శ్రీరస్తు.

శ్రీమదధ్యాత్మతత్త్వప్రతిపాదకంబును

ముముక్షుజనాపేక్షితంబును నగు

# శ్రీమదధ్యాత్మరామాయణము

పద్యకావ్యము.

కోటమరాజు నాగయామాత్యవిరచితము.



(ద్వితీయముద్రణ)


చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1924.

'ప కాలికు తేని'

౦.డ

# పీఠిక.

శ్లో॥ అనశ్వరం విశ్వవినాశకాలేఽప్యనాది మాదిం జగతోఽపి సృష్టేః।
అగోచరం గోచరమాత్మవిద్భిరధ్యాత్మరూపం శరణం ప్రపద్యే॥

శ్రీమదధ్యాత్మవిద్యాప్రతిపాదకమైన యీగ్రంథమును సంస్కృతమున విశ్వామిత్రమహర్షి యుమామహేశ్వరసంవాదరూపముగ నధ్యాత్మరామాయణ మనుపేర 65 సర్గములు రచించె. దీని నాంధ్రీకరించిన సుకవులు కానాదము పెద్దనకవియు, కోటమరాజు నాగయామాత్యుఁడు అను నిరువురు. ఇందు ప్రథముఁడు ప్రౌఢకవి ద్వితీయుఁడు సరసకవి. ఈగ్రంథనిర్మాత

కోటమరాజు నాగయామాత్యుఁడు

ఇతఁడు ఆర్వేలనియోగిబ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. కాశ్యపసగోత్రుఁడు. ఇతనితండ్రి భాస్కరమంత్రి తల్లి కాయమాంబ. ఇవియతఁడు పీఠికలో స్పష్టం చేసెను

సీ. విహితంబుగను కోటమరాజు భాస్క-
రాఖ్యమంత్రికిఁ దద్భార్యయైన కామ
మాంబకును బుట్టి సుతుఁడై గాశ్యపసగోత్ర
జనితుఁడను నాగయామాత్యుఁ డనెడువాఁడ.

అని చెప్పుకొనియె. ఇతని నివాసము కృష్ణామండలము. ఇందును గూర్చి తా నేమియుఁ జెప్పుకొనలేదు. కాని గద్యనుబట్టి చూడఁ గృష్ణామండల మని తోఁచుచున్నది. గద్యములో 'ఇది శ్రీమోగుకోట ముక్తీశ్వరవరప్రసాదలబ్ధకవితాపవిత్ర' అని చెప్పుకొనియె ఇందు చెప్పఁబడిన ముక్తీశ్వరక్షేత్రమగు మోగుకోట కృష్ణాతీరమున రేపల్లెతాలూకాలో రేపల్లెకు నాలుగు మైళ్లదూరములో నున్నది. కృష్ణాసాగరసంగమమునకుఁ జుమించు మూఁడునాలు గామడలదూరములోఁ గృష్ణానదిపడమటియొడ్డున నున్నది ఇది సుప్రసిద్ధమైన క్షేత్రములలో నొకటి. పురాతనములైన దేవాలయము లిందుఁ గలవు. ఇందు వేంచేసియుండు నీశ్వరుండే ముక్తీశ్వరుండు.

ఈ ముక్తీశ్వరుని గుఱించిన మాహాత్మ్య మా ప్రాంతముల విశేష ప్రతీతి గలదు. దీనిం బట్టియు కృష్ణామండల మని స్పష్ట మగుచున్నది. ఇంతియకాక యీమహాకవిచరిత్రాంశమును వీరికుటుంబము లోనివా రిట్లు చెప్పియున్నారు. వీరినివాసము పెనుమూడి యను గ్రామము. ఇది ముక్తీశ్వరక్షేత్రమునకు నొకమైలు దూరములో కృష్ణ యొడ్డున నున్నది. వీరు విశేష కాలము రేపల్లెలో నివాసముచేయు చుండువారు. వీ రొక జమీందారునివలన గొంతభూమి సంపాదించి మిగుల మన్ననలు వడయుచుండిరి. నాగయశాస్త్రులవా రని ప్రఖ్యాతి గాంచి రట. వీరు గొప్ప మహిమగలవారు. ఈవంశస్థు లాయూర నిపు డెవ్వరు లేరు. కాని యితరత్ర ఆకుటుంబములోనివా రనగా ఆయనకు రెండుమూడు తరములవారు గలరు. ఈకవి కాలనిర్ణయమునకు వారైన చెప్పకొనిన యాధార మేదియు గానరాకున్నది. యాథార్థ్య మెట్లున్నను బూర్వకవిస్తుతిని బట్టి కాలనిర్ణయము సేయు పథము ఘంటాపథ మయినను నీతనివిషయమున ట్లూహాపోహల నూహింప వలనుగాదు. ఇతడు సామాన్యోక్తి నాంధ్రలోకమునకు గవితాభిక్షపెట్టిన శబ్దబ్రహ్మ యను నన్నయను గూడ స్తుతింపక యిష్ట దేవతాప్రార్థనానంతరము

సీ. సంతతార్చితరామ .. ...

తే. వాత్మ గణుతింతు మత్కావ్య మలరుటకును. బా. 6.

అని యీరీతిగా స్తుతించెం గాన గనపట బోతనామాత్యుని స్తుతించి విరమించినందున నాతని తరువాతివాడని సిద్ధాంతము సేయుట సత్యమున కెడమగును. ఇది నాపథము మార్గదర్శి కాదు. కవుల చరిత్ర ములో నీకవి యిప్పటి కించుమించు 50 సంవత్సరముల క్రిందటివాం డని తెలియంబడుచున్నది. కాని వారికుటుంబములోనివారు చెప్పిన దానింబట్టి చూడ నిప్పటికి నూఱుసంవత్సరములకు బూర్వము న నున్నట్లు నిశ్చిత మగుచున్నది.

ఇతడు లోకసాంప్రదాయకముగ భీమకవిని నుతించి 'తన కవిత్వంబు నాయకునకు గొసంగి యవ్యయంబైన కైవల్య మందినట్టి పుణ్యచరితుని బమ్మెరపోతరాజు' నని తనకున్న దైవకృతియందలి నిక్కంబైన నమ్మిక నొక్కినొక్కి వక్కాణించి వెల్లడించె. పోతనామాత్యు

నకుఁ బూర్వులేమి సమకాలికులేమి తదితరులేమి కవితాసామ్రాజ్య పట్టభద్రు లెందఱు కవీంద్రు లుండినను వారిం బేర్కొనక పోతనామాత్యు నొక్కనిమాత్రమ పేర్కొనినంతమాత్రమునఁ దక్కుంగల కవుల నిరసించె నను దూఱునకుమాత్రము పాల్పడుపరాదు. ఈతని యుద్దేశ్య మేదియో కొంత విలక్షణంబుగ నుండియుండవలయు.

ఈతఁడు దైవకృతిసమర్పణమందుఁ గైవల్యప్రాప్తియును నరకృతియందుఁ బోతనచెప్పిన 'ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి....' యనినట్లు ఘోరంబగు కాలునిత్రేటుపాటులును గలవను నిశ్చయబుద్ధి యున్నట్లు దానిని వ్యంగ్యముగ 'తనకవిత్వంబు నారాయణునకొసంగి, యవ్యయంబైన కైవల్య మందినట్టి పుణ్యచరితుని' అని చెప్పి కృతికన్యారత్నమును శాశ్వతుండైన నారాయణున కర్పించి దీర్ఘసౌమంగల్యముం గూర్చిన సాయుజ్యసామ్రాజ్యమున నిండోలగంబుండనయ్యెడినని సూచించె ఈస్థితిలో విచారింప నొక్కపోతనకుం దక్కఁ దక్కుంగలవారలను సంపూర్ణముగ లేదని భావించియుండు. అన్నట్లు సామాన్యముగ విచారింప నొక్కొక్క రొక్కకృతికన్య నొక్కనరునకును నొక్కదానిం బరాత్పరునకును సంబంధించి వియ్యమందినవారుగ దోఁచుదురు. ఇంతియకాక తా నిబంధింపం బూనిన ప్రబంధంబు కేవలభక్తి జ్ఞాన వైరాగ్యములు కాటపట్టై తత్తత్సాధనసంపత్తియతోడు గాఁదగినదిగా నుండ భక్తికి నిధానమై జ్ఞానమున కాలవాలమై వైరాగ్యమునకుం బుట్టినిల్లై సద్యోమోక్షదాయకంబైన భాగవతంబు నిర్మాతయగు పోతనయె తనకు మార్గదర్శకుం డయ్యె ననియు గ్రంథసంబంధమున బాంధవ మ్మొనర్చించియుండవలయు. ఈకవి యుద్వైతి. శివకేశవులయం దభిన్నవృత్తిగలవాఁడు దీనికిం దార్కాణము తనకుం గవితాబ్ధి ముక్తీశ్వరవరప్రసాదమునని గద్యములో 'ఇది శ్రీమోహనకోట ముక్తీశ్వరవరప్రసాదలబ్ధకవితాపవిత్ర' అని చెప్పికొనుటయుఁ గృతిని శ్రీరంగేశున కంకితము సేయుటయుఁ దెల్లం బగుచున్నది. ఈకవి గురుస్తుతినిగూడఁ జేయక ముక్తీశ్వరవరప్రసాదలబ్ధకవితావైభవముగలవాఁ డని చెప్పికొనినంతమాత్రన నితనికి సహజపాండిత్యమబ్బియుండునా యని యూహించుట కేలయు మహాకవులయందును

విరసా భవేత్.' అన్నట్లు లీతనికిం గవిత స్వయమాగత యగుట సరస
యై యమృతకిరణాభరణోత్పాదిత యగుట నమృతప్రాయయై రమా
మనోహరానుగృహీత యగుట మంజుభాషిణియై పల్కరించుటం జేసి
తెలుచు నీకవి ప్రాసకు వేసటం బడక యతికి వెంపరలాడక గణకల్ప
నకు దల్లిపల్లు లభ్యసింపక గొంటుపదము లిరికింపక మారాన్వయ
మున కెడమీక భావసందర్భమున మూలగ్రంథము నాసింపనీక
యెంతయు మనోహరముగ సంతరించె ననుట కుదాహరణములు
చూపంబూనిన గ్రంథ మాద్యంతము చూపింపవలసియుండును పోత
నకుం బోలె నీతనికిని సంత్యానుప్రాసయం దించుక యభిలాష గలదు.
దీనికి ముందుదాహరణములు వివరించెద. ఈకవి కృష్ణామండలమండనా
యమానుండయ్యు నుభయకావేరీమధ్యగతుండగు శ్రీరంగేశ్వరునకుం
దనకృతి యొప్పగించె ఇందులకు నాదస్తుతియందును షష్ఠ్యంతముల
లోను జెప్పుకొనియె. కాన కృష్ణాతీరము త్రికేశ్వరక్షేత్రమునం బుట్టి
కావేరీతీర శ్రీరంగేశ్వరక్షేత్రమున స్నాతకాతని ముక్తిరంగునిం జేసిన
దేవనాయకులపపౌత్రుడగు నీతని కవితాకన్య యనన్యసామాన్య ఇంక

గ్రంథమందలి ప్రాశస్త్యము

విచారింతము ఇయ్యది తత్త్వబోధప్రబోధకమైనది. కాని యాద్యం
తము లౌకికపోల్కి బోతిపోసినచందమున విసుగొందించునది కాదు.
ఇందు కథాంశమున రామాయణమును సమయసందర్భానుసర
ణముగ బ్రపంచోత్పత్తియు, బ్రహ్మోపదేశంబును, గుణత్రయవిభాగం
బును, సచ్చిదానందస్వరూపంబును, భక్తిప్రకారంబును, జ్ఞానమార్గం
బును, వైరాగ్యనిదానంబును, మోక్షసాంప్రదాయంబును నాదిగా
సర్వమును గీతలకుం బ్రతినిధిగ చేటతెల్లముగ దెల్పంబడినది. ఈ
యాథాత్మ్యక్రమం దీకవి తత్త్వదాభ్యాసములం జక్కపఱచి పండు వలిచి
చేతం బెట్టినపగిదిం దనయనుభవసిద్ధాంతమును బ్రకటించె. ఈకవి
కేవలకవితాధోరణి గలిగి మూలగ్రంథమునకు మక్కికి మక్కి ఫక్కికి
ఫక్కి రచించినవాడు గాదు ఈతడు మిగుల వేదాంతశాస్త్రనిష్ణాత
యై యుపనిషదాద్యర్థవిజ్ఞాతయైనట్లు దోచెడిని. ఈతని వేదాంత
విద్యానైపుణ్యమున కొకటిరెం డుదాహరణము లుదాహరించెద.

ఉత్తరకాండములో శ్రీరాముడు లక్ష్మణునకుం దత్త్వోపదేశము

నేయుఘట్టమున 'తత్త్వమసి' యనుమహావాక్యము నిర్ధారణముసేయు నెడ లక్షణావృత్తిని సమర్థించి నయించి పొందుపఱచిన శక్తివలన నీతనికి న్యాయశాస్త్రమందును మిగులఁ బాండితీగరిమ కలదని స్పష్టపడుచున్నయది మఱియు మూలమున

'నేతిప్రమాణేన నిరాకృతాఖిలో హృదా సమాస్వాదితచిద్ఘనామృతః,
త్యజే దశేషం జగదాత్తసద్రసం పీత్వా యథాఽంభః ప్రజహాతి తత్ఫలమ్.'

అని యిచట చెప్పిన నేతిప్రమాణవాక్యము లెయ్యవియో మాతృకలో వివరించియుండకున్నను దీని నెంత సమంజసముగ శ్రుతిప్రమాణములు బోధపఱచి చెప్పెనో చూడుఁడు.

సీ. అరయంగ 'నేహ నానాస్తి కించన' యన 'నాత్ర కాచన భిదాఽస్తి' యనఁగఁ
దెలియ 'నథాత ఆదేశో న' యనఁగఁ జెలువొందు శ్రుతివాక్యములను నిఖిల
మును నిరాకృత మయ్యె మనుజుఁ డిట్లగుటఁ జే మామిడిపండున మధురరసము
గొని టెంకయును జర్మమును బాఱవైచిన గతిని హృత్కమలమం దతిగుణాఢ్యుఁ
తే. డన ... ... ... (ఉత్త. 169.)

అని యిట్లు శ్రుతిప్రమాణములు చూపించి తేటపఱచె. మఱియు

'యస్తాత్ప్రసుప్తౌ తదభావతః పరః సుఖస్వరూపేణ విభావ్యతే హి నః.'

అనుమూలమును వివరించి పెంచి

వ. కాని యయ్యహంకారంబును దద్వృత్తులును లేని సుషుప్తిసమయంబున 'తమోభిభూత స్సుఖరూప మేతీతి' 'సుఖ మహ మస్వాప్స'మితి శ్రుతివాక్యములచేత సుఖస్వరూపుం డగుచు విభావితుఁ డగుఁగావున... (ఉత్త. 175.)

అనియు, మఱియు

'శ్రద్ధాలు రత్యూర్జితభక్తిలక్షణో యస్తస్య దృశ్యోఽహ మహర్నిశం హృది'.

అను నీమూలాంశమున

వ. ఇట్లయిన నహర్నిశంబులయందు 'తస్యైష ఆత్మా వివృణుతే తనూస్వాం' అను శ్రుత్యుక్తప్రకారంబున హృదయగోచరుండ నగుదు... (ఉత్త. 198.)

ఇట్లింతయో మహావాక్యముల నిర్దేశించి నిర్వచించె. మఱియు 'యత్ర గొట్టు స్తత్ర నట్టుః' అన్నట్లు కాకుండ విభీషణశరణాగతియందు శ్రీరాముని స్తవము సేయునెడ

'నిరాధారో నిరీశ్వరః, షడ్భావరహితోఽనాదిపురుషః ప్రకృతేః పరః.'

అనుమాతృకలోఁ జెప్పియున్న షడ్భావము లెయ్యవియో తెలుపఁబడ

లేదు. కాని దానిని భాషాంతరీకరణమున నీకవి యెంత స్వానుభవసిద్ధాం తము వెల్లడించెనో తెలియనగు. గర్భోపనిషత్తులో

'షడ్వై భావవికారాః. అస్తి జాయతే వర్తతే
పరిణమతే ఉపక్షీయతే వినశ్యతీతి భవతి విక్రియతే చ'.

అని చెప్పఁబడినది. దానిని సంగ్రహించి సమయసందర్భమున నిట్లుగా

సీ. ... ... ... ... నిరుపాశ్రయుండ 'వుండె
జనియించెఁ బెరిఁగెను సంచరించెను దగ్గ నడఁగె' ననంగ నీయాఱుభావ
తే. ములును లేని నరీశ్వరమూర్తివాది ... ... (యు. 78)

అని యాఱుభావములం జెప్పి మూలము నలంకరించె. మఱియు శ్రీరా ముఁడు లక్ష్మణునకుఁ దత్త్వోపదేశము సేయుఘట్టమున

'శోకే స్వయం తేషు తు తత్తదాకృతి ర్విభాతి సంగాత్స్ఫటికోపలో యథా,
అసంగరూపోఽయ మజోఽమృతోఽద్వయో విజ్ఞాయతేఽస్మిన్ పరితో
విచారితే.'

అనుమూలమునకుం బరిణామము

చ. ఎఱుపగుపువ్వునందుఁ ... ... (వేదవిద్వరా!) (ఉత్త. 163.)

ఇట్లింతయు మనోహరముగ నాయాయి తత్త్వబోధమునఁ దన్మయత్వమునం దనశక్తిసామర్థ్యములను వెల్లడించెను. మఱియు శ్రీరామపట్టాభిషేకఘట్టమున బ్రహ్మాదులు శ్రీరాముని స్తుతించుతఱి యక్షులు రావణుఁడు పెట్టినకష్టములు చెప్పుకొనుటలో

'యక్షా ఊచుః—సదా విష్టికర్మ ణ్యనేన నాభియుక్తా వయోమో
దశాస్యం బలా ద్దుఃఖయుక్తాః, దురాత్మా హతో రావణో రాఘవేశ!
త్వయా తే వయం దుఃఖజాతా ద్విముక్తాః.'

అను మాతృకకుఁ దాన్ని యనుభవించినవాఁడుం బోలె నాకష్టసమ యమున నెట్లు చెప్పెనో చూడుఁడు.

వ. యక్షు లిట్లనిరి.
ఉ. వెట్టికిఁ గొట్టి మమ్ము ... ... మాకృపన్ (యు. ౨. అ. 300.)

కేవలకవిమాత్రున కింతటిభావము కనఁబఱుపఁగల శక్తి దుర్ల భము. ఇందువలన నీ కవికి లోకానుభవమును మిక్కుటముగఁ గల దని తోఁచెడిని. శృంగిబేరపురమ్మున జడలుదాల్చినపిమ్మట మూలములో సూర్యాస్తమయవర్ణన మేమియు లేదు. కాని

'జలమాత్రం తు సంప్రాశ్య సీతయా సహ రాఘవః,
ఆస్తృతిం కుశపర్ణాద్యైశ్శయనం లక్ష్మణేన హి. ఉవాస...'

అనిమాత్రమున్నది ఇందు నీకవి యెంత సమయోచితంబుగ నుత్ప్రేక్షించెనో చూడుఁడు.

ఆ. నాకులంబువాఁడు వ్యాకులంబును జెందె
నాకు లంబు గ్రోలి నాకు నేటి
పోక లనుమఁ జింతఁ బొరలినగతిఁ బశ్చి
మాబ్ధిఁ గ్రుంకెఁ బంకజాప్తుఁ డపుడు. (అయో. 173.)

అయ్యవసరంబునందు చంద్రోదయంబును మూలములో లేకున్నను ప్రబంధమండనంబుగ నిట్లుత్ప్రేక్షించె.

చ. తలఁప సమానుషంబగు ... ... దూర్పుదిక్కు నన్ (అయో. 181.)

మఱియు వేకువజామయ్యె ననుటకు మూలగ్రంథమున

'గుహలక్ష్మణయో రేవం భాషతో ర్విమలం నభః.'

అనిమాత్ర మున్నది. కాని సూర్యోదయవర్ణనమున్మాత్రము లేదు.

ఆ. చాలతిపమఁ బూని .....వేల్పు వొడిచె. (అయో. 189)
క. ఒకగతి నుంబను......శుకపికరవముల్. (అయో. 190.)

అని యిట్లుత్ప్రేక్షించె. మఱియు

'సీతా రాజీవపత్రాక్షీ సర్వలోకైకసుందరీ'

అనుదానికిఁ బ్రబంధలక్షణంబుగ

తే. కచ కుచానన గళ నేత్ర కరయుగముల
కలి కుధ్ర చ్చంద్ర దర వారిజ లత లోడి
పాఱె ధరఁ జొచ్చెఁ గృశియించె నీటి మునిఁగెఁ
బంకమునఁ జిక్కె నిడుదలై బయల కుఱికె.

క. అని యొన్నఁదగు మహీసుతఁ ... ... (అర 174)

అనిశృంగారం బతిశయంబుగ వర్ణించె. సామాన్యముగ భావవైశద్యముల గ్రంథభాగ మంతయు నిట్లే యుండెడిని. ఇఁక గుణదోషంబు లనుటం జేసి ప్రకరణాంతరమును గొంచె మాలోచింతము. ఈగ్రంథము కేవలాధ్యాత్మికప్రధానము గాన నాయంశమంద యియ్యది విచారణీయమై యుండుఁగాని దోషప్రకరణమునకు లాగుట యప్రస్తుత ప్రశంస యయ్యెడిని. అయినను బ్రబంధము శాస్త్రనిబంధిత మగుటంజేసియు నాభాగమందు విరమించిన సామాన్యపరిపాటికిఁ దప్పకగుటంజేసియు

నించుక యీయంశమును బ్రశంసింపక తప్పనిసరి. వాఙ్మయమంతయు వైకల్పికము, మతైకశరణము. లక్ష్యలక్షణములలో నీయాంధ్రమ్ము తఱుచు లక్ష్యప్రధానమైయే లక్షణము సమర్థింపఁబడుచున్నది గాని యాదిభాషయందువలెఁ గాకపోవుటంజేసియే 'పుణికకొక బుద్ధి జిహ్వకొక రుచి' యన్నట్లు శాఖోపశాఖలై నాఁటినుండి నేఁటివఱకును బాహుళికమైయే యున్నది. కాన నత్యల్పములో నిదమిత్థమని నొక్కి చెప్పుటకు వలనుగాదు. ఈకవి లఘ్వలఘురేఫములకు మైత్రి చేసెను గాని విరోధించినవాఁడు కాఁడు. మూఁడుపాళ్లు మైత్రి కొనఁబడినవారలె మిక్కుటముగాని యెడఁబాటుచేయ నీయకొనినవారు కొలఁదిమందియె గలరు. ఇదియుఁ గొలంది కాలము నుండియె విశేషము పట్టింపు పట్టఁబడుచున్నట్లు తెలియనగుచున్నది. శకటరేఫ మాంధ్రాక్షరములలో లేనిదై కర్ణాటకభాషనుండి వచ్చినదైనను లళలకుంబోలె రఱలకు నుచ్చారణస్థాన మేకమై యున్నదని లాక్షణికు లొప్పినదియె ఈ రెంటికి నైక్యముండియుఁ గొంచెమూఁదిపలుకునంతటి భేదముమాత్రమున్నది. నిర్బిందువులకును సార్ధబిందువులకును బ్రాసమైత్రి కొనఁబడక కవిప్రయోగదర్శనమునఁ బక్షాంతరీకరింపఁబడినట్లియ్యదిగూడ 'రయో స్తు నిత్యం స్యా' త్తని నిర్వచింపఁబడినను నట్టిదియ కాని మతవైషమ్యానఁ గొందఱిచే బహిష్కరింపఁబడినట్లు తోఁచెడిని. అయినను నాధారములు లేకపోలేదు. భారతములో

క. తెంపును బెంపును గఱుర ని, లింపులు వెఱఁగంది చూడ రిపుసైన్యములుం
గంపింపఁ దమబలంబులు, అంపిలి బిట్టార్వ సింధు రాజుం దాఁకెన్.

అనియు, మహాకవి కేతన కృతదశకుమారచరిత్రమున రెండుమూఁడు స్థలములఁ బ్రాసమైత్రియె యున్నట్లు కాననయ్యెడిని. గాని గౌరవమును బురస్కరించుకొని యయ్యవి విరూపములకు మార్పఁబడినను మార్పఁబడవచ్చును.

ఉ. ... ... అంతయుఁ రాజున కేన చెప్పి నీ
కోయఁగ వత్తుఁ గందువ యొఱంగుట నాతఁడు వన్నెపంచినన్.(ఆ. 10. 42.)

అని యిట్లు మైత్రి చేసెను. ఇఁక లక్షణకర్త యప్పకవి చెప్పి యున్నవి లోకవిదితములుగదా. ఇట్టివి యితరకృతులందును లేకపోలేదు. ఇఁక దీనివిషయము చర్చించుట యెల్ల 'కంబళిలోఁ దిని వెంట్రుకలు లెక్కపెట్టినట్లు' కానయ్యెడి.

'కువర్ణము పరం బగునపు డుకారఋకారములకు నగామగంబగు.'

(బా తత్సమ. 28.)

ఈసూత్రముచే నిత్యముగా నగాగమప్రాప్తి చెప్పంబడినది. ఈ కవి యొకటిరెండుచోట్ల నగాగమరహితంబుగ

సీ ...విప్ర. తే జవరులు వనుఁ జూచి పతి నీవు వనము కేఁగ (అయో. 131.)

ఉ. విశ్వము కెల్లఁ దోఁతువు ... ... (అర. 63)

సీ. తే. గాక యని శుక్రుసుందిరాంగణము కరిగి. (యు. అ. ౨ 47)

ఇట్లు చెప్పియున్నాఁడు. ఇదియును నిత్యముగాక వైకల్పిక మనుటకుఁ గాని తప్పనుటకుఁ గాని యితరకృతుల నట్లుండ నిచ్చి కవిత్రయము వారిలో నొక్కండగు నెఱ్ఱాప్రెగ్గడ నృసింహపురాణములో రెండుప్రయోగములాధారములున్నవి. యుదాహరించెద.

క. ... ... గరుడానీనునకు సిద్ధగరుడామురుకున్. (పీ. 38)

అని పద్యాంతములలోను

చ. నీ, కనివపదంబు ద్రిప్పఁగ జగత్పతి పద్మజాకైనఁ బాడియే... (ద్వి. 28.)

అని ద్వితీయాశ్వములోను బ్రయోగింపఁబడినవి

మఱియు నప్పకవియు

తే. సౌరభాషకు శబ్దశాస్త్రంబుపగిదిఁ, దెనుఁగు కావశ్యకం బిది దీనిఁ జదివి. (ప్ర. 9.)

అని చెప్పె. ఇతరకృతులయుం దీపట్టింపు కనప్పట్టదు. బహుళంబుగ మహాకవిప్రయోగములం బట్టి దోషగణంబున లెక్కించుటకన్న వైకల్పిక మనుటలో లోపముండదు.

ఇంకఁ గళాపరిచ్ఛేదమున వాగనుశాసను సూత్రమున

'కించి త్ప్రిశంస నాద్భుత స్మతాప యదా తదా కి మేవాళ్చ క్త్వా కిల తూష్ణీ మాద్యా నభిదధతి కలా ద్రుతో న యేషాం స్యాత్.'

అని చెప్పంబడినదానిలోఁ దూష్ణీమర్థకమైన వ్యతిరేకార్థమునకు నీకవి

ఉ. యానురవైరియుణ్ మరల నన్యరథంబున నెక్కి నిల్వకణ్. (అర. 260)

మ. ... అంఘుల్ వానరు లింక వ్రారు మసపైదండెత్తకణ్ మున్నె. యు. 46.

ఇట్లే యుద్ధ. 185. 273, 299, (అ. 2.) 156 ఉత్త. 270. ఈపద్యముల యందును మఱికొన్నిటను ద్రుతాంతముగఁ జెప్పియున్నాఁడు. దీనికిని 'ఎత్తక' అనునది 'ఎత్తకయుణ్' అనుదానిలోని యుకారలోపమున వచ్చిన ద్రుతంబుగాన సాధువని సమర్థించు నొకమతము గలదు.

### ఇఁక సంధి.

'ఉకృంశ్లేషో నాచి ద్రుతస్య సర్వత్ర ఉకృపూర్వేషు.'

అని ద్రుతంబున కచ్చుపరం బగునపుడు నిత్యముగ సంధియు, ద్విత్వాభావంబును జెప్పఁబడినవి. ఇందు

చ వడిఁ గవియంగ మహాబలుఁడు వారిజమిత్రకులాన్వితుండు డ
స్పొడ యొకయర్ధచంద్రశరము న్నడరించెను ... ... (అర. 23.)

ఇట్లే అర 139, 363. కిష్కిం 9. 99. యు 46. ఆ 102. 130. ఉ. 174,325 ఈపద్యములయందును మఱికొన్నింటియందును ద్రుతంబునకె కాక యచ్చున కచ్చు పరంబగునపుడును సంధిచేయఁబడలేదు.

మఱియు

క. కాదేని ముని శపించును, నాదుసుతు ననేకహాయనకలితతపసో
త్పాదిత విడి మీఁద బ్రదుకఁగ, రాదిఁక సత్యంబు నొందరా దెటులొక్కో.
(బా. 125)

అని యున్నది. దీనికి మూలము 'బహువర్ష సహస్రాంతే కష్టే నోత్పాదితా స్సుతాః' అని యున్నందున

'తపసో' త్పాదితు సుతు విడి బ్రదుకఁగ, రాదిఁక'

యని యుండవచ్చునేమో యని యూహించినను, 'తపసా-ఉత్పాదితాః-తపఉత్పాదితాః' అని కానగు. అట్లు గాక తృతీయాంతముపై సంధి చేయఁబడలేదు. ఇట్లే

ఉ. తారకనామమంత్రజపతత్పరుఁడంగ తవదాసదాసుఁడన్. (అర. 58.)
మత్తకోకిల ... ... ... ప్రాణముల్
వీడ నేఁ డిటు లున్నవారు తవేప్సితం బొసఁగం గపుల్. (కిష్కి. 218.)

అని సంస్కృతంబునం బోలె నాంధ్రంబునను విభక్తి నిల్పంబడియె అను ధాతుప్రయోగము లేక యిట్టిరూపంబు లాంధ్రమున నుండు టరుదు. 'త్వద్దాసదాసుఁడన్' అనుచో ఛందోభంగమును, త్వదీప్సిత మనుచో యతిభంగమును గల్గును. ఇట్టివి యితరకృతులయందును నొకట రెంటఁ గానన య్యెడి. సోముని హరివంశమున

క. మనుజాళను లఁట జలు లఁట, మును లఁట యజ్ఞంబు లఁట నమో విశ్వసృజే
విన మెన్నఁడు మున్నిట్టివి, కనికని కౌతుక్యఁ డింటికంబము నేనన్. (పూర్వభాగము)

అని యున్నది. కానియట్టివి ప్రయోగములు. మఱియు నిట్లే మఱికొన్నిగాన

నయ్యెడిని. అయ్యవి యెల్లఁజూపించుటకన్నఁ బాఠకమహాశయులకు వదలుటయే సమయోచితము.

సీ. తే. వేదఘోష శాస్త్రానువాదములను, జరితస్వాహాస్వధామునిశబ్దములను(అర. 77.)

ఇట 'చరితస్వాహా' యనుపదంబున సంయుక్తాక్షరపూర్వంబగు తకారము గురువు గానగు. అట్లని గణభంగము. అచ్చటచ్చటఁ గృతుల నీలాటివి గన్పట్టినను శాస్త్రసమ్మతము గాకపోవును. మఱియు

తే ... తనరు నయోధ్యాగమాట సీతనఁగఁ బుట్టె (బా. 128)

సీ. ... వికల్పితప్రాపంచసాక్షునఁ బడు చిదాత్మ (సు. 174)

ఇచటఁ దత్సమసంధి చేయుంబడినది.

చ ... గరుణింపు కూడి చన నుం ... వ్వడి యొక్కని నిచ్చటన్. (సు. 325.)

ఇచట 'ఒక్కని నిచ్చటన్' అని యుండవలసియుండును

సీ బలిక నాతనికి రావణుచెల్లెలగు కుంభినసికిని లవణుఁ డనంగ నొకఁ ... (సు 207.)

దీనికి మూలము

'రావణ స్యానుజా భార్యా తస్య కుంభీనసీ శ్రుతా.'

అనియున్నందున 'కుంభీనసి' యని యుండనగు ఇట్లు మఱికొన్ని స్థలములనుం గానంబడియెడి.

ఇట్టివి కొన్నింట మహాకవులకృతులయందును గానంబడినను దుస్సంధి యని పేర్కొనఁబడుచున్నవి.

ప్రాస.

ఇం దచ్చటచ్చట నుదాహరణీయములైన ప్రాసలును బ్రయోగింపఁబడినవి.

క. రఘురాముని ... తరుణీ! (కిష్కి. 119)

ఇట్లే అయో 225. సుం. 67. యు. 163. పద్యములోను మఱికొన్నింటను స్వవర్గప్రాసములు గూర్పఁబడినవి. కాని సుందరకాండములో

ఉ. చాలుదువెంతకైన..., జాఁగిలి మ్రొక్కి పోవుచు మనంబునఁదాల్చెను. 107

అని మూఁడవపాదములోఁ బ్రాసభ్రంశ మయ్యె.

ఇఁక యతిభ్రమణములు

కొన్ని కానవయ్యెడి. అయ్యవి యెల్ల దైవకరణ్యంబులు. ఈ క్రింద నుదహరించుచున్నాఁడ.

ఇఁక మఱికొన్నియు నుండఁగలవు కాని యిందులోఁ గొన్ని కొన్నియైనఁ బ్రత్యంతరము దొరకినపుడు సంప్రతించిన మాఱ్పుండునేమో యని యవకాశము గలుగుచున్నది. ఎత్తుక, ఉంచుక, తోడుక, పెట్టుక ఇత్యాదులు సామాన్యపరిపాటిగా దోషగణంబునం జేర్పఁబడుచున్నవి ఈలాటి పచ్చటచ్చట నీకృతియందును గలవు కాని యప్పకవీయములో నాంధ్రదేశ్యభేదంబులలో

తే. ఆంధ్రదేశపురస్థాయులైన సకల, జనములకును మఱుంగు దేశంబు లేక
తేటతెల్లమిగాఁ బల్కు మాట లెల్ల, నవని శుద్ధాంధ్రదేశంబు లనఁగఁబడును

క. పాలును బెరుఁగును నెయ్యని, వాలాయం బుట్టిఁబట్టి వంచుక త్రాగెన్
ఓ లెమ్మక పనిబిడ్డఁడు జోలి యిఁకే మున్నదన్న శుద్ధాంధ్రంబుల్.

అని చెప్పిన యాధారముచేతను

చ. పరిణయవేళయందుఁ దనపాదముఁ బట్టుక సన్నెకంటిపైఁ
దిగముగ ... .. ... ... (పీఠి 21.)

అని ప్రయోగించుటచేతను నొకమతమున దోషదూషితములు గాక సాధువులనియే తలంతము

ఈ గ్రంథమింతకుముందుఁ బ్రాచీనకాలపుముద్రణంబున ముద్రితంబైనది గావునఁ జాలభాగము విరుద్ధముగ నుండియుండినది. కొన్నియెడల శిథిలమైనది. కొన్నిచోట్ల వ్యత్యాసమయినది ఇవి యన్నియు నాకాలమునాఁటి ముద్రణపద్ధతులచేతనే యంతటిపా టొంది యుండవలయును శిథిలము, బాలకాండములో దివ్యరూపమున నవతరించిన శ్రీరాముని శిశురూపము ధరియించుమని కౌసల్య వేఁడుకొనునప్పుడు నీసపద్యము తేటగీతిలో 'రూపముపసంహరించి నిరూఢముగను, దర్శనం బిమ్ము ననుఁ గన్న తండ్రి! నేఁడు' అని రెండుపాదములు మాత్ర ముండెను. దీని నిట్లు సవరించితిని.

తే రూప ముపసంహరించి నిరూఢముగను
(శిశువు రూపంబు దాల్చి నా చిత్తమునకుఁ
బుత్రసంతోష మొనఁగూర్చి పుత్త్రుఁడవుగ)
దర్శనం బిమ్ము ననుఁ గన్న తండ్రి! నేఁడు. (బా. 98.)

ఇట్లు బాలకాండములోన 241 పద్యముసీసగీతములో మూఁడు పాదములు మాత్ర ముండె.

సీ. తే. బ్రణుతి యొనరించి పూజలు వడసి రాఘ
వానుమతిని మహేంద్రాచలాగ్రమునకుఁ
(దరలి మౌనియై యట తపశ్చరణమునకుఁ)
బరమపుణ్యుండు భార్గవుం డరిగె నపుడు.

అని పూరించితిని. ఇట్లు యుద్ధకాండములో 330, ఉత్తరకాండములోని 159, 165, 167 ఈవృత్తములును మఱికొన్నియు విపరీతముగ నుండ యథాభిప్రాయమున ఛందోనిబంధితంబులు చేయంబడి యచటనే తెల్పంబడినది పూరించినభాగములకెల్ల ()కుండలీకరణముచేయఁబడినది. ఇట్లు చూచుకొలందిని నెన్నియో కనఁబడుచుండును. ఇది క్రొత్తకూర్పగుటచే నీవుఁ గాక కొన్నిముద్రణస్ఖాలిత్యము లున్న నుండవచ్చును. అవియెల్లఁ బునర్ముద్రణసంస్కరణీయంబులు గాన నిఁక నింతటితో నీప్రసంగము విరమించి శ్రుతిపేయంబులగు నీకవి పద్యమధుధారలం గ్రోలి శ్రవణానందసుఖ మనుభవింతము.

## అంత్యానుప్రాస.

ఉ. రామ! శమాభిరామ! ...నమస్సు నీకగుఁ౯. (అర. 23.)
ఉ. దూరమునందు నుండి...రామగేహముఁ౯. (అయో. 326.)

## శబ్దగుంభనము.

వ మఱియు నచ్చర లచ్చట రచ్చగ హెచ్చుగ విచ్చలవిడి గూడి యాడి పాడి యోడి దాడితోడి వీడితి మనుచుఁ జని రంత. (అర 26.)

## సంస్కృతము.

ఆ "అమిత తేజసే...నమో" స్తటంచు. (యు 69.)

## భక్తి.

తే మించునానసక్తితోడఁ...శ్రద్ధచే నారగింతు (కిష్కిం 148.)
ఉ. ఏనరులైన...వెంకి నసింతు రింపుగ౯. (యు 307.)

## శృంగారము.

తే. కచకుచానన...బయలకుఁతిక. (అర 174.)

## విషాదము.

ఉ. తమ్ముఁడ యిన్వి దేశమున... ...మదృష్టవిహీనుల కేల గల్గెడుఁ౯. (యు. 244.)
ఉ అలిసి గోలుపోయి...చింతయేటికి౯. (యు. 245.)

## వైరాగ్యము.

ఉ చచ్చినవానికన్నెడుటఁ... ...చచ్చినవానికి నెవ్వ రేవురుఁ౯. (యు. ఉ. 126.)

# కల్పనాచాతుర్యము.

ఉ. నూఱులుగన్న... ...హిమాద్రినందనా! (యు. 279.)
మ. ఇల నేదేవుని... ...శ్యామలా! (సుం 160)
క. ఏ యమ్మబంటు... ...చల్లనగుటకు సరుదే?. (యు. అ. ౨ 154.)

ఈరీతి నుదహరింపఁదలంచిన నెంతటికిని దృప్తితీఱఁబోదు. ఇట్టి గ్రంథరాజ మేమూలలనో పడియుండ నుద్ధరించి భాషోద్ధారణబద్ధకంకణు లయిన బ్రహ్మశ్రీ. శ్రీ వావిళ్ల. వేంకటేశ్వరశాస్త్రులవా రాంధ్రలోకమునకుఁ జేసిన యీమహోపకారమున కాంధ్రలోక మెంతటి. కృతజ్ఞత చూపినను ఋణము తీఱఁబోదు. ఇట్టి యముద్రితగ్రంథముల నుద్ధరించి వాఙ్మయము ప్రబోధించి లోకమునం జిరతరకీర్తి సిండించుటకు భగవానుఁడు శ్రీశాస్త్రులవారియెడ సంపూర్ణాయు రారోగ్యైశ్వర్య ప్రదాతయై, 'కలౌ వేదాంతిన స్సర్వే' అను నానుడి ఫక్కిగాక నిష్కలుషంబగు తనయధ్యాత్మవిజ్ఞానచంద్రికల పంచవింశతిసహస్రాధిక సంఖ్యాకగ్రంథరూపమున నాంధ్రలోకంబున వెల్లడించి యవ్యయంబగు యశఃకాయము వెలింగించి సాయుజ్యపదవి నలంకరించిన యిమ్మహాకవికృతికి ప్రతిహతప్రచారమగునట్లు శివానుధ్యాత యగుఁగాత!.

గీ. తత్త్వబోధావధూత సత్యప్రభూత
నాగయామాత్యకవిత ప్రజ్ఞాసమేత
మిగుల నాపాతమాధుర్యమగుటచేత
వేంకటేశ్వరుకృపచేత వెలయుఁగాత.

ఇట్లు,
విద్వజ్జనవిధేయుఁడు,
కావ్యతీర్థ, మద్దుపల్లి. వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రి.

చెన్నపురి.
3-4-25

శ్రీః.

# విషయసూచిక.

## బాలకాండము.



## అయోధ్యాకాండము.

# విషయసూచిక.



## అరణ్యకాండము.



## కిష్కింధాకాండము.

## సుందరకాండము.



## యుద్ధకాండము.

## ఉత్తరకాండము.

శ్రీరస్తు.

# అధ్యాత్మరామాయణము

## బాలకాండము.

శ్లో. చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరమ్,
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్.
రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే,
రఘునాథాయ నాథాయ సీతాయాఃపతయే నమః.



వైకుంఠము రంగమందిరముగా శ్రీభూసతుల్గొల్వ న
క్కావేరీతటమందు శేషఫణిభోగం బూని తా నాగని
ద్రావిభ్రాజితుఁడైన పుణ్యపురుషు౯ రాజీవనేత్రు౯ మహా
త్సేవాప్రీతు మహానుభావుఁ గొలుతు౯ శ్రీరంగనాథు౯ విభు౯. 1

సీ. ఏదేవుఁ డఖిలలోకేశుఁడై రజతాచలంబుమీఁదను గాఁపురంబు సేయు
నేధీరుఁ డమరుల బాధించి విహరించు దోషాచరావళిఁ ద్రుంచఁ గడఁగు
నేపుణ్యుఁ డఖిలమునీంద్రులకోర్కులు సమకూర్చుఁ గల్పభూజంబుమాడ్కి
నేమహాగుణశాలి కామాదిరహితుఁడై ప్రకటవైరాగ్యసంపద వహించు
తే. నట్టి ప్రాలేయశైలకన్యాధినాథు, సింధురాజినధరు జగద్బంధు నభవు
వేదవేద్యుఁ బురాతను ఖేదమోద, విరహితుఁ బరేశు శివుని భావింతు మదిని. 2

క. వాణీశసాంద్రతరక, ళ్యాణప్రదు భూతకల్పనాద్యతు జగ
త్త్రాణధురీణు నమేయుఁ బు, రాణపురుషుఁ గమలగర్భుఁ బ్రస్తుతి సేతు౯. 3

క. కలశాబ్ధిసుతను దుహినా, చలకన్యను వాణి నర్కశశివాయుకుమా
రుల మఱియుఁ గల్గువేల్పులఁ, బలుమఱు భజియింతుఁ గవిత భాసిల్లుటకు౯. 4

వ. మఱియును. 5

సీ. సంతతార్చితరామచంద్రపాదాంభోజుఁ బ్రాచేతసుని గవిప్రథముఁ దలఁతు
భారతగ్రంథకల్పనదక్షు భజనంబుసేతు నాసత్యవతీతనూజు
శైలరాట్తనయాప్రసాదవర్ధితవాగ్వికాసుఁ బ్రస్తుతిసేతుఁ గాళిదాసుఁ
పార్వతీవల్లభోపాసకు నెమ్మదిఁ బాడుదు వేములవాడభీముఁ

తే. దనకవిత్వంబు నారాయణునకొసంగి, యవ్యయంబైన కైవల్య మందినట్టి
పుణ్యచరితుని బమ్మెరపోతరాజు, నాత్మఁ గణుతింతు మత్కావ్య మలరుటకును. 6

ఆ. ధర రమావరార్పితం బగుచుఁ దెలుఁగు, కావ్యమునను శ్లిష్టకల్పనముల
లేనితప్పు లెన్నఁ బూనుదు రొకకొంద, ఱోర్పు లేక పల్కు నేర్పు లేక. 7

వ. అని యిట్లు ముఖ్యదేవతావందనంబును సుకవికీర్తనంబును గుకవిగుణేరితంబునుం
గావించి. 8

తే. రహిఁ దెలంగాడు కోటమరాజుభాస్క-
రాఖ్యమంత్రికిఁ దద్భార్య యైన రాయ
మాంబకును గూర్మిసుతుఁడఁ గాశ్యపసగోత్ర
జనితుఁ డను నాగయామాత్యుఁ డనెడు వాఁడను. 9

వ. ఇద్ధరాతలంబున. 10

క. ఘనపాండిత్యము లేదు, న్ననుదనచేకొలఁదిసైన నారాయణశా
ర్ఙ్గన మొనరింపఁగఁ దగునని, మనమున నెన్నుచును గాన ముదమున నేనున్. 11

షష్ఠ్యంతములు.

క. ధీరునకును గౌస్తుభమణి, హారునకును మేఘసన్నిభాకారునకున్
ఘోరాసురహరణసహా, స్ఫారునకును నుపవనవిహారునకున్. 12

క. పుణ్యునకును మునిసేవాశ, రణ్యునకును నంగకోటిరాజత్తనులా
వణ్యునకు నిగమమస్తక, గణ్యునకు నహైతుకాత్తకారుణ్యునకున్. 13

క. నేమముగ నుభయకావే, రీమధ్యతలంబునందు శ్రీభూనీళా
భామ లడుగులొత్తఁగ ని, ద్రాముద్రాకలితుఁడైన రంగేశునకున్. 14

క. తగు ప్రణవవిమానమున భు, జగపల్లవతల్పమునను శయనించి బుధుల్
నిగమములఁ బొగడ విని చెలు, వగఁ బుట్టఁ బరికించు రంగనాయకిదొరకున్. 15

వ. అంకితముగా నాయొనర్పం బూనిన యధ్యాత్మరామాయణం బను మహాకావ్యంబు
నకుఁ గథాక్రమంబెట్టు లనిన లోకానుగ్రహార్థంబు శైలనందనచేతఁ బ్రశ్న యొన
రింపంబడి తత్పార్వతీవల్లభుం డగు శశాంకశేఖరుం డెఱింగించిన యర్థంబయ్యుమావల్లభు
వలన నెఱింగి కమలాసనుండు నారదున కెఱింగించిన తెఱంగునఁ దనయందలి కృప

# బాలకాండము.

వేదవ్యాసమునీంద్రుండు పల్కె ననుచు సూతుండు నైమిశారణ్యపుణ్యక్షేత్రం
బున శౌనకాదిమహామునివర్గంబులం గనుంగొని బ్రహ్మాండపురాణంబునందలి
యధ్యాత్మతత్త్వబోధకంబగు శ్రీరామాయణపుణ్యాఖ్యాయికఁ బల్క నుపక్ర
మించి యిట్లనియె. 16

క. రాముఁడ నే ననియెడుమతి, నేమతిని ధనంబు నేయు నిల మోహము నా
రాముఁడ నే ననుట కతి, ప్రేమను సజ్జనుల ననుసరించెద నెపుడున్. 17

తే. నాసవనతాంఘ్రియుగళు సీతాసమేతు, సదయు భక్తప్రసన్ను రసాతనాథ
వానయనవనీలజలజపత్త్రస్మితాబ్జు, సుందరుని వంద్యు మానసమందుఁ గొలుతు. 18

సీ. భవవారివాహప్రభంజను ఘోరదానవభుజంగఖగేంద్రు రవికులేశు
సీతాసమేతు నాశ్రితసుమిత్రాపుత్త్రినమలు నాద్యు నమేయు నఘవిదూరు
జలజగర్భసురేంద్రసంతతార్చితు జగద్వ్యాపకు భక్తసంతాపహరణ
నవ్యయు దశకంఠనాచలభిదురతుల్యశరాఢ్యు నిత్యుఁ గల్యాణగరిము

తే. వప్రతర్క్యప్రతాపాఢ్యు వంబుదోప, మానవరదేహుఁ బుణ్యనాజానుబాహుఁ
బరమమునిగేయు దశరథభాగధేయు, రాము రిపుభీము సీతాభిరాముఁ గొలుతు. 19

చ. ఎవఁడు ధరాధరంబు హరియింప నురాళి నుతింపఁ జిన్మయుం
డవనిఁ బయోరుహాక్షకులమందు జనించి దశాస్యముఖ్యదా
నవుల నడంచి పాపహానంబగు కీర్తిని భూమి గప్పి చెం
ది వెలుఁగు బ్రహ్మ మాద్యము నుతించెద నాజనకాత్మజాధిపున్. 20

మ. జగము ల్సేయఁగఁ బెంపఁ జంప నొకఁడై సావిద్యుఁ డై తన్నుఁ గా
ల్పఁగ సమ్మాయకసాధ్యుఁ డై మదిఁ దలంపన్ రాక సానందుఁ డై
తగు నైర్మల్యరతిఁ దాల్చి స్వీయమగు తత్త్వజ్ఞుండు నై యొప్పు న
జ్జగదీశు న్నిజబోధరూపు రఘువంశశ్రేష్ఠు భావించెదన్. 21

తే. ఇతరమతి లేక వినుపించు నెవఁడు చదువు, నిట్టి యధ్యాత్మసంజ్ఞచే నెనయురామ
చరిత మఖిలపురాణసుసమ్మతంబుఁ, బాపములఁ బాసి హరిఁ జెంద నోపువాఁడు.

క. శివగిరిజాతయు రామా, ర్ణవసంగతయు ననఁ దగిన రామాయణకా
వ్యవిమలగంగానది యీ, భువనత్రయమును విశుద్ధిఁ బొందఁగఁ జేయున్. 23

శా. గౌరీనాథసుధాపయోనిధిజ యై కల్యాణసంధాయి యై
వైరాగ్యోజ్జ్వలమూల మై కలితదివ్యజ్ఞానసస్యంబు నై
పారం బొందని భక్తిసూనయుత మై భాసిల్లు నాధ్యాత్మిక
శ్రీరామాయణకల్పకంబు విబుధు ల్సేవింతు రిష్టార్థు లై. 24

వ. మఱియు వినుం డొకానొకసమయంబునఁ గైలాసకుభృద్వతంసంబున రవిశశివిమ
లంబగు మందిరంబున రత్నసింహాసనస్థుండును ధ్యాననిష్ఠుండును సిద్ధసంఘసేవితుం
డును మహామునిభావితుండును నగు సదాశివదేవుం గనుంగొని వామాంకస్థ యగు
పర్వతరాజనందన భక్తినమ్రయై సకలహితకరంబును నానందకందంబును నగు
వాక్యంబుగా నిట్లనియె. 25

సీ. సకలాత్మసాక్షివై సర్వజగన్నివాసుండవై చెలువందు శుభగచరిత!
నీకు వందన మిదె నీవు సనాతనుండవుఁ బరమేశ్వరుండవును గాన
ధర సనాతనమగు పురుషోత్తమునితత్త్వ మెఱుఁగఁ గోరెద నింక నెంతగోప్య
మైనఁ బల్కఁగరాని దైన మహానుభావులు భక్తుల కెఱుంగఁ బలుకువార
తే. లిదియు కా దింక నేనుమీ కనయభక్తి, యతినుఁ బ్రియనిట్లుఁ గానసమ్మతినిఁ బల్కఁ
దగును నే వేఁడుకొన్న యర్థంబు లెల్ల, భక్తవత్సల! కైలాసభవన! యీశ!. 26

వ. ఎట్టులనినఁ బరోక్షజ్ఞానంబును నపరోక్షజ్ఞానంబును దదపరోక్షజ్ఞానజననకారణంబు
లగు భక్తివైరాగ్యంబు లెవ్విధంబులో యవియును నానాతత్త్వవిచ్ఛేదకంబు నగు
మితంబునుం బల్కెదవేని యే ననధికారిణగు స్త్రీనైనను దారణోపాయంబులగు భవన్ము
ఖోదితంబు లెఱింగెద నిదియు కా దింకొక్క పరమరహస్యంబు వేఁడెద నది ప్రథ
మంబ యానతీవలయు సర్వప్రాణులకు నధిష్ఠానభూతుం డగు రామచంద్రునియందు
జనియించిన భక్తియు భవమోక్షణంబునకుఁ బ్రసిద్ధం బొందు సాధనంబు లేదని
యను సంశయంబు జనియించెం గావున నీదునిర్మలోక్తులచేత నది వాపం దగు
వినుండు. 27

సీ. దశరథరాజనందనుని గొందఱు సిద్ధు లాద్యుండు పరుఁడును సద్వయుం..
సకలమాయాగుణసంప్రసారవిముక్తుఁ డని రేయుఁబవలును నప్రమత్తు
లగుచు భజింపుచు నవ్విధంబుగఁ బరంపరము నొందిరి కొంద ఱదియు కాదు
స్వావిద్యచేతను సంవృతమానసుం డగుచు నాత్మ నెఱుంగఁ డన్యు లెఱుఁగఁ
తే. బలుకఁగఁ బరాత్మతత్త్వంబు దెలియఁగాక, యున్నసితాకృతింబగు మున్నదుఃఖ
మేల పరమాత్ముఁ డగునమ్మహిమచేతఁ, జేయఁబడుఁ గాన సముఁ డెల్లజీవులందు. 28

క. ఇటు లెఱుఁగనివాఁ.. భజిం, చుట కేక్రియఁ దగు నటంచుఁ జాతురు కరుణా
నిలాంబర! మీచే నిపు, డెటుఁ దెలియఁగఁ బోలు దాని నెఱిగింపఁ దగున్. 29

వ. అనిన మహాదేవుం డిట్లనియె. 30

మ. సతి! యేహేతువుచేత నీవు రఘువంశశ్రేష్ఠతత్త్వంబు హృ
ద్గత మౌనట్లుగఁ గోరి తెండుల భువిఁ గన్యాత్మ విభ్రంగి ము

న్నితరు ల్వేఁడరు గాన నీదగు మనోభీష్టం బొసంగూర్ప నా
శ్రితరక్షాపరతంత్రు రాఘవవిభున్ సేవించి భావించెదన్. 31

వ. పరమాత్ముండగు రామచంద్రుని నిగూఢంబును బరమంబును నగు తత్త్వం బెఱుంగ వేఁడితివి కావున నమ్మహాత్ముండు పరమాత్మయు నిర్మాయుఁడు మొదటివాఁడును మహా వంగుండును నొక్కండును నజుండును నద్వయుఁ దనదగు మహామాయచేత జగంబులు సేయుచు లోపల వెలుపలను దల్లేపవర్జితుం డయి యాకాశంబుభంగి నుండు మఱియును. 32

తే. తనరి సర్వాంతరస్థుఁ డద్వయుఁడు నిగూఢుఁ, డగుచుఁ దనమాయనగు జగంబంత వెలుఁగఁ
జేయుఁ దత్సన్నిధానంబుచేతఁ దిరుగు, జగము లోహ మయఃకాంతసన్నిధివలె. 33

వ. విమూఢులగు వా రివ్విధంబున. 34

క. మతి దెలియక స్వాజ్ఞానా, వృతులై గతమాయుఁ డధికవిజ్ఞానఘనుం
డతులితుఁ డగు నాత్మ నలఁప, జతపఱతురు స్వాజ్ఞతను నిజం బిది యబలా!. 35

క. ఉరుకర్మయుక్తులును నుత, పరివారోపేతు లగుచు భవమున నెపుడుం
దిరుగుజనులహృదయస్థితు, లెఱుఁగరు గ్రైవేయ ముజ్ఞు లెఱుఁగనిభంగిన్. 36

మ. అమరున్ వేఱొక కాంతి యర్కునెడఁ బెంపై యున్న జ్యోతిస్స్వభా
వము నం గానితెఱంగునన్ విమలభాస్వద్జ్ఞానసంపూర్ణుఁ డౌ
కమలాప్తాన్వయవార్ధిచంద్రునియెడం గానేర్చునే యయ్యవి
ద్య మహీభృద్వరనందనీ! ప్రథితకళ్యాణీ! భవానీసతీ!. 37

వ. అదియుఁ బరమాత్మయుఁ బరమేశుండును నగు నతనియందుఁ బల్కంబడ దెట్లనినఁ గన్నులు దిరుగుచుండు వినష్టదృష్టికి గృహాదికంబెల్లఁ దిరుగుగతిఁ గనుపడనిమాడ్కి దేహేంద్రియకర్తయగు జీవునిచేత నావరింపంబడు నంతయుఁ గేవలాత్మయందు నారోపించి యేనుగర్తను భోక్తనను విమోహంబు నొందుదురు. నభోమణియందుఁ బ్రకాశరూపావ్యభిచారంబున నగ్నిహోత్రంబు లేనిమాడ్కిఁ బరుండును బరిశుద్ధజ్ఞానమయుండును నగు రామచంద్రునియందు జ్ఞానాజ్ఞానంబు లుండనేరవు. పరానందమయుండును విజ్ఞానరూపియును గావున నజ్ఞానంబునుండదు తత్సాక్షియు మాయాశ్రయుండును గాన నమ్మహాత్మునిమోహంబు నొందింప నమ్మాయకు సామర్థ్యంబు గలుగనేరదు. మఱియును. 38

క. అతిదుర్లభ మిది వినుమిం, కితరుల కెఱుఁగింపఁ బోల దీరామమరు
త్సుతసీతాసంవాదము, నతిసుఖదము మోహసాధనంబు మృగాక్షీ!. 39

వ. ఎట్లనిన. 40

సీ. మున్ను రామాయణంబున రామచంద్రుండు దేవకంటకు దశగ్రీవు సహిత
బలవాహనంబుగ ఖండంబునం గూల్చి సీతతోఁ దాను సాకేతమునకు
సౌమిత్రియును వాయుజముఖవానరవర్గమును గొల్వఁ జనుదెంచి వనజగర్భ
పుత్త్రాదిబుధులు నింపు దలిర్ప సభను సుఖాసనంబుననర్కభాసమానుఁ
తే. పద్మహస్తుఁడు గూర్చుండి యధికబుద్ధి, కలితు విజ్ఞానశాంతు నిశ్చలుఁ గృతాత్మ
కార్యు హనుమంతు ముకుళితకరు నిరీహుఁ, గాంచి యిట్లనె ధారుణీకన్యతోడ. 41
మ. మనకున్ భృత్యుఁడు వీతకల్మషుఁడు నాత్మజ్ఞానపాత్రుండు పా
వని మన్నిశ్చయ మీనుబుద్ధి కెఱుఁగం బల్కం దగు నీ వనన్
జనకక్ష్మావరపుత్త్రి సత్కరుణచే సామీరి నీక్షించి రా
మునియాథార్థ్య ముపక్రమించెఁ బలుకన్ మోదంబునన్ బార్వతీ!. 42
వ. ఇట్లు లోకవిమోహినియగు వైదేహి సమర్థకంబుగ. 43
సీ. రామచంద్రుఁడు పరబ్రహ్మంబు సచ్చిదానందుఁ డద్వయుఁడు నానందుఁ డమలుఁ
డీశుఁ డాత్మయు స్వప్రకాశుండు శాంతుండు నిర్వికారుఁడును నిర్మలుండు
నని బుద్ధి నూహింపు మగచరేంద్రవతంస! మూలప్రకృతి లోకములు సృజింపఁ
గావ నిర్జింపఁగఁ గర్త నే ననుకొమ్ము మత్సన్నిధిభూతవితతి నెల్ల
తే. నేనె సృజియింపుచుండుదు నిది యెఱుంగఁ, జాలకజ్ఞులు రామభూపాలునందు
భ్రాంతినొందుచునుం గుణోపాధియుక్తుఁ, డొరుల కెఱుఁగంగఁబడఁ డగోచరుఁడు నిజము.
వ. ఇదియె కాక. 45
సీ. అతినిర్మలంబగు సర్కాన్వయంబున జనియించి తాటకిఁ దునిమి సవము
గాచి యాతిని నాతిగాఁ జేసి మిథిలలో శంకరుచాపంబు పొంక మడఁచి
ననుఁ బెండ్లి యై భార్గవునిగర్వ మడఁగించి కదలి యయోధ్య కిం పొదవఁ జేరి
పదునాల్గువర్షముల్ పదపడి నను గూడి జనకునానతివశంబునను నేఁగి
తే. యచట నెదిరించు నవ్విరాధాదిముఖ్య, దేవకంటకులను ద్రుంచి తివిరి మాయ
లేడి యైనట్టి మారీచు లీలతోడఁ, గూల్చి మాయామహీజను గోలుపోయి. 46
వ. అంత జటాయువునకు మోక్షం బొసంగి కబంధుని గతభవబంధుం జేసి శబరివలనఁ
బూజితుం డై సుగ్రీవునితోడ సాచివ్యం బొనరించి యొక్కసాయకంబున వాలిం
జక్కడంచి సీతాన్వేషణంబు సేయం బనిచి ప్రసిద్ధం బగు దక్షిణపారావా
రంబు సేతుబంధనంబు గావించి లంకానిరోధనంబునుం జేసి సపరివారంబుగ దురా
త్ముం డగు రావణుం బరిమార్చి విభీషణునకు రాజ్యం బొసంగి యేనునుం గూడఁ బు
ష్పకారూఢుం డై యయోధ్యానగరంబున కేతెంచి పట్టాభిషిక్తుం డై చెలువొంద

సనుటయాదిగాఁగల మత్కృతకార్యంబులు నిర్వికారుండును నఖిలాత్మయు నగు
రఘునాయకునియందు మూఢు లారోపింతు రమ్మహాత్ముండు. 47

తే. చనఁడు నిలువఁడు చింతగాంచఁడు తలంపఁ, డొకటి యొనరింపఁ డానందుఁ డుజ్జ్వలుండ
చలుఁడు పరిణామహీనుఁ డీజాడ నయ్యుఁ, గలసి మాయాగుణములతో మెలఁగు నిటుల.

చ. అని పలుకంగ నాత్మయు ననాత్మ పరాత్మలు వీని తత్త్వ మో
యనిలకుమార! నీకుఁ దెలియంగను బల్కెద సంయమాఘవుం
డనియెను; మూఁడుభంగుల మహాత్ములు భేదము లాకసంబుసం
దున నెటులొప్పుచు నక్కరణిఁ దోఁచును జిత్తున నిక్క మెట్లనన్. 49

సీ. సకలాశ్రయమునందు వెలయుమహాకాశ మజ్జలావచ్ఛిన్నమంగు బింబి
తంబును నసఁ ద్రివిధంబుగ భేద మాకసమున నగుభంగిఁ గాంచ బుద్ధ్య
వచ్ఛిన్నచైతన్య మచ్చొంతఁ గాక చెల్వగుపూర్ణచైతన్య మట్టిబుద్ధి
యందు బింబితమగు నట్టిచైతన్యంబు నన మూఁడువిధముల నగును భేద

తే. మచ్చిదాభాసయుతమగు నట్టిబుద్ధి నలరఁ గర్తృత్వజీవత్వములు వికార
విరహితుండు నవచ్ఛిన్నుఁ డరయ నిట్లు, లయి సకూటస్థుపయి నుంతు రజ్ఞులిలను. 50

తే. అట్టియాభాసయును నవిద్యాకృతంబ, యగుట వలన మృషాబుద్ధి యనఁగఁబడుఁ
గడఁగి విచ్ఛేదధర్మంబు కల్పితంబ, యగుట నాతఁ డవిచ్ఛిన్నుఁ డనఁగఁ దగును.

వ. తత్త్వమసీతివాక్యంబులవలన నాతనికఁ బూర్ణునితోడ నైక్యంబు పల్కంబడదు
నిబ్భంగి బుద్ధియందుఁ గన్పించుచైతన్యంబునకైక్యంబు పల్కంబడదు మఱియును 52

తే. అమరు జీవాత్మపరమాత్మలందు నెప్పు, డైక్యభావంబు నీమహావాక్యము సను
నాసమయమునఁ దనదు కార్యములతోడ, నడఁగును నవిద్య నిస్సంశయంబు వత్స!.

వ. మద్భక్తుండగువాఁ డిట్టియైక్యజ్ఞానం బెఱింగి నన్నిమద్భావంబునకు నర్హుండగు
నిట్లుంగాక మద్భక్తివిరహితులై శాస్త్రంబు లనుఘనంబుల మునింగెడు మూఢాత్ము
లకు జన్మశతంబులకునైన జ్ఞానమోక్షంబులు సిద్ధింప విదియును. 54

చ. అనఘ! రహస్య మీహృదయ మాత్మవినిశ్చయ మేను నీకుఁ బ
ల్కినయది నాదుచింతనము లేక యిలన్ శఠులైనవారి కి
వ్వను దగ దింద్రభోగములు వచ్చిన నంచు సమీరపుత్త్రుఁ గ
న్గొని రఘువల్లభుం డనియెఁ గోమలి! యే నిదె నీకుఁ బల్కితిన్. 55

సీ. అతిగుహ్యతమము హృద్యము పవిత్రము పాపశోధనం బపవర్గసాధనంబు
శ్రీరామకథితం బశేషాగమాంతసంగ్రహ మెవ్వ రతిభక్తిఁ గడఁగి చదువ

నడఁగు ననేకజన్మార్జితాఘములు శ్రీరామువాక్యప్రకారమున యోగి
బృందాపకారియుఁ బితృవధరతుఁడు జాతిభ్రష్టు పాపి భూదేవహంత
తే. కుండు నైనను శ్రీరామకువలయేశు, పూజ యొనరించిహృదయంబుతోఁజదువఁగఁ
బరమయోగులకైన లభ్యంబుగాని, పదము గలుగును సురలచే భావ్యుఁ డగును. 56
క. అనిన గృహీతానుగ్రహ, సనుపమధన్యను గృతార్థ నైతిని సదె వీ
డెను మదిని గల్గుసంశయ, మినుమడి నీకరుణ ననుచు నీశ్వరి యనియెన్. 57
చ. పరమపవిత్ర! నీదు ముఖపంకజసంస్కృత మైన రాఘవే
శ్వరుచరితామృతం బిపుడు పానమొనర్చిన నెమ్మనంబు సం
సరణము వాపు నంచు విన సంతసిలుక్ మితమాటఁ దృప్తి చే
కురదు స్ఫుటాక్షరంబుగను గోరెదఁ బల్కఁగదే కృపానిధీ!. 58
మ. విను దేవీ! రఘునాథుచేత మును నే విన్నట్టిగోప్యంబు రా
మునిచారిత్రము దీనిఁ గోరి వినినన్ ముక్తుల్ నిజాజ్ఞానసం
జనితోద్యద్భయరాశిచేఁ దవరు భాస్వత్సప్తసంతానముల్
ఘనతాపత్రయహారమాఁ బలికెదన్ గౌరీసరోజాననా!. 59
వ. ఎట్టు లనిన. 60
సీ. దశకంధరాదిదైత్యవితానభరముచేఁ దప్త యై గోరూపధారి యగుచు
ధరణి సమస్తబృందారకుల్ చనుదేర వనరుహాసనులోకమునకు రోద
నంబు సేయుచు నేఁగి నలినగర్భున కంతఁ బలుకంగ నమ్మహాభవ్యచరితుఁ
డఖిలాత్మవిజ్ఞాని యగుట నొంకిత ధ్యానించి దుగ్ధాబ్ధిసన్నిధికి నరిగి
తే. యతులితపురాణకథితసంస్తుతులచేత, సిద్ధనిర్మలపదముల శ్రీశు నఖిల
లోకవ్యాప్తస్థితు నజరుని లోకనయనుఁ, బరమపురుషుని వినుతించెఁ బద్మజుండు.
వ. ఇట్లానందసలిలావృతనయనుం డై భక్తికలితవాక్యంబుల సన్నుతిసేయునవసరంబున
దిక్కుల తమం బెల్ల నివారింపుచు. 62

## శ్రీమన్నారాయణుండు బ్రహ్మకుఁ బ్రత్యక్ష మగుట.

సీ. వారిజహితసహస్రోరుప్రకాశుఁ డై సాక్షాత్కరించెఁ బద్మాక్షుఁ డప్పు
డకృతాత్ములకుఁ జూడ నలవిగానితదీయవిగ్రహం బజుఁడు సమగ్రదృష్టిఁ
జూడఁ జాలకయును జూచెఁ దద్రూపంబు హరినీలతుల్యంబు దరహసితశు
భాస్యంబుఁ బద్మపత్రాక్షంబు మకుటకుండలహారకేయూరకలిత మమర
తే. వాంఛితంబును శ్రీవత్సలాంఛనంబు, విమలకౌస్తుభరత్నంబు విపులపాంచ
జన్యజలజగదాసహస్రారధరిత, ఘనమసాయకతుల్యం బనంత మజము. 63

వ. మఱియును. 64

తే. స్వర్ణయజ్ఞోపవీతంబు స్వర్ణవర్ణ, చేలమును ఖగవాహనస్థితముఁ బంక
జాలయాధారుణీసేవ్య మఖిలపార్శ్వ, దోపశోభిత మభయంబు పాపహరము. 65

వ. ఇవ్విధంబున. 66

క. ఎసఁగి యురుపక్కియల సన, కసనందనముఖులు మించి గణుతి యొనర్పన్
బిసరుహలోచనుఁ డపు డ, ద్దిస నిలువఁగఁ బద్మజుండు ధృతకరపుటుఁడై. 67

వ. హర్ష గద్గదభాషణంబుల నిట్లని వినుతింపం దొడంగె. 68

సీ. దేవ! కృపాసాంద్ర! దీనజనావన! నారాయణానంతవారిజాక్ష!
నీరూప మీక్షింప నే నెంతవాఁడను గర్మపాశంబులకడముఁ గను మ
ముక్షులౌ వారిచే ముదమునఁ బ్రాణబుద్ధీంద్రియాత్మల నుతియింపఁ బడెడు
నీపదాబ్జములకు నెమ్మి మ్రొక్కెదఁ బూర్ణ కాముఁడవును స్వసుఖానుభవుఁడ

తే ననయ్య గుణమయ మగు మాయ నఖిలమును సృ
జించుచును బెంచుచును విదారించు చుందు
వెవ్వఁ డా నీధర్మముల శ్రద్ధ నెసయ వాని
కరణి నితరవ్రతులు శుద్ధిఁ గాంచలేరు. 69

ఉ. సత్యపదానువర్తులగు సంయమివర్యులచేత నాత్మలన్
నిత్యము నిల్పఁగాఁ దగు వినిర్మలతావకపాదపంకజం
బత్యనురక్తి నాదుహృదయంబున నిల్పునుగాక దుష్టసాం
గత్యసముద్భవాఘచయఖండన సేయుము ముకుంద! మాధవా!. 70

వ. దేవా! బ్రహ్మత్వాధికారసిద్ధికొఱకు మాచేతను బ్రత్యక్షానుభవసిద్ధ్యర్థంబు జ్ఞానవం
తులగు మహాయోగిజనులచేతను బూర్వంబ సేవితుండ వైతివి మఱియును. 71

చ జలనిధికన్య నీయురముఁ జయ్యనఁ జెందియుఁ బాదయుగ్మమం
దుల నిడినట్టి యాతులసితోడ సపత్నియపోలె స్పర్ధచేఁ
వెలయుట దా మెఱంగి సువివేకులు లచ్చినివీడి నీపదం
బుల దృఢభక్తిఁ గోరుదురు పుణ్యశరీర! ఖగేంద్రవాహనా!. 72

క. ధారుణిలో నరులకు సం, సారామయతప్తులకు రసాయన మగుటన్
నారాయణ! మా కవ్యభి, చారంబుగ నీదుభక్తి సమకూర్పఁగదే. 73

వ. అని యివ్విధంబున విన్నవింపం గనుంగొని భగవంతుం డగు నారాయణుం డద్ది
కర్తవ్యం బనిన మరల సరస్వతీరమణుం డిట్లనియె. 74

సీ అవధరింపుము షడ్గుణైశ్వర్యసంపన్న! యీవసుంధరయందు రావణుండు
పౌలస్త్యతనయుండు పటుబలాఢ్యుఁడు రాక్షసాధీశ్వరుం డు వాఁ డాగ్రహమున

మద్దత్తవరముచే మత్తుఁడై మూఁడులోకములవారలకు దుఃఖము లొనర్చు
వానికి మనుజునిచే నేలఁ గూలంగ నేను గట్టడ చేసి తిట్లు గావ
తే. మానవాకృతి మీరలు పూని దేవ, కంటకుండగు నప్పఙ్క్తికంఠుఁ దునుముఁ
డిట్టులైనను సుఖియించు నెల్లజగము, లనిన నారాయణుం డిట్టు లనియె నపుడు.
క. వనజజ! విను మును గశ్యపుఁ, డనుముని తపమునను నాకు నానంద మొన
ర్చినఁ నేను దృక్పథముఁ జెం, దిన సుతునిఁగ వేఁడె ననుమతించితి నటులన్. 76
మ. ఇపు డామూనికులేంద్రుఁడున్ దశరథాధీశుం డనాఁ బుట్టె నా
నృపకాంతా త్రితయంబునందునను జన్మింతుం దనూజుండనై
కృప నాల్గాకృతులన్, మహీజ యన సత్క్రీర్తిన్ విదేహక్షమా
ధిపు గేహంబున యోగమాయయును వృద్ధిం బొందు వాగీశ్వరా!. 77
వ ఏను నిమ్మాయాసహితుండనై సకలకార్యంబులు చక్కంజేసెద ననుచు భగవంతుం
డంతర్ధానం బొందె నంత శతానందుం డమరబృందంబులం గనుంగొని. 78
మ. వినుఁడీ దేవతలార! లోకగురుఁడౌ విష్ణుండు భూభార మో
ర్వను మార్తాండకులంబునందునను శ్రీరామాఖ్యచేఁ బుట్టుఁ గా
వున నాత్మాంశల వానరప్రవరులన్ బుట్టించి యుగ్రాజిఁ దో
డ్పొసరింపం దగు నిల్చు నెంతతడ వయ్యుర్వీశ్వరుం డుర్విలోన్. 79
వ. అని యమరబృందంబులకుం బలికి భూదేవి ననునయించి చతురాననుండు నిజ
భవనంబునకుం జనియె నమరులును. 80
తే. ఘోరపాషాణదంష్ట్రావనీరుహోగ్ర
నఖముఖాయుధములగు వానరశరీర
ములును ఋక్షాకృతులుఁ దాల్చి జలజనయను
నుదయముఁ బ్రతీక్షసేయుచు నుండి రపుడు. 81
క. అనుచు శశాంకకిరీటుం, డినవంశాంభోధిచంద్రుఁ డిఁకమీఁద జనిం
చును తద్విధంబుఁ బల్కెద, వినుమనియెఁ దుషారశైలవిభునందనితోన్. 82
వ. ఎట్టు లనిన. 83
సీ. అతిధార్మికుం డయోధ్యావల్లభుఁడు సర్వలోకవిశ్రుతుఁడు భాగ్యాకరుండు
సత్యపరాక్రమశాలి శూరుఁడు దశరథుఁ డనురాజు మూర్ధన్యమాళి
తనయులు లేక చింతను గుస్సియొకనాఁడు ఘనువసిష్ఠుని బిల్వఁ బనిచి యోమ
హాత్మ పుత్రులులేని యఖిలరాజ్యము దుఃఖకరము గావున నెట్లు కలిగెదరు స
తే. మస్తలక్షణలక్షితుల్ మహితు లాత్మ, జులు దయామతితో నింతఁ బలుకు మనిన

నమ్మునిశ్రేష్ఠుఁ డనియె ధరాధినాథ!, చింతిలకు తావకాభీష్టసిద్ధి యగును. 84
తే. సత్త్వసంపన్నులును దేవసములు నల్వు, రాత్మజులు గల్గెదరు శాంత కధిప! తపము
యర్థముగఁ గలపుణ్యుఁ డీయవని ఋశ్య, శృంగుఁ డాతని నిటఁ దేరంగ బనుపు.

### దశరథుఁడు ఋశ్యశృంగుని రావించి పుత్రకామేష్టి యొనర్చుట.

వ. ఇట్లొనరించి యేమునుం గూడఁ బుత్త్రకామేష్టి యొనరింపు మనినఁ బఙ్క్తి-
రథుండును మంత్రులతోడం జని ఋశ్యశృంగుం దోడితెచ్చి పరిశుద్ధుం డై వీత
కల్మషులగు మునులం గూడి యజ్ఞకర్మం బుపక్రమించి శ్రద్ధాయుక్తుం డై వేల్చు
చున్నసమయంబునఁ దప్తజాంబూనదప్రభుం డగుచు హవ్యవాహనుండు స్వర్ణ
పాత్రస్థంబగు పాయసంబు కరంబునం బట్టి హోమకుండంబునందు సాక్షాత్క-
రించి. 86
క. కొనుఁ డిదె పాయస మిది గొను, మనుజులకు సుతత్వ మొందు మహిలోఁ బరమా
త్మ నిజం బమరవినిర్మిత, మని పఙ్క్తిరథునకు నొసఁగి యనలుఁడు చనియెన్. 87
ఉ. అంతటఁ గోరిక ల్సఫల మౌటకు సంతస మంది యమ్మహీ
కాంతుఁడు మానివర్యులకు గ్రక్కున మ్రొక్కి తదాజ్ఞఁ గైకయీ
కాంతకుఁ గోసలాత్మజకుఁ గైకొనఁ బాయస మిచ్చెఁ, గోరి తా
నంత సుమిత్ర వేఁడఁగఁ బ్రియంబున వారు స్వభాగమందుఁదన్. 88
వ. సగంబు సగం బొసంగి రిట్లు భుజియించి రాజకాంతలు ముగ్గురును సగర్భ లై దేవ
తలభంగి భర్తసౌధాంతరంబులం జెన్నొందిరంత దశమమాసంబునఁ గౌసల్య
కుమారు సద్వయుం గనియె నవ్విధంబు వినుము. 89
ఉ. ఘన మై యొప్పెడుచైత్రశుద్ధనవమిన్ గర్కాటలగ్నంబునన్
వనజాప్తుం డజరాశిఁ జెందఁగ బునర్వస్వర్క్ష మింపొంద హె
చ్చున నింపై గ్రహపంచకం బమరఁ దేజోవిగ్రహుండున్ సనా
తనుఁ డావిర్భవమొందె నచ్యుతుఁ డమర్త్యత్రాణపారీణుఁ డై. 90
వ. బృందారకులు మందారకుసుమంబు లందంద వర్షింపుచుండి రద్దేవుండు. 91
సీ. కలితనీలోత్పలదళనిభశ్యాముండు పీతాంబరధరుండు జాతరూప
మాణిక్యకుండలమహితకపోలుండు నంభోజరక్తనేత్రాంతుఁ డుగ్ర
కరసహస్రప్రతీకాశకిరీటుండు నాకుంచితాలకుం డబ్జపాంచ
జన్యగదాసహస్రారశోభితచతుర్బాహుండు సంతతోత్సాహుఁ డాత్మ
తే. సత్కృపాచంద్రసూచితసస్మితుండు, భూరికరుణారసావృతపుండరీక
లోచనుండును భవబంధమోచనక్రి, యాచణుండును భువనవిలోచనుండు. 92

వ. మఱియు శ్రీవత్సహారకేయూరనూపురాదిభూషణుండును వనమాలికావిరాజితుం
డును నగు జగన్నాథుండు గానంబడిన విస్మయంబు నొంది హర్షాశ్రుజలపూర్ణ
నయన యై కరంబులు మొగిడ్చి కౌసల్య యిట్లనియె. 93

చ. జననుత! దేవదేవ! వరచక్రగదాధర! వందనంబు ని
న్ననయము వాగగోచరుఁడు నచ్యుతుఁడుం బరమాత్మయుం సనా
తనుఁడు నతీంద్రియుం డనుచుఁ దత్త్వవిదుల్ వచియింతు రైన మా
యను జగదుద్భవస్థితిలయంబు లొనర్చుచు నుందు వెంతయున్. 94

వ. దేవా! సత్త్వాదిగుణసంయుక్తుండ వై స్తోత్రార్హుండ వయితివి గాని విచారింప నమ
లుండవు నఖిలంబు సేయుభంగి నుండుదువు గాని యకర్తవును నడచినమాడ్కిఁ
దోఁతువు గాని గమనవర్జితుండవును వినినపోల్కి నగుపడుదువు గాని తత్సాధన
రహితుండవును గనినయట్లు వెలయుదువు గాని కనుంగొననివాఁడవును నిట్లు సాధనం
బులు లేక సకలకార్యంబులు నొనరించు నీకుఁ బ్రణమిల్లెద. యేను బల్కుటయె
కాదు 'అప్రాణో హ్యమనః శుభ్రః' ఇత్యాదిశ్రుతివచనంబులునుం గలవు. సకల
భూతంబులయందును సమంబుగ నుండియు నజ్ఞానధ్వాంతచిత్తులగువారలకు నగ
పడ వింక సద్బుద్ధులగు పుణ్యులకుం గానవత్తువు. మఱియును. 95

ఆ. లోకములకు భక్తలోలత గనుపింప, నణువులట్లు పంకజాండకోటు
లుదరమందుఁ దోఁచు విదితుండ విబ్భంగి, గలిగితయ్య! నాదుగర్భమందు. 96

వ. ఏనును. 97

సీ. కనులపండువుగాఁగఁ గనుఁగొంటి నీదివ్యమంగళమూర్తి నీమాయచేత
దుర్భరసంసారతోయధి మునిఁగిన నాఁడు దానికి నిట్లు చూడఁబడుట
నీదయాళుత్వంబు నేఁ డందఱికిఁ దేటపడియె విశ్వ మనేకభంగులుగను
ద్రిప్ప నీమాయ నన్నెప్పుడు చెందకయుండ నొనర్చి యియ్యుజ్జ్వలంపు

తే. రూప ముపసంహరించి నిరూఢయుక్తను, (శిశురూపంబు దాల్చి నాచిత్తమునకుఁ
బుత్రసంతోషమును గూర్చి పుత్త్రుఁడవుగ,) దర్శనంబిమ్ము ననుగన్నతండ్రి! నేఁడు.

వ. ఇట్లయిన లాలనాలింగనాలాపంబుల నుత్కటంబగు నజ్ఞానంబు నుత్తరించెద
ననిన నెయ్యది యభీష్టం బది సమకూర్తు ననుచు భగవంతుం డిట్లనియె. 99

మ. జననీ! రావణుఁ గూల్చి భూభర మడంచం భారతీనాథుచే
తను నీవుం బతియుం దపంబునను బుత్త్రిత్వంబు నొంద న్నుతిం
చిన మీచేతను బ్రార్థితుండ నగుచుం శిష్టావనౌత్సుక్యతం
జననం బందితిఁ బూర్వభాగ్య మిటు మత్సందర్శనం బబ్బుటల్. 100

ఆ. నాదుమూర్తిదర్శనంబు మోక్షకరంబు, పామరులకు దుర్లభంబు గానఁ
దనరుఁ దని యలక్ష్యమును బూనక తలంపు, మమ్ము! సంతతంబు నెమ్మనమున.

క. విమలమతి నమలసంవా, దము వినినఁ బఠింపఁ జదువఁ దగు మత్సారూ
ప్యము మరణవేళ మత్స్మృతి, యమరు నసంశయము ముక్తుఁ డగు నతఁ డంతన్.

ఆ. అనుచుఁ బల్కి బాలుఁడై రోదన మొనర్చె, బాలుఁడయిన నింద్రనీలరుచియుఁ
గర్ణములకు నంటు కనులు సుందరమూర్తి, పరఁగి చూడఁ గనుల పండు వయ్యె.

దశరథుఁడు పుత్రోత్సాహము సేయుట.

వ. ఇట్లు బాలసూర్యసన్నిభుండును బాలితాఖిలలోకపాలకుండు నై యొప్పె. దశర
థుండును నిట్టికుమారజననమహోత్సవంబు విని యానందార్ణవమగ్నుం డయి
గురువరసమేతంబు గాఁ జనుదెంచి. 104

క. కమలజకోమలపాదుని, గమలాస్యుని గమలకరుని గమలోదరునిన్
గమలాధినాథు మునిహృ, త్కమలార్కుని గమలనయనుఁ గనియెను బాలున్.

వ. ఇట్లు గనుంగొని హర్షాశ్రుసంప్లుతుం డై గురువర్యునిచేత జాతకర్మాదికర్తవ్యంబు
లొనరించె నంత. 106

క. భరతుం గనియెను గైకయి, గరిమన్ గవలను సుమిత్ర గనియెను ధరణీ
శ్వరుఁ డవ్వేళ మహీసుర, వరులం దనియించె నిష్టవస్తుప్రతతిన్. 107

వ. అప్పుడు కౌసల్యానందనుం గనుంగొని. 108

తే. మాను లజ్ఞాన మడఁగి విజ్ఞానమహిమ, నెవనియందున రమియింతు రెవఁడు క్రీడ
దా నొనర్చునో యతనికిఁ దవిలి గురుఁడు, నామకరణం బొనర్చెను రాముఁ డనుచు.

వ. తక్కినకుమారుల ముఖ్యవరం గాంచి. 110

తే. ధరణి భరియించుఁ గావున భరతుఁ డరులఁ, దునుముఁ గావున శత్రుఘ్నుఁ డనుపమాన
లక్షణాన్వితుఁ డౌటను లక్ష్మణుండు, నని ముదంబున నామధేయంబు లొసఁగె.

వ. వారును బాల్యసాంశంబు ననుసరించి రామలక్ష్మణ భరత శత్రుఘ్ను లన వేఱు
వేఱ విహరింపుచుండి రందు రామచంద్రుండు లక్ష్మణసహితుం డై బాలక్రీడలను
ముగ్ధభాషణంబులను జననీజనకులకు ముదం బొనరింపుచుండె నప్పుడు. 112

సీ. స్వర్ణమయాశ్వత్థపర్ణముక్తాఫలప్రభ సొగసైన ఫాలభాగమునను
నడుమను శార్దూలనఖముగూర్చిన రత్నములహార మింపగుగళమునందుఁ
గనకాంచితంబు లర్జునశలాటకములు చెవులఁ గంకణములు చేతులందు
మొలను గంటలు పాదములను సందెలు పావడములు గజ్జెలు నిట్టు లమరి తోడి

తే. బాలురను గూడి ముంగిట లీలతోడఁ, జెలఁగి గంతులు వైచునా చిన్నికొమరు

రాముఁ గముఁగొని దశరథభూమివిభుఁడు, సంతసము నొందునపుడు కౌసల్యతోడ

వ. మఱియు భుజియించు నవసరంబున. 11

క. రామా! భుజియింపఁగ రా, వే మాయయ్య! యని తండ్రి పిలువ నపుడె త
ద్భామిని రామా! రారా, దా మాదగ్గఱ కటంచుఁ దగఁ బట్ట జనన్. 11

వ. అప్పుడు మహాయోగుల మనంబులకును స్పృశియింప నందని పరబ్రహ్మంబు దశర
థునను మతంబునఁ దన్నుఁ బట్టవచ్చి యోపక యలసటఁ జెందు తల్లియందుఁ గరు
ణించి మందహాసంబు మొగంబునం దళుకొత్తఁ గర్దమాంకితపాణితలుం డై తన
యంతం జనుదెంచి. 116

తే. కబళ మొక్కింత గొనితొంటికరణి వేగఁ, బరువులిడుచుండు నిట్లు దంపతులనఖిల
భూతలానందకరుఁడగు పుణ్యమూర్తి, బాలలీలల సంతోషపరులఁ జేసె. 117

వ. కౌసల్యయు నెలనెలను సువాసినీజనంబులకు విచిత్రంబులగు పాయసంబు లొసం
గుచు రఘువంశోత్తము నలంకరింపుచుండు నంత లోకపాలతుల్యులగు నక్కుమా
రులును గౌమారవేళ సంప్రాప్తం బైన వసిష్ఠుచేత నుపనీతు లై సర్వవిద్యావిశారదు
లును ధనుర్వేదనిరతులును సర్వశాస్త్రాస్త్రకుశలులును నై మాయామానవరూపం
బుల నొప్పి రయ్యెడ. 118

సీ. సాదరంబున రఘుస్వామివెంటనె లక్ష్మణుం డెడఁబాటు లేకుండు సేవ్య
సేవకభావంబు చెన్నొంద భరతునితోడ శత్రుఘ్నుండు వీడకుండు
రామచంద్రుఁడును దురంగాదిరూఢుఁ డై ఘననిషంగంబులు కార్ముకాస
నంబును బూని వెంటను లక్ష్మణుఁడు రాఁగ వనమున కేఁగి యవ్వనమునందుఁ

తే. గలుగు క్రూరమృగంబులఁ గార్ముకప్ర, ముక్తనారాచములఁ గూల్చి భక్తితోడ
జనకునకు వేడ్క లొసరించి సకలలోక, సమ్మతములగు కార్యముల్ సల్పుచుండు.

వ. మఱియు నారాఘవుండు నిత్యంబును బ్రొద్దున మేల్కాంచి సరయూజలంబులఁ
గృతస్నానుం డై కాలోచితకృత్యంబులు దీర్చి జననీజనకులకు నమస్కరింపుచుఁ
బౌరకార్యంబులు వినయాన్వితుం డై యొనర్చుచు బంధుపరివారుం డై భుజియిం
పుచు మునిబృందంబులవలన ధర్మశాస్త్రాదిరహస్యంబులు వినుచుఁ దెలియవలయు
నెడలఁ దెలియవడుగుచు నవికారియుఁ బరిణామహీనుండును విచారింప నెద్దియు
సేయనివాఁడును బరమాత్ముండు నయ్యు మనుష్యలోకంబు ననుసరించి యుండె
ననుచు. 120

ఆ. వ్యోమకేశుఁ డాత్మభామామణికిఁ, బలికి యింక నవనపాలనంబు
సేయుభానువంశశేఖరుం డవ్విధం, బెఱుకసేతు ననుచు నిట్టులనియె. 121

వ. అట్టిసమయంబున. 122

సీ. ఒకనాఁడు గాధేయుఁ డుగ్రాంశుసదృశుఁడు పరమాత్మమాయచేఁ బ్రభవ మొందె
నని విని కనుఁగొను నాకాంక్షఁ జనుదేర దశరథుం డర్ఘ్యపాద్యము లొసంగి
విధ్యుక్తపూజఁ గావించి కేలు మొగిడ్చి యేఁ గృతార్థుఁడ మీర లిటకు వచ్చు
టన తోన సంపదల్ చనుదెంచె మీవాంఛితంబుఁ బల్కుఁడు సేతుఁ దప్ప కిప్పు

తే. డనినఁ గౌశికుఁ డనియె నే నమరపితృవి
తతికిఁ బర్వమ్ములను నిష్టి దనగఁ జేయు
చుండ మారీచుఁడును సుబాహుండుఁ దదను
చరులుఁ జనుదెంచి విఘ్నంబు సలుపుచుండ్రు 123

వ. తద్విఘాతార్థంబు భవన్నందను రామచంద్రుం బనుపు మనినఁ బఙ్క్తిరథుండును
భీతుం డై మంతనంబున వసిష్ఠుం జేరి గుణాకరుం డగు రామచంద్రు నీఁజాల
నెట్లు మేలౌ ననుచు వెండియు 124

క. కాదేని ముని శపించును, నా దుసుతు ననేకవత్సరకలితతపసో
త్పాగు విడి మీఁద బ్రతుకఁగ, రాదిఁక సత్యంబు నొందరా దెటులొకో?. 125

చ. అనిన వసిష్ఠుఁ డిట్లనె రహస్యము నెమ్మది నుంచు రాముఁడున్
మనుజుఁడు గాఁడు విష్ణుఁడు సనాతనుఁ డవ్యయుఁ డిద్ధరాభరా
పనయ మొనర్పమం చజుఁడు పల్కరు వేఁడఁగ మానవాకృతిన్
జననము నొందె భక్తజనసౌఖ్యఫలప్రదమూర్తి గావునన్. 126

వ. ఇదియె కాదు తొల్లి నీవు బ్రహ్మదేవున కాత్మజుండవు కశ్యపుండవు ప్రజాపతివి
మహాభాగయగు కౌసల్యయు దేవమాతయగు నదితి. మీర లగ్రాహ్యవిషయులును
విష్ణుపూజాధ్యానైకతత్పరులును నగుచు బహువత్సరంబు లుగ్రతపంబుఁ గావింప
నప్పుడు వరదుండును భక్తవత్సలుండును నగు నారాయణదేవుండు ప్రసన్నుం డై
వరంబు వేఁడుం డనిన ననఘా! నీవు మాకు నందనుండవు గమ్మనుచుఁ బలికితి రిట్లు
మీచేత నభ్యర్థితుం డై భూతభావనుం డగు భగవంతుండు పుత్త్రుం డై జనియించె
రాముఁ డతండు మఱియును. 127

తే. ఉరగపతి లక్ష్మణుం డయ్యె దనుజఘాంతకములు భరతశత్రుసూదనమూర్తు లగుచుఁ
దనరు నయ్యోగమాయ సీతనఁగఁ బుట్టె, జనకభూవిభుతనయ యై మనుజవర్య!.

క. కాన మునీంద్రుఁడ రాముని, జానకిపం గూర్ప వచ్చె సంశయ మిఁక నీ
మానసమునఁ దలఁపక ముని, తో నంపుము సుతుల దివిజతుల్యుల ననఘా!. 129

క. ఇది యొరులతోడఁ బల్కఁ దగదు గావున సమ్మదమున గాధేయుని బూ

జఁ దనిపి పనుపు సుమిత్రా, సుదతీసుతుఁ గూర్చి రాము సుగుణస్తోమున్. 130

వ. అనిన రాజవరుం డగు దశరథుండు ప్రముదితాంతరంగుం డై కృతకృత్యుండ నైతి
నని తలంచి. 131

## దశరథుఁడు విశ్వామిత్రుని యాగరక్షణార్థమై రాముని బంపుట.

చ. జననుత! రామ! రామ! రఘుసత్తమ! లక్ష్మణ! యంచు నాత్మనం
దనులను జీరి వారివదనంబులు పల్మరు ముద్దుగొంచు న
మ్మునికి నొసంగె నంత నతిమోదము నొంది శుభంబు పల్కుచుం
జనియెను గౌశికుండు ధృతశాంతుఁడునున్ భగవంతుఁ డయ్యెడన్. 132

వ. ఇట్లు శరశరాసనంబులుఁ బూని దాశరథులు తనవెంటం జనుదేరఁ గొంతదేశం
బతిక్రమించి యచ్చట. 133

సీ. గాధేయమౌని రాఘవుఁ గాంచి గ్రహణమాత్రమున క్షుధాదికష్టములు చెంద
నీయని యమరవినిర్మితంబుల నతిబలయును బలయు నాఁ బరఁగు రెండు
విద్యల నొసఁగె నవ్వేళ భాగీరథి యవతరణంబు సేయంగ నచట
తాటకావనము ప్రాప్తం బైన సత్యపరాక్రమశాలి యా రామచంద్రుఁ
తే. గాంచి ముని పల్కె నిచట రక్కసి జగంబు, బాధ సేయును గామరూపములు దాల్చి
తాటకి యనంగఁ బరఁగు చిత్తమున నొందు, దలఁపక యు దాని హింసింపవలయు నీవు.

చ. అనిన ముదంబు నొంది యురగాధిపసన్నిభ మాత్మసాధనం
బనఁదగు చాప మెక్కిడి మహారవ మవ్వన మెల్ల నిండఁజే
సిన నదియున్ బలాహకము సింధుపతిన్ విడివచ్చుభంగి రా
మునిపయి నార్చుచుం గవిసె భూధరముల్ వగులన్ మహోద్ధతిన్. 135

వ. తత్సమయంబున లక్ష్మణాగ్రజుండును నొక్క తీవ్రభల్లంబున దాని యురంబు వగు
లనేసి నదియుఁ బ్రవాహంబుగ రుధిరంబుఁ గ్రక్కుచు నేలం బడి తొల్లిశాపంబు
వలనఁ బిశాచత్వంబు నొందియు నారఘునందనప్రసాదంబున విముక్త యై
సర్వాభరణకలితంబును సుందరంబును నగు యక్షదేహంబు నొంది రామునకుం
బ్రణమిల్లి తచ్ఛాసనంబున దివంబునకుం జనియె నంత. 136

తే. శిరము మూర్కొని కౌఁగిటఁ జేర్చి రామ, చంద్రునకుఁ గౌశికుం డస్త్రసమితి మంత్ర
సహితముగ నిచ్చె నని హిమక్ష్మాధరేంద్ర, తనయతోడుతఁ బల్కె మోదమున హరుఁడు.

వ. అంత నతిరమ్యంబును మునిసంకులంబును నగునొక్కసిద్ధాశ్రమంబునఁ గౌశిక

తోడ నారేయి నిలిచి ప్రభాతంబగుడు సిద్ధచారణసేవ్యంబగు నమ్మహాతపోవనంబుఁ
జేరిన. 138

క. మును లెల్లను గాధేయుఁడు, చనుమునఁ బూజ యిడి రమలచారిత్రులకున్
ఘనకనకగాత్రులకుఁ దు, ర్జనబలజైత్రులకు రామసౌమిత్రులకున్. 139

క. మునివర! దీక్ష వహింపుము, దనుజాలన నెంతి యైన మదం బందుచు న
మ్ముని వహ్నిన్ వేల్వఁదొడం, గెను దనఘననిష్ఠచేత గిరివరతనయా!. 140

వ. ఇట్లు మునిసహితుండునై హోమంబు గావింపుచునుండ మధ్యాహ్నంబున రాక్ష
సులును గామరూపులు నగు మారీచసుబాహులు రుధిరాస్థినిచయంబులు వర్షింపుచు
నంబరంబున దోఁచిన రాఘవుండును. 141

ఉ. చూచి శరాసనంబుఁ గొని స్రుక్కఁగ నెక్కిడి యెక్కుపెట్టి నా
రాచయుగ మ్మమర్చి సుకరమ్ముగఁ జిమ్మఁగ నం దొకమ్ము మా
రీచుఁ దృణాయమానముగఁ ద్రిప్పుచు రొప్పుచు నప్పయోధిలో
వైచె సుబాహుఁ గాల్చె శిఖివైఖరి రెండవకాండ మయ్యెడన్. 142

తే. అదియు నత్యద్భుతంబయ్యెఁ దదనుచరుల, బలువురను ద్రుంచె రామభూపాలుతమ్ముఁ
డమరు లెల్లను జల్లిరి సుమము లెంతొ, మొరసె నిర్జరదుందుభుల్ పరఁగ నపుడు.

వ. సిద్ధచారణులు సంతసించిరి విశ్వామిత్రుండును శేషంబగు సవనతంత్రంబు నిర్వ
ర్తించి పూజార్హుండగు రఘునందనుం బూజించి యాశ్రమంబునం దిడుకొని బాష్పా
కులేక్షణుండై భక్తితోడఁ గౌఁగిలించుచుఁ బక్వఫలాదుల సలక్షణుండగు లక్ష్మ
ణుం దృప్తుం గావింపుచు మధురంబులగు పురాణవాక్యంబుల దివసత్రయంబు
గడపి నాలవదివసంబున రఘునందనుం గాంచి. 144

సీ. రామ! రామ! విదేహరాజపట్టణమున జనకభూపాలుమహోత్సవ మ్మలరు
నచట మహేశుశరాసనంబు పినాకపాణిచేఁ దొల్లి నిల్పంగఁ బడియె
సత్త్వసంపన్నంబు శైవంబుఁ గావున నబ్బిరయుడు నీక్షించి యవ్విదేహ
భూవల్లభునిచేతఁ బూజలు వడసి యయోధ్యాగమనముచేఁత నియుక్తి మనిన

తే. సంతసము నొంది యంద ఱచ్చటను వెడలి, చనుచు గంగాసమీపమందునను గౌత
మాశ్రమము పుణ్యదం బహల్యాతపఃప్ర, భాసమంచితతలము నేర్పడఁగ గాంచి 145

వ. దివ్యపుష్పఫలోపేతంబులగు పాదపపుంజంబులం గలిగి నానాజంతువివర్జితంబును
మృగపక్షిగణహీనంబును నగు నయ్యాశ్రమంబు నుద్దేశించి శోకాకలితుండును
రాజీవలోచనుండును నగు లక్ష్మణాగ్రజుండు గాధేయున కిట్లనియె. 146

క. మునివర! ఘనభూరుహములు, గనఁబడి మృగాద్యఖిలజంతుహీనం బయ్యెన్

మనమున కాహ్లాద మొన,ర్చను నివ్వన మెవరివొక్కొ చెప్పవయ్యా దగన్.147

వ. దీనియథార్థంబు పల్కుం డనిన భగవంతుం డగు కౌశికుం డి ట్లనియె. 148

## విశ్వామిత్రుం డహల్యాశాపంబు రామునకుఁ దెల్పుట.

చ. విను రఘునాథ! మున్ను జనవిశ్రుతకీర్తి ఘనుండు బల్తపం
బున మధుసూదనున్ భువనపూజితుఁ దన్పెను గౌతమాఖ్యుఁ డ
మ్మునివరు బ్రహ్మచర్యమున మోదితుఁ డై కమలాసనుం డహ
ల్యను బరిచర్య సేయఁగ దయామతి నిచ్చెఁ ద్రిలోకసుందరిన్. 149

వ. ఇట్లొసంగిన. 150

క. అవ్వనితతోడ మునివరుఁ, డవ్వనమున నిలువ నిర్జరేశుఁడు సమయం
బెవ్విధమున దొరకొను నే, నవ్వనితం జెంద ననుచు నరయుచు నుండెన్. 151

ఆ. అంత నొక్కరేయి యమ్ముని స్నానార్థ, మరుగ నతనివేష మంది యతని
కాంత నంత గదిసి క్రక్కున వెలువలి, కరుగువేళ మునియు సడ్డపడియె. 152

వ. ఇట్లెదురుపడి పరమకోపనుం డగుచుఁ దనవేసం బూనిన యాఖండలుం గనుం
గొని. 153

సీ. ఎవఁడవు నీవు దురాత్మ! యిటు మత్స్వరూపి వై చనుదెంచితివి పల్కు సత్యమింకఁ
గాదేని నిను బూది గావింతు నిది యసంశయ మన్న మది నెంతొ భయమునొంది
కరుణింపు కామకింకరుఁడ దేవేంద్రుండ నెఱుఁగక చేసితి నింతపట్టు
నని పల్కఁ గ్రోధతామ్రాక్షుఁ డై మూఢాత్మ! యోనిపై నాసక్తి నొందితీవు

తే. కావున సహస్రయోనుల గాయ మొందు, మనుచు శపియించి స్వాశ్రమమునకు నేఁగి
ప్రాంజలిని వేపమానను భార్యఁ గాంచి, కోపమున నిట్లు పల్కెను గుధరతనయ!.154

ఆ. శిలవు గమ్ము యిచట శీతవాతాతపం, బులకు నోర్చి తపము సలుపు రామ!
రామ! యనుచుఁ బగలు రాత్రియుఁ బరమేశు, భజన సేయు హృదయపద్మనిలయు.

వ. మఱియు నిరాహార వై యుండు మియ్యాశ్రమంబును జంతువిరహితం బయ్యెడు
నిట్లు వర్షసహస్రంబు లనేకంబులు చనినపిమ్మట దశరథరాజనందనుండును శ్రీమం
తుండును నగు రామచంద్రుండు సానుజుం డయి చనుదెంచి యియ్యాశ్రమంబు
నం గల శిలఁ బాదంబున నాక్రమించు నాసమయంబున ధూతపాప వగుచు భక్తి
తోడ నమ్మహాత్ముం బూజించి ప్రదక్షిణనమస్కారంబులుం గావించి వినుతించి
శాపంబువలన విడువంబడి తొంటిభంగి సుఖంబున నాదుసేవ యొనరింపం గల
వనుచు గౌతమమునీంద్రుండు నగోత్తమంబగు హిమాలయంబునకుం జనియె.
రఘునందనా! యది మొదలు ఆ యహల్య భూతంబుల కదృశ్య యై గాలిఁ గ్రోలి

నీదుపాదరజస్స్పర్శనంబుఁ గాంక్షింపుచు దుష్కరంబగు తపంబు సేయుచు నీస
మయంబునకును నిల్చియున్నయది గావున. 156

తే. పావనము సేయు మునిభార్య బ్రహ్మపుత్త్రి, ననుచు హస్తంబుపట్టితోడ్కొనుచు నేఁగి
చూపినను జేరఁజనికాలుచొన్ని యెదుటఁ, గాంచె రాముండు గౌతమకాంతనపుడు.

వ. కనుంగొని యే రామచంద్రుండు సనుదు నమస్కరించిన నాయహల్యయు 158

## శ్రీరామదేవు నహల్య వినుతించుట

సీ. నీలమాణిక్యసన్నిభుఁ బీతకౌశేయవాను లసన్మందహాసుఁ బుండ
రీకలోచను మహాశ్రీవత్సచిహ్నితభుజవక్షు సాయకకార్ముకాఢ్యు
రఘుకులాధిపు సుమిత్రాపుత్త్రిసంయుతు నిజకీర్తికలితదిఙ్మిచయు ధీరుఁ
బగు రమానాథు ముందఱ గాంచి గౌతమువాక్యముల్ దలఁచి శ్రీవల్లభుం...

తే. ఇతఁ... నారాయణుఁడు పరుఁ డీశుఁ డనుచు
మించి యతిగౌరవమునఁ బూజించి మ్రొక్కి
యతివ హర్షాశ్రుపూర్ణ నేత్రాంత యగుచుఁ
దనువు పులకింప వినుతి సేయను దొడంగె. 159

ఉ. దేవ! జగన్నివాస! భవదీయపదాబ్జరజఃకణాలిచేఁ
బావని నైతిఁ గోరికలు పాల్పడెఁ గంపితచిత్తవృత్తిగౌ
రీవరపద్మజాదిమునిబృందము లెప్పుడుఁ జూడఁ గోరుతత్వ
త్పావనధూళి నంటి కనుపంటువు గంటిని వింత రాఘవా!. 160

చ. జనవర! వింత నీదుగుణసంపద మానుషవేషధారి వై
యనఘము మోహితాత్ములుగ నందఱఁ జేతువు నిశ్చలుండ వ
య్యును జరియింతు వన్నిటను నొప్పియు నొక్కఁడ వుందు వెల్లమా
యను స్వవశం బొనర్చియుఁ దవానుసరత్వ మొసర్తు వెంతయుఁ. 161

ఉ. ఏపరమేశుపాదరజ మెంతయుఁ దాల్చి పవిత్రుఁ డై కుభృ
చ్చాపపయోజసంభవులఁ జాలఁ బునీతులఁ జేసె గంగ నేఁ
డాపరమేశ్వరుండె సదయామతి దృక్పథమందు రామధా
త్రీపతి యై కనం దగె మదీయపురాకృతిఁ మెన్న శక్యమే 162

తే. అమలమర్త్యావతారు రామాభిధాను, సగుణుఁ బద్మదళాశలోచను ధనుశ్శ
రాఢ్యు రమణీయవేషు మహాత్ము విష్ణు, భజన మొనరింతు హరి నొం...పలుకఁ దలఁప.

తే. ఏమహాత్ముని పదరజం బెపుడు శ్రుతులు, వెదకు వాణీశుఁ డేదేవువిమలనాభి
పద్మమునఁ బుట్టె నీశుఁ డేధవ్యనామ, మునరసిమఁ దయ్యె నారామమూర్తిఁ దలఁతు.

చ. ఎవనిశుభావతారకథ లెప్పుడు నారదపద్మజాంబికా
ధవు లొగి బ్రహ్మలోకమునఁ దద్దయు గానము సేయ వాణిదాఁ
జెవులకుఁ సోఁక బాష్పకణసిక్తనిజోరుకుచాగ్రసీమ యై
తవిలి స్వవల్లకిం బలుకుఁ దాదృశు రామవిభుం భజించెదన్. 165

సీ. ఆపరాత్మవు నీవు భూపవంద్య! పురాణపురుషుండ వజుఁడవు పరుఁడవు ప్రభ
వాపహారుండ వాద్యంతశూన్యుండవు జగదుద్భవస్థితిసంక్షయముల
కారకుఁడ వయ్యును మాయ నొందవు పుట్టువులేని నీవు విరించివిష్ణ్వీశ్వరాది
భేదంబులను నిజభృత్యజనానుగ్రహార్థంబు గల్గెడి యాదిమూర్తి
తే. అఖిలసంపూర్ణుఁడవును స్వయంప్రకాశుఁ, డవు స్వతంత్రుండ వట్టి నిందవిలి పొగడ
నేను దగుదునె కావ మ్రొక్కెడుదు నిదియె, చూడు రఘునాథ! చల్లనిచూపుతోడ.

క. మును నీ యభిమానంబున, వనజాలయు లాలనమున వహియింప దివం
బును భువియుఁ గప్పి మించిన, ఘనతరభవదీయచరణకంజముఁ గొలుతున్. 167

చ. జగములు నాదిభూతమవు సర్వజగద్వలయాశ్రయుండవున్
జగమవు నీవ భూతచయసంభరితుండవు నయ్యు వేఱె యొ
ప్పుగఁ గనుపింతు వీవ యొకపోలిక నాప్రణవాఖ్యతోడఁ బ
ల్కఁ గనగు మేటి వీవ భవలంపటమానసమానవర్తనా!. 168

వ. దేవా జగన్మయుండ వయ్యు వాచ్యవాచకభేదంబులను గార్యకారణకర్తృత్వఫలసాధనభేదంబులను బహురూపయగు మాయవలనను నొక్కరుండవయి ప్రకాశింతువు మాయికుండవుఁ బరమేశ్వరుండవు నగు నిన్ను భవన్మాయామోహితస్వాంతులగువారలు నిక్కంబుగ నెఱుంగలేక మనుజమాత్రునిగఁ దలపోయుదు రమలుండవగు నీవు విహాయసంబు పోలిక నన్నిట బహిరంతరంబుల వెలింగెదవు తత్సంగరహితుండవు నచలుండవు నిత్యుండవు శుద్ధుండవు సముండ వద్వయుండవు నగు నీతాదృశుని నిన్ను మూఢాత్మనగు నే నెవ్విధంబున నెఱుంగం జాలుదు. కావున నన్యచిత్తనయి శతసంఖ్యలఁ బ్రణుతిగావించెద. 169

ఆ. ఎచట నున్న నెచటి కేఁగిన నీపాద, పద్మభక్తి మాకుఁ బాలుపడును
గాతి మచల యగుచుఁ గపులమిత్రాన్వయ, తిలక! విసరఘాఘపుంజక రామ. 170
తే. భవ్యగుణపుష్కరాక్ష! దివ్యచాప, ఘన హృషీకేశ! భక్తవత్సల! ముకుంద!
ధీర! నారాయణ! వినీలవారివాహ, దేహ యిదె వందనము! రామ! దేవదేవ!. 171

ఆ. కనకరుచిరవసనుఁ గరధృతశరచాపుఁ, గమలవిశదనయనుఁ గాలమేఘ
సము సహస్రసూర్యసంకాశు రత్నవ, త్కుండలాఢ్యు రాముఁ గొలుతు నిన్ను.

ఉ. సానుజముఖ్యు దుర్భరభవాబ్ధిసమీరు భయాపహారు శివున్
ధ్యానమొనర్తు నంచటు ప్రదక్షిణ మొయ్యన జేసి మ్రొక్కి యా
మ్నానవనాఘునాజ్ఞ గొని మానిని గౌతము నాత్మవల్లభుం
గానగ నేగె నాహిమవగంబున కంబుజపత్రలోచనా! 173

సీ. ఈయహల్యాస్తోత్ర మెవ్వరే భక్తిచే బఠియింప నఘములు బాసి బ్రహ్మ
మొందుదు రిక సుతు లుద్భవింపగ గాంక్ష గలపుణ్యు లవనిజాకాంతసేవ
సలుపుచు బఠియింప సంవత్సరమునను గాంతె వంధ్యయు నైన గల్గు సుతుడు
సర్వకామంబులు సమకూరు రాఘవానుగ్రహంబున దుష్ప్రతిగ్రహాది
తే. ఘోరపాతకములు సేయు క్రూరుడును వి, ముక్తుడగునింక సాచారయుక్తుడైన
యతని బలుకంగ నేటికిసనుచు శైల, తనయుతో బల్కె బావనుడు హరుడు

క. ఇటమీద రామచంద్రుడు, కుటిలాలక జనకుముద్దుగూతురు సీతన్
దటిదాభమితవపు విశం, కటవృత్తి వరించు యశము గడు నించు ధరన్. 175

వ. తత్క్రమం బెఱింగించెద వినుము మరల శివుండు 176

చ. విను హిమశైలకన్య రఘువీరుని గన్గొని గాధినందనుం
డనిరయు కుమార! ముందు జనకాధ్వర మింపుగ దాని గాంచి యే
గ నగుసటన్న సందఱును గద్దన జాహ్నవి దాటి నిల్చి రొ
య్యన మిథిలాపురంబునకు నందిక యామునిపల్లె నానికిన్ 177

తే. అంత జనకుండు మునివరు డరుగుదెంచు
టలు దెలిసి పూజ యొనరింప వడియునస్తు
సమితి గొనుచు నుపాధ్యాయసహితు డగుచు
నరుగుదెంచి మునీంద్రు నెయ్యమున గాంచి 178

వ. దండప్రణామంబు గావించి పూజించి సర్వలక్షణకలితులగు రామలక్ష్మణుల గనుం
గొని గాధేయున కిట్లనియె 179

క. వీరలు నరనారాయణు, లో రవిచంద్రులతెఱంగున లోకము వెలుగం
గా రుచి నొప్పెద రమరకు, మారులో సంతసిలు నాదుమది వీరి గనన్. 180

వ. ఈనరశార్దూలుర తత్త్వం బెఱింగింపుండనిన గుశికాత్మజుం డిట్లనియె. 181

ఉ. వీరలు రామలక్ష్మణులు వీరులు పఙ్క్తిరథాత్మజుల్ మహో
దారులు నన్నదమ్ములు మదధ్వరవిఘ్నము మాన్ప దండ్రిచే
దారు నియోగులై వెడలి దారిని రామవిభుండు తాటకన్
ఘోరతరాంబకంబునను గూల్చె నిలింపులు సన్నుతింపగన్. 182

వ. ఇట్లు విశ్వఘాతిని యగు తాటకను మదీయశాసనంబునం బరిమార్చి యిద్యుతి విక్రముండు మఖధ్వంసవిఘ్నకారులగు సుబాహుప్రముఖులఁ బెక్కండ్రు రక్కసులనుక్కడంచి మారీచునకూపారంబునం బడవైచె నంత గంగాతటంబునం బవిత్రంబగుచుఁ దనరు గౌతమాశ్రమంబున నహల్యాదర్శనంబుం జేసి యప్పుణ్యాఙ్గనచేత సత్కృతుం డయ్యె నా బ్రహ్మపుత్త్రియు రఘునందనచరణకమలపరాగసంస్పర్శనంబున శాపసంప్రాప్తపాషాణరూపంబు వాసినదగుటం జేసి యమ్మహాత్ముని ననేకప్రకారంబులం బ్రస్తుతించి తదనుజ్ఞాత యై నిజప్రాణవల్లభుండగు గౌతము పాలికిం జనియె నిక్కుమారవర్యులు సకలరాజపూజితం బయి భవద్గృహంబునం జెలువొందు మాహేశ్వరంబగు కార్ముకంబు గనుంగొను వాకాంక్షం జనుదెంచిరి కావున నక్కార్ముకంబుం గనుపింపుము పిత్రుదర్శనార్థంబు వేగంబె చననిచ్చయించె దరనిన జనకుండును. 183

తే. అతిముదనొందిశాస్త్రము సమ్మతములైన, పూజ లొనరించి నిజమంత్రి బుద్ధిమంతుఁ
జీరి వేగంబ తెప్పించు శివశరాస మంచితంబుగ రాముఁ డీక్షించు నపుడు. 184

ఆ. అనుచుఁ బల్కమంత్రి చనిన గాధేయునిఁ, గాంచి రాఘవుండు ఘనజవమున
నిమ్మహేశుచాప మెక్కిడె నేనిమా, సీత నిచ్చి పెండ్లిసేతు నిపుడు. 185

వ. అనుచుఁ బల్కినం గుశికాత్మజుండు మునిమనినరవుల రామచంద్రుం గనుంగొని యియ్యమితతేజునకు మాహేశ్వరం బగు చాపంబు శీఘ్రంబె కాన్పింపు మని మిథిలాధిపుతోడం బలుకు నవసరంబున 186

## శ్రీరామచంద్రుఁడు శంకరధనుర్భంగము సేయుట.

సీ. చాపవాహకులు దోశ్శక్తియుక్తులు పంచసాహస్రసంఖ్య లావధకుఁ దెచ్చి
రురుతరఘంటాశతోపేతమును మణివస్త్రాంచితమునగు వామదేవు
కార్ముకం బపుడు రాఘవుఁడు ప్రహృష్టాత్ముఁడై కాసె బిగియించి వీఁక వామ
హస్తంబునను దచ్ఛరాస మంది గుణంబు నునిచి లీలయుపోలె నొక్కమారు

తే. నారి సారించునంతలో సారమెసఁగి, స్వర్గమర్త్యరసాతలవ్యాప్తముగను
మొరయుచును రెండుతునుకలై ధరణి బడియెఁ జూచి నిఖిలావనీశులు చోద్యమంద.

క. సురలపుడు విరులవానలు, కురిసిరి గంధర్వులెచ్చుగొని పాడఁగ న
చ్చరలాడిరి దివిమొరసెను, సురదుందుభు లతిముదమునఁ జూచిరి సభికుల్. 188

వ. ఇట్లు భగ్నంబైన శివశరాసనంబుం గాంచి జనకుండు రామచంద్రుం గౌఁగిలించుకొనియె. తదీయ దోస్సారంబునకు నంతఃపురవాసినులగు సీతామాతృజనంబులును విస్మయంబు నొంది రప్పుడు. 189

సీ. తనతల్లి మందిరంబుననుండి భాసురస్వర్ణమాలావిరాజత్కరాబ్జ [illegible]
యగుచు సీతాకాంత యంగమునఁ దగుచిఱునగ వుప్పతిలఁ [illegible]బుభంగి
మేనిచాయ వెలుంగ నానావిభూషణకలిత యై యందెలు ఘల్లు[illegible]
మొరయు దుకూలంబు ముసుఁగిడి వస్త్రాంతరమున బాలిండ్లు చెన్నమరుచుండ
తే. వనరుహాక్షులు దన్నుఁ దోడ్కొనుచు రాఁగ, సభకుఁ జనుదెంచి రాఘవేశ్వరునికంధ
రమున మాలిక నిడి సిగ్గుఁ బ్రమదమును జె, లంగ నంతఃపురమునకు లలన చనియె.
తే ఇవ్విధంబున నమ్మిథిలేశుపట్టి, కనకదామంబు రామునిపై నునిచి చనిన
రాజసతులు గవాక్షుల రంధ్రములను, నిక్కి చూచిరి రఘురామచక్కఁదనము. 191

వ. అప్పుడు విశ్వామిత్రుం గనుంగొని జనకభూవిభుం డిట్లనియె మునీంద్రా! రాఘవు
ల వివాహార్థంబు కాంతాజనంబులం గూడి తనయుపరివారసహితుం డై దశరథభూ
వల్లభుండు చనుదెంచునట్లు శుభలేఖ వ్రాయింపుం డనిన నట్లయని యతిత్వరితవిక్ర
ముండగు నొక్క దూతం బనిచిన వాఁడు జని రామచంద్రు విజయం బెఱింగించిన
దశస్యందనుండు రామకృతంబగు మహాత్కార్యంబునకు మిక్కిలి హర్షంబు నొంది
ధీసచివుండగు సుమంత్రు మిథిలాగమనార్థంబు సత్వరం గావించి కౌసల్యాదిభార్య
లను యగ్నులం గొని కులగురుండును నగు వసిష్ఠుండు ముందు సన నియోగించి
తానును విపులం బగు రథం బెక్కి. 192

సీ. సైన్యసమేతుఁ డై సాకేతనగరంబు వెడలి విదేహభూవిభుని పురముఁ
జేరంగ వచ్చిన నారాజవంశజుం డతివేడ్క నెదురుగా నరుగుదెంచి
కొనిచని యిందుమన్ననలు గావించె నాసమయంబునను రామచంద్రుఁ డనుజ
సహితుఁ డై దశరథు చరణాంబుజములకు మ్రొక్కిన రాముని ముద్దుగొనుచుఁ
తే. దండ్రిఁ గనుఁగొంటి నేఁటికి దైవగతిని, వికచపంకేరుహాముఖాంగి వెలయు నీదు
నెమ్మొగము గాధిసుతుకటాక్షమ్ముచేత, సకలకార్యంబులును నాకుఁ జక్కనయ్యె.
వ. అనుచు బ్రహ్మానందమగ్నుని భంగి నుండె నప్పుడు. 19
తే శంఖకాహళదుందుభిస్వనము లొప్ప, దివిజాలింపొంద జనకుమందిరముఁ జొచ్చి
రంత శుభలగ్నమున రాము నఖిలబంధు, యుక్తముగఁ జేరి జనకుఁ డత్యుత్సవమున.
సీ. సర్వశోభాఢ్యంబు స్వర్ణభూషితవిప్రభామినీసహితంబు ప్రబలవేద
విన్మహీసురచయావృతము రత్నస్తంభకీలితంబు నృత్తగీతవాద్య
కలితంబు పుష్పముక్తాఫలాన్వితము నై తనరు నిశాలయంబునను రత్న
సింహాసనంబున శ్రీరామచంద్రుని నునిచి విశ్వామిత్ర[illegible]
తే. సుతశతానందముఖమునిస్తోమములను, బూజలను దన్పి [illegible]

నిరుగడలహవ్యవాహనునిడియథాక్ర, మంబుగఁ బ్రబలఁ జేసి నేమంబుతోడ. 196

వ. నవరత్నఖచితభూషణోపేతయగు సీతం దోడ్కొని సభార్యుం డై జనకుండు చను
దెంచి రామచంద్రుచరణకమలంబులు నిజకరకమలసలిలంబులం గడిగి. 197

## జనకమహారాజు శ్రీరామునకు సీతను బాణిగ్రహణ మొనరించుట.

తే. పద్మసంభవశంకరప్రభృతు లెవని, పాదసలిలంబుఁ దాల్చిరో భద్ర మనుచు
నట్టి శ్రీరామచంద్రుపాదారవింద, జలము జనకుండు శిరముపైఁ జల్లుకొనియె. 198

వ. అప్పుడు సాక్షతోదకపూర్వకంబుగా నిజనందననుం గరంబు పట్టి పాణిగ్రహణ
విధానంబున. 199

క. కనకాభరణాంచితసిత, వనరుహదళనయన నాదు వరసుత సీతన్
ఘనముగ నీ కిచ్చెద మన, మున సంతస మంది రామ! మునినుతనామా!. 200

తే. అనుచు సీతను రామకరార్పితంబు, చేసి మును సర్వభూతనివాసుఁ డైన
హరికి నిందిర నొసఁగి మిన్నందుదుగ్ధ, సాగరునిభంగి జనకుండు సంతసించె. 201

వ. అప్పు డప్పు మిథిలేశ్వరుఁ డౌరసి యగు నూర్మిళయను కన్యకామణిని సుమిత్రానందను
నకును భరతశత్రుఘ్నులకు శ్రుతకీర్తి మాళవులను భ్రాతృకన్యకల నొసంగె నిట్లన్న
దమ్ములు నలువురును భార్యాసహితు లై రెండవలోకపాలురభంగిఁ జెల్వొంది రట్టి
యెడ నారదువాక్యంబులఁ దలంచి విశ్వామిత్రాదిమునివర్గంబులం గనుంగొని విదేహ
భూవిభుం డి ట్లనియె 202

చ. మును సవనం బొనర్చుటకు భూమిని నాఁగట సాగుసేయఁ బం
పినను సితాగ్రమందుఁ గనుపించెను నివ్వనజాయతాక్షి యే
నును ముదమంది కూఁతుఁగఁ గనుంగొని నాదగుభార్య కిచ్చి త
ద్వనితయుఁ బెంచుచుండెఁ గులపావని నివ్వసుధాతనూభవన్. 2 3

వ. అంత నొక్కనాఁడు వివిక్తప్రదేశంబున నేను గూర్చున్నయెడ 204

తే. మహతియనువీణెయందు శ్రీమంతుహరిఁ బ, రేశునారాయణుని భజియింపుచును దు
షారహీరాభదేహుఁ డానారదుండు, శంకరునిభంగి జనుదెంచె సదయుఁడగుచు 205

వ. వచ్చి నాచేతఁ బూజలు వడసి సుఖాసీనుం డై యతం డి ట్లనియె. 206

సీ. విను రహస్యంబు దీనను నీకు శుభమగు హరిపరమాత్ముండు నచ్యుతుండు
భక్తపాలనమును పఙ్క్తికంఠరహననంబును గావింప నాల్గురూపు
లను రామచంద్రుఁ డై వనజాకృతిని బఙ్క్తిరథభూవిభునకుఁ బుత్త్రత్వమొందె
యోగమాయయు సీత నాఁ గఁ బుట్టెను నీదుమందిరంబునఁ గాన మఱపు గనక

తే. యత్న మొనరించి భార్యగా నర్పణంబు, సేయు మద్దేవునకు నొండు సేయవలదు

నిశ్చయము పూర్వభార్య యీ నెలఁతయౌట, రాత్మనకునంచు జనిరి విహాయసమున.

వ. అదిమొదలు కన్యకం గమలాలయంగా నెంచుచు రామచంద్రునకు వివాహంబున నొసంగం గలుగునోయని త్రిపురదాహానంతరంబున నుమావల్లభుచేత మద్గృహంబున నుంచబడుటవలన నాకు పూర్వుల నాఁటనుండియుఁ బూజింపఁబడుచున్న శైవ ధనుర్భంగంబునకుం గావించితి నిట్లు సేయుటవలన సీతాపాణిగ్రహణార్థం బనేక రాజవల్లభులకు మానభంగం బయ్యె నిప్పుడు కృపాతిశయంబున మీరలు రామచంద్రుం దోడితెచ్చుటచే మనోరథంబులు ఫలియించె ననుచు రఘుపుంగవుం గనుంగొని.

తే. అవనిజయు నీవు నొక్క సింహాసనమునఁ, గమలబాంధవుగతి దేహకాంతు లమర
నిపుడు కూర్చుండఁగనుఁగొంటి విపులమయ్యె, జన్మమో రామ! యామినీచరవిరామ!.

సీ నీపాదసలిలంబు నెమ్మిఁ దాల్చి సరోరుహాసనుం డీసృష్టి చేసి మించె
బలియు నీపాదాబ్జసలిలంబు ధరియించి దేవలోకాధీశుఁ డై వెలింగె
నా గౌతమునిభార్య యౌ నహల్యయు నీదుమృదుపాదములను జారినరజంబు
చేతఁ దత్క్షణమయ శిథిలీకృతాత్మభర్తృప్రోక్తశాప యై యింతి యయ్యె

తే నెవ్వరిటు సేయుపుణ్యులీ పృథ్వియందుఁ, బతితపావనబిరుదు సంతతముఁ దాల్చి
యాధికెక్కిన నీవొక్కరుఁడవె కాక, రామ! సీతాభిరామ! శర్వనుతనామ!. 210

వ మఱియును 211

చ ఎవనిపదాబ్జరేణువు లోకింత ధరించి మహామునీంద్రులీ
భవభయకాలచక్రములఁ బాసిరి యేమహితప్రతాపుస
త్ప్రవిమలనామకీర్తనలఁ బల్కరు మున్నత నొంది నిత్యులై
దివిజులు దుఃఖముల్ విడిరొ ధీరతఁ దాదృశు నిన్నుఁ గొల్చెదన్. 212

తే అనుచు వినుతించి జనకధరాధిపుండు, మఱియు మఱియును శ్రీరాము చరణములకు
ననుదినంబును వందనంబగు నటంచుఁ, దనయుపస్థుఁ రాఘవునితోడఁ బనుపఁదలఁచి.

వ కోటిశతంబులగు హేమాగులును నయుతంబులగు ధనంబులును నియుతంబులగు తురంగంబులును షట్ఛతంబులగు మాతంగంబులను నొక్కలక్ష కాల్బలంబులను ద్విశతంబు దాసీనికరంబును దివ్యాంబరంబులును ముక్తారత్నమయోజ్జ్వలంబులగు హారంబులును మహిత్రివత్సలుం డై యొసంగి వసిష్ఠాదులను భరతలక్ష్మణశత్రుఘ్నులను దశరథుని యథాన్యాయంబుగఁ బూజించి ప్రస్థానంబు సేయించె నాసమయంబున జనకభార్యయు జానకిం గౌఁగిలించుకొని సాశ్రులోచన యై. 214

ఆ అత్తమామలకును ననుదినంబును సేవ, సలుపు మమ్మ! రామచంద్రుమనను
ననుసరించి మెలఁగి యధికపాతివ్రత్య, మొంది సుఖము నొంది యుండు మమ్మ!.

వ. అనుచుఁ గూఁతురి నంపకంబు చేసె నప్పుడు. 216

క. లోకభయంకర మయ్యెను, గాకుత్స్థాన్వయులు మిథిలఁ గదలి రయమునన్
వీఁకఁ జనుచుండఁ బణవా, నేకరవంబుల మదేభబృంహితములచేన్. 217

తే. అనుచు వృషవాహనుం డద్రితనయతోడ మిహిరకులమండనుని కీర్తి మిగులఁబల్కి
మఱలఁ దదనంతరకథాక్రమంబుఁ దెలుపఁ, దొడఁగెఁ గలితరథాంగ! కస్తూరిరంగ.

వ. ఇట్లు మిథిలానగరంబు వెలువడి చనుచుండ యోజనత్రయంబున నుత్పాతంబులు
గానుపింప దశరథుండు బెగ్గిలి వసిష్ఠుం గనుంగొని మ్రొక్కి యివ్విషమంబులగు
నిమిత్తంబులు దోఁచుటకుఁ గారణం బేమి యనిన వసిష్ఠుండును. 219

ఉ. ఓమనుజేశ! మీఁద నొక యుక్కటి గల్గును గల్గి తత్క్షణం
బే మిముఁ బాయు నెట్టనిన మించి మృగంబులు సవ్యగాము లై
వేమరు నేఁగుచుంట నన వెండియు నె బల్సుడిగాలి మిక్కుటం
బై మనుజాళికన్నులకు నంధతమం బవరించె నయ్యెడన్. 220

## దశరథునిఁ బరశురాముఁ డడ్డగించుట.

సీ. భగవంతుఁడును బ్రతాపసముగ్రుఁడును నగు భార్గవుం డచటఁ గన్పడియె నవ్వ
హోత్రుడు నీలమేఘాభుండు భూరిజటామండలాఢ్యుండు భీమపరశు
చాపవిభాస్వద్భుజాదండుఁడును సమస్తక్షత్రియానీకతాడనుండు
హైహయాధిపబాహుహననుండు నటు కాలమృత్యువ్యగ్రగతిఁ దోఁప మిగుల వెఱచి

తే. దశరథుం డప్పు డర్ఘ్యపాద్యము లొసంగి, కరయుగంబులు మోడ్చినన్ గావు నాదు
సుతుని రాముని దయఁ జూచి బ్రతుకనిమ్ము, మనసుఁ జెవిఁ బెట్టకయ రాముసదరిచూచి.

వ. క్రోధంబునం బ్రచలితేంద్రియుం డయి నిష్ఠురంబుగ నిట్లనియె. 222

క. నాముందఱ నీ వొకఁడవు, రాముఁడ నని తిరుగఁ దగునె రాజాధమ! నీ
వే మేటిరాజ వయినను, భీమాహవ మాచరింపు బెగడక నాతోన్. 223

ఆ. పార్వతీవిభుండు పాఱవైచిన చీకు, విల్లు విఱచి విఱ్ఱవీఁగఁ దగునె
వైష్ణవంబు దీని వడి నెక్కువెట్టుము, నప్పుడు నిన్ను మెత్తు నని యొనర్తు. 224

వ. కాదేని. 225

తే. మిమ్ము నందఱిని యమాలయమ్మునకును బుత్తునని దెలియుమీవె మున్ను భూరిమహిమ
నిరువదియు నొక్కమారులు పరశుధార, నఖిలధరణీపతులఁ ద్రుంచినట్టివాని. 226

వ. అని పలుకు సమయంబున. 227

తే. అఖిలజనలోచనములకు నంధతమస, మడరె ధరణియుఁ జలియించె నంత రామ
చంద్రుఁ డాభార్గవునిచేతి చాప మంది, గుణ మొనర్చి శరంబందుఁ గూర్చి పలికె.

క. రాముశరము గనుఁగొని భృగు, రామ! పదములైనఁ బుణ్యరాశియయిన నీ
భీమాస్త్రమునకుఁ జూపుము, నీమహిమలు దూరముగను నిలుపుము వేగన్. 229

తే. అనుచుఁ బలుకంగఁ బూర్వవృత్తాంత మెల్ల, సంస్మరింపుచు నారామచంద్రపాద
పంకరుహములు గనుఁగొని భార్గవుండు, పలికె విస్మితాననుండునై జలజనయన!.

సీ. రామ! రామ! మహాత్మ! భీమబాహాటోప! తెలిసె నేఁటికి నీదు దివ్యమహిమను
జగదుద్భవస్థితిసంహారదక్షుండ వాద్యంతరహితుండ వగణితుఁడవు
యోగమాయాసమాయుక్తుండ వజుఁడవు నవికారివియును నిరామయుండ
వమలుండవును సంతతానందుఁడవు పురాణపురుషుఁడవు జగన్నాయకుండ

తే. వనుచు నెఱుఁగుదుఁ బూర్వవృత్తాంత మొకటి, వినుము బాల్యంబునందేను ఘనతపంబు
చక్రతీర్థంబున నొనర్చి చక్రపాణి, నిను నారాయణునిఁ దనియించినాఁడ. 231

వ. ఇట్లనన్యచిత్తుండనై యమ్మహాత్మునకు సంతసంబు గావింప శంఖచక్రగదాధరుం
డును ప్రసన్నముఖపంకజుండునగుచు నాదుముందఱ నిలచి యిట్లనియె. 232

ఉ. ధరణీదేవ! భవత్తపోమహిమ చోద్యంబయ్యె నిక్ మెచ్చితిన్
వర మే నిచ్చెద హైహయుం దునిమి గర్వగ్రస్తులౌ రాజులన్
ధరణిం బేరడఁగించి కశ్యపున కీధాత్రీతలం బిచ్చి శాం
తరుచిం దాల్పు మదంశ నొంది పితృహృత్తాపంబు వారింపఁగన్. 233

తే. అంత త్రేతాయుగమున రామాఖ్యచేత, జనన మొందుచు నీ కొసంగినచిదంశ
వపువునకై కొందు నట మానివగుచు బ్రహ్మ, దినమునిల్చెదవని పల్కి దివికి జనియె.

వ. నాచేత నిత్తెఱం గెల్లఁ గావింపంబడియె నిప్పుడు. 235

ఉ. ఆపురుషుండ వీవ భవదంశముఁ గొంటివి మేలు గల్గె నీ
ప్రాపునఁ బద్మజాండములు పావకుసందు జలంబునందునుం
బ్రాపగుధూమఫేనములభంగి జనించు నడంచు నిట్టి నీ
రూప మెఱుంగఁజాలరు సరోజభవాభవులైన రాఘవా!. 236

సీ. రఘునాయక! విరించిప్రార్థనంబున నీవు జనయించితివి నీకు సంభవాది
షడ్భావములు లేవు జనములు నీమాయ గలుగుసంతతము నిన్నుఁ గానలేరు
నీయాశ్రయంబున నఖిలంబు నీమాయ యొనరించు మాయాశ్రయుండ వీవు
బ్రహ్మాదులకును నేర్పరుపరాని యచింత్యశక్తిమంతుఁడవును ముక్తిదుఁడవు

తే. రూఢిగాఁగను విద్యావిరోధియైన, మాయన విచారములఁ గల్గు మానవులకు
నిట్టిమాయలు వాపి నీ విపుడు గానఁ, బడుట నాదుపురాకృతఫలము గాదె. 237

వ. దేవా! ప్రకృతికంటెఁ బరుండవమలుండవు నిర్వికారుండవు పూర్ణుండవు గమనాది

వివర్జితుండవు నగుమహానుభావుండవు మఱియు నవిద్యాకృతలింగదేహంబులం బ్రతిబింబితంబగు చిచ్ఛక్తి జీవలోకంబున జీవాభిధానంబు నొందు నెంతవట్టు దేహమనఃప్రాణబుద్ధ్యాదులయందు నభిమానవంతుం డగునంతవట్టును గర్తృత్వభోక్తృత్వాదిసంసారంబును బుద్ధికి జడత్వంబున నజ్ఞానంబును లేదయినను నవివేకంబున బుద్ధ్యాత్మలను జడాజడంబులకు మిథ్యాతాదాత్మ్యంబున నేకత్వంబొనరించి సంసారియనంబరఁగు నెట్టు లనిన జడంబునకుఁ జిత్సమాయోగంబునఁ జిత్త్వంబును జిత్తునకు జడసాంగత్యంబువలన జడత్వంబును నుష్ణోదకంబున జలాగ్నులకు మేళనంబుభంగి నుండు మఱియు. 238

చ. మనుజున కెంతవట్టు జనమాన్య! భవత్పదభక్తిసేవనం
బొనరక యుండు దుఃఖముల నొందును సజ్జనుఁ డంతవట్టుఁ గా
వున భవదీయభక్తులకుఁ బొల్పుగ సేవ యొనర్చి వారొసం
గినమదితోడ నిన్ గొలిచి కృత్రిమసంస్మృతి వీడఁగాఁ దగున్. 239

వ. ఇట్లొనర్చిన నదిమొదలు మాయ మెల్లమెల్లనఁ గృశియించు నంత విజ్ఞానసంపన్నుండగు నట్టి పుణ్యునకు సద్గురువు లభియించు సద్దేశికోత్తమునివలన మహావాక్యార్థజ్ఞానంబు వడసి భవదనుగ్రహంబున ముక్తుండగు నింక భవద్భక్తివిరహితులకుఁ గల్పకోటిశతంబులకైన జ్ఞానంబును ముక్తియును సుఖంబులు గలుగుట సంశయంబు గావున భవత్పాదయుగళభక్తియ జన్మజన్మంబుల నాకగుంగాక యవిద్య యేరెండింటివలన నశియించు నట్టి భవద్భక్తియు భవద్భక్తసాంగత్యంబును నాకుఁ బొల్ప[illegible]ంగాక మఱియును. 240

ఆ. నీదుభక్తి గలిగి నీకీర్తి జగముల, విశదపఱచునట్టి విబుధవరుఁడు
ప్రబలి జగము లెల్లఁ బావనం బొనరించు, నతని నతనికులము నగునె తలఁప 241

క. ఘనదేహ! భక్తజనభా, వన! భువనాధిప! యనంత! వామన! నారా
యణ! వాసుదేవ! కారు, ణ్యనివాస! ముకుంద! వందనంబిదె రామా!. 242

తే. ఏను లోకజిగీషచేఁ బూనిసేయు, పుణ్యమెల్లను నీబాణమునకు నర్ప
ణంబగును గాక యిదె వందనం బటంచు, మనవి యొనరింప మెచ్చి రామప్రభుండు.

సీ. విను విప్రవర్య! నీ వొనరఁ గోరిన నెల్లఁ గృపసేతు ననఁ బ్రీతి నపుడుఁ బల్కెఁ
గమలాక్షు! దయ నీకుఁ గలదేని నామీఁద నీపాదయుగభక్తి నీదు భక్తు
లగువారితోఁ బొందు దగఁ గృపసేయు మీ స్తవ మెవ్వరేనియుఁ జదువఁ బాప
మెల్లను బాయును మృతివేళ నీస్మృతి గలుగుఁ గావుత నీదుకరుణ ననుచుఁ

తే. ప్రణుతి యొనరించి పూజలు వడసి రాఘ, వానుమతినిమహేంద్రాచలాగ్రమునకుఁ
(దరలి మౌనిరైయొయట తపశ్చరణమునకుఁ)? బడసుపుణ్యుండు భార్గవుండరిగె నపుడు.

## శ్రీరాముఁడు సీతాసమేతుఁడై యయోధ్యకేతెంచుట

తే. కోలుపడినవిధానంపుఁగుప్పగలిగి, నట్లు ముదమంది రయమున నచటు వెడలి
బంధువులతోడ సాకేతపట్టణంబు, శీఘ్రమున రాఘవులు ప్రవేశించి రపుడు. 245

వ. అచ్చట దేవసములగు భరతశత్రుఘ్నులును లక్ష్మణుండును దమదమభార్యలఁగూడి
నిజమందిరంబుల సుఖం బుండిరి మఱియును 246

తే నెమ్మి జననీజనకులకు సమ్మదముగ, సీతతోఁ తసుండై లక్ష్మీసమేతుఁ
డగుచు వైకుంఠధామంబునందు వెలయు, మాధవునిభంగి శ్రీరామమనుజవిభుఁడు.

వ. అంత భరతమాతులుండగు యుధాజితుండు పనివడి చనుదెంచిన దశరథుండును వానిం
బూజించి తోడన కేకయరాజనగరంబునకు భరతశత్రుఘ్నులం బనిచె నప్పుడు.

క. నాకంబునఁ బౌలోమీ, పాకారులఁగాంచి వేడ్క పడు నదితిక్రియన్
సాకేతంబున రామధ, రాకన్యలఁ గాంచెఁ బల్కెఁ రఘుఁ డతిప్రేమన్. 249

వ. ఇవ్విధంబున. 250

సీ. సాకేతమున లోకసంగీతకీర్తియు నఖిలేశ్వరుండును నిఖిలమాని
జననికరానందసందోహదేహుండు నిరవధివిభవుండు నిర్వికార
వైభవుండును శ్రీనివాసుండు నిత్యమాయానివాసుండును నఖిలలోక
నాథుండు ముదితగుణగణుండునయ్యును దనమాయ నగు కార్యమువకఁ దానుఁ

తే గూడి చరియించుఁగాన లోకులకు మనుజ, చందమునఁ దోఁచె శ్రీరామజనవిభుండు
దన చరిత్రంబు భూమి పావనము సేయ, జనకనందనతోఁ త శైలతనయ. 251

క. అని శివుఁ డంబిక కెఱిఁగిం,చినగతి విధి నారదునకుఁ జెప్పినవ్యాసుం
డును నాకుఁ బల్కె వినుఁడం, చనియెను సూతుండు శౌనకాదులతోడన్. 252

## ఆశ్వాసాంతము.

క. కాలాంభోదరనిభ! భవ, శైలపురందర! కవేరజాతటరంగ
స్థలన! నిజభక్తనిచయ, పాలన! సన్నుత సరోజభవ! రంగేశా!. 253

మాలిని. శ్రితజనపరిరక్షా! శ్రీసమాయుక్తవక్షా!
గతభవభయమోహా! కాద్రవేయారివాహా!
శతమఖముఖవంద్యా! సర్వలోకాభినంద్యా!
రతిపతిశతరూపా! రంగనాథావనీపా!. 254

గద్యము. ఇది శ్రీమోరతోట ముక్తేశ్వర ప్రసాదలబ్ధ కవితాపవిత్ర కోటమరాజు
భాస్కరమంత్రిపుత్త్ర నాగయామాత్య ప్రణీతంబయిన శ్రీమదధ్యాత్మరామా
యణంబను మహాకావ్యంబునందు బాలకాండము సర్వంబు నేకాశ్వాసము.

శ్రీరస్తు.

# అధ్యాత్మరామాయణము

## అయోధ్యాకాండము.



రామచంద్ర! పూజిత!
ధారాధరనీల! పద్మదళలోచన! సం
సారపయోనిధితారణ!
నారాయణ! నిఖిలలోకనాయక! రంగా! 1

వ. అవధరింపుము చంద్రావతంసుం గనుంగొని గిరికుమారి యిట్లనియె. 2

ఉ. దేవ! పురప్రహార! వినుతించెద రాఘవుఁ డేమిసేసె న
ద్భావము నిశ్శంకముగఁ బల్కు మనన్ ముదమంది శంకరుం
డోవనజాక్షి! రామవిభుఁ డొక్కెడ జానకి చామరంబుచే
వీవఁగ దివ్యరత్నమయపీఠమునన్ విజనస్థలంబునన్. 3

వ. నీలోత్పలదళశ్యాముండును గౌస్తుభాముక్తకంధరుండును నగు రాఘవుండు రత్న
సింహాసనస్థుండై తాంబూలచర్వణం బొనరించుసమయంబున. 4

### శ్రీరాముకడకు నారదుఁ డేగుదెంచుట.

ఉ. దేవమునీశ్వరుం డమితతేజుఁడు నారదుఁ డేగుదేర సం
భావనచేసి మ్రొక్కి జనపావన నీ వరుదేర వంశముం
బావనమయ్యెఁ గోరికలు పండె గృహస్థుల కెట్లు గల్గు మీ
సేవయు దర్శనంబు నన శ్రీపతితోడుత నారదుం డనెన్. 5

సీ. వరనాథ నను మోహపఱపంగ నేల గృహస్థుండ వనిపల్కె దది నిజంబు
జగముల కాదియై తగనిల్చు మాయ నీగృహిణి మీవలన విరించిముఖ్యు
లుద్భవించిరి సుగుణోజ్జ్వలత్రిగుణాత్మ యై మాయ చెలువొందు నవనిమీఁద
భువనత్రయంబు నీభవన మా నిబ్భంగి నీగృహస్థత్వంబు నెమ్మిఁ దనరు.

ఆ. హరివి నీవు లక్ష్మి యవనిజ హరుఁడ వీ, వద్రికన్య సీత యబ్జభవుఁడ
నీవు వాణి జనకభూవరపుత్త్రి నీ, విభవ మిటు చెలంగు విమలచరిత!. 6

వ. దేవా! నీవు భాస్కరుండవు జానకి ప్రభావతి, నీవు శశాంకుండవు వైదేహి శుభలక్షణయగు రోహిణి, నీ వాఖండలుండవు పౌలోమి జనకనందన, యనలుండ వీవు నీదు కాంత స్వాహాదేవి కాలరూపి యగు దండధరుండ వీవు సీత సంయమని. జగన్నాథా! నీవు నిరృతివి మంగళప్రదయగు భూసుత తామసి, నీవు వరుణుండవు జానకి భార్గవి, నీవు వాయుదేవుండవు వసుమతీతనయ సదాగతి, కుబేరుండ నీవు మహీకన్య సర్వసంపద, నీవు లోకనాశనకరుం డగు రుద్రుండవు నీదుధర్మపత్ని రుద్రాణి యనం బరఁగు నింతెపల్కనేల వినుము. 7

తే. స్త్రీపురుషవాచకము లెన్ని చెలఁగు నన్ని, సీతయును నీవ సుమ్ము విఖ్యాతచరిత!
గాన మీకన్న నిఖిలలోకముల భజన. సేయఁదగినది యితరంబు చెప్పఁబడదు. 8

వ. దేవా! నీయాభాససంయుతంబగు సజ్ఞానం బవ్యాకృతం బనం బరఁగు నాయవ్యాకృతంబువలన మహత్తత్త్వంబు జనియించు నమ్మహత్తత్త్వోపాధికుం డై సూత్రాత్మ సమష్టిలింగదేహాభిధానంబున హిరణ్యగర్భుండగు మఱియు నహంకారబుద్ధులు రెండును బంచప్రాణంబులును జ్ఞానేంద్రియకర్మేంద్రియంబులు పదియునుంగూడి సప్తదశాత్మకంబును జన్మమృత్యుసుఖదుఃఖసంయుతంబును నగుసని ప్రాజ్ఞులచేత లింగదేహంబు పల్కంబడు నాహిరణ్యగర్భుండయి జగన్మయుండును జీవిసంజ్ఞుండు నై లోకంబునం బ్రకాశించు నింక వాచ్యంబును ననాదియు నగు నవిద్యాకారణోపాధియనం బరఁగు బ్రహ్మను స్థూలసూక్ష్మకారణంబు లనియెడు నుపాధులు మూఁడు గలవు తదుపాధిత్రితయసంయుక్తుండగువాఁడు జీవుం డనియును విముక్తుండగువాఁడు పరమేశ్వరుండనియును బల్కంబడు జాగ్రత్స్వప్నసుషుప్త్యాత్మకం బైన సంసారంబు చెలువగునట్టి సంసృతికి విలక్షణుండవును ననుస్యూతుండవును సాక్షివియు నగు జ్ఞానరూపుండవును నీవ మఱియును. 9

తే. అఖిలజగములు పుట్టి పెంపగు నవంగ, నీమహాదేహమునఁ గాన నీవు సకల
కారణుండవు నిఖిలలోకప్రభుండ, వీవు దైత్యాన్వయాటవీదావదహన!. 10

సీ. రజ్జుసర్పభ్రాంతి నిజ్జగంబులఁ బరమాత్మను జీవుఁ గా నాత్మఁ దలఁప
భయమందుఁ దెలియ నిర్భయమందు సకలదేహముల నీచిచ్ఛక్తి యమరునంత
తవపు బుద్ధులు నెల్లఁ దనరుఁ గావున నీవు పరమాత్మ నఖిలభూప్రజకుఁ దావ
కజ్ఞానమునఁ దోఁచు నఖిలంబు త్వద్జ్ఞానమున మిథ్య యగుఁ గాన జనుల కెల్ల

తే. జ్ఞాన మెఱుఁగంగ వలయును గాన నీదు. మహితభక్తియుఁ గల్గఁ గ్రమక్రమమున
జ్ఞానమును గల్గు మోక్షంబు గాననగును, నమ్మహాత్ముని కద్ధికనాథకళత్ర 11

తే. కాన నీపాదయుగభక్తి గలుగువారు, మోక్షభాక్కులు నీదుకటాక్ష మబ్జ
గర్భజంభారిముఖు లెల్లఁ గాంక్షఁ జేసి, తపముఁ గావించెదరు కాద దైత్యదమన! 12

చ. జనవర! నీసుభృత్యులకు సంతతభృత్యుఁడఁ గాన లోకమో
హినియగు మాయ నన్నుఁ గదియింపదు నీఘననాభిపంకజం
బున జనియించు వాక్పతికిఁ బుత్త్రుఁడఁ బౌత్త్రుఁడ నీదు భక్తుఁడన్
ననుఁ గరుణింపు తండ్రి! రఘునాథ! విదేహసుతామనోహరా! 13

వ. అనుచుఁ బల్కి యనేకవిధంబుల నమస్కరించి యానందాశ్రుపరిప్లుతుం డై యి
ట్లనియె. 14

చ. వనరుహగర్భుపంపునను వచ్చితి నీవు దశాననున్ వధిం
పను జననంబు నొందితివి పఙ్క్తిరథుండును రేపు రాజుఁ జే
యును నిను నిట్టులైన నిఖిలోర్వీభరాపహ మెట్టు లౌను? స
త్యవిరతమైన నీపలుకుఁ దథ్య మొనర్పుము రాఘవేశ్వరా! 15

తే. అనుచుఁ బలుకంగఁ జిఱునగవాననంబు, నందుఁదలుకొత్త రాఘవుం డనియె వినుము
నారదా! మత్ప్రతిజ్ఞప్రకార మెల్లఁ, జేతుఁ గాలానురోధంబుచేత నుంటి. 16

తే. సంశయము లేదు ప్రారబ్ధసంక్షయంబు, నెఱిఁగి యాసురమండలం బెల్ల నడఁచె
దను క్రమక్రమమున రేపు దనుజనిచయ, మడఁపగను దండకారణ్య మనుసరింతు.

వ. జటావల్కలంబులుఁ బూని పదునాలుగువత్సరంబు లమ్మహారణ్యంబున నివసించి సీతా
హరణంబను మిషచేత దుష్టాత్ముండగు నప్పౌలస్త్యుం బరిమార్చెద ననుచు రఘువల్లభుండు
ప్రతిజ్ఞ యొనరించిన నారదుండును. 18

క. మోదంబు నొంది రాముని, పాదములకు మ్రొక్కి దేవపథమునఁ జనె శా
తోదరి! హరినారదసం, వాదం బిది వినినఁ బాపవర్గ మడంగున్. 19

తే. రామనారదసంవాద మేమహాత్ముఁ, డైన లిఖియింప వినుపింప ననుమతింప
శాకశాసననగరాధిపతియ యగును, మఱియుఁ గైవల్యమందుఁ గ్రమక్రమమున. 20

వ. అనుచు మహాదేవుం డచలరాజతనయతోడ సర్వాలివృత్తాంతం బుపక్రమించి బల్కం
దొడంగె నంత నొక్కనాఁడు దశరథుండు రహస్యప్రదేశంబునం గూర్చుండి
నిజకులాచార్యుండును సర్వజ్ఞుండును మునిప్రవరుండును ధీరుండును సద్గుణగరి
ష్ఠుండును నగు వసిష్ఠునిం బిలువంబనిచి యిట్లనియె. 21

## దశరథుఁడు శ్రీరామునకుఁ బట్టాభిషేకము సేయుట కాలోచించుట.

క. ఘనముగ రామునిపట్టున, ననయము విన నొప్పు నిప్పు డటుగాన ధరా
వనితకు విభునొనరించెద, మునివల్లభ! తావకానుమోదమునఁ దగన్. 22

వ. అదియునుంగాక యేను వృద్ధుండ భరతుండును శత్రుఘ్నసహితుండై కేకయరాజగృహంబున నున్నవాఁడు మీర లనుమోదింపందగు సకలగృహంబులఁబతాకంబుల నిల్పునట్లును ద్వారంబులం గనకముక్తామయంబు లగువిచిత్రతోరణంబులు శీఘ్రంబ నియోగించి రామచంద్రు నామంత్రణంబు సేయుం డనుచు సుమంత్రుం బిలిచి యిట్లనియె. 23

తే. రాము భూపాలనకళాభిరాముఁ జేయ, వలయు మునివర్య యాజ్ఞ గావలయు వస్తు
సమితిసమకూర్పుమనసంతసంబుఁ బొంద, నపుడుమునిమంత్రివరుఁజూచియనియెనిట్లు.

సీ. నాల్గుకొమ్ములుగల నాగంబు లైరావతకులోద్భవంబులు తనర నఖిల
తీర్థోదకంబులు దెచ్చి కాంచనకుంభముల నిల్ప వైయాఘ్రములు వినూత్న
ములు మూఁడుచర్మముల్ వెలయ సన్మణిభూషణాంచిత లగుచుఁ బౌరాంగనలును
నిలువ మహర్షివర్యులు కుశపాణులై దివ్యాసనంబులఁ దేజరిల్లఁ

తే. బటుతరాయుధముల వీరభటులు గొల్వ, భూరిమంగళవాద్యముల్ భోరు కలఁగ
రాజలక్షణములు నెల్ల రహిఁ జెలంగ, రేపు సేయింపు మమలప్రతాప నీవు!. 25

తే. నగరమున దేవతాయతనంబులకును, బలులు పూజలు నొసఁగంగఁ బనుపు మనుచుఁ
బలికి రఘునాథుగృహములోపలికి నేఁగె, నవ్వసిష్ఠుండు వికచహృదబ్జుఁ డగుచు.

వ. ఇట్లు భగవంతుఁడగు వసిష్ఠుండు రథారోహణంబు సేసి వెడలి కక్ష్యాత్రయంబు నతిక్రమించి యచ్చట రథంబు డిగ్గి యాచార్యత్వంబు గలుగుటవలన ననివారితుఁడై యతిభాస్వరం బగు రామమందిరసమీపంబునకుం జనిన నారఘువల్లభుండు వేగంబ లేచి కృతాంజలియై భక్తియుక్తంబుగ నమస్కరించి రత్నాసనం బిడి జనకనందనానీతంబులగు కనకకలశసలిలంబునఁ బాదప్రక్షాళనంబుఁ గావించి యర్ఘ్యోదకంబు సీతయుం దానును శిరంబునం జల్లుకొని భవత్పాదాంబుధారణంబున ధన్యుండ నయితి ననిన నవ్వసిష్ఠుం డిట్లనియె. 27

క. హరుఁడును మజ్జనకుం డగు, సరసిజజుఁడు నీదుపాదసలిలముచేతం
బరమగు ధన్యతఁ గాంచిరి, శరనిధిసమధీర! యిట్లు చను నే పలుకన్. 28

చ. అదియునుగాక నీజనన మార్తి నెఱుంగుదు రావణాదులన్
మదము లడంచి భక్తుల కమర్త్యుల కింపు దలిర్ప లచ్చితో
నుదయము నొంది తీవు మది నుంచియు దేవ! రహస్య మాట నే
నిది యెఱుఁగంగ నీక గురువె ననియుంటి రమామనోహరా!. 29

క. గురువులకు దొరవు జగదం, తరవర్తివి శుద్ధతత్త్వతనుఁడవును వగో
చరుఁడవు మనుజునిక్రియ నీ, ధరఁ దోఁతువు మాయచేత దశరథరామా!. 30

వ. దేవా! పురోహితత్వంబు విగర్హ్యంబును దూష్యజీవనం బని యెఱింగియు జగద్యంత్రవాహకుండవు పరమాత్మవు స్వాధీనసంభవుండవు నగు నీ విక్ష్వాకుకులంబున రామాభిధానంబున నుద్భవించెద వనుచుఁ జతురాననువలన నెఱింగి సంతతసాంగత్యంబును నాచార్యత్వంబును గల్గెడు ననుమహాకాంక్షచేత నిట్టి కొద్దిపని కియ్యకొని భవదన్వయంబున నాశ్రయించియుంటి నిప్పుడు. 31

తే. నామనము సంతసము నొందె రామ! నీదు, దర్శనంబున సకలభూతలము మోహ
మందఁజేసెడు మాయన్ జెందనీక, కావ ననుఁ బ్రోచు విభుఁడవుగావె నీవు 32

వ. దేవా! ప్రసంగవశంబునం బల్కుటగాని యెఱుంగక కాదు రేపు ప్రభాతంబున నిన్ను ధరాపాలనంబున కభిషిక్తుం జేయఁ దొడఁగె నెమ్మని జనకుండు నన్నుఁ బనిచెం గావునఁ జనుదెంచితి నీవును యథావిధ్యుక్తంబుగా సీతాసహితుండ వై యుపవసించి శుచివియు భూమిశాయియు జితేంద్రియుండవు నిమ్ము ప్రభాతంబునం జనుదేరం దగు ననుచు రథారోహణంబుచేసి వెడలె నంత సర్వజ్ఞుండును మాయారహితుండును నీశ్వరుండును నగు జానకీవల్లభుండు నిజవాక్యవ్యాప్తి యగు లక్ష్మణుం గనుంగొని చిఱునగవు దలిర్ప ని ట్లనియె. 33

క. తమ్ముఁడ! నను ధరణీస్థలి, కిమ్ముగ నధిపతిని జేతు రెల్లి యనుటమా
త్రమ్మొకటిగాని యిమ్మహి, కిమ్ముగఁ గర్తను భోక్త వీవె తలంపన్. 34

క. నీవు బహిఃప్రాణంబవు, భావజశతరూప! యనుచుఁ బలికె వసిష్ఠుం
డేవిధమునఁ బలికెనొ యటు, లావసుధాధిపుఁడు నిల్చె నతినిష్ఠమెయిన్. 35

వ. అత్తెఱంగెల్ల భూవల్లభునకు వసిష్ఠుం డెఱిఁగించెఁ బట్టణం బంతయు వసిష్ఠోక్తప్రకారంబున నలంకృతంబు సేయించి రొక్క భటుం జని యిత్తెఱంగు కౌసల్యాసుమిత్రల కెఱింగింప హర్షంబు నొంది వానికి మౌక్తికహారంబు లొసంగి దశరథభూవల్లభుండు సత్యవంతుం డగు నయిననుఁ గాముకుండు గావున కైకేయీవశుండయి విఘ్నంబు సేయునో యని రామాభిషేకార్థంబు పుత్రవత్సలయగు కౌసల్యయు దుర్గాదేవి నారాధింపుచుండె నంత. 36

చ. సురలు సరస్వతిం బిలిచి సోమనిభాస్య! యయోధ్య కేఁగి మం
థర నటమీఁదఁ గేకయసుతన్ విధిపల్కునఁ జెంది రాము భూ
వరునిగఁ జేయకుండ వనవాస మొనర్చు మనన్ ముదం బటం
చరిగి నిజేశు నాజ్ఞను రయంబున నెల్చెను వాణి యచ్చటన్. 37

వ. ఇట్లు త్రివక్రాంగియుఁ గేకయరాజనందనకు ముఖ్యపరిచారికయు నగు మంథరయం దావేశించె నప్పుడు. 38

క. మంథర మందరనిభ మగు, దుం దనరెడుసౌధ మెక్కి సురుచిరముగ నిం
పొందెడుపురి కని విస్మయ, మందుచుఁ జని ధాత్రి కిట్టు లనియెన్ బెలుచన్. 39

చ. జనని! యిదేమి పట్టణము సర్వశుభావహ మై తనర్చెఁ గ
ఘనముగ వస్త్రముల్ మణులు కాంచనముల్ రఘురాముమాత స
జ్జనులగు విప్రవర్యులకు సమ్మతి నిచ్చెడు నన్న ధాత్రి యి
ట్లనియె విదేహజాధిపు ధరాధిపుఁ జేయును రెల్లి వేడుకన్. 40

## కేకయరాజపుత్రికి మంథర దుర్బోధనచేయుట.

సీ. అని పల్కి మంథర యతిరయంబున నేఁగి కేకయాత్మజఁ జూచి నీకు దొడ్డ
భయము పుట్టెను రాముఁ బట్టంబు గట్టెద రెల్లి యంచన సంతసిల్లి కైక
పస ధనంబు లొసంగి పాపాత్మ! భయ మేల భక్తుండు రాముఁడు భరతుకంటె
నన దాది యిట్లనె నతివ! నీపతి నీకు సమ్మదంబుగఁ బల్కి సకలకార్య
తే. ములును గౌసల్య కింపొప్ప మొనసి చేయుఁ, గాన నీనందనుని వెలిగా నొనర్చి
రామునకుఁ దోడగుట సుమిత్రాసుతుండు, గలయ ధరణీశుఁ జేయు రాఘవునిగంటె

వ. ఇంక నీకుఁ బ్రాణాంతంబయినను గ్రామనిర్యాపణంబైనను గల్గుఁ గాక యుండినఁ
గౌసల్యాసుమిత్రలకుఁ బరిచర్యసేయునలయు భరతునకు రాము ననుసరించి యుండుట
సంభవించు నాకుం జూడ నంతకంటె మరణంబు శ్రేయస్కరంబని తోఁచెడు శుభంబు
కాంక్షించెద వేని భరతుం బట్టంబుగట్ట రాఘవుఁ బదునాల్గువత్సరంబులు వనంబున
కనుప యాచింపు మంత భరతుండు సకలోపాయసమర్థుం డగు నింకొక్క యు
పాయం బెఱింగించెదఁ దొల్లి దేవాసురసంగ్రామంబునఁ బురందరాహూయమానుం
డై దశరథుండు నిజసేనాయుక్తంబుగాఁ జని యానిసేయుచునెడ రథాశ్వంబు భిన్నం
బైన నీవును మహాసాహసంబున హస్తంబుఁ జొన్పి నిల్వరించితి యంత రక్కసులం
గూల్చి జయంబునొంది నిన్నుం గనుంగొని నీసాహసంబునకు మెచ్చి రెండువరం
బులు వేఁడు మనిన నీవును. 42

ఆ. కరుణ గల్గెనేని వరయుగంబును నాకు, వలయునపుడొసంగవలయు ననిన
సంతసించెఁ గాన సతి! నేఁడు తద్వర, ద్వయము వేఁడు పుత్రవత్సలతను. 43

వ. అవ్వరంబు లిప్పుడు స్మృతిగతంబు లయ్యె నీవును గోపాన్వితవై క్రోధాగారం
బునం బ్రవేశించి దశరథుండు సత్యప్రతిజ్ఞుం డై నీయభీష్టం బెప్పుడొనగూర్చు
నంతపట్టు నాభరణంబులెల్ల నొలిచివైచి నేలంబడి యూరకుండు మనిన దుస్సంగ
హితవిభ్రమంబున నవ్వాక్యంబులు పథ్యంబు లని తలంచి. 44

ఆ. అతిముదమునఁ బలికె తమ్మ! ముక్ దెలియంగఁ, జాల బుద్ధిమంతురాల వీవు

భరతుఁ డిపుడు పట్టభద్రుఁ డైనను రామ, శతము నిత్తు నీకు సమ్మదమున. 45

క. అని మలినవస్త్రయుతయై, తనులిప్తపరాగ యగుచు ధరపైఁ బడి యి
ట్లనియె విను రాఘవుండు వన, మున కరిగెడు నంతవట్టు మూర్ఛిత నుండున్. 46

వ. చనఁడేనిఁ బ్రాణంబు లైనను విడిచెద నని నిశ్చయంబు సేయు మనినను గల్యాణం బగు నని నిజసదనంబున కమ్మంథర చనియెఁ గేకయాత్మజయు నట్లొనరించె వినుము 47

క. ధీరుం డైనను సుగుణా, చారుం డైనను వివేకసంయుతుఁ డైనం
గ్రూరులఁ గూడి చరించిన, నారయఁ దత్సదృశుఁ డగుట యరుదె మృగాక్షీ!. 48

## దశరథుండు కైకగృహంబున కేఁగుట

వ. అనుచుఁ బినాకధరుం డపర్ణాసతితోడఁ దదనంతరకథానువాదనం బారంభించి యిట్లనియె నంత దశరథుండు రామాభ్యుదయకారణంబునకు నభిముఖులుగాఁ సకల మంత్రివరుల నియోగించి తానును బరమానందంబునఁ గైకేయీసదనంబునకుం జని యవ్విధం బంతయుం జూచి విస్మయం బంది యచ్చటి దాసీజనంబులం గాంచి.

ఆ. భామ యిట్టు లుండ నేమికారణ మొకో, యనిన వార లిట్టు లనిరి దేవ!
కుడువ దోగిరంబు కోపంబు విడ వదు, నీవు దెలియవలయు దేవి తెఱఁగు. 50

క. అని యన విని మెలమెల్లనఁ, జని తత్తను నంటి యిట్లు చను నె పరాగం
బున నున్కి యెవ్వ రేమని, యనిరో కృపాదృష్టిఁ బల్కు మంతయు నాకున్. 51

క. ధనికు దరిద్రునిఁ జేసెద, ధనికునిఁ జేసెద దరిద్రు దండసమునకుం
జను మనుజుఁ గాతుఁ జంపఁగఁ, జనఁడేని వధింతు నీకు సమ్మతిగాఁ గన్. 52

వ. ఇంత యన నేల నాదు ప్రాణంబు లైనను నొసంగెద మత్ప్రాణతుల్యుం డగు రాఘవు సాక్షి పల్కు మనిన సంతసించి కైకయు మెల్లనఁ గన్నీరు తుడిచికొని యిట్లనియె. 53

క. శపథము పూనెదవేనియు, విపులాచారంబునందు వెలసెదవేనిం
గృపసేయవలయు మిమ్ముల, నిపుడే యాచించుకార్య మినకులతిలకా!. 54

వ. ఎద్ది యనినఁ దొల్లి దేవాసురసంగ్రామంబున నాచేతఁ బరిరక్షితుండవై రెండువరంబు లొసంగితి వవి నీయొద్దఁ బదిలంబుగ నుంచితి నిప్పుడు 55

ఆ. ఒకట భరతు ధారుణికి రాజుఁ జేయు వే, యొకట జడలు దాల్చి యుగ్రవనిని
బదియు నాలుగేండ్లు వసియింప రఘురాముఁ, బనుపు సత్యమార్గవర్తి వేని. 56

ఆ. ఇట్లు సేయవేని యే భుజంగముచే, నైన రజ్జువునను నైనఁ జత్తుఁ
గాన సత్యవాదివేని నామది సంత, సిల్ల రాము నడవి కెల్లి పనుపు. 57

మ. అన వజ్రాహతి భూరుహంబు తలక్రిందైనట్లు మూర్ఛిల్లి చ
య్యనఁ గన్విచ్చి నిశాటిఁబోలు నిజభార్యం గాంచి శ్రీరాము మా
న్యనయంబుల్ మది మెత్తు విప్వు డిటు సేయంబోలునే ధాత్రి నో
వనితా! నీసుతుఁ డేలుఁ గాసలకుఁ బోవల్ మాన్పవే రామునిన్ 58

వ. రామచంద్రునివలన భయంబు రానేరదు నాయందుఁ గరుణింపుము. 59

క. అని పాదాక్రాంతుండౌ, మనుజేశునిఁ జూచి కోపమగ్నానన యై
జననాథ! పుత్త్రమోహం, బున ధర్మము దప్పి నరకమునఁ బడఁదగునే?. 60

చ. సకలసభాంతరంబులను సత్యధనత్త్రి యటంచు మించి యె
న్నికఁ గని పుత్త్రమోహమున నేటికి బల్ నరకంబుఁ జెందఁ గో
రిక జనియించెనొక్కొ మునిప్రీతికరుం డగు రామునిమీఁద నో
డక శపథం బొనర్చుటలు డాంబికసత్యములో తలంపఁగన్. 61

ఆ. వేయు నేల రాము విపినంబులకుఁ బంప, వేనిఁ జత్తు ననుచుఁ బూని పలుక
మూర్ఛనొందె రాజు మొగి నాఁటిరేయేఁగె, దుఃఖమునను వర్షతుల్య మగుచు. 62

వ. అప్పు డరుణోదయకాలంబున వందిమాగధగాయకజనంబులు చనుదెంచఁ గైకేయి మహాగ్రహంబున వారల నివారించె నంతఁ బ్రభాతం బగుటయు మధ్యకక్ష్యంబున బ్రాహ్మణక్షత్త్రియాదిజనులును మహర్షులును గాంతాజనంబులును ఛత్త్రచామరరత్న దండాదిరాజలక్షణంబులును దోడ్కొని వసిష్ఠుండు నియోగించిన తెఱంగున నొప్పి యుండె నప్పుడు. 63

సీ. వరపీతకౌశేయవాసు గజారూఢుఁ గాలాంబుదసమానఘనశరీరుఁ
గమనీయశోభితకటకోజ్జ్వలు సహస్రమన్మథసుందరు మందహాసుఁ
గౌస్తుభశ్రీవత్సకలితమహోరస్కు క్షితిసుపర్వామాత్యసేవ్యమాను
సతతసీతాసమాశ్రితనిజవామాంకు సత్యసంకల్పు నీశ్వరు మహాత్ము

తే. దేవదేవుని శ్రీరామభూవరేణ్యు, వెల్లగొడుగు గూర్మిఁ గౌసలీవిభుఁడు పట్టఁ
బుడమికభిషిక్తుఁ డయి వచ్చు పుణ్యచరితుఁ, గాంచు టెపుడొ ప్రభాతంబు గల్గు టెపుడొ

వ. పురజను లెల్ల నారాత్త్రి నిద్రమాని ప్రభాతం బగుట కెదురుచూచుచుండి రంత సుమంత్త్రుండును భూవరుండు గృహంబు వెడల కునికి కేమికారణంబో యనుచు మెల్లనఁ దద్గృహద్వారంబు డగ్గరి జయజయశబ్దంబులు పలుకుచుఁ జనిచని యచ్చట విచారగ్రస్తుండును నతివ్యాకులితేక్షణుండును నతిఖిన్నుండును నగు నృపవర్యుం గనుంగొని యిట్టు లుండుటకుఁ గారణం బేమి యనినఁ గైక యి ట్లనియె. 65

గీ. రామరామరామరామరామ యటంచు, రాత్త్రి నిద్రలేక రాజు మదిని

నుండుచున్నవాఁడు గొబ్బున నీ వేఁగి, రాముఁ దోడితెమ్ము రాజుకడకు. 66

వ. అనిన సుమంత్రుండు రాజవాక్యంబు వినక యెట్లు వోఁగు ననిన నమ్మాట విని దశరథుం డిట్లనియె. 67

తే. రాము సుకపోలు సుస్మితుఁ గోమలాంగు, శాంతు మణిమయకుండలు జలదవర్ణుఁ
జూడవలె నీవు చని వేగఁ దోడితెమ్ము, మత్సమీపంబునకు టన్న నుత్సహించి. 68

వ. అట చని కాంచె మంత్రివరుఁ డుత్కటశతపత్రవిమానకుండలో
త్కటనిజగండభాగు జలదప్రతిమాంగు విశాలవక్షు వి
స్ఫుటసరసీరుహాక్షు ఘనభూషణు ధీరు సుధాకరాస్యు ది
క్తటపరికీర్ణకీర్తి భవతారణకృన్నిజనాము రాముని౯. 69

వ. మఱియును. 70

తే. హారకేయూరమకుటాంగదాదిభూష, ణాంచితము హేంద్రవిభవుఁ గల్యాణవసను
మృదులపర్యంకసంస్థు సుస్మితు మహోగ్ర, యామినీచరభీము శ్రీరాముఁ గాంచి.

వ. కృతాంజలిపుటుం డై యిట్లనియె. 72

క. నినుఁ గనుఁగొను వేడుక నను, మనుజేశుఁడు పనిచె రామ! మంగళ మగు ర
మ్మన లక్ష్మణుఁడును దానును ఘనముగ రథ మెక్కి జనకుఁ గనుఁగొను వేడ్క౯.

## శ్రీరాములు కైకసదనంబున కేఁగి దశరథుఁ బొడగనుట

వ. వెడలి మధ్యకక్ష్యంబున వసిష్ఠాదు లెదురైనం గాంచుచు నంతిరయంబున జనకుసమీపంబునకుం జని యవ్విభుచరణకమలంబులకు నమస్కరించిన 74

చ. కరములు సాఁచి రాఘవునిఁ గౌఁగిటఁ జేరిచి దుఃఖమగ్నుఁ డై
బరువగు మూర్ఛనొందె నట పఙ్క్తిరథుం డిటు లొందఁ గెల్లనుం
దరులును నేడ్వసాఁగి రతిదారుణ మంచు వసిష్ఠమౌని వే
గిరమున నేఁగుదేర మునికి౯ మునమ్మొదు నమస్కరింపుచున్. 75

వ. రామచంద్రుం డిట్లనియె. 76

చ. మునివర! ఖేదసంబునకు మూల మిదేమొకొ యున్నఁ గైక యి
ట్లనె రఘువంశపావనధరాధిపుశోక మడంప నీకపోఁ
జను నెటులన్న నేను మును సంతసమందఁగఁ జేయ నాకొసం
గను వరయుగ్మ మీ వది యకీర్తిసువృత్తి వహింపుమియ్యెడ౯. 77

ఆ. నీకుఁ దల్పలేక శోకసంతప్తుఁడై, యున్నవాఁడు చూడు మొప్పుదప్పి
కాన ధర్మమార్గగామివై రక్షింపు, సత్యపాశబద్ధు జనకు నిపుడు. 78

వ. అనుచుం బల్కిన రామచంద్రుండును శూలాభిహతునిభంగి వ్యథితుండయి కైకేయిం జూచి నీవ యివ్విధంబునం బల్కెడుభంగిం దోఁచుచున్నయది అయినను. 79

ఆ. తండ్రియాజ్ఞచేత ధనమైన బలమైన, గ్రామమయిన నాదుకాంత నైన
విడుతుఁ దండ్రియాజ్ఞ విడువ రాఘవుఁడు రెం, డాడువాఁడు కాఁడొకప్పుడైన.

ఆ. తండ్రి పనుపకున్నఁ దలఁపెఱింగి యొనర్చు, మనుజుఁ డుత్తముండు మధ్యముండు
పనుపఁ జేయువాఁడు పనిచినఁ జేయని, తనయుఁ డధముఁ డనఁగఁ దగును జనని 81

వ. కావున జనకు నాజ్ఞోల్లంఘనంబు సేయు సత్యంబు. పృథివ్యాదిభూతంబులు గంధాదిగుణంబులం బాయునిభంగి నేను సత్యంబు దొఱంగనని పల్కు దాశరథిం గనుంగొని సంతసంబునం గైక యిట్లనియె. 82

ఉ. రామ! ధరాతలంబునకు రాజయి మాభరతుండు నిల్వ నీ
వీమహిఁ బాసి కానలకు నేఁగి చతుర్దశవత్సరంబులు
న్నేమముతో వసింప ధరణీపతి కట్టడిచేసె నన్న శ్రీ
రాముఁడు తొంటికన్న మది రంజిలి యిట్లను కైకతోడుతన్. 83

క. జననీ! భరతుఁడు విభుఁడయి, తనరు ధరాస్థలికి నేను దాపసినై కా
ననమునకుఁ జనుదు నిజ మి, య్యనఘుఁడు పల్కుమికి సంశయం బగు మదిలోన్.

వ. అమ్మాటవిని శోకంబు నివ్వటిల్ల దశరథుం డిట్లనియె నందనా! స్త్రీజితుండ భ్రాంతుండ నున్మార్గవర్తి నట్టి నన్ను నీదు ఖడ్గంబునం ద్రుంచి రాజ్యంబు గైకొనుము. పాతకం బంటివేని 85

క. గురులైనను దుష్పథమునఁ, జరియించినఁ ద్రుంపఁదగును సద్బుద్ధికి నీ
వరమరసేయకు మని రఘు, వరుఁ జూచి నితాంతశోకపరవశుఁ డగుచున్. 86

వ. ఇట్లైన నన్నృతంబుఁ జెంద దనుచు రామచంద్రుం గౌఁగిలించుకొని ముక్తకంఠుం డై. 87

ఉ. హా రఘువంశపావన! మహాభుజ! హా శతపత్రలోచనా!
హా రమణీయహార! కుముదాప్తముఖా! జగదేకనాయకా!
హా రజనీచరాంతక! దయాకర! న న్విడనాడి యొంటిమై
ఘోరతరాటవిన్ జనుటకున్ మదిఁ బూనెద వెట్లు పుత్త్రకా! 88

తే. హా మమప్రాణవల్లభ! హా నృపోత్త, మా! ఘనోహ్మ! యనుచు నమ్మనుజవిభుఁడు
మిగులఁ జింతాభరంబునఁ బొగల నతని, నేత్రయుగళంబు చల్లనినీటఁ దుడిచి. 89

వ. రామచంద్రుం డిట్లనియె. 90

చ. జనపతి! చింతయేల భువి సర్వమునుం భరతుండు ప్రోచు న
వ్వనమునఁ గోటిసంఖ్యలను వాని సుఖం బిటకన్న నైనఁ గ్ర
న్ననఁ జనుదెంతు నమ్మ పదునాల్గుసమంబులు పుచ్చి కైకకుం
బెనయ భవత్ప్రతిజ్ఞ ఫలియింప సురల్ వినుతింప వేడుకన్. 91

వ. కావున వనవాసం బనేకవిధంబుల మహాగుణం బేయు ననుజ్ఞారంబు జననీగృహంబు
నకుం జని యద్దేవి నాశ్వాసించి జనకనందన ననూనయించి మరలి నీదుపాదంబు
లకుం బ్రణమిల్లి సుఖలీలగహనగమనంబుఁ జేసెద ననుచు వెడలి కౌసల్యామందిరం
బునకుం జనుదెంచె నంతకమున్న కౌసల్యయు శ్రీరామవిజయంబునకు హోమం
బులు చేయించి బ్రాహ్మణజనంబులకు సువర్ణంబు లొసంగి మౌనంబునొంది యంత
స్థుండును ముఖ్యుండును ఘనచిత్ప్రకాశుండును నిరస్తసమస్తాతిశయస్వరూపుం
డును విష్ణుండును సదానందమయుండును నగు నారాయణదేవుఁ బరమయోగధ్యా
నంబునం దలంచుచు రాఘవాగమనం బెఱుంగక యుదిరెయు రామచంద్రుండని
సుమిత్ర పల్కిన రామనామాంకితంబగు నమ్మధురవాక్యంబు విని బహిర్దృష్టి ప్రవ
హింపంజేసి ముందట. 92

సీ. కలితశతాధ్వరోకసన్నిభాకారు నలినపత్రవిశాలనయనయుగళు
మాణిక్యకుండలమండితసుకపోలు వరకాంచనాంబరధరు ననంతు
నక్షరు శుద్ధు నిరామయు నవ్యక్తు నిరుపద్రవు నిరీహు నిత్యశాంతు
సర్వభూతస్థితు స్వప్రకాశు మహీశమాన్యు సదానందమయుని దార
తే. హారకాంచీకలాపు మంజీరశింజి, తాత్మపదపంకజుఁ గృపాఢ్యు నాత్మతనయుఁ
గాంచి యతిసంభ్రమంబునఁ గౌఁగిలించి యంకమునఁ జేర్చి ముద్దాడి యనియె నిట్టుల.

వ. ఇట్లాద్యంతరహితం బగు నమ్మహామహుదేహంబు నివురుచు. 94

క. మాయయ్య! బొజ్జవాడిన, దైయున్నది మోము విందు నా భోజనముం
జేయుము నీ కని వండిన, పాయస మిదె యనిన రామభద్రుం డంతన్. 95

## శ్రీరాముని వనవాసవృత్తాంతము విని కౌసల్య ప్రలాపించుట.

మ. కనతల్లీ! భుజియింతు నెక్కడ మహోగ్రవ్యాఘ్రఘోరాటవిం
జన భూనాథుఁడు కైకకుం బెనయ నాజ్ఞాపించె దుఃఖింపఁగాఁ
జన దన్నం గని వ్రాలి హా తనయ! రాజశ్రేష్ఠ! నిన్ బాసి యుం
డను నీవెంట నెవత్తుఁ గ్రేపు చనఁ గూడం బోక గో వుండునే. 96

ఆ. అదియుఁ గాక రాజ్యమంతయుఁ దనపుత్త్రి, నేల నిమ్ము కైక కేమి యొగ్గు
చేసి తీవు నారచీరలు ధరియించు, తపసిసేయ నాదుతండ్రి! నిన్ను. 97

వ. నాదు ప్రాణంబులకన్న మిన్న యగు నిన్ను వీడంజాల మతియును. 98

క. జననీజనకులు దలఁపఁగఁ, దనయుల కొక భంగిఁ గాన దశరథుఁడును బో
ష్మని పల్కె నేను జనఁదగ, దని పల్కెడఁ జనినజత్తు నది నిజ మనినన్. 99

వ. అమ్మాటలు విని సాగ్రహుండై సుమిత్రానందనుం డి ట్లనియె. 100

సీ. తరుణార్క కోటిభాసురకుండలకిరీటు నాజానుబాహుఁ గర్ణాంతనేత్రు
సజలాభ్రవర్ణుఁ గాంచనవస్త్రసముదీర్ణు సర్వాంగసుందరు సత్యసంధు
ముద్రికారత్నసముజ్జ్వలకందర్పకోటిలావణ్య సంపుటితమధ్యు
వీరు జితేంద్రియు ధీరు మహోరస్కు మంజుభాషణు ననామయుఁ బరేశుఁ

తే. జూచి రఘునాథ! నన్నిదె చూడు భ్రాంత, మానసునిఁగై కయీవిభు మనుజవిభునిఁ
గట్టి భరతుని దద్బంధుగణము నెల్లఁ, గూల్చి రాజ్యంబు నీకొనగూర్తు నిపుడు.

వ. శత్రుసూదనా లోకప్రదాహకంబగు నాదుశౌర్యంబు శునాసీరప్రముఖు లీక్షిం
చెదరుగాక పట్టాభిషిక్తుండ వగుటకుం బనిపూను మేమును ధనుష్పాణినై నిలిచి
తద్విఘ్నకారు లగువారల సమయించెద ననుచు లోకంబులు గాల్చువానిపగిదిం
బలుకు నత్యుగ్రనసహాయపరాక్రము ధనుర్బాణధరు దీరఁబార్శ్వస్థు నతికోపను
సుమిత్రానందనుం గాంచి మక్కువలోడఁ గౌఁగిలించి రఘునందనుం డి ట్లనియె.

సీ. వినుసుమిత్రాపుత్త్ర! ఘనబలుండవు శౌర్యసంపన్నుఁడవు నాకు సత్ప్రియుండ
వని యెఱుంగుదుఁగాని కనుపించునట్టి యీయువనిరాజ్యము సత్య మయ్యేనేనిఁ
బడయంగవచ్చు సంపద లెల్ల మెఱుపులవలెఁ జంచలంబులు వహ్నితప్త
మగు లోహమునఁ బడ్డ యంబుబిందువుమాడ్కి మనుజాసకాయువ్యమహిమదఱుఁగు

తే. భోగిపదవంబునను బడి యీఁగలందుఁ, దలఁపు గలిగెడు కప్పచందమునఁగాల
సర్పమునఁ జిక్కియును నశాశ్వతములైన, భోగములకిచ్ఛ యుంతురు భువినిజనులు.

తే. పుణ్యములఁబాసి నిజదేహపోషణంబుఁ, దలఁచి కర్మంబు లొనరింతు రెలమి జనులు
దేహికన్నను వేఱు యీదేహ మరయు, నెనరిఁజెందును దత్సుఖ మ్మెల్ల వత్స!. 104

ఆ. తల్లిదండ్రు లన్నదమ్ములు బంధువు, లనెడు బంధములు జనాళి కెల్ల
నెసఁగఁ గల్గుఁ బోవు నేటిలోని ప్రవాహ, మందు నింధనములచందమునను. 105

వ ఆదియునుంగాక. 106

సీ. ఛాయవంటిది లక్ష్మి చంచల తనుపుష్టి జలతరంగంబు నిశ్చయము గాదు
స్వప్నవృత్తిము సతీసంయోగ మాయువు సల్పనూ నభిమాన మధికతరము
సదనంబు భార్యయు మొదలుగాఁ గల్గు నీసంసార మెల్ల నశాశ్వతంబు
గంధర్వనగరంబు గరి మేను సూర్యోదయాస్తమయంబుల నాయు వరుగు

తే. జరయు వృద్ధదశాగ్రస్తులగుచుఁ జనెదు, మనుజులను గాంచి భువి బుద్ధిమాంద్యులగుచు
గాలవేగం బెఱుఁగక కామముఖ్య, షడ్గుణంబుల నొందెదు జనులఁ గంటె!. 107

ఆ. పచ్చికుండలోనఁ బఱఁగు నీరము లట్లు, నరుని కాయ మెల్ల జరగుచుండు
దినదినంబు నరునిఁ దివిరి రాగాదులు, శత్రులట్ల బాధ సలుపుచుండ్రు 108

మ. జర శార్దూలముభంగి మానవుని తేజం బెల్లఁ గైకొందు నం
చు రయం బొప్పఁగ నిల్చు మృత్యువు వసించుం గాలముం గూడ నిక్
బౌరిపుత్త్రుం దగ నంచు నిక్కెఱిఁగి యే భూనాథుఁడే శూరుఁడే
జిరపుణ్యుండ నటంచుఁ బ్రేలుచును భస్మీభూతుఁ డౌఁ బిమ్మటన్. 109

వ. మఱియు నీదేహంబుల నంత్యంబున సారమేయంబులయిన నంటరోయ నిట్టి త్వగస్థిమాంసవిణ్మూత్రరేతోరక్తాదిసంయుతంబును బరిణామంబును నగు దేహం బెవ్విధంబున నాత్మ యగుంబో నీవును దేహాభిమానంబున లోకంబు గాల్ప నిశ్చయించితి వందుఁ దోసంబు సంభవించు. దేహంబు నేననునది యవిద్య యనం బరఁగు నవిద్య సంసారకారణంబును విద్య తన్నివర్తకంబును నగుఁ గావున మోక్షకాములగు పురుషుల కెల్లెడల విద్యాభ్యాసంబ సేయవలయు నింకఁ గామక్రోధాదు లని యెడు శత్రునిచయంబులు గల వందు మోక్షవిఘ్నంబునకు గ్రోధంబ చాలు నీవును గ్రోధంబునఁ గాదె పితృమాతృజనంబుల వధియింపం బూనితివి మనస్సంతాపంబును సంసారబంధనంబును ధర్మక్షయంబును నివి క్రోధంబునం బ్రభవించుం గావున నిట్టి క్రోధంబు వర్జింపవలయు. 110

తే. తామసం బంతకుండు వైతరణి తృష్ణ, దనరు సంతస మెల్ల నందనవనంబు
కామధేనువు శాంతియౌఁ గాన జనుఁడు, మించి సతతంబు శాంతి వహించవలయు.

వ. ఇట్లు శాంతిగరిష్ఠుండ వైతివేని నీకు శత్రువులు గలుగనేర రంతదనవు పరిశుద్ధుండును స్వయంజ్యోతియు నవికారియు నిరాకృతియు నగు నాత్మను దేహేంద్రియప్రాణబుద్ధ్యాదులకు విలక్షణుం డని యెఱుంగకుండునంత దనుకను మృత్యుసంప్లుతుండయి సంసారదుఃఖపారావారంబున మునుంగుచుం దేలుచు నుండుఁ గావున లక్ష్మణా! నీవును సాధుభావంబున సర్వదా భిన్నుం డగు పరమాత్మ నెఱుంగుము. బుద్ధులు బయుల వర్తింపఁ గాక భయంబు నొందక ప్రారబ్ధవశంబునను బ్రవాహపతితంబు లట్ల సుఖంబు లయినను దుఃఖంబు లయినను సంభవించిన నహంకారమమకారంబుల నొందక యేను బల్కిన శుద్ధస్వభావంబు వహించిన నిన్ను నంట నేరవు మఱియును. 112

ఆ. ఏను బల్కినట్టి యీవాక్యములు నీదు, మానసంబునందుఁ బూని తేని

సకలసుఖము లొప్పు సంసారదుఃఖముల్, దొలఁగు నిశ్చయంబు దలఁపు మిటుల.

వ. అని తల్లిం గనుంగొని. 114

తే. జననీ! యివ్వాక్యములు నీదు మనమునందు, నిల్పి నారాకఁ గోరుచు నిలువు పదియు
నాలుగేఁడులు నిముసంబుపోలెఁ బుచ్చి, మఱలి వచ్చెద దుఃఖముల్ దఱుఁగు నీకు.

క. ఇలఁ గర్మమార్గవర్తుల, కలవడ నొకచోట నుండు టదియెటులన్నన్
సలిలప్రవాహమందున, నిలువని కట్టియలభంగి నిజ మగు జననీ! 116

వ. కావున నీవును సంతసంబునం బంచితివయేని నాకును సుఖసంవాసంబు గలుగు ననుచుఁ జరణంబులపయిం బడిన రామచంద్రుం గ్రుచ్చియెత్తి తొడలపై నిడుకొని యాశీర్వదించి నందనా! నీవు చనువేళను నిల్చుసమయంబున శయనించు తఱిని ఇతరవేళలను సమస్తదేవతలును గంధర్వులును బ్రహ్మయు నారాయణుండును భగవంతుం డగు సదాశివుండును రక్షింతురు గాక యని మఱలి మఱలి యాలింగనంబులు సేసి వీడుకొలుపునప్పుడు నమస్కరించి హర్షాశ్రులోచనుండై మెల్లన లక్ష్మణుం డిట్లనియె. 117

మ. ధరణీనాథ! భవత్కటాక్షమున వ్యాత్సందేహముల్ వాసె నీ
చరణాబ్జంబులు గొల్చి వచ్చెదను వత్సా! నిల్వు మిం దన్న ని
ద్ధరణిన్ మేను దొరంగువాఁడ నన మోదం బందితి మ్మీవు స
త్వరతం గూడ వటంచుఁ బల్కుచన సీతాకాంత నూఱార్పఁగన్. 118

## శ్రీరాముఁడు సీతాగృహంబున కేఁగుట.

వ. ఇట్లు చనుదెంచిన నిజప్రాణవల్లభుం గాంచి భూపుత్త్రియు నతిభక్తి నెదురువచ్చి స్వర్ణపాత్రస్థసలిలంబులఁ బాదప్రక్షాళనంబు చేసి కనకపీఠంబున సుఖాసీనుం గావించి. 119

ఆ. వనిత మందహాసమున గజాశ్వపదాతి, నృత్యవాద్యతతులు నిలిపి పాద
చారి వగుచు రాఁగఁ గారణం బేమని, యడిగిన సతికి నిట్లు లనియె విభుఁడు. 120

చ. వన మనురాజ్య మిచ్చె రఘువర్యుఁడు గాన భరింపఁ బోదు మ
జ్జననికి సంతతంబుఁ బరిచర్య యొనర్చుచు నుండు మిచ్చటన్
బనుపడ నాడి తప్ప సని పల్కిన బెగ్గిలి యేల కానసం
బున కిటు పోవఁగావలసె భూరిదయాకర! యానతీయవే. 121

వ. అనిన రామచంద్రుం డిట్లనియె. 122

చ. విను హరిమధ్య! కైక తను వేఁడిన రెండువరంబు లిచ్చె నం
దు నొకట భూమియెల్ల భరతుండు భరింపఁగ వేఱొ యొక్కటం

బనివడి కానలందుఁ బదునాలుగువర్షము లేను నిల్వ న
ప్పనుపు వహింతు విఘ్నములు పల్కకు మీ వన సంతసంబునన్. 123

వ. జనకనందన యిట్లనియె. 124

చ. విను రఘునాథ! మున్నె యటవీస్థలి కేఁగెద వెన్క నీవు రాఁ
జను నను వీడిపోవుటలు సైఁప దనన్ బ్రియమంది స్వప్రియన్
గనుఁగొని రాఘవుం డనియెఁ గానన ముగ్రభుజంగసంయుతం
బనిమిషదుర్గమంబు జలజానన! నీవు సహింప నేర్తువే. 125

వ. అదియునుం గాక. 126

క. ముదతి! మధుసూపఘృతములు, వెదకిన లే వరయ నైన వేళ్లను బండుల్
ఉదకము దినమున దొరకవు, పదముల నడుచంగవలయు బహుకష్టమగున్. 127

వ. మఱియును. 128

తే. అతిపానీయవర్షాగు లధిక మవనిఁ, గానుపించని కర్కశకంటకములు
వీటి కేమి సహింప నిశాటకోటి, గుండె తల్లడపాటు గావుంతు మిచట. 129

వ. మఱియు ఝిల్లీఝంకారవంశాభియుతంబును దండకాఖ్యంబును నగువనంబు
బహువిధదుఃఖభవనంబు గావున భవనంబున నిలువుము శీఘ్రంబ మఱల వత్తుం
గనియెద ననిన నయ్యువకులతిలకు పలుకులు ములుకుల క్రియఁ గలఁకసేయఁ దలక
డచిన యలుకకలకలతోడ నులికి యుక్కలకంతి యిట్లనియె. 130

సీ. తగునయ్య! యగ్నిసాక్షిగ నన్నుఁ బెండ్లియై విడనాడి చన సత్యవిభవ! నీకు
భోజనంబయిన నీభుక్తశేషము లైనపండ్లు మృష్టాన్నంబుభంగిఁ గుడుతు
నీవు కూడఁ జరించు నెడఁ గంటకము లున్నఁ బుష్పశయ్యలభంగి బుద్ధిఁ దలఁతుఁ
గ్లేశకారిని గాను యీశ! దైత్యమునంటి చనుదెంచెదను బాల్యమున నవిప్ర

తే. వరులు నను జూచి పతి నీవు వనము కేఁగ, గల రటంచనుఁ బల్కిరి ఘనులువార
లైనఁ జనుదెంచుటలు గల్గు నది యొఁగాక, విప్రవర్యులచే మున్న విశదముగను.

క. రామాయణము లనేకము, లామూలంబులుగ వింటి నవనిజ విడి యే
రాముఁడు వనమున కేఁగెను, నామది కెఱుఁగంగఁ బలుకు నరనుతచరితా!. 132

తే. కాన నీవెంటఁ జనుదెంతు మాని నన్ను, వీడి చనుదేని ప్రాణముల్ విడుతు నీదు
ముందఱనటంచుఁ బల్కునమ్ముదితఁ జూచి, సమ్మదమునొందె నారామచంద్రుఁడపుడు.

వ. అంత జనకనందన కనకమణిమయవివిధాభరణంబు లరుంధతీప్రముఖమునివనిత
లకు నొసంగ నియోగించి నట్లు చేసె రామచంద్రుండును జననీసేవకపౌరజానపద
ధరాసురవర్గంబులకు సహస్రసంఖ్యల ధనం బొసంగె. లక్ష్మణుండును సుమిత్రం

దోడ్కొని కౌసల్యకు నప్పగించి కోదండపాణి యై రాఘవునకు నగ్రభాగంబున
నిలిచె నంత నచ్చట వెడలి 134

మ. చరణన్యాసపవిత్రితావని ఘనశ్యాముండు రాముండు శం
బరజిత్కోటితనుద్యుతుల్ దిశలు గప్పన్ రాజమార్గంబునం
గరుణన్ మెల్లన పౌరజానపదవర్గంబెల్ల వీక్షించుచున్
దరుణీసోదరయుక్తుఁడై పితృగృహస్థానంబుఁ జేరన్ వెసన్. 135

వ. అనుచు సంబరకేశుండు మేనకాతనయతోడ సవ్వలివృత్తాంతంబు పల్కందొడంగ
నిట్లు కౌసలేయుండు సీతాలక్ష్మణసమేతుండై రాజవీథి నరుగుచెంచు సమయంబున.

చ. పురజను లాత్మలందు రఘుపుంగవుఁ గన్గొని లోభమోహసం
భరితుల కేటిప్రేమ సని బాలుర గానఁగఁ జొప్ప రిల్లు భూ
వరుఁడును గైక యావరణవర్జిత యై చనుచుండె సీత య
చ్చెరు విధి మున్ను గాంచితిమె సీతను రామసమేత నెన్నఁడున్. 137

తే వందిమాగధరహితు లై పాదచారు, లగుచుఁ జను రామలక్ష్మణాయవనిజలను
గంటిరె మనుష్యయత్నముల్ గలుగు నెట్లు, దైవబలమెక్కుడై యుండ ధరణిమీఁద.

వ. ఇన్నిటికి మూలంబు కైకయి యను పేర సర్వవినాశిని యగు రక్కసి జనియించె
దీనివలన రామునకు సీతాలక్ష్మణులకును గాల్నడలచేతఁ దగనిదుఃఖంబు సంభవించె
సత్యసంధుండయ్యును స్త్రీలోలుఁడై ప్రియాపహారం బగునందను విడిచె దశరథు
నకు నేటి సత్యవాక్యంబు కైకయి యైనను మఱలింపక క్రూరకర్మయు విమూఢ
బుద్ధియు నగుచు వెడల నడిపించె మనకు నిట్టి యధర్మప్రదేశంబున నిలువఁ బోలదు
మఱియును. 139

తే. భోగమోక్షంబు లొసఁగెడు పుణ్యమూర్తి, రామచంద్రుండు కాననభూమి కేఁగ
మనకుఁ దలిదండ్రు లెవ్వ రిమ్మహిని వేఱ, రాఘవునిఁ గూడఁ జనుదము రండటంచు.

వ ఇట్లతిశయదుఃఖాకులులగు పౌరజనంబులం గనుంగొని సాధుసంఘంబునందుండి
వామదేవుం డను మునిపుంగవుం డిట్లనియె. 141

పౌరులు దుఃఖింపటకు వామదేవుండను ముని హితంబు సెప్పుట.

సీ జనులార! శ్రీరామజానకీలక్ష్మణులను గూర్చి చింతిలఁజనదు మీర
లీరాఘవుం డాదినారాయణుండు సాక్షాద్విష్ణుఁ డిందిర జనకతనయ
యోగమాయ యనంగ నుర్విఁ బ్రసిద్ధ యానంతుండు శేషుఁ డహీశ్వరుండు
రామచంద్రునితోడ నేమఱకుండును లక్ష్మణాఖ్యను బుణ్యలక్షణుండు

ఆ కనుఁగొనఁగ ననంతకల్యాణగుణశాలి, రామచంద్రుఁ డనవరతము ప్రకృతి

గుణములందుఁ గని గణుతింపఁ దత్త్వజ్ఞానుసారి యనఁగ నలరుచుండు. 14
వ. ఎట్లనిన. 14
క. వనజజుఁడు రజోగుణమున, వనజాక్షుఁడు సత్త్వగుణమువలనను రుద్రుం
డనఁగఁ దమోగుణమున నో, జనులార! వెలుంగు నితఁడు సంతతము మహిన్. 14
వ. మఱియును. 14
సీ. మనువు వైవస్వతు మును లయాంతంబున మత్స్యమై యీరాజమౌని నావ
యందు నాథత్వ నొయ్యనఁ జేర్చి పాలించె నబ్ధి మున్ మథియించు నవసరమునఁ
గూర్మమై మందరకుధరంబు మూఁపునఁ దాల్చె ధారుణి రసాతలమునొంద
దంష్ట్రాగ్రమునఁ గ్రోడత వహించి తద్ధాత్రి నుద్ధరించెను నఖరోజ్జ్వలుండు
తే. నగుచు నరసింహమూర్తి ప్రహ్లాదవరదుఁ, డనఁగఁ గాంచనకశిపు పేరడఁచె నపహృ
తాత్మనందనరాజ్యయై యదితి వేఁడ, వామనత్వంబునొంది యీరామవిభుఁడు.
క. బలిసదముఁ జేరి మిగులన్, బలుచఁదనము నొంది మూఁడుపదము లనుచు న
బ్బలి సుతలముఁ జేరిచి జగ, ములకదితితనూజముఖ్యముఖ్యు నొనర్చెన్. 147
వ. వెండియు దుష్టక్షత్రియభూభారనివృత్త్యర్థంబు భార్గవుం డయ్యె నిప్పు డాజ
గన్నాయకుండు శ్రీరామరూపంబున రావణాదు లగు రక్కసుల కోటిసంఖ్యల
నుక్కడంచు నిక్కం బాదురాత్మునకు మానవుచేత మరణంబు నిశ్చితం బగుటవల
నను జగద్వ్యాపకుం డగు నీహరి దశరథుచేతఁ బుత్త్రిత్వంబు నొంద మిక్కిలి
తపంబున నారాధితుం డగుటవలనను దాశరథియై జనియించెం గావున నవతరించిన
కార్యంబు దీర్ప సీతాలక్ష్మణసహాయుం డై వనంబున కరుగుచున్నవాఁడు జనకనం
దనయు నమ్మహాత్ము యోగమాయ సర్గస్థితిలయంబులకుఁ దాన యై వెలుంగుచుండు
నిందు దశరథుండును నై కైకేయియు నిచ్చుకంతయైనం గారణంబుగా రిట్లు భూభార
నివారణంబు సేయవలయు నని పూర్వదినంబున నారదుండును విన్నవించె నెల్లి
వనంబునకుం జనియెద నని తనకుఁదాన రామచంద్రుండునుం బలికె నది గావున
బాపురుల రై వారి నుద్దేశించి వగవం జన దెట్లనిన. 14
తే. రామమంత్రంబు జపియించు ప్రజలు మృత్యుముఖ్యభయములు గనరత న్మూర్తియైన
దాశరథి కేల దుఃఖముల్ దలఁచి చూడఁ, గంబు శ్రీరామమంత్రంబు కలియుగమున
తే. భక్తజనులను బాలింప ఖండనమున, రావణుని ద్రుంప దశరథరాజు కింపు
దనర శ్రీరాముఁ డన నిట్టి మనుజుఁ డయ్యె, మాయతోఁ డంత నాదినారాయణుండు
వ. ఇట్లు పలికి వామదేవమహాముని యూరకుండె నచ్చటి విప్రసమూహంబు లెల్ల రామ
చంద్రుండు జగత్ప్రభుం డగు హరి యని యెఱింగి హృత్సంశయగ్రంథు లెఱ్ఱ
విడిచి రాఘవు నేమఱక చింతింపుచు. 15

క. సీతారామరహస్యము, ప్రీతిం జదివినను వినినఁ బ్రియవిజ్ఞానో
పేతం బగుభక్తి సము, ద్భూతం బగు వారియందుఁ బురుషుల కెల్లన్. 152

తే. అతిరహస్యంబు గోపనీయంబు మీరు, రాఘవప్రియులరు గానఁ బ్రకటితముగఁ
బలికితి మటంచు నరిగి రా బ్రహ్మవిభులు, పౌరులా రాముఁ దలఁచిరి ప్రభుఁడటంచు.

వ. అంత సీతాలక్ష్మణులతోడ రామచంద్రుండవారితుండై దశరథాలయంబుఁ బ్రవే
శించి కైకేయిం గనుంగొని. 154

క. జననీ! దృఢచిత్తులమై, చనుదెంచితి మడవి కేఁగ జనపతి పలుకన్
జనియెద మనఁ గైక లిఖం, చినగతి వెర్వేఱ నారచీర లొసంగెన్. 155

వ. అప్పుడు. 156

ఉ. చీరలు దాల్చి రంత రఘుశేఖరు నాజ్ఞను రామలక్ష్మణుల్
వారిజనేత్రి సీత తల వంచుక సిగ్గున రాముఁ జూడన
చ్చీర ధరాతనూజ తొలిచీరపయిన్ దగఁ జుట్టఁ జుట్టినన్
బోరున నేడ్చి రందఱును భూసుతకైన విధాతవ్రాఁతకున్. 157

అది విని కోపంబుతోడ నరుగుదెంచి వసిష్ఠుండు కైక కిట్లనియె. 158

. ఓ నిశాచరి! రాము నొకని నీపతి వేఁడి సీత కిత్తువె నారచీర లిపుడు
బుద్ధి గల్గెడునేని భూపుత్త్రి వివిధభూషణములు ధరియించి సార్వభౌముఁ
డగురాఘవుని కింపుదగుల నేఁగెడుఁ గాక యనిన నీలోన నోయాతివ! రాజు
దుఃఖింపుచు సుమంత్రుతోడ వేగమె నీవు రథము దెమ్మని పుత్త్రిరత్నములను

తే. జూచి హా రామ! యని భూమి సొక్కి వ్రాలె, నంత ముందఱ రథమెక్కె నమ్మహీజ
దాశరథియును మూఁడు ప్రదక్షిణములు, తండ్రికొనరించి రథమెక్కె తాను నపుడు.

## రథారోహణులై రామలక్ష్మణులు సీతతోఁగూడి వనంబున కేఁగుట.

లక్ష్మణుండును. 160

. చారుతూణీరయుగళంబు ఘోరఖడ్గ, యుగళము దివ్యశరాసనయుగముఁ గొనుచు
రథముపై నెక్కె వేగ సారథిని జూచి, పోనిమ్మన దశరథభూవరుండు. 161

. నిలుపు నిలుపు మనిన వలదు పోనిమ్మని, రాముఁ డనఁగఁ బఱపె రథము వేగ
రాము రథము పోవ రాజు తల్లడపాటు, నొంది రామ! రామ! యెందుఁ జనితి. 162

అని మూర్ఛనొంది తెప్పిరి, మనుజేశుఁడు రామమాతమందిరమునకున్
గొనిపొండు బ్రతుకు టెక్కడ, నన భటు లటుచేసి రంత నటు రాఘవుఁడున్.

తమసాతీరంబు చేరి కొన్నిజలంబులు గ్రోలి నిరాహారియై సీతతోడ నొక్కవృక్ష
మూలంబున శయనించె లక్ష్మణుండును శరాసనపాణియై సుమంత్రుం గూడి ధరా

త్స జం దనప్రభుం గాచియుండె రాఘవవివాసంబునకు నోర్వక యాక్రందనంబు
సేయుచు రథంబు వెనుదగిలి వచ్చిన పౌరబాలవృద్ధాదు లెల్లను బురంబునకు మఱల
రామచంద్రుం దోడ్కొనిపోవంగలము లేకుండిన సీతోడ వనంబున కరుగువార
మని తత్సమీపంబున శయనించియుండి రంత రామచంద్రుండును వారి నిశ్చయం
బునకు విస్మయంబునొంది యేనుబురంబు చొరనొల్ల వీరలెల్ల దుఃఖభాజను లయ్యెద
రనుచు సుమంత్రుం జీరి యీసమయంబున వెడలవలయు వరదం బాయతంబుసేయు
మనివనతండును జవనాశ్వంబులం బూన్చి తోడితెచ్చె నంత రామచంద్రుండును
సీతాసౌమిత్రులతోడ నయ్యర్ధరాత్రంబున వారు లెఱుంగకుండ రథారోహణంబు
సేసి యయోధ్యామార్గంబుపట్టి కొంతదూరంబు బరిగి యరదంబు మఱలించె నంతఁ
దమసాతీరంబున. 164

క. ఖరకరుఁ డుదయించినతఱిఁ, బురజనములు మేలుకాంచి భూమిజయును నా
ఖరకరకులజలనిధిహిమ, కరులు లేకుంటఁ జూచి కడుదుఃఖితులై. 165

వ. రథనేమిమార్గంబు పట్టి యయోధ్యానగరంబునకుం జని యందునుం గానరా
దయ్యె ననుచు నహోరాత్రంబులు మనంబుల వారల సంస్మరింపుచు నిండ్లకడనుండి
రంత సుమంత్రుం డతివేగంబున రథంబు నడుప రాఘవుండును జనపదంబు లనేకం
బులు గనుంగొనుచు శృంగిబేరసమీపమార్గంబున. 166

మ. చని గంగానదిఁ గాంచి భక్తిమెయి రాజశ్రేష్ఠు లప్పుణ్యవా
హినికిన్ మ్రొక్కి జలంబులాడి సుఖదాయిన్ శింశుపావృక్షమున్
గని యాపొంత వసించి రంత గుహుఁ డక్కాకుత్స్థు లేతెంచుట
ల్జనము ల్దెల్ప నెఱింగి పుష్పఫలముల్ సద్భక్తిచేఁ బూనుచున్. 167

క. చనుదెంచి రాము సీతా, వనితావిభుఁ గాంచి ముందుపాయనమిడి వం
దనపూర్వకముగ నిలఁబడి, వనుఁ గరముల గ్రుచ్చియెత్తి నరనాయకుఁడున్. 168

వ. కుశలం బరసిన దేవా!, సకలంబు సంపన్నంబని కరంబులు మొగిడ్చి గుహుండిట్లనియె.

సీ. జననాయక! నిషాదుఁడను నన్ను శుచిఁజేసెఁ బరఁగ నీయంగసంస్పర్శనంబు
ధర నిషాదున కేల భరియింపు కరుణ నన్ బాలింపు నీమూర్తి బంటుభంగిఁ
జనుదెమ్ము నాగృహంబునకు నీ కని సమకూర్చినఫలములు గొమ్ము లెమ్ము
అనఁ బ్రీతి దళుకొత్త జననాథుఁ డనె నిషాదవరేణ్య! మాకు సంతసము నీదు

తే. వాక్యములఁ గాని మత్పితృవాక్యసరణిఁ, దలఁపఁబదునాలుగేండ్లు కానలవసింతుఁ
గందమూలఫలమ్ములు గొందు మంది,రముల కేతేర నమ్ము మీ క్రమము నీవు. 170

తే. నాయదియ రాజ్యమంతయు నాకుసఖుఁడ, వీ వనుచుఁబల్కి యొకవటవృక్షమునకు

సేఁగి తత్ క్షీరమున జడల్బాగుమీఱ, దాల్చి రప్పుడు వేడ్క నద్దాశరథులు. 171

వ. ఇట్లు జటామకుటంబులు పూని రయ్యవసరంబున. 172

ఆ. నాకులంబువాఁడు వ్యాకులంబును జెందె, నాకులంబు గ్రోలి నాకు నేటి
పోక లనుచుఁ జింతఁ బొరలినగతిఁ బశ్చిమాబ్ధిఁ గ్రుంకెఁ బంకజాప్తుఁ డపుడు. 173

క. పటుతాండవోద్ధతమహా, నటరాజజటాకిరీటనవరుచు లిపుడో
క్కటి యగుచు వెడలె నా మి, క్కటమై సభ మెల్ల నరుణకాంతిఁ దనర్చెన్.

వ. తత్సమయంబున. 175

చ. జలములు గ్రోలి భర్మమయసౌధమునం గరకంకణంబు లు
జ్జ్వలతవముల్ చెలంగ మును జామురముల్ ధరణీజ వీవ ని
శ్చలగతిఁ బజ్వలించుగతి జానకిఁ గూడి వసించె మించు ద
గ్ధలను గిశోరపత్త్రముల బాగుగఁ దమ్ముఁడు సేయు పాన్పునన్. 176

వ. తత్సమయంబున. 177

క. కోదండ మెక్కువెట్టి ని, షాదాధిపసహితుఁ డగుచు సౌమిత్రి సమా
సాదితమానసమునఁ గా, పై దగ్గఱ నుండె నాత్రియామమువందున్. 178

క. అని గాధితనయసవహా, లనకాశలకోసలేయలక్ష్మణగుణస
ద్ఘన నిందుమౌళి యగరా, ట్తనయ కెఱింగించి మఱలఁ దలఁచెం బలుకన్. 179

వ. తదనంతరంబ. 180

చ. తలఁప నమానుషం బగువ్రతంబు ధరించి సుమిత్రపట్టి ని
శ్చలమతిఁ గొల్చె నింతయును జాలదె యాదొరవుల్ సుధామయో
జ్జ్వలకిరణాలిచే మిగులఁ జల్లనినిద్ర యొసంగువాఁడనం
చలఘుగతిం జనించె నస నాశశి కప్పుడెఁ దూర్పుదిక్కునన్. 181

వ. అప్పుడు కుశపర్యంకంబున నిద్రించు రఘుపుంగవుం గనుంగొని గుహుండు కన్నీరు
వెడల్చుచు వినయంబున లక్ష్మణున కిట్లనియె. 182

శా. కంటే లక్ష్మణ! యిమ్మహాభుజుఁడు నిక్కానన గుహాస్తీర్ణుఁడై
యుంటన్ గేకయపుత్త్రి జేసె నిటు లీయుర్వీశుసౌభాగ్యమున్
గంటంజూచి సహింపదయ్యెఁ ద్రిజగత్కల్యాణుఁడై యుండి యి
ట్లుంటం గల్గె విధాత్రుకృత్య మిలలో నొక్కండు దప్పించు నే!. 183

క. పవళించు నెవఁడు మణిమయ, భవనోత్తమమందు మృదులపర్యంకమునం
దవనిసుతఁ గూడి యిప్పుడు, కువలయపతి యుండినాఁడు కుశతల్పమునన్. 184

**గుహునికి లక్ష్మణుండు హితోపదేశము సేయుట.**

వ. అనుచుఁ జింతాభరంబునం బలుకు గుహునివాక్యంబులు విని లక్ష్మణుం డిట్లనియె.

చ. వినుము నిషాదవర్య! రఘువీరున కిమ్మెయిఁ గైక చేసె నం
చనవల దట్టు లన్న నొరు లొందురె కష్టసుఖంబు లీయ స
మ్మనుజాపురాకృతంబున సమస్తసుఖంబులు దుఃఖము ల్క్రమం
బునఁ జనుదెంచు మాన్పఁగను బోలునె పద్మజుకైన నిమ్మహిన్. 186

తే. మఱియు సుఖదుఃఖములొసంగ నొరులు గారు, ఒరులొసంగెదరను మాటచిఱుతబుద్ధి
యాత్మకర్తృత్వ మెల్ల వృథాభిమాన, మవనిఁదనకర్మసూత్రంబు దవిలియుండు.

వ. అదియునుంగాక తనచేత నొనరింపంబడు కర్మంబులెల్ల మిత్రామిత్రోదాసీనమధ్య స్థబంధుజనంబులయందు భావింతు రట్లుగాదు సుఖదుఃఖంబులం దెయ్యదియైన నెత్తెఱంగునవైనఁ దనకర్మవశంబులయి సంభవించిన నవియెల్ల ననుభవింపుచు నరుండు స్వస్థచిత్తుండయి యుండవలయు భోగాగమంబులయందును భోగవిసర్జనంబులయందును గాంక్షలేక లభించినను లేకయుండినను నీవు భోగవశుండవు గమ్ము. ఎద్దేశంబున నెక్కాలంబున నెవనికియైన నెవనిచేనైన నొనరింపంబడిన శుభాశుభకర్మంబు లనుభవనీయంబులుగాని వేఱొండుకాదు గావున నట్టివాటియందు హర్షవిషాదంబు లందుటఁ జాలు నింకఁ గమలాసనుచేత నెయ్యది విదితంబది దేవదానవులకయిన దాఁట నలవిగాదు సుఖదుఃఖంబుల నరుం డెల్లకాలంబు నరికట్టంబడు. పుణ్యపాపంబుల సుఖదుఃఖానుభవయోగ్యంబయి శరీరంబుపుట్టు రేయునుం బవలునుంబోలె సుఖంబు వెనుక దుఃఖంబును దుఃఖంబు వెనుక సుఖంబును జలకర్దమంబులభంగి సుఖంబునడుమ దుఃఖంబును దుఃఖంబునడుమ సుఖంబును జంతువులకు గడప నలవిగాక కలుగుచుండుఁ గావున విద్వాంసు లగుపురుషు లివ్విధంబున సకలంబును మాయ యని యెఱింగి ధైర్యవంతులయి యిష్టానిష్టాగమంబులయందు హర్షశోకంబుల నొందకుండుదు రని యిట్లు గుహలక్ష్మణులు భాషించుచున్నయెడ గగనతలంబు విమలంబయి. 188

తే. చాల తపముఁ బూని సంయమ్ముల్ వనముల, నిన్నుఁ గాంచ వేడ్క నున్నవారు
దర్శనం బొసంగఁ దగు రామ! యనీ మేలు, కొల్వ సనఁగఁ బగటివేల్పు వొడిచె.

ఒక గతినుంటను వనమున, నకుటిలసౌభాగ్యయుతున కనుక్రియఁ దాశా
నుకరము లీవీశాల నా, సుకరములయి మించె నచటి శుకపికరవముల్. 190

అంత మయూఖమాలి యుదయాచలమందునఁ దోఁప రామభూ
కాంతుఁడు మేలుకాంచి కులకల్పితకృత్యము లెల్లఁ దీర్చి ధీ
మంతు గుహుం గనుంగొని సమంచితమౌ నొకనావఁ దెమ్మనన్
సంతసమంది తెచ్చి రఘుసత్తముఁ గన్గొని భక్తితోడుతన్. 191

సీ. ఆరోహణము సేయు మవనీశ! యీనావయందు లక్ష్మణుఁడు సీతాంగనయును
గూడ మావారలతోడ నాయితుఁడనై నడపెద ననిన నప్పుడమిఱేఁడు
ముందఱ జనకునిముద్దుకూఁతురి నెక్కఁబనిచి తానును గుహుబాహుదండ
మూఁతగా నావపై నేతెంచె నిఖిలాయుధములతో సౌమిత్రి తత్క్షణమున
తే. నెక్కె గుహుఁడును దనదు పెంపెక్క విద్య, నేర్పునను బంధుసహితుఁడై నీటిమీఁద
సంబరవిహారులకు నద్భుతంబు దోఁప, నడపఁదొడఁగెను (నావఁ దా నడిగ నప్పుడు).
వ. తదనంతరంబున నాపోతంబు గంగామధ్యంబునకుం జనిన జనకజయు నప్పుణ్య
వాహినిం బ్రార్థించి. 193
తే. వందనం బిదె గంగాభవాని! యేను, రాఘవులు సౌఖ్య మొప్పఁ బురంబునకును
వచ్చితిమయేని మధుమాంసవస్తువులను, బలులఁ బూజింతు నని భక్తిఁ బలికె నప్పుడు.
వ. అంత. 195
క. నమ్మిన భవజలనిధితీ, రమ్మున మనుజాలను డించు రసికుఁడు వరకూ
లమ్మున డిగియెను సతితోఁ, దమ్మునితో గుహునితోడఁ దామరసాక్షీ!. 196
వ. ఇట్లు గంగావతరణంబుచేసి యవ్వల నరుగునవసరంబున గుహుండు రామచంద్రుం
గనుంగొని దేవా! భవచ్చరణంబులు చూడవచ్చెద నాజ్ఞ యిందు కాదేని ప్రాణం
బులు విడుతు ననిన సీతాపతి యిట్లనియె 197
క. పదునాలుగువర్షంబులు, చదిపి ధరాతలముఁ బ్రోవఁ జనుదెంతు నిజం
బిది రాముఁ డొండుపల్కఁడు, ముదమునఁ జను మన నిషాదముఖ్యం డప్పుడున్.
వ. విషాదం బందుచు నిజమందిరంబునకుం జనియె నంత రాఘవు లచ్చోట నొక్క ప
రిశుద్ధం బగుమృగంబు నేసి పక్వంబుచేసి హవ్యవాహనునం దాహుతి యిడి శేషంబు
గుడిచి యువ్వగను వృక్షతలంబున సుఖలీల నారేయిఁ గడపి యంత మఱునాఁడు
రామచంద్రుండు సుమిత్రాసుతసీతాసమేతంబుగ భరద్వాజాశ్రమంబునకుం జని
బయుల నిలిచి యొక్కవటుం గాంచి. 199

## శ్రీరాముఁడు భరద్వాజాశ్రమంబున కేఁగుట.

ఉ. ఓ మునిపుత్త్ర! నీవు చని యొప్పఁగ మీగురువర్యుతోడ శ్రీ
రాముఁడు దర్శనార్థము ధరాతనయానుజయుక్తుఁడై బహి
స్సీమను నిల్చినాఁ డనుచుఁ జెప్పు మనం జని యావటుండు శ్రీ
రామముఖోదితంబులు కరంబులు మోడ్చి యెఱుంగఁ బల్కినన్. 200
వ. విని తోడనె లేచి యర్ఘ్యపాద్యంబులు చేఁబూని రామునమీపంబునకుం జనుదెంచి
యథాన్యాయ్యంబుగఁ గాంచి ససీతాలక్ష్మణుండగు నప్పుణ్యుం బూజించి యి
ట్లనియె. 201

క. మాపర్ణశాల కిటు నీ, తాపతి! చనుదెమ్ము దేవతలు వెదుకఁగ నా
నీపాదయుగపరాగము, చేఁ బావనములుగఁ జేయు సిద్ధాశ్రమముల్. 202

క. అని కుటజసమీపమునకు, జనకతనయతోడ రామసౌమిత్రులఁ దో
డ్కొని వచ్చి సేయఁదగుపూ, జనములు గావించి వినయసంభాషణలన్. 203

వ. భరద్వాజమునీంద్రుం డిట్లనియె. 204

సీ. భవదీయసంగమభాగ్యంబుచేత సంతీంబు గాంచితి నాతపంబువలన
నీయుపాసనచేత నాయొద్ద విజ్ఞానదృష్టి గల్గును గాన దేవదేవ!
మును నీవు కమలగర్భునిచేత నుతిగాంచి జనియించుటలు నేఁడు వనమునకును
జనుట నీ వొనరించు పనియును నేఁ దెలియుదు నతిమాయుఁడవుఁ బరమాత్మ వీవు

తే. ఇంకమీఁదటఁ బల్కంగ నేల యేను, గడుఁ గృతార్థుండ నిలమాయకంటె వేఱ
యైన కాశత్స్వపురుషునిఁ గానఁగల్గెఁ, గనుఁబడుండువుగాఁగ నిన్నొనలందు. 205

మ. అనినన్ రామవిభుండు కేల్మొగిచి మీ రగ్గింప నే నెంతవాఁ
డను భూపాలకమాత్రుఁడన్ గరుణఁ జూడం బోలు నం చాశిషన్
మునిసాన్నిధ్యమునందుఁ బుచ్చి కమలాప్తుం డంతఁ బూర్వాద్రిఁ దో
చిన మేల్కాంచి కులోచితక్రియలు దా శీఘ్రంబు గావింపుచున్. 206

క. సీతాలక్ష్మణయుతుఁ డయి, యాతపసి వనంబు వెడలి యమునానది సా
కేతపతి మునితనయకృ, పోతముచేఁ గడచి వారు పొమ్మను త్రోవన్. 207

క. చనిచని యయ్యెడ వాల్మీ, కునివాసం బంటి చిత్రకూటప్రాంతం
బున నేఁగుచు ముందఱఁ గనుఁ, గొనియెన్ గౌసల్యముద్దుకొడుకు తపోవనమున్.

వ. అట్లుకాంచి 209

తే. సత్త్వసహితంబు మునిజనసంకులంబు, సలిలఫలపుష్పశుకపికకలితవాను
లూరుభవపుణ్యవాసంబుఁ జేర నరిగి, యమ్మునికి మ్రొక్కె సతితోడఁ దమ్ముతోడ.

వ. అంత వాల్మీకి ముందఱ. 211

సీ. రాము రమానాథు రాజీవదళనేత్రు భవపాశహరు జటాభారధరితు
నాదిత్యకుఁవర్యు నప్రమేయు విశుద్ధు జానకీలక్ష్మణసహితు నభవు
సర్వభూతహృదంబుజస్థితు శృంగారమహితాపయుష్య సనామయు సుశాంతు
ధర్మమార్గు వినిర్జితక్రోధు యోగమాయామనుష్యుని గాంచి యతిముదమునఁ

తే. జేరి విధిపూర్వకంబుగ 'గౌరవించి, భువనసంపూజ్యు నప్పూజ్యుఁ బూజచేసి
ఫలము లాతిథ్య మొసఁగ నప్పరమమౌని, గాంచి కరములు మోడ్చి రాఘవుఁడు పలికె.

క. మునివర! జనకుని పనుపున, జనుదెంచితి మిచట సౌఖ్య సంవాసం బా

వనమొకటి చూపుఁ డతివయు, ననుజుఁడు నేఁ గొంతకాల మనిచెద మచటన్.

వ. అనిన దాశరథివినయోక్తులకుఁ జిఱునగవుతోడ వాల్మీకిమునీంద్రుం డిట్లనియె

చ. వనజదళాక్ష! నీ కిది నివాసముగా నిది యంచు బల్కఁ నేఁ
జనుదునె సర్వభూతముల సంభరితుండవు సర్వమున్ భవ
త్తనువున నుండు నైన (నుచితం) బగు మందిర మేను బల్కెదన్
వనితయు సోదరుండు గొలువ న్నిలు మచ్చట నన్న వేడుకన్. 215

సీ. భవదీయమంత్రంబు పఠియింతు రెవ్వరు నిర్ద్వంద్వులును సర్వనిస్పృహులును
శరణంబొచ్చినవారు సమముగాఁ గనకలోష్టములు దల్చెడువారు శాంతమతులు
ప్రియముచేపడిన నప్రియముగల్గిన సర్వమును మాయ యని భ్రాంతిఁ గననివారు
పరమాత్మయందు షడ్భావము ల్లేవని తనువున నగు నని తలఁచి ప్రాణ

తే. బుద్ధిచే (భయసుఖదుఃఖములు) నటంచు, రూఢిసంసారధర్మనిర్ముక్తులైన
యనఘు లెవ్వరు వారిచిత్తాంబుజములు, సదనములు నీకు సంపూర్ణచంద్రవదన!.

తే. మనము బుద్ధియు నీయందు నునిచి పుణ్య, పాపములు వీడి సంతసపడుచు భూత
హితము సేయుచు నుండు యతీశచిత్త, జలరుహంబుల వసియింపు గొలువుదీర. 217

వ. మఱియును. 218

తే. అమలుఁ జిద్ఘను సకలగుహాశయస్థు, సర్వగతు ముఖ్యు నిర్లిప్తు సార్వభౌము
విమలమతి నెప్డు నిన్ను భావింతు రెవరు, వారిహృదయంబునను నిల్వు వారిజాక్ష!.

క. సతతాభ్యాసదృఢీకృత, మతియుతుల భవత్పదాబ్జమగ్నత దూరీ
కృతకల్మషుల మనంబుల, సతతము వసియింపు సీతసతిఁ గూడి నృపా!. 220

తే. రామ! నీనామమాహాత్మ్య మేమనంగఁ, దగు మహాఘచయంబులఁ దలఁగి యేను
బ్రహ్మఋషి నైతి నీనామభజనచేత, నద్భుతము విను నాదువృత్తాంత మెల్ల. 221

సీ. విప్రాన్వయంబున వెసఁ బుట్టుటయె కాని ప్రబలశూద్రాచారరతుఁడ నగుచుఁ
బలుకిరాతులఁ గూడి మెలఁగి యొక్కకిరాతసతియందుఁ బలువుర సుతులఁ గాంచి
వారలఁ బోషింపఁ బోయలతోఁ గూడి చేత నమ్ములు పట్టి భూతములకు
నంతకోపముఁడనై వ్యవహరింపుచు సూర్యసంకాశమగు ఋషిసప్తకమును

తే. ఘోరకాననమునఁ గాంచి దారి గట్టి, యెదిరి పోకుం పోకుఁడం చేను బల్క
నందఱును గాంచి యోరి పాపాత్మ! యేల, నీవు నోడిగట్టితివి ముట్టి నీచమునను

తే. అనిన నేనును బుత్త్రదారావనమున, కిట్లొనర్చెద ననినఁ వా రిట్టు లనిరి
నీ వొనర్చెడు పాపంబు నీకుటుంబ, మనుభవించునొ యడిగి ర మ్మంతవట్టు 223

క. ఏ మిచ్చట నిల్చెద మన, నామెయిఁ జని వారి నడుగ నఘమున కేమం

గాము ఫలంబున గనినను, నామది సంజాతవేదనం బొరలుటయున్. 224

వ. కరుణాపూర్ణమానసులగు సప్తమహామునులున్నయెడకుం జనుదెంచి వారలదర్శనంబున శుద్ధాంతఃకరణుండనై శరాసనాదులు వర్జించి నిరయార్ణవంబునం జను నన్నుం గావుం డనుచు నమ్మహాత్ములచరణకమలంబులం బడిన వారునుం గరుణించి. 225

తే. లెమ్ము సత్సంగమమ్ము శుభ మ్మొసంగు, నించుకంతయు నుపదేశ మిత్తు మందు
నచ్యుతంబగు పదవి నీ కబ్బు ననుచు, నొకరి కొక రిట్టు లనుకొని రకుటిలముగ.

క. క్రూరుండయినను శరణని, చేరిన రక్షింపవలయు శ్రీహరిపదముల్
జేరిచి యని నీనామం, బో రామ! మరా యటంచు నొసఁగిరి కరుణన్. 227

వ. ఇట్లు వ్యస్తాక్షరపూర్వకంబును భవతారకంబును నగు నీనామం బేకాగ్రచిత్తంబున నేము వచ్చునంతకు జపియింపు మండు మనుచు దివ్యదర్శనులగు నమ్మును లంతర్ధానంబుచేసి రదిమొదల నేనును బాహ్యంబు మఱచి యొక్కటయిన మానసంబున జపియించుచుంటి నిట్లనేకకాలంబు సర్వసంగవిహీనుండనగు నాదుపైని వల్మీకంబు పెరిఁగె నంత యుగసహస్రంబునకు మఱల నమ్మహాత్ములు చనుదెంచి నన్నుఁ జీరిన. 228

సీ. మంచులోనుండి యేతెంచుసూర్యునిభంగి నాపుట్టవెడలి నే నరుగుదేర
ననుఁ గాంచి మౌను లిట్లనిరి మునీశ్వర! నీకు నామంబు వాల్మీకి యనఁగ
వల్మీకముననుండి వచ్చుట రెండవజన్మం బటంచు స్వేచ్ఛను విహాయ
సమున నేఁగిరి రఘుసత్తమ! నీనామమాహాత్మ్యమున నిట్లు మౌని నగుచు
తే. నేఁడు గనుఁగొంటిఁ దమ్మునితోడఁ బొలఁతి, తోడఁ గోదండశరములతోడ మాయ
తోడఁ గైకొన్నపరమూర్తితోడ సడవి, కరుగుదెంచిన పుణ్య శ్రీహరి మహాత్మ.

వ. మఱియును. 230

## శ్రీరాముని వాల్మీకి స్తుతియించుట.

సీ. విమలసారసనేత్రు శపదమోజ్జ్వలు నాద్యు నాద్యంతరహితు నవ్యక్తు నిత్యు
నిర్వికల్పుఁ జిదంశు నిర్ముక్తబంధను నిర్మలు నిష్క్రియు నిర్వికారు
శ్రీనివాసు ననంతుఁ జిద్ఘను నచ్యుతు నిరుపద్రవు నిరీహు నిరుపమాను
శ్రీశు సదాశివసేవ్యు నిరాభాసు నభవు నిరాకారు నమలు నిన్నుఁ
తే. గాంచితిని రామ! మోక్షంబుఁ గాంచితిపుడు, సందియమ్ములేదొకప్రదేశంబు నీకుఁ
జూపెదను రమ్ము మన రామభూపవరుఁడు, సమ్ముదంబున నావనస్థలము వెడలి. 231

వ. సీతాలక్ష్మణులును మౌనియుఁ దచ్ఛిష్యగణంబులును దోడరాఁ జని గంగాపర్వత మధ్యంబునఁ బూర్వపశ్చిమంబులుగా విస్తీర్ణంబులగు రెండు పర్ణశాలలు వాల్మీకి సంయమి సేయింప శోభనంబగు తన్మందిరద్వయంబున. 232

శా. సీతాలక్ష్మణయుక్తుఁడై రఘుకులశ్రేష్ఠుండు వాల్మీకి వి
ఖ్యాతి న్నిత్యము సేయు పూజనముచే నానందుఁడై సిల్చె గం
గాతీరంబున వజ్రహస్తుఁడు శచీకాంతాయుతుండై సుర
వ్రాతం బెల్లెడఁ గొల్వ నాకమున శ్రీ రంజిల్లుచందంబునన్. 233

వ. అనుచు. 234

తే. ఇవ్విధంబున నారాఘవేశుఁడభ్ర, సదృశగాత్రుండు జనకాత్మజాకళత్రుఁ
డలరు నని శైలసుతతోడ నంతమీఁది, కథఁ దొడంగెను బల్క గంగాధరుండు.

వ. అంత నిచ్చట. 236

సీ. ఖరకరుం డస్తాద్రిమణుఁగున నేఁగ నత్తఱి మంత్రి సాకేతపురముఁ జేరి
వసనంబు మోముపై ముసుఁగిడి కన్నీరు నించుచు శరదంబు నిలిపి రాజ
గనుఁగొన లోనికిఁ జని జయశబ్దపూర్వకముగఁ బొగడుచు వందనంబు
గావింప నామంత్రిఁగనుఁగొని విహ్వలుం డగుచు సుమంత్రి!మాయయ్య రాముఁ
తే. డెచటఁ దమ్మునితోఁ దనయింతితోడ, నుండె నెచ్చట డించితి వోయి నను
రాముఁ డేమనె నేమనె రాముతమ్ముఁ, డలసి సీతయు నేమనె పలుకు మయ్య. 237

వ. నిర్దయుండును బాపాత్ముండును నగు నాతోడ నేమని పల్కుమని రనుచు నాఁపఁ
దగని దుఃఖంబున దశరథుండు. 238

క. ఓరామ! యోగుణాకర!, శూర! ధనుర్వేదనిపుణ! సుకుమార! కృపా
ధారక! భావజ్ఞ! సదా, చార! లక్ష్మణకుమార! చను నే విడువన్. 239

తే. నీతివిస్తారులార! మన్నింపుమాట, లాడు బంగరుబొమ్మ! సీతమ్మ! మీర
లిపుడు మృతినొందువాఁడ నై యింటనున్న, నన్నుఁగన్గొన రాకేమి యన్నలార!.

వ. అని విలపించుచు మిక్కిలి దుఃఖసాగరంబున మునింగిన భూవిభుఁ గనుంగొని
సుమంత్రుఁడు ప్రాంజలి యై యిట్లనియె. దేవా! రామచంద్రుని సీతాలక్ష్మణుల
తోడ నరదం బెక్కించుకొని శృంగిబేరపురసమీపంబున వలరు గంగాకూలంబున
డించితి నాఁటిదినంబున గుహుఁడు ఫలాదికంబులుఁ గొనివచ్చిన ముదంబంది కరం
బుల నంటి యారగింపక విడిచె నంత గుహుని చేత వటక్షీరంబు దెప్పించి జటామ
కుటంబుఁ బూనుచు వికసన్ముఖుం డయి నన్నుం గనుంగొని. 241

చ. జనకునితోడఁ జింతిలుము సైఁపగు మమ్ముఁదలంచి యంచు ని
వ్వనమున సౌఖ్య మెక్కుడు భవత్పురికన్న నఖండమ్ముఁ బల్కు మ
జ్జననికి మ్రొక్కి పల్కుమనె జానకి యంత నమస్కరించె నం
చను మనె రాముఁ జూచుచుఁ గుచాగ్రపరిస్రుతవారిధార యై. 242

వ. వృద్ధుండును శోకపరిప్లుతుండును నగురాజు నూరడింపు మనుచు నాతోడ మఱిమఱి పల్కుచు నావపై నెక్కి యంత నేనును గంగాపరికూలంబు వార లంతవట్టుకుఁ జేరుగు రంతవట్టును నిలిచి యధికంబగు దుఃఖంబున మఱలి యింటికిఁ జనుదెంచితి ననిన నమ్మాటలకు విలపించుచుఁ గౌసల్య పఙ్క్తిరథున కిట్లనియె. 243

మ. ప్రియకాంతామణియైన కైకయికయిం బ్రీతిం బ్రభుత్వంబు సం
తయుఁ దత్పుత్రున కిచ్చి చాలక యు కాంతారంబులఁ జొన్పి తెం
తియు మారాముని నాఁడు లేక పిదపం దవ్వైన నేఁడేమి యి
ట్టియుపాయంబు బది చెప్పఁబోలుఁ దగుబోటిం గూర్చి నాథాతియున్. 244

క. అని పల్క ననితకుతమున, నయ్యును దరికొల్పినట్లు నతిదుఃఖమునం
జనపతి పల్కెను జనునే, వనితా! దుఃఖింపవాని నంచన సేయన్. 245

దశరథుఁడు బ్రాహ్మణశాపప్రకారంబు కౌసల్యకుఁ దెల్పుట.

వ. ఇంక నాదు ప్రాణంబు లుత్క్రమించు సంశయంబు లేదింతకుఁ బూర్వవృత్తాంతం బొక్కటి యీసమయంబున స్మృతిగతం బయ్యె నెట్లనినఁ దొల్లి యౌవనసమయంబునఁ జాపబాణధరుండనై వేఁటమీఁది యాసక్తిచేత వనములవెంట మహామృగంబుల సంహరింపుచు నొక్కయెడ నర్ధరాత్రంబున మునికుమారుండు పిపాసాపీడితులగు జననీజనకులకు జలంబులుగోరి సరోవరంబున ఘటంబు ముంచినఁ దచ్ఛబ్దంబు విని యేనుంగు నీరు ద్రావెడు నని కోలందీసి రాత్రియందు శబ్దవేదకౌశలంబున విడిచి నంత. 246

క. అకటా! కూలితి నట మా, యమ్మకు నయ్యకు నెంతి మదిఁ గుందెదరో
యొకరికిఁ గీడొనరింపని, యకుటిలునను బట్టి మదిని మనుజుఁడు లిఖించెన్. 247

వ. అనుచు మనుజు నెలుంగు చెవిం బడిన భీతుండనై మెల్లఁ దత్పార్శ్వంబునకుం జని దశరథుండ నెఱుంగమి నేసితి స్వామీ! క్షమింపు మనుచుఁ జల్లనిమాటల వడుగులం బడిన మునిపుత్త్రిండును 248

సీ. ధరణీశ! భయము నొందకు బ్రహ్మహత్య నిన్నంటదు, వైశ్యసంయమిని; నాకు
నెదురులు చూచుచుండెదరు మాతలిదండ్రు లాఁకటం దప్పికి సలసి వేగ
పోయి వారికి జలం బొసఁగుము లేకున్న నాతండ్రి కోపం బొసర్చి నిన్నుఁ
గోపంబుపుట్టిన: వేపొమ్ము జలమిచ్చి వారికి మ్రొక్కి యీతీరునను
తే. పెరుకు బాణంబు ప్రాణముల్ గదలుచున్ వేగ, నటుల దేహంబువలన సాయకము పెరికి
జలఘటముఁ గొంచు నా దంపతులు వసించు నాటజంబునకేఁగ సుతుఁడు రాఁకుండుటకును.

వ. మిక్కిలి విచారంబున. 250

తే. ఎంత తడవయ్యె మనసుతుం డేఁగి రాని, కారణం బేమి వేఱొక్క గతియు లేని
వృద్ధులను మందదృశులను విడుచు వనఁగ, వలదు భక్తుండు వాఁడేమి వనటఁబడెనొ.

వ. ఇట్లు తెరువుచూచుచు నేను జనుదెంచు చప్పు డాలించి తనయుం డనుకొని నంద
నా! నీవింత తడవుచేసిన మాను దిక్కెయ్యది జలములు దెమ్ము ద్రావెద మనిన
నేనును మెల్లన చని వారిపాదంబులకు మ్రొక్కి వినయాన్వితుండ నై. 252

సీ. తనయుండఁ గా నయోధ్యకు నాథుండ నజ్ఞ రఘుఁడ వేఁటాడఁగ రాత్రియందు
జలములచేరువ నిలిచి తజ్జలగతి విని శబ్దవేధిక్రమమున
నంబకం బేసిన 'హా హతోస్మి' యటంచు మనుజాధ్వని మొఱంగ విని భయమునఁ
బఱచి యచ్చోట జలవిహారియంబఁబడిపడియున్న మీసుతుఁగాంచి నన్నుఁ గావు

తే. మెఱుఁగమి నొప్పితి నటంచు జనకుఁడు మున్ బట్టుకొని నను గరుణ మీపట్టినన్ను
వెఱవకుము బ్రహ్మహత్య నిను బొంద దనుము జలముగొని చనుమని యెమీసముఖమునకు.

వ. ఇట్లు శీఘ్రంబ మజ్జననిజనకులపజ్జఁబు లొసంగి నమస్కరించి వేఁడుకొను
మునిసుతునిహింసకుండ నరుదెంచితి శరణాగతుండ నగుదు మీరు దయాళులు
రక్షింపవలయు ననిన వారును బెగ్గిలి యనేకవిధంబుల విలపింపుచు నన్నుం గనుం
గొని యక్కుమారుసమీపంబునకుం గొనిపొమ్మనిన నేను నట్ల సేయ నావృద్ధదంప
తులు తమకుమారుదేహంబు స్పృశియించి బహువిధంబుల విలపింపుచు 254

క. ఓతనయ! మమ్ము వృద్ధుల నితెఱఁగున విడువందగునె యేతెంతుము నీ
తో తీవ్రము యని చితి సం, జాతిం బొనరింపు మనిరి సయ్యన నాతోన్ 255

ఉ. ఏ నటు సేయ నంత జగమఁడిచెంపుమ నాకు నుంది రా
సూనుసితోడ నగ్నిఁబడి సౌఖ్యము; సొక్కుడు వేళ నీకు ని
ల్లాను దనూజదుఃఖమున నంతము నొందెద వంచుఁ బల్కి న
న్నాని; తటస్థ మయ్యె నిద మాకు వేళ యపారితంబుగన్ 256

వ. అనుచు దశస్యందనుఁ డధికశోకంబు 257

సీ. ఓరామ! గుణధామ! యోరత్నగుణధామ! యోమహీతనయ! మీతండ్రికిలేమిఁ
గైకయీకృతనిశ్చయకంటకంబు సొలైతి నని పల్కి దశరథావనివిభుండు
ప్రాణముల్ విడి విష్ణుపద మొందె నప్పుడె హాహారవంబులు నచటి రాజ
సతులును మఱియుఁ గౌసల్యాసుమిత్రలు భువి నుఱస్తాడనపూర్వకముగ

తే. రోదనము చేసి రంత సూర్యోదయమున, నా మునిసం వసిష్ఠముని మంత్రిసహితుఁడగుచు
వచ్చి దశరథుతనువు తీర్పంబ తైల, భరితముగఁ ద్రోణమున నుంచి భటులఁ బిలిచి.

వ. మీర లాశ్వికులై యుధాజిన్నగరంబునకుం జని యచ్చట శత్రుఘ్నసహితుండై

శ్రీమంతుఁడగు భరతుఁ డున్నవాఁ డమ్మహీశుతోడ జననీజనకులం గనుంగొన
నయోధ్యకు రావలయునని యేను బల్కితి ననుచు నెఱుకసేయుం డనిన వారును
సత్వరంబునం జని భరతమాతులుండగు యుధాజిత్తునకుం బ్రణమిల్లి శత్రుఘ్నస
హితుఁడై భరతుఁడు దశయుకి యయోధ్యానగరంబునకు రావలయునని వసిష్ఠము
నీంద్రుఁ డాజ్ఞయొసంగె ననిన నమ్మాటలు విని భరతుఁడు భయవిహ్వలుఁడై
శత్రుఘ్నుం దోడ్కొని యాభటులతోడ వెడలి. 259

## భరతుఁడు కేకయపురంబు వెడలి యయోధ్యకు వచ్చుట.

ఆ. రామునకును లేక రాజునకుఁ గీడు, మొకటి యచటఁ గల్గనోపు ననుచు
మార్గమందు ఖిన్నమానసుఁడై వచ్చి, విరహితోత్సవంబుఁ బురముఁ గనియె 260

వ. ఇట్లు జనసంభ్రమవర్జితంబును భ్రష్టలక్ష్మీయు నగుసాకేతపురంబు గాంచి చింతా
పరుఁడై రామలక్ష్మణవిరహితం బగునాపురికోటలోనికిఁ జని యొక్కరాజసదనం
బుఁ జొచ్చి యందు నొంటిగాఁగూర్చున్న కైకేయిం గనుంగొని మాతృభక్తితత్ప
రుఁడై యాపెచరణంబులకు శిరంబు దగుల నమస్కరించిన నద్దేవియుఁ బ్రేమసం
భ్రమంబులతోడఁ దనయుం గ్రుచ్చియెత్తి యాలింగనం బొనర్చి తొడలమీఁద
నిడుకొని శిరంబు మూర్కొనుచు. 261

ఆ. తనయ! కుశలు లగుచుఁ దనరదరె నాదు, తల్లిదండ్రు లిపుడు దైవగతిని
కుశలి వగుచు వచ్చి కూర్చున్న నిన్నుఁ గంటి, ననిన దూయమాన మైనమతిని 262

వ. భరతుం డిట్లనియె. 263

మ. జననీ! యొంటిగ నుంటి వేమి రఘువంశశ్రేష్ఠుఁ డెందుండె ని
న్ననిశంబున్ విడి నిల్వఁ డొక్కడను నేఁ డిబ్భంగికిం దుఃఖమున్
ఘనమౌ భీతియుఁ బుట్టు నన్ను భరతున్ గల్యాణచింతారతున్
మునిసంభావితసత్యమార్గనిరతున్ ముంజేత నూరార్చుచున్. 264

క. కైకేయి యిట్లనియె. 265

సీ. హయమేధయాగాదు లాచరించినవారు ధర్మశీలురు నేపథంబుఁ గాంతు
రాపథం బందె మీయయ్య యన్నను శోకముస్ప్రాలి లేచి యోజనక! రాము
నకు నైన జననికైనను నొప్పగింపక వృజినార్ణవంబున విడిచి యెంతఁ
బోయితి వని యగముడి వీడ నిలఁ బడ నిజనందనునిఁ గాంచి నేత్రజలముఁ

తే. తుడిచి కూర్చుండఁబెట్టి నీకడకు సకల, మేను సమకూర్చితి నొకింత యొఱుంగ కేల
దుఃఖ మొందెద వనఁ దల్లితోడ భరతుఁ డనియె మృతివేళఁ దండ్రి యేమనియె ననుచు.

వ. ఇట్లడిగిన భయంబులేక కైక యిట్లనియె. 267

క. నందననీజనకుఁడు రఘు, నందను లక్ష్మణుని జనకనందనను మనం

బందుఁ దలంచి విచారము, నంది సురేంద్రాలయమున కనుగమించెన్. 268

వ. అనిన జననీ! రామచంద్రుండు సన్నిధిలేకుండుటలేమి? లక్ష్మణుండు సీతయు నప్పు
డెచ్చటికేఁగి? రనుచుఁ దగనిదుఃఖంబున నడిగినఁ గైక మఱల నిట్లనియె 269

సీ. యౌవరాజ్యంబు మీయయ్య రామున కివ్వ సంభ్రమం బొనరించు సమయమందు
నడ్డమై యే విఘ్న మాచరించితి నీకు రాజ్యంబు సమకూర్ప; రాజు మున్ను
వరదుఁడై నా కిచ్చె వరయుగం బవిరెండు వలయునప్పు డొసంగ వలయు నంటి
సమ్మతి యనె నంచు సకలరాజ్యంబు నీ కిచ్చుట యొకటి సీతేశు నడవి
తే. యందు మునివృత్తి నుండఁగ ననుపు టొకటి, యనిన సత్యపరుం డా రాజగుట నీకు
రాజ్య మొసఁగెను గానకు రాముఁ బనిచెఁ, దండ్రి మాటకు దాఁటక దాశరథియు

క. వనమునకుఁ జనియె మునియై, ఘనపాతివ్రత్యధర్మగరిమ జనకనం
దనయు వెడలె సౌమిత్రియుఁ, దనయన్నకు సేవ సలుప దానుం జనియెన్ 271

ఆ. వనమునకుఁ జనంగ వారలఁ దలపోసి, రామ! రామ! రామ! రామ! యనుచు
వగచి వగచి మేను వదలి మీతండ్రి దా, ననుగమించె దివికి ననిన నపుడు. 272

వ. వజ్రాహతం బగు మహీజంబు చందంబున నిస్సంజ్ఞుం డై నేలం బడిన దుఃఖితుఁ డై
కేకయరాజనందన మఱల నిట్లనియె. 273

సీ. ఇల నీకుఁ బాలింపఁ గలుగంగ దుఃఖింప నవసరమా నందన! పైఁపు మనసు
దహియించుగతిఁ దనతల్లిఁ గని యోపి! భాషింపకుండు నీపాపగర్భ
మందుఁ బుట్టుటచేత నధికపాపాత్ముఁడ నైతిఁ గుంభీపాక మందఁగలవు
భర్తృఘాతిని వైన పాపాత్మి వేనును గరళంబుచే నైన ఖడ్గధార
తే. నైన శమనాలయంబున కరుగువాఁడ, ననుచుఁ బోనాడి కౌసల్య సరియఁ జనిన
నాపె యెలుఁగెత్తి యేడ్చుఁ దదంఘ్రియుగము, మీఁద భరతుండు పడిచేసె రోదనంబు.

వ. అప్పుడు సాధ్వియు యశస్వినియు నగు నారామజనయిత్రి భరతుం గౌఁగిటం
జేర్చి దన్నివమేనును వాడినవదనంబును వడంక నశ్రుజలంబులు నించుచు నిట్లనియె.

తే. తనయ! దూరంబునకు నీవు చనిన నింత, యయ్యె మీతల్లి చేష్టితం; బంత యాపె
వలనె యెఱింగితివి వేఱె పలుక నేలఁ, దరగఁ దెన్నటి కీదుఃఖభరము నాకు. 276

మ. నను దుఃఖార్ణవమందుఁ ద్రోచి జడలున్నారల్ శరీరంబునం
గునఁ దా దాలిచి కాయ లాకులను దృప్తిం దౌచు సౌమిత్రియుం
జనకక్ష్మావరపుత్రి తోడరుగ రాజశ్రేష్ఠుఁ డిక్ష్వాన్వయుం
బునకుం గేటువు రామచంద్రుఁ డరిగెం బోరానిశైలాటవిన్. 277

తే. అనుచుదూర్వాదళశ్యాము నఘువిరాము, రామమదిలోనఁ దలఁచి యోరామ! సుగుణ

ధాను! నాయందు దయ చేసితనయుఁడవు గాఁ, బరఁగి వాఁడవు తత్త్వరాత్పరుఁడవయ్యు.
వినను నను దుఃఖము విడి. పోనేరగు విధిని దాఁటఁబోల దెవరికిన్
హోనందన! యా భూస్థలి, పైనిం బడ నడుగు లొత్తి భరతుం డప్పుడున్. 279

జనని! నావచనం బసంశయంబుగ నమ్ము శ్రీరాముపట్టాభిషేక వేళఁ
గైకయి సేయువిఘ్నం బెఱింగిన నట్లు సేయుంగ బనిచినఁ జెంగు నన్ను
బ్రహ్మహత్యాశతోద్భవమహాఘంబును భార్యాయుతంబుగ బ్రహ్మపుత్త్రి
డగు వసిష్ఠుని కింత మసిధారఁ దెగ వ్రేయు పాతకంబు నటంచు భరతు డేడ్వఁ
దొడఁగినను బుత్త్రీశోకదుఃఖ మొంగుచున్నకల్మషుం డైన పల్కె నవల వసిష్ఠుండు భరతుఁ
డరుగుదెంచుట విని మంత్రివరులఁగొనుచు, వచ్చి భరతుని శోకవిహ్వలునిఁ గాంచి.

సాదరంబుగ నిట్లనియె 281

కనుఁగొనఁ బెద్దయైహికసుఖంబుల దృష్టి వహించె జ్ఞాని యై
దనరెఁ దురంగమేధముల దక్షిణలన్ ధరణీన్ సురావళిన్
దనిపెఁ దనూజుఁగా హరిని దాఁ గనె నంతవ నన్ సుధర్మయం
దనఘ! సురేంద్రుతో నిలిచె నట్టి మహాత్ముని గా లనింతురున్. 282

మఱియు నశోచ్యంబును మోక్షసాధనంబును నగు తెఱంగున నేల యూరక వగ
చెద వాత్మ నిత్యుండు నవ్యయుండును నిర్మలుండును జన్మనాశనవివర్జితుండును
నిర్వికారుండును నిరాకారుండును సుప్రకాశుండును నిరంజనుండు నగుం బరఁగు
శరీరం బంటివేని జడంబు నత్యంతాపవిత్రంబును వినశ్వరంబు నగుఁ గావున
విచారింప శోకంబున కవకాశంబు గనుపడదు కొందఱు జనుండైన నందనుండై
నఁ దమవారు మృత్యువశులైరేని మూఢులగువారలు స్వాత్మతాడనపూర్వకంబుగ
దుఃఖింపుదు రది పల్కనేల యిట్లగుట నిస్సారం బని సంసారంబున వియోగబుద్ధి
గలుగు నవ్వైరాగ్యహేతువును శాంతిసౌఖ్యంబునుం గల్గఁజేయు నది యెట్లనుడు 283

ఆ. జన్మవంతుఁడైన జనునకు మృత్యువు, దండ యగుచు వెంట నంటియుండుఁ
గాన జననమందు వానికిఁ దప్పదు, మృత్యు వర్కవంశ మేదినీశ! 284

వ. మఱియును. 285

చ. జనములకుం బురాకృతవశంబున సంభవనాశముల్ దలి
ర్చును గుణవంతులైనఁగి శోకము నేక్రియఁ గాంచు రెవ్వరై
నను మృతిఁబొందు వేళ? నొకనాఁ డవి పల్కఁగఁబోని దాయు వే
దనమునవో నశించుటలు దివ్యము నాహరిమాయ నిట్టియున్. 286

స్పృష్టులు గడచె సాగరంబు లనేకంబులు శోషించెనవి యాతీరున నగుచుండఁ గద లెడు తామరతేకున నంటిన జలబిందువుమాడ్కి నిమిషభంగురంబు లగు దేహంబులం బల్కనేల వెండియును. 287

ఉ. జీర్ణపటంబు వీడి నవచేలము దాల్చినభంగి దేహియుం
జీర్ణశరీరము న్విడిచి చేకొను నూతనదేహ మాత్మ సం
పూర్ణుఁ డుహాని వృద్ధులను బొందఁడు పుట్టఁడు చావఁ డిట్టిస
న్నిర్ణయవాక్యముల్ మదిని నిల్పి యొనర్పుము తండ్రికిం గ్రియల్. 288

వ. మఱియు షడ్భావవిరహితుండును సనంతుండును సదాస్థితుండును సత్యజ్ఞాన విగ్రహుండును నానందరూపుండును బుద్ధ్యాదులకు సాక్షియు లేపవర్జితుండును ముఖ్యుండు నద్వితీయుండును సదాస్థితుండును బరమాత్మయు నగు నాత్మ నివ్విధంబున నెఱింగి తైలద్రోణిచఁనఁ బిత్రుదేహంబు వెడలించి సచివయుక్తుం డవై యేమునంగూడ శాస్త్రాన్యాయంబుగఁ గృత్యంబు సేయు మనిన నద్దేశికోత్తము పలుకులవలన నజ్ఞానజంబగు శోకంబు విడిచి భరతుండు వసిష్ఠోక్తప్రకారంబున మంత్రిసచివపరివారుం డై. 289

భరతుండు దశరథున కగ్నిసంస్కారాదిక్రియలు చేయుట.

తే. తైలమునఁ గల్గుదశరథతనువు దిగిచి, యాహితాగ్నికి నొనరించునట్లు దహన
కర్మ మొనర్చి పదియు నొక్కటియు నైన దినములను విప్రతతికిభోజనములొసఁగి

చ. మఱియు ధనంబులు న్మణులు మౌక్తికముల్ వివిధాగ్రహారముల్
వరవరుసేగ భూసురజనంబుల కిచ్చి సమస్తలోకవి
స్ఫురదురుకీర్తి భానుకులపుంగవుఁ డామునఁ బరేశు దివ్యనుం
దరతరుణార్క తేజు ఘనతారణు నెన్నుచు నుండె నెమ్మదిన్ 291

వ. ఇట్లు తలంచుచు 292

ఉ. ఘోరవనంబు చేర రఘుకోవిదుఁ డాత్మసతీసమేతుఁ డై
యూరక కైకఁ జూచి మది యొప్పను గాల్చినయట్టులుండె నే
తారఘునాథుఁ డిష్టగుణుఁ డర్హవ మే నొనరించి రాజ్య మి
ట్లూరక డించి యారఘుకులోదధిచంద్రము నాశ్రయించెదన్. 293

తే. అనుచు నంబికసోదర గర్హిణాధాగు, శీఘ్రరేఖ్వాపుఁ డురుతరనియతిఁ గేక
యీసుతుండు సిట్చె ననుచుఁ దానిట్లు పలికి, వఱలనూహించె నవ్వాలి తెఱఁగు దెలుప

వ. అంత వసిష్ఠుండును మునిజనులును మంత్రులుఁ బౌరులుం గూడ దేవసభాసన్నిభం బగుసభాభవనంబున కరుగుదెంచి భద్రాసనాసీనుండగు చతుర్ముఖుండునుంబోలె

వ. ఇట్లు గాంచి ముందఱఁ గానఁగలిగి యేను గుహుండ నని నమస్కరించినఁ గైకేయీసుతుండును. 302

ఆ. అతిరయమునఁ దిగిచి యాలింగన మొనర్చి, నేను మఱిగి తమ్ముఁడా! మహాత్ముఁ
డైనరాముఁ గంటి వాలింగన మొనర్చె, నతఁడు సాశ్రునయనుఁ డగుచు నిట్లు.

వ. కావున. 304

ఉ. ధన్యుఁడ వయ్య నీవు గుణధాముని రాముని లక్ష్మణావనీ
కన్యలతోడ నిర్వ్యథలఁ గంటివి మైథిలిఁ గూడి యాజగ
న్మాన్యుఁడు నిద్రఁ జెందిన వనస్థల మెయ్యది చూపవయ్య! నా
దైన్యముఁ బాపవయ్య యిఁకఁ దాళఁగఁజాల నిషాదవల్లభా!. 305

వ. నీవు రామచంద్రునియెడ భక్తిగలుగువాఁడ వగుట భాగ్యవంతుండవును ముఖ్య ప్రియుండవు నయితి వనుచుఁ గన్నీరు కాలువలు గాఁగ మాటిమాటికి రామచంద్రు సంస్మరింపుచుఁ గౌసలేయుండు రాత్రివేళ శయనించిన వనప్రదేశమునకు గుహునితోడం జని యిది యనుచుఁ గనుపఱచిన లక్ష్మణుండు మున్ను పరచిన దర్భలతోడ నతండు జనకనందన యాభరణంబులం గలుగు కనకబిందురేఖల సమలంకృతంబగు నారామశయనప్రదేశంబుఁ గాంచి దుఃఖసంతప్తహృదయుండై పరివేదనంబుఁ జెందుచు. 306

సీ. అక్కటా మిథిలేశు మక్కువకూఁతు రెంతయును గుమారి సీతావధూటి
ప్రాసాదమున రత్నపర్యంకమునఁ గోమలాస్తరణంబునం దతిశుభమునఁ
బవ్వళించును రామభద్రునిఁ గూడి యాపతిభక్తినిరత యీపట్లఁ గఠిన
దర్భశయ్యల నేవిధంబునఁ బండెనో దుఃఖింపుచు మదీయదోషమునను

తే. రామవిభుఁ గూడి కేకయరాజసుతకుఁ, బాపరాశికి నేఁ దనూభవుఁడ నైతిఁ
గాల్పనే నన్ను నమ్మించి గిఱిగె నాప, రాత్ముఁడగు రామవిభునకీయడవి నుంట.

తే. అయ్యయో లక్ష్మణుండు మహాత్ముఁ డతని, జన్మసుఫలంబు శ్రీరామచంద్రుతోడ
నేమఱక హృష్టుఁడై యుండు నెట్టివాఁడు, లబ్ధమైనను గిరులైన నడవులైన. 308

తే. ఏను శ్రీరామదాసదాసానుదాస, కింకరుఁడ నైతి నేని నిశ్శంక నాదు
జన్మసాఫల్య మగుఁ గాక జానకీశుఁ, డెచ్చట నుండును దమ్ముఁడ! యెఱుఁగఁ బలుకు.

వ. అమ్మహాత్ముం దోడితేర నతిరయమ్మున నరిగెద ననిన గుహుండును బరిశుద్ధమానసుండని యెఱింగి స్నేహంబున భరతున కిట్లనియె. 310

క. సరసిజలోచనుఁ డగు రఘు, వరునియెడఁ భూమితనయవలన సుమిత్రా

వ. కాన నీవ ధన్యుండ వనుచు 312

ఉ. భరతనృపాల! రాఘవనృపాలుఁడు దేవనదీవిహారమం
దిరపుగఁ జిత్రకూటకుధరేంద్రసమీపమునందు సంయమీ
శ్వరవిమలాశ్రమస్థలిని సర్వసుఖావహుఁడై వసించె సో
దరతరుణీసమేతముగఁ దత్ప్రభుఁ గానఁగఁ బోద మిత్తరిన్. 313

వ. వేగంబ గంగ దాఁటవలయు ననుచు వేనూఱు నావలు దెప్పించి సైన్యంబులనెల్లఁ బరకూలంబున డించి యొక్క రాజనావఁ గొనివచ్చి యందు భరతశత్రుఘ్నులను రామజననియు వసిష్ఠునిఁ గైకేయిని మఱియుఁ గలుగురాజకాంతలను సమారోహణంబు సేయించి తాన యమ్మహానది దాఁటించె నంత సత్వరంబుగ భరద్వాజాశ్రమంబుఁ జేరి రప్పుడు భరతుండు విస్తారంబగు సైన్యంబు దూరంబున నిల్పి తమ్మునితోడ నయ్యాశ్రమంబులోనికిం జని 314

క. భ్రాజిచ్ఛవితేజో భర, ద్వాజ సమానీతు మౌనివల్లభుఁ గని సం
కేజప్రియరాజాన్వయు, రాజన్యులు మ్రొక్కి రద్రిరాజతనూజా!. 315

క. కనుఁగొని ముని దశరథసుతు, లని ముదమునఁ బూజఁ జేసి యతివేషము దా
ల్చినభరతునిఁ గని విస్మయ, మున నిట్లని పల్కె నపుడు భూధరతనయా!. 316

క. మన మలరఁగ భూపాలన, మొనరింపక జడలు నారలూనిఁ బూని తపో
ధనసేవితవనభూముల, కనుగమనముఁ జేసి తేటి కాయాసమునన్?. 317

వ. అనిన భరద్వాజువచనంబులు విని సాశ్రులోచనుండై భరతుం డిట్లనియె. 318

సీ. భగవంతుఁడవు సర్వభావస్థితంబులు దెలియుదువైన నేన్ బలుకవలయుట
నా యంతనుఁ గరుణగా నమ్మైన రాము రాజ్యవిఘాతమందు దుశ్చరిత్రయైన
కైకేయి చేయువిఘ్నంబును వనగమనాదికం బెఱుంగ మీ యంఘ్రియుగము
లాన యుండను దీనమానసుఁడై మౌనిపదములు ముట్టి మీమది నెఱుంగుఁ
తే. నేను పరిశుద్ధబుద్ధితో గాని సోదు, రాజ్యమందే మిసుఖము శ్రీరామపాద
కింకరుఁడ వల్లభుఁడు జానకీవిభుండు, సందియములేదు నమ్ముఁడీ సమయమునందు.

మ. చని రామాంఘ్రియుగంబుఁ బట్టుకొని యీసంభారముల్ చూపి ర
మ్మని సన్మానితసిద్ధజానపదపౌరామాత్యవర్గంబుచే
వనజాతేక్షణు నాకుమారమణు సర్వస్వామిఁ గావించి తో
డ్కొని సాకేతపురంబు గూర్తునిది చూడుం జేయు భృత్యక్రియన్. 320

ఆ. అనిన మునియు భరతు నాలింగనముసేర్చి, పొగడి విస్మయంబుఁ బొంది మించు

సీ. చింత నొందకుమయ్య శ్రీరామునందు సుమిత్రాతనయునందు మిగులభక్తి
గలవాఁడ వీవు నేఁ దెలియుదు నీకు నీసేనలకును విందుసేయ నిశ్చ
యించెదఁ గాన నీ వీవేళ నిచ్చట సుఖలీల నిలిచి యిచ్చోటు వెడలి
రేపు శ్రీరామసమీపంబునకుఁ బోవఁ జను మన్న భరతుఁ డిట్లనియె మౌని
తే. తిలక! మీ రానతిచ్చినపలుకు లెస్స, యనిన మునియును జలముల నంటి హోమ
భవనమం దున్న కామధేనువును జీరి, వలయువస్తువులను విందు సలుపు మనిన. 322

వ. భరద్వాజశాసనంబున నక్కామవర్షిణియు యథేష్టంబుగ మనోరథపదార్థంబుల
వర్షించి సేనలవారినెల్లఁ దృప్తులం జేసె యోగివల్లభుండగు భరద్వాజుండును ముం
దఱ విధిదృష్టకర్మంబుల వసిష్ఠుం బూజించి సానుజుం డగు కైకేయీనందను సంతృ
ప్తుం జేసె నద్దాశరథియు స్వర్గతుల్యంబగు నయ్యాశ్రమంబున నొక్కదినంబు గడపి
మఱునాఁడు తమ్ముండునుం దానును భరద్వాజు నభివాదనంబు చేసి యనుజ్ఞ వడసి
రామసన్నిధికిం జనుచుఁ జిత్రకూటనగంబు గాంచి దూరంబున సైనికుల నునిచి
రామసందర్శనాకాంక్షి యై పరమతపశ్చరితుం డగు భరతుండును. 323

మ. అనుజుండున్ గుహుఁడున్ సుమంత్రుఁడును దోడై రాఁగ శ్రీరామచం
ద్రనివాసం బెఱుఁగంగలేక యెదురౌ తత్ప్రాంతసంచారస
న్మునులన్ దా మవిభుండు లక్ష్మణధరాపుత్రీయుతుండై వసిం
చును దా నెచ్చట మాకుఁ బల్కుఁడగు నంచున్ బోవ వా రందఱున్. 324

వ. ముందటఁ జిత్రకూటంబునకుఁ బశ్చిమంబున మందాకినికి నుత్తరతటంబు నగు
వివిక్తస్థలంబు రమ్యకాననమండితంబై సఫలంబు లగుచూతపనసకదళీషండంబులం
గలిగి చంపక కోవిదార వకుళాభిరామంబై శ్రీరామసదనం బదె యల్లదె యనిన
మార్గంబు నొంది యనుజమంత్రియుతుండై చని చని 325

ఉ. దూరమునందునుండి భరతుండు గనుంగొనె రామచంద్రసం
చారముఁ బుణ్యసీమము ప్రశాంతయమిప్రవరాభిరామమున్
భూరుహకీలితార్కకులపుంగవవల్కలచేలమున్ దురా
చారవిమోహమున్ విగతసత్త్వసమూహము రామగేహమున్. 326

క. ఈ తెఱఁగున భూతేశుఁడు, సీతాపతికథలు వల్కె శిఖరివరతనూ
జాతకు ఘనకౌతుకమున, భూతలదుర్వారితవారణజాతిప్రేమన్. 327

వ. అంత భరతుండు. 328

శా. సీతారామపదాంకితస్థలము సుశ్రేయస్కరంబున్ సువి

ద్యోతం బైనశుభావహం బనుచు తద్ధూళీవ్రజం బానుర
వ్రాతాలభ్యము తాను సోదరుఁడు మూర్ధంబందు వే తాల్చుచున్. 329

తే. వింత ధన్యుఁడ నైతి నేవిభుపదాబ్జ, రజము బ్రహ్మాదులును శ్రుతివ్రజము వెదకు
నట్టి శ్రీరామచంద్రపాదారవింద, చిహ్నితం బైనపదము వీక్షింపఁ గలిగె. 330

వ. అనుచు నద్భుతప్రేమరసప్లుతాశయుండై విగాఢం బగుభావనచేత రాఘవు సంస్మరింపుచు నానందబాష్పంబులచేత నురోజాంతరంబు స్నపితంబుగా మెల్లన శ్రీరామసన్నిధానంబు నొంది యచ్చట. 331

## భరతుండు చిత్రకూటంబున నున్న శ్రీరాముని గనుంగొనుట.

శా. కైకేయీతనయుండు గాంచెఁ దరుణార్కస్ఫారతేజున్ సుమి
త్రాకాంతానుతసేవితాంఘ్రికమలున్ రాజీవపత్రాక్షు దూ
ర్వాకారు న్నవవల్కలాంబరుఁ బ్రసన్నాస్యున్ బ్రశాంతున్ జటా
నీకాంచన్మకుటున్ సమాస్థితు జనానింద్యవ్రతున్ రాఘవున్. 332

వ. ఇట్లు వీరాసనాసీనుం డగు నాసీతాపతిం గనుంగొని మిగులసంతోషంబునం జనుదెంచి సత్వరంబునఁ బ్రణామపూర్వకంబుగాఁ బురోభాగంబున సంబడి హర్షంబున నద్దేవు చరణకమలంబులు పట్టుకొని లేవకయున్న రామచంద్రుండును. 333

క. తనదీర్ఘకరంబుల నా, ఘనభుజు లేవంగఁ దిగిచి గాఢతరాలిం
గన మొనరించి నిజాంకం, బున నిడుకొని నేత్రసలిలముం దుడిచి దయన్. 334

వ. మఱలమఱల మేనుసిమురుచుండె నంత దశరథభార్యాజనంబులెల్లను బిపాసార్తలయి యుండి జలంబులం గాంచి వడివడివచ్చు ధేనుగణంబుల చందంబునం బఱతెంచిన సీతాపతియు ముందఱ జనయిత్రి గనుంగొని వేగంబు లేచి పాదంబులకు నమస్కరించిన సకౌసల్యయు సాశ్రునేత్రయై నిజకుమారుఁ గౌఁగిలించుకొని దుఃఖించె. తక్కిన జననీజనంబులకును వందనంబులు చేసి సమాగతుండగు వసిష్ఠుం గాంచి సాష్టాంగప్రణామంబు గావింప మఱలమఱల ధన్యుండ నయితి ననుచు నందఱు యథార్హంబుగఁ గూర్చుండ నియోగించి తల్లుల విలపించెద రేల మజ్జనకుండు కుశలియై యున్నవాఁడే! యనిన నాసౌరాన్వయపయఃపారావారతారావిభుండగు సీతావిభుం గనుంగొని యనఘుండును సర్వజ్ఞుండును నగు వసిష్ఠమునిపుంగవుం డిట్లనియె. 335

## వసిష్ఠుండు శ్రీరామునకు దశరథుమరణం బెఱింగించుట.

తే. మిమ్ముఁ బాసినచింతచే మేదినీశుఁ, డడలి హారామ! రామ! హాయనితనయ!

వ. కర్ణశూలసదృశంబు లగునప్పలుకులు విని. 337

ఉ. హా యని నేల వ్రాలి జనకా! సుగుణాకర! మమ్ము వీడి నీ
వేయెడ కేఁగినాఁడ విపు డెవ్వఁడు ప్రోచెడువాఁడు వీడుటల్
న్యాయమె మేము భూస్థలి ననాథుల మైతి మటంచుఁ గన్నులం
దోయకణంబు లొల్కఁ గుణతోయధి రాముఁ డెలుంగు రాల్పడన్. 338

వ. విలపించె సీతాలక్ష్మణులును భూమిం బడి చాల దుఃఖించిరి వసిష్ఠుండును శాంతవచనంబుల వారల దుఃఖంబు శమియింపం జేసె నప్పుడందఱు మందాకినికిం జని జలంబుల మునింగి విగతకల్మషులయి రాజునకు నతికాంక్షచేత జలంబు లొసంగిరి. రామచంద్రుండు లక్ష్మణుతోడఁ "వయం యదన్నాః పితర స్తదన్నాః" అనుస్మృతిచోదితంబుఁ గైకొని తేనెతోడం గల్పిన గారపిండివలనఁ బిండంబు లిడి దుఃఖాశ్రుపూర్ణనయనుండయి స్నానంబు చేసి వనంబునకు నరుగుదెంచె తక్కినవారలెల్ల సుచిరంబు విలపించుచు నీటం గ్రుంకి రామాశ్రమంబునకు మఱలిరి. నాఁటిదినంబందఱు నుపవాసంబు చేసి మఱునాఁడు మందాకినీజలంబులఁ గృతస్నానులయి పర్ణశాలకుఁ జనుదెంచి యెల్లవారును గూర్చున్నయెడ భరతుండు కేలుమోడ్చి రామవిభున
కిట్లనియె 339

సీ. అభిషేక మంది మహాభాగ! శ్రీరామ! రామ! పితృవ్యమా రాజ్య మేలు
మగ్రజుండవు తండ్రి యట్టివాఁడవు నాకు క్షత్రియధర్మంబు సకలరాజ్య
పాలనం బొనరించి బహుయజ్ఞములు చేసి వంశాభివృద్ధికై వరతనూభ
ఫలఁ గాంచి రాజ్యమందుల వారలను నిల్పి యటు తపోభూమికి నరుగవలయుఁ
తే. గాన వనవాసమున కిది గడియ గాదు, నన్ను మన్నింపు మాతల్లి మున్నొనర్చె
దుష్కృతం బదినీ దయతోడ మఱువు, మనుచు సాష్టాంగ మెరఁగి రామాంఘ్రియుగము.

క. శిరమున నిడుకొని లేవక, భరతుఁడు సాఁగిలినఁ జూచి భరతాగ్రజుఁ డా
దరమునఁ గరికరముల నా, నురుదీర్ఘము లైన బాహుయుగముల భరతున్. 341

వ. నిజాంకతలంబునకుం జేర్చి స్నేహార్ద్రనయనుండై యిట్లనియె. 342

ఉ. వత్స! భవన్ముఖోదిత మవశ్యము సేయఁగ నొప్పుఁ గాని భూ
భృత్సురవంద్యుఁడౌ జనకుఁ "డీవు మునిక్రియఁ దొమ్మిదైదు నా
వత్సరముల్ మహావననివాస మొనర్పుము పైన రమ్ము రా
జ్యోత్సవయుక్తుఁడై భరతుఁడుండు"ననెన్ ఘనసత్యవాక్యుఁడై. 343

వ. ఇవ్విధంబున. 344

గీ. జనకుచే నీకు సకలరాజ్యంబు నాకు, దండకారణ్యరాజ్యంబు దత్తమయ్యెఁ

గాన నవ్విభుశాసనం బూని మనకుఁ, జేత కర్తవ్య మిఁక నొక్కనీతి వినుము.

క. జనకునిపను పొనరింపక, మనసు చనినభంగిఁ దిరుగుమనుజుఁడు నరకం
బునఁ బడును గాన దశరథ, జనపతిపను పొనరఁ జేయఁ జను మన కిపుడున్. 346

వ. నీవు రాజ్యంబు శాసింపు మేను దండకారణ్యంబుఁ బాలించెద ననినఁ గైకేయీ
నందనుం డిట్లనియె. 347

తే. మానినీలోలుఁడై యభ్రాంతిమానసుండు, దలియక యుపత్నీసవాక్యములు గ్రహింప
జనునె యనినను జనకాత్మజాకళత్రుఁ, డిట్టులనియెను భరతుతో నిందువదన!

వ. జనకుండును స్త్రీజితుండును గామియును మూఢబుద్ధియు నగుచుఁ బల్కిన పలుకులు
గావు వినుము 349

క. మును గరుణ నొసఁగె గావున, నమచిత మాడంగ వెఱచి యనిరొ యసత్యం
బున నరకమునను భేదులు, ఘనభీతిం జెందుదురు జగంబున వత్సా!. 350

వ. ఇదియుకాదు చేయఁగుననుచుఁ బూని యేను బలికినపలుకులు రఘుకులంబున జనిం
చినవాఁడనై యెవ్విధంబున నసత్యంబులు చేయఁగ ననిన భరతుం డిట్లనియె 351

క. ఈనారచీర లీజడ, లేను ధరించి పదునాలుగేఁడులు నిలుతున్
గాన రాజ్యముఁ జేయుము, మానక నీ వుండు మనిన మఱి భరతుతోన్. 352

వ. రామచంద్రుం డిట్లనియె. 353

క. నీ కొసఁగె ధరణి విపినము, నా కొసఁగెను వ్యత్యయంబు నడవ దనిన బల్
కోకమున భరతుఁ డనియె గుణాకర! లక్ష్మణునిభంగి నడవులవత్తున్. 354

వ. కాకున్నఁ బ్రాయోపవేశంబున నాదుకళేబరంబు విడిచెద ననుచుఁ బలికి భూతలం
బున దర్భలు పఱచి మనోనిశ్చయుండయి ప్రాఙ్ముఖంబుగఁ గూర్చుండిన రామచం
ద్రుఁడు విస్మితుండయి భరతునిర్బంధంబు వాపికొన నేత్రాంతసంజ్ఞతోడ నాత్మ
భావంబు వసిష్ఠున కెఱింగింప నంత విజ్ఞానగరిష్ఠుండగు వసిష్ఠుండును భరతు నేకాం
తంబునకుం జేరి యిట్లనియె. 355

సీ. అతిరహస్యమును నిశ్చితముగా నెఱుఁగుము మద్వాక్యసరణి నీమదిని వత్స!
దశరథరాజనందనుఁడై శతానందు ప్రార్థనచేత శ్రీరాముఁ డనఁగ
నారాయణుఁడు దశాననవధార్థముఁ బుట్టె యోగమాయయు సీత నాఁగ జనకు
తనుజ యయ్యెను శేషదర్వీకరేశుఁడే యవ్వలఁ బుట్టెను లక్ష్మణాఖ్యచేత

తే. నేమఱకయుండు నితఁడు సీతకు నెపుడు, వీరు రావణుఁ బరిమార్ప వెడలినారు
సంశయము లేదు కైకయీజల్పితమున, వరమొసంగుటలును దైవచరిత మరయ. 356

వ. కావున నిట్టులేల సంభాషించు టదిగావునఁ దండ్రీ! రాముని మఱలించు నెడల

దాసక్తిమాని మాతృజనంబులతోడ సేనలం గొని పురంబునకుం జనుము కుశలంబు తోడ రాజ్ఞుం బరిమార్చి శిక్షింపఁ జనుదేరఁ గలం డనుచుఁ బలికిన వసిష్ఠసంయమి పలుకులకు విస్మయంబు నొంది. 357

శా. సీతానాయకుసన్నిధానమునకు స్నేహంబుతో నేఁగి సం
ప్రీతిన్ మ్రొక్కి నరేంద్ర! నీ వెపుడు సుశ్రీ నొప్పు రాజ్యంబునం
జేతు న్నేఁలు నీదుపాదుకలకున్ శిక్షింప నా కిమ్ము సా
కేతం బెన్నఁడు వత్తు వంతకును జూచెదం జూతు నీమారుగన్ 358

వ. అనిన దివ్యంబులును రత్నభూషితంబులును నగుపాదుకలొసంగ నవియును శిరంబున నిడుకొని ముఱిముఱి మ్రొక్కుచు భక్తిచేత గద్గదస్వరంబున మఱల భరతుం డన్నతో నిట్లనియె. 359

ఆ. నాథ! వినుము పదియు నాలుగువర్షముల్, చనినపిదప నొక్కదినము నైన
నీవు రాకయున్న నిలువఁ బావకుఁ జొత్తు, ననిన మెచ్చి భరతు ననిపెనపుడు. 360

వ. బుద్ధిమంతుఁ డగుభరతుండును వసిష్ఠశత్రుఘ్నమాతృజనధీసచివసైన్యసమేతుండయి మఱల సమకట్టునెడ నొంటిగఁ గేకయరాజనందన దొరఁగెడు కన్నీట నాకులయై కేలుమోడ్చి రామచంద్రుసన్నిధి కరుగుదెంచి యిట్లనియె. 361

## కైకేయి శ్రీరాముని స్తుతించుట.

చ. దినకరకోటితేజ! భవదీయమహామహిమానుబద్ధనై
వినకయ నీమహోత్సవము విఘ్న మొనర్చితి నీవు భక్తపా
లనపరమవ్రతుండవు దలంపకు నాదగు దుష్టచేష్ట లె
ల్లను భవదీయమాయకుఁ దలంగ సురాసురులైన నేర్తురే. 362

వ. సాధువులకు సారంబు క్షమాగుణంబు గావున నాతప్పు సైరింపుము నీవు సాక్షాత్కరించిన విష్ణుండ వవ్యక్తుండవును బరమాత్మవు సనాతనుండవు నగుదువు మాయామానుషరూపంబున జగం బంతయు మోహింపంజేయుదువు నీచేతఁ బ్రేరితులై లోకుల వసాధువులు గాఁగ నమ్మాయ యొనరించు విశ్వంబంతయు నీయధీనంబు స్వతంత్రరహితులగు జను లేమిసేయంగలరు వెండియు. 363

క. నర్తకుఁడు త్రిప్పినట్లు ప్రవర్తించెడు తోలుబొమ్మ వైఖరి నాజ్ఞా
వర్తినినై పలుతెఱుల, వర్తించును మాయ నిన్ను వదలక రామా! 364

వ. ఏనును నీచేతఁ బరివోదితనై దేవకార్యంబుకొఱకుఁ బాపచిత్తంబున నిట్టిపాపకర్మం బొనరించితి నైనను. 365

శా. సాక్షాత్కార మొనర్చి తిప్పుడదిదృక్షాస్వాంతమ్ముగ్యత్నహ
ప్రత్యక్షాగోచరమూర్తి వయ్యు భవదీయజ్ఞానతీక్ష్ణాసిచే
నక్షీణాత్మ! భవాదిగోచర! మదీయజ్ఞానపాశంబు స
ద్వ్యక్షోభం బొనరించి కావఁగదవే రామా! నినున్ వేఁడెదన్. 366

తే. శరణుఁ జొచ్చినదానను గరుణఁ జూడు, వరద విశ్వేశ్వరానంత వాసుదేవ!
శ్రీనివాస! జగన్నాథ! సేవసేతు, ననిన సంప్రీతుఁడై రామజనవిభుండు. 367

వ. కైకేయి కిట్లనియె. 368

ఉ. నిశ్చయమమ్మ! నీపలుకు నిర్జరకార్యముఁ బూని వాణి మ
న్నిశ్చితపద్ధతిన్ వెడలె నీవదనంబున దోస మేమి య
ద్వ్యాశ్చరముఖ్యరూపము లతర్కితవై భజియింపుమందు స
న్నిశ్చలభక్తి నింక జననీ! సమకూరును దీనమోక్షముల్. 369

వ. అఖిలవస్తువులయెడ విగతస్నేహవై నాకు భక్తి సల్పితివేని శీఘ్రంబ కైవల్యంబు గలుగు వెండియు. 370

క. ఏను బ్రియాప్రియులందు స, మానుఁడ భేదంబు దలఁప మానక భక్తిం
దాను భజించిన నరునకు, లోనై వర్తింతు భక్తలోలత్వమునన్. 371

వ. లోకంబున. 372

శా. మన్మాయాబలమోహితాత్ములగుచున్ మర్త్యుందు పంచత్వమున్
జన్మంబుం గలవాఁడటంచు మది నెన్ జర్చింతురో యమ్మ త
త్తన్మార్గంబులు గావు దైవగతి నేతద్జ్ఞానము న్నీయెడన్
జన్మించె న్భవసాగరం బది వెడల్పం జాలు నన్ జెందుమున్. 373

వ. కావున నన్ను. 374

తే. స్మరణచేయుచు నిలుపుము సదనమునందె, కర్మములనంటు పనుమ రాఘవుఁడు పల్క
మతిమతిప్రదక్షిణప్రణామము లొనర్చి, చనియె నానందవిస్మయసహిత యగుచు.

క. జననుతుఁడగు భరతుండును, జననీపరివారముం బ్రజనసంయుతుఁడై
చనియెఁ బరాత్పరు రాఘవు, ఘనమతిఁ దలఁచుచును బాదుకలు గైకొనుచున్.

వ. ఇట్లయోధ్యానగరంబునకు శీఘ్రంబ చని పౌరజానపదవర్గంబుల నప్పట్టణంబున నిలిపి మహామతి గావున యథాన్యాయంబుగ నందిగ్రామంబు చేరి యచ్చట సింహాసనంబున నిత్యంబును భక్తిచేతఁ బాదుకల నునిచి రామునకుఁ జేయుభంగి గంధపుష్పాక్షతాదులఁ బూజనంబును నిఖిలరాజోపచారంబులును జేయుచు నెల్లెడల నియతవ్రతుండును ఫలమూలాశనుండును దాంతుండును జటావల్కలధారియు

నధర్మాయియు బ్రహ్మచారియు నగుచు శత్రుఘ్నుతోడ భూతలంబునం గలుగురా
జకార్యంబులెల్లను బాదుకలకుఁ దెలియఁజేయుచు రామాగమనకాంక్షచేత దినంబు
లు లెక్కవెట్టుచు రామార్పితమానసుండై బ్రహ్మర్షి చందంబున నుండె నంత 377

సీ. అచ్చట చిత్రకూటాచలంబున రామజననాయకుండు సన్మునులుగొలువ
జనకజతో లక్ష్మణునితోడఁ గొంతకాలము ముదంబునఁ బుచ్చి తమవసించు
చో న్నెఱింగి జనము లప్పుటప్పటికిని దర్శనాకాంక్ష నందలుగ రాఁగ
నాగండడికి నోడి యాసగంబును వీడి దండకాటవిఁ జేరుదమని దలఁచి

తే. యనుజుఁడును గాంతయును గొల్వ నత్రివనము, సర్వకాలసుఖావహర్త్వకాఖిలహిత
మనుజసంబాధమత్యుత్తమంబుఁ గాంచి, యందుఁ జెలువొందుమునిఁ జేరనరగి యపుడు.

క. ఏ రాముఁడ నని చరణాం, భోరుహముల కెఱఁగి తండ్రి పుత్త్రేరఁగ నే
నారణ్యమొంది మీపద, సారసములు గంటి నీమిషక ధన్యుఁడనై. 379

మ. అనిన న్మౌనియు రాఘవుండు హరి లోకాధ్యక్షుండు నారాయణుం
డని సద్భక్తిని బూజసేసి ఫలమూలాగుల్సమర్పించి మిం
చినయాతిథ్య మొనర్చి ముగ్గురు సుఖాసీనస్థితి న్నుండ రా
మునితో నిట్లనె నత్రిసంయమి మహామోదంబునం బాగ్వతీ!. 380

ఉ. సూర్యకులీన లోన వసనూయ యనం గడు సుప్రసిద్ధ మ
ద్భార్య సుధర్మవత్సల తపం బొనరించును వృద్ధగాన న
య్యార్యఁ గనుంగొనం బనుపు మార్మసతీమణి నన్న రామభూ
వర్యుని సమ్మతిం జనకవల్లభుకూఁతురు చేరి మ్రొక్కెనన్. 381

వ. అవనూయయుఁ బ్రహృష్టచిత్తంబున. 382

తే. చిన్నిసీతమ్మ! నిన్ను వీక్షించితిమ్మ!, యనుచు నాలింగనమొనర్చి ఘనదుకూల
యుగ్మమును దివ్యకుండలయుగము నిచ్చి, కర్మనిర్మిత మొసఁగె నా ధర్మసతికి 383

వ. మఱియు దివ్యంబులగు నంగరాగంబులొసంగి సద్భక్తిచేతం గమలాననా! యిత్త్యం
గరాగంబువలనిశోభ నిన్నుం బాయకుండెడుఁ బాతివ్రత్యంబుఁ బూని జీవితేశ్వరు
నాశ్రయించి వెడలితివి కావున రాఘవుండును నీతోడఁ గుశలియై మఱలి సదనం
బునకుఁ జనుదేరఁగలండనుచు దీవించి వీడ్కొలిపె నంత యథాన్యాయంబున సీతా
సమన్వితుండగు రామచంద్రునకు భోజనంబు గావించి సౌమిత్రిం బూజించి
కృతాంజలియై యత్రిమునీంద్రుఁడు మఱల నిట్లనియె. 384

చ. నరవర! సర్వలోకము లొనర్చుచుఁ దత్పరిరక్షణార్థమై
సురనరతిర్యగాకృతులఁ జొత్తువు మాయ యసాధ్య యయ్యుఁ దా

వెలిచున నిన్నుఁ జెందఁ బదివేలకు దేహగుణాళితోడ దే
వర! కళ లుండకుండుట వివస్వదుదంచితవంశపావనా!. 385

వ. ఇత్తెఱంగున. 386

క. అని శివుఁ డంబిక కెఱిఁగిం, చినగతి విధి నారదునకుఁ జెప్పిన వ్యాసుం
డును నాకుఁ బల్కె వినుఁడం, చనియెను సూతుండు శౌనకాదిమునులకున్. 387

క. కాకోదరవరశయన! ర, మాంకాంతాచుంబితాత్మమధురాధర! శో
భాకర! గోపురసప్త, ప్రాకారవ్యోమయానభవన! మురారీ!. 388

మాలినీ. ప్రణవమయవిమానా! ప్రావృడంభోపమానా!
ఫణిరమణశయానా! భద్రవైహంగయానా!
ప్రణుతమునివితానా! భక్తమోక్షప్రతానా!
రణజితరిపుసేనా! రంగనాథాభిధానా!. 389

గద్యము. ఇది శ్రీమోరుతోటముత్తీశ్వర ప్రసాదలబ్ధకవితాపవిత్ర కోటమరాజు భా
స్కరమంత్రిపుత్ర నాగయామాత్య ప్రణీతంబయిన శ్రీమదధ్యాత్మరామాయణం
బను మహాకావ్యంబునం దయోధ్యాకాండము సర్వంబు నేకాశ్వాసము.

శ్రీ ర స్తు.

# అధ్యాత్మరామాయణము

## అ ర ణ్య కాం డ ము.



శ్రీకంఠార్చితపదయుగ!
వైకుంఠాధీశ! భక్తవత్సల! దనుజా
నీకవారణ! సంభావిత
నాకాధిపభావ! రంగనాయకదేవా! 1

క. అవధారు చంద్రజూటుం, డవనీధరకన్యతోడ నంబుజసఖువం
శవిభూషణగుణకథనం, బవిరళమతి మఱలఁ జేయ నారంభించెన్. 2

వ. అంత నచ్చట నవ్వాసరంబు నిలిచి ప్రభాతంబున రఘునందనుండు సుస్నాతుం
డయి యత్త్రిమునీంద్రుం జేరి ప్రయాణోన్ముఖస్వాంతంబున నిట్లనియె. 3

ఉ. మౌనివరేణ్య! సర్వమునిమండలమండిత! దండకాననం
బే నివసింతుఁ బల్కెదగు నెచ్చట మార్గము గానుపింప మా
తో నిజశిష్యసంఘములఁ దోడ్కొనిరింపఁగఁ బోలు నన్న న
మ్మౌనియు జానకీవిభునిమాటలకుం స్మితచారువక్త్రుఁ డై. 4

వ. మహాశయుండు గావున నిట్లనియె. 5

ఆ. నిఖిలమునకుఁ దెరువు నీవ చూపెదవు నీ, కొరులు దెరువుఁ జూప నోపువార
లైనఁ జూపువాఁడ నవనీశ! లోకానుసారివైన నీకు సమ్మదముగ. 6

వ. అనుచుఁ దనశిష్యజనుల నాదేశించి కొంతదూరం బరుగెంచి రామచంద్రునిచేత
నతిప్రీతి నివారితుండై యత్త్రిమునీంద్రుండు తనభవనంబునకుం జనియె నంత
రాజీవలోచనుండగు రామచంద్రుండును గ్రోశమాత్రంబగు దూరంబరిగి యచ్చట
నొక్కమహత్తరంబగు నది యడ్డంబైన నత్త్రిశిష్యులం గనుంగొని యిట్లనియె. 7

క. ఈనది గడచుతెఱం గే, మైనఁ గలదో లేదో యనిన నవనీప! సుదృఢం
బౌ నావ గలదు నిముసము, లోనం దాఁటించు నేర్పులున్నను మాకున్. 8

తే. అనుచు శ్రీరామలక్ష్మణయవనిజలను, నావ నెక్కించి వారు క్షణంబులోన
నదిని దాఁటించి రామాభినంద్యమాను, లగుచుఁ జని యత్రివనమున కగతనూజ!. 9

వ. అంత రామచంద్రుండు. 10

క. చని కాంచె సింహభల్లుక, వనకిటిశార్దూలమహిషవాహావికీర్ణం
బును భృంగఝిల్లికాగణ, ఘనఝుంకృతముఖరవిహంగగణసంయుతమున్. 11

వ. ఇట్లతిఘోరంబును రోమహర్షణంబును నగు నవ్విపినంబుఁ బ్రవేశించి రామచం
ద్రుండు లక్ష్మణున కిట్లనియె. 12

సీ. మన మింక దృఢయత్నమునఁ బోవవలయును జాపంబు గుణముచే సంఘటించి
శరములు పూని యే సరిగాద వెన్క నీ విమ్ములు విల్లూని రమ్ము మనల
సందున మిథిలేశునందన యరుదెంచు నాత్మ పరాత్మలయందు మాయ
తెఱఁగున దిశలెల్లఁ బరికింపుచుండుము రక్షోభయం బీ యరణ్యమందుఁ

తే. జాలఁ గలదని వింటిమి శత్రుదమన!, యనుచు భాషింపుచును వారు సార్ధయోజ
నంబు చని యందు విమలోదకంబుచేతఁ, బరమపావనమగు సరోవరముఁ గాంచి.

వ. మఱియు కహ్లారకుముదోత్పలమండితంబును దాత్యూహప్రముఖజలవిహంగకూజి
తంబును శీతలసలిలాంచితంబును నగు తత్పుష్కరిణీసమీపంబునకుం జని శుభంబగు
తత్సలిలంబు ద్రావి మలయానిలంబు వీతేర నొక్కింతతడవు సమీపమహీరుహ
చ్ఛాయ నాశ్రయించి యంత. 14

## శ్రీరాముఁడు విరాధునిఁ జూచుట

ఉ. ముందఱఁ గాంచె భానుకులముఖ్యుఁడు దంష్ట్రికరాళవక్త్రు సం
క్రందనభీరగర్జను నరగ్రథితాయతశూలహస్తు ని
ష్యందితఖాద్యమానవనసామజమాహిషసింహసక్తు సా
నందసమాగతుం దనుజనాథు విరాధు సురాపరాధునిన్. 15

తే. ఇట్లు గనుఁగొని రాఘవుం డెక్కువెట్టి, కార్ముకముఁగొని తమ్మునిఁ గాంచి కాంచు
మయ్య! యీపచ్చపాపనిశాటు మనకుఁ, గట్టెదుట వచ్చుచున్నాఁడు దిట్టయగుచు.

వ. వీనిం గాంచినజనులు సప్రాణులై నిలువనేర్తురే యదిగావున నీవును జనకనందన
భయంబునొందకుండ ధను వెక్కువెట్టియుండు మనుచుఁ దానును సాయకంబుఁగొని
మహాచలతుల్యుండై నిలిచె నంత వాఁడును జానకీలక్ష్మణులను రమానాథుండగు
రామచంద్రునిం గాంచి పకపక నగి భయంబు పుట్ట నిట్లనియె. 16

సీ. జడలు వల్కలములు చాపము లమ్ములు పూని యెవ్వరు మీరు మౌనివేష
ధారులై యివ్వనాంతముసందుఁ గాంతతో మదమున సంచరించెదరు వింత

నోటి కందిలిరి మనోహరకబళోపమానులై వ్యాఘ్రసామజనిషేవి
తంబైన యీదండకంబున కేల వచ్చితి రన్న జానకీపతియు వాని

తే. పల్కులకు సంస్మితాస్యుఁడై పల్కె నోరి, యేను రాముఁడ నాతమ్ముఁడితఁడునాకు
సమ్మతుఁడు లక్ష్మణుండు యీసతి మహీజ, సీత మత్ప్రాణవల్లభ భూతలమున. 17

తే. వెదకి మీవంటిదుర్మార్గవితతి నెల్ల, శిక్షసేయఁగ జనకాజ్ఞచేత వెడలి
వచ్చితి మటన్న శ్రీరామువాక్యమునకుఁ, గనలిబిట్టార్చి యాలోకకంటకుండు 18

వ. వదనంబు దెఱచికొని యొక్కవికారంబగు సాలంబుగేలం గీలించి శూలిగతి నాభీలుండై. 19

ఉ. రామ! త్రిలోకవిశ్రుతు విరాధు నెఱుంగవె మద్భయంబునన్
వేమఱు మౌను లీవనము వీడి పలాయితులైరి నీవు మీ
సేమముఁ గోరెదేని యిపు సీతను డించి నిరాయుధుండవై
భూమి నదృశ్యవై ఖరిసి బొమ్ము రయమ్మునఁ దమ్ముతోడుతన్. 20

మ. అటుగాకుండిన మ్రింగువాఁడ నని యుగ్రాకారుఁడై జానకిం
బటువేగంబునఁ గైకొనం గవియ రామస్వామి తా నవ్వటా
లటు లొక్కమ్మునఁ దక్కరద్వయము ప్రయ్యంజేసె నప్పాపుఁడుం
దటు వీ పివ్వక పైకిఁ బర్వఁగను దత్పాదద్వయుం బొక్కటన్. 21

క. క్రూరాస్త్రంబునఁ గూల్చెను, ధారుణిపై వడియు నద్భుతంబనఁదగ నం
తారక్కనుఁ డఱచుచు బల్, కోఱలు గలత్రాఁచుభంగి ఘోరాస్యుండై. 22

చ. వడిఁ గవయన్ మహాబలుఁడు వారిజమిత్రకులావతంసుఁ డ
ప్పుడ యొకయర్ధచంద్రశరము న్నడరించెను దాన నోటనున్
బొడబొడ రక్తముం దొరఁగ భోరని యార్చుచువాఁడు ధారుణిన్
బడియె నిలింపదుందుభులు బల్వడి మ్రోసె విహాయసంబునన్. 23

వ. అయ్యెడ. 24

క. జనకజయు రామచంద్రుని, వినుతింపుచుఁ గౌఁగిలించె విబుధులు వభివా
దనములు గావించిరి వే, డ్కను బాడిరి కిన్నరులును గంధర్వవరుల్. 25

వ. మఱియు నచ్చర లచ్చట రచ్చగ హెచ్చుగ విచ్చలవిడి గూడి యాడి పాడి
రాడి దాడితోడి వీడితి మనుచు చనినంత. 26

సీ. అరిపా! విరాధకాయము వీడి యతిసుందరాకారుఁడై నవిమలాంబరావృ
తుండు విభ్రాజమానుండు ప్రతప్తకాంచనచారుభూషణసంయుతుండు
నగునొక్కరుఁడు మింట నంభోజహితుభంగి ముందఱ నిలిచి సన్మునిరహస్య

సమరప్రచండుఁ బ్రసన్నుసర్వార్తిసంహారు సర్వేశు మాయావిహీను
తే. సద్గుణాలయు రఘుకులసార్వభౌము, హరిఁ బరేశు రమేశు రామావనీశుఁ
గాంచినిశ్చలచిత్తుఁడైకరయుగంబు, మోడ్చినుతిసేయఁదొడఁగె నంబురుహనయన!.
ఉ. రామ! శమాభిరామ! రిపురాక్షసగర్వవిరామ! రాజను
త్రామ! సమస్తపుణ్యగుణధామ! నమస్కృతసర్వసంయమి
స్తోమ! పయోజమిత్రకులతోయధిసోమ! వినీలవారిద
శ్యామ! పవిత్రనామ! కమలాంచితదామ! నమస్సు నీ కగున్. 28
క. ఓ సీతావల్లభ! ను, ర్వాసుం డనిమిత్తరోషుఁ డలిగి శపింపం
గాసింబడి నేఁడు నిరా, యాసంబునఁ దొంటిరూప మందితి నీచేన్. 29
వ. రాజీవదళలోచనా! శ్రీరామా! మున్ను విపులప్రకాశుం డనువిద్యాధరుండ నీదు
దర్శనస్పర్శనంబు లత్యంతసుఖాభినుస్సనంబులు గావున ధన్యుండ నయితి మతి
యును. 30
మ. ఇఁకపై నాకు భవోపశాంతి యగున ట్లింద్రాళి కాంక్షించు తా
వకపాదాబ్జములందు సంస్మృతియు సర్వస్వామి వీ వాట మా
మకకర్ణంబుల నీకథాశ్రవణముల్ మజ్జిహ్వ నీనాము మ
స్తకమం దంఘ్రిమనస్సు నర్చనలు హస్తంబందు నా నీద యున్. 31
సీ. వందనం బగు నీకు వరషడ్గుణైశ్వర్యకలితవిదిన్నతాజ్ఞానరూప!
రామ! భూమిసుతాభిరామ! యాత్మా రామ! యోగి బ్రహ్మ నీ కొదిగి కేలు
మోడ్చిన నను గావు పోయెద దేవలోకమునకు నీయనుగ్రహము చేత
నతికేడ్క నోసచ్చిదానందవిగ్రహ! యాజ్ఞ యిండనుటయు నవ్విరాధు
తే. చేత నాగతి నుతిగాంచి శ్రీనివాసుఁ, డతిదయామతి వర మిచ్చి యరుగు వేళ
మరలఁ గనుఁగొని యమ్మహోజ్వలి శుభప్ర, దముగ నిట్లనె తుహినభూధరతనూజ!.
చ. వినవె విద్యాధర! సర్వమాయలును పోషింబుల్ విడెఁ నీకు నక్
గనుటన్ నేఁడు విముక్తకల్మషుఁడవు విజ్ఞానైకముఖ్యుండ విం
కను మద్భక్తియు లభ్య మెవ్వరికిఁ గల్గుణ్ వారల స్తోత్రభా
జనులం జేయు నసంశయం బనిన స్వేచ్ఛన్ రాముఁ గీర్తింపుచున్. 33
వ. తనదులోకంబునకుం జనియెఁ గావున. 34
ఉ. రామునిచే సుఘోర మగు రాక్షసదేహము వాయుటల్ యమి
స్వామి యొసంగు శాపగతి మానుట తొల్లిటి దేవకాయముణ్

ధామము గల్గియుంట వరదానము లన్ని విరాధుఁ డంచె నో
భామిని! కోర్కె లన్ని రఘుపాలుని గొల్చు నరుండు గాంచఁడే! 35

ఆ. అనుచుఁ బల్కి యాత్మవనితతోడ శివుండు, మరల రామచంద్రు చరితమెల్లఁ
దెలుపు వేడ్కతోడఁ బలికె నిట్లని దివ్య, మంగళస్వరూప! రంగభూప!. 36

ఆ. వందనం బొనర్తు వరమహోద్దండపదో, ర్దండులకు రణప్రచండులకును
నాత్మకాంతికలితార్కమండలనైజ, లక్షణులకు రామలక్ష్మణులకు. 37

## శ్రీరాముఁడు శరభంగాశ్రమంబునకుం జనుట.

వ. ఇట్లు విరాధుండు స్వర్గంబు నొందిన రామచంద్రుండును సీతాలక్ష్మణసమన్వితుం
డై సర్వసుఖావహం బగు శరభంగాశ్రమంబునకుం జనిన బుద్ధిశాలియగు నా శర
భంగయోగియు సంభ్రమంబున లేచి యెదురు వచ్చి సీతాలక్ష్మణులతోడ నద్దేవుం
బూజించి విష్టరంబున నుపవిష్టుం జేసి కందమూలఫలాదులచేత నాతిథ్యం బొన
రించి సంప్రీతితో భక్తపరాయణుం డగు నన్నారాయణున కిట్లనియె. 38

మ. బహుకాలంబుననుండి రాఘవ! భవత్పాదాబ్జసందర్శనో
త్సవతన్ నిల్చితి నిందు బల్ తపమునన్ దత్పుణ్య మెల్లన్ భవ
త్పావనీయాంఘ్రుల డించి ముక్తిపదసామ్రాజ్యంబు నేఁ గాంతు నై
త్యవనప్రాభవ నీవ యింత యని దార్ఢ్యంబైన వైరాగ్యతన్. 39

ఉ. ఆశరభంగయోగియు మహత్తరమైన తపఃఫలంబు సీ
తేశున కిచ్చి ముంగు చితి యేర్పడఁ జేసి విరక్తుఁడై 'నమ
స్తే శతపత్రనేత్ర! తులసీదళదామ! హరే! రమాపతే
దాశరథే!' యటంచుఁ బ్రమదంబున హస్తము లెత్తి మ్రొక్కుచున్. 40

వ. మఱియు సీతాలక్ష్మణులకుం బ్రణమిల్లి నెమ్మనంబున. 41

ఉ. స్నిగ్ధజటాకలాపు నతసీకుసుమసుందరరూపు జానకీ
మార్గ్యసరోజభాను నతమానివితాను నశేషవ్యాప్తస్థితున్
ముగ్ధతరస్మితున్ జనమనోహరు సానుజు వల్కలాంబరున్
దుగ్ధసముద్రధాము భవదోషవిరాము సురాము రామునిన్. 42

క. ధ్యానము సేయుచు నీరఘు, భూనాథునికన్న వేఱె భువిలోనఁ గృపా
మానసు లెవ్వరు మన్నతి, దా నెఱిఁగి బిరాన వచ్చెఁ దనయంతఁ గృపన్. 43

వ. మఱియు ననన్యచిత్తుండగు నాచేత సంస్మృతుండగుచు నేఁడు సమీపించెం గావున
నితండు స్మృతకామధేనువ యనం దగు నిప్పు డఖిలప్రభుం డగు నీదాశరథియు

నాత్మదేహంబు వైశ్వానరున కిచ్చి యకల్మషం బగు బ్రహ్మలోకంబున కరుగమించు
నన్నుం గనుంగొనుఁ గావున మని వెండియు. 44

తే. మేఘమందుఁ దటిల్లత మెఱయు మాడ్కి, నెవని వామాంకపీఠమునం దవనితనయ
వెలయు నయ్యయోధ్యాపురవిభుఁడు రాముఁ, డెల్లపుడు నాదు మది నుల్లసిల్లుఁ గాత.

తే. అనుచు రాముని మిక్కిలి నాత్మఁ దలఁచి, ముందు గనుఁగొంచు వహ్నిసముజ్జ్వలంబు
చేసి పంచాత్మకం బగు నాశరీర, మందు విడి లోకపతిపదం బందె నపుడు. 46

వ. ఇట్లు దివ్యదేహధరుం డై శరభంగయోగి దివంబున కరిగినఁ దదనంతరంబ. 47

తే. దండకారణ్యమునఁ గల్గుతాపసోత్త, ములు రఘూత్తము ప్రాభవం బవనిఁ గాంచు
వేడ్క శరభంగయోగిని వేశనమున, కరుగుదెంచిరి పెక్కండ్రు గిరిశమూర్తి! 48

వ. ఇట్లు చనుదెంచిన సంయమిశ్రేష్ఠులం గనుంగొని మాయామానవరూపంబులు గైకొ
నిన వార లగుట రామలక్ష్మణులును జనకనందనయును సాఁగిలంబడి నమస్కరించిన
వారును నాశీర్వదించి వినుతించి ప్రాంజలు లై సర్వహృదయస్థితుండును ధనుర్బాణ
ధరుండును హరియు నగు నక్కౌసలేయున కిట్లనిరి 49

సీ. తెలియుదు మయ్య! భూతలభరం బడఁపంగ నలినజుచేఁ బ్రార్థనంబు వడసి
నీ వుద్భవించితి వీవసుంధరయందు హరివి నీ వని జనకాత్మజయును
లచ్చి యటంచు నీలక్ష్మణుం డాశేషవంశ మంచు దరారు లరయ భరత
శత్రుఘ్ను లని యేము చాల నెఱుంగుదు మిఁక మీఁద మాదుఃఖ మెల్ల నీవు
తే. మాన్పవలయును జనుదెమ్ము మానిసేవి, తాశ్రమములకు సతితోడ ననుజుతోడ
వచ్చి చూచిన మాపడుపాట్లు దెలిసి, పోవవలె నని దయచాలఁ బొడము నీకు. 50

వ. అనుచుఁ గృతాంజలిపూర్వకంబుగ. 51

క. యతివరులచేత విజ్ఞా, పితుఁడయి రామప్రభుండు ప్రియసోదరభూ
మితనూజాయుతుఁడయి వెస, నె తదీయాశ్రమము లెల్ల లీలం జూడన్. 52

వ. ఇట్లు వెడలి వారలతోడం గొంతదూరంబు చని యచట నస్థిమాత్రంబులయి వనభూమి
యంతటం బడియున్న శిరంబు లనేకంబులు గాంచి రామచంద్రుండు మునులతోడ
నీశల్యంబు లెవ్వరి? వేల పడియుండె? ననిన నాజటిలు లిట్లనిరి. 53

తే. రామ! మునిమస్తకము లివి రాక్షసాళి, పాఱివైచెను భక్షించి పరమనిష్ఠఁ
దా రెఱుంగక యుండినతఱిని గవిసి, యేమనందుము సైఁప రొక్కింతరైన. 54

వ. ఇట్లు బహుకాలంబు జరిగె ననిన ధర్మదైన్యసమన్వితం బగు సంయమిసముదయ
వాక్యం బాకర్ణించి. 55

క. ప్రతిన యొనర్చెను రాక్షస, తతి నిది మొదలెచటనున్న దండింతు భవ
ద్గతముగ నని యుండఁగ విన, నతిమోదమునొంది రమ్మహామును లెల్లన్. 56

## రాముఁడు సుతీక్ష్ణాశ్రమమునకుఁ బోవుట.

వ. అంత గహనవాసు లగు నమ్మునులవలన ననవరతపూజ్యమానుండై సీతాలక్ష్మణులతోడ నవ్వనంబుల రఘునందనుండు కొన్నివర్షంబులు గడపె నిట్లు క్రమక్రమంబున ఋష్యాశ్రమంబు లెల్లం జూచుచుఁ బ్రఖ్యాతంబును మహామునిసంకులంబును సర్వగుణసంపన్నంబును సర్వకాలశుభావహంబును నగు సుతీక్ష్ణాశ్రమంబునకుఁ జనిన నగస్త్యశిష్యుండును రామమంత్రోపాసనాతత్పరుండును నగు నా సుతీక్ష్ణుండును రాఘవానుగమనంబు విని తనయంతన సత్వరుండై చనుదెంచి విధిప్రకారంబునం బూజించి భక్త్యుత్కంఠితలోచనుండై యిట్లనియె. 57

ఉ. భూరిగుణాప్రమేయ! శశిభూషణపద్మభవాశ్రితాంఘ్రిపం
కేరుహ! మైథిలీరమణ! కిల్బిషసంహర! పూర్ణకామ! సం
సారమహార్ణవోద్ధరణసాధననామ! రమాభిరామ! నీ
తారకనామమంత్రజపతత్పరుఁడన్ తవదాసదాసుఁడన్. 58

ఉ. నీవు జగంబువారలకు నిక్కము గన్పడియుండి సంసృతిన్
దేవర! మాయచేఁ దవిలి త్రిమ్మరుమందిరపుత్రమిత్రదా
రావిషయాంధకూపవివరస్థమలామిషపిండమోహపా
శావృతు నన్నుఁ గాంచి దనయంతన వచ్చితి వాదరింపఁగన్. 59

వ. మఱియు. 60

చ. అనఘ! సమస్తభూతహృదయస్థుఁడవయ్యు స్వమంత్రజాప్యదూ
రుని యెడ మాయఁ గప్పెదవు రూఢిగఁ దన్మహనీయమంత్రసా
ధను నెడఁ జేరనీక మదిఁ దాను దలంచి స్వజిరిమపోల్కి నో
య్యన ఫలదుండ వౌదువు జనాళికి నీదయ యింత రాఘవా!. 61

వ. మఱియును. 62

ఉ. విశ్వము గల్గఁజేయ నభివృద్ధి యొనర్ప నడంప హేతువౌ
నీశ్వరమూర్తి వొక్కరుఁడ వీవ గుణత్రితయాత్మమాయ వా
ణీశ్వర పార్వతీశ్వర రమేశ్వర రూపులమువ్వమానిమా
విశ్వము గల్గఁ దోఁతువు రవిప్రతిబింబబహుత్వవైఖరిన్. 63

వ. ఏనును. 64

ఉ. ఇచ్చట నేఁడు గంటి వృజినేతరమానసపద్మ మైనయ
ష్మచ్చరణారవింద మఘమర్షణదృగ్విషయుండవయ్యు నీ
యుచ్చకురాని కష్టుల కొకింతియుఁ గన్పడ వాత్మనామమం
త్రోచ్చరణామలాత్ముల కనుత్తమ! ముందఱ నిల్తు వెల్లెడన్. 65

వ. వెండియు. 66

సీ. నీవరూపిణుఁడవౌ దేవుండవైన నీరూపంబు గనుఁగొంటిఁ బాపహరము
మద్భాగధేయంబు మహితనీలోత్పలశ్యామంబు సప్రసన్నాస్యంబు నియత
చిత్తలక్ష్మణవరసేవ్యంబు సుమనుష్యవేషంబు శరచాపభూషణంబు
కందర్పకోటిసంకాశంబు వల్కలాంబరము దయార్ద్రస్వభావ మమిత
తే. గుణకరిష్ఠంబు శాంతంబు గురుతరస్మి, తాస్యమును జానకీయుతం బనుగతప్ర
కృతిగుణంబును గంటి మ్రొక్కితిని ధన్యుఁ, డైతి సఫలంబు జన్మమిం కన్యమేమి.

వ. మఱియు సకలదేశకాలాద్యుపాధిరహితంబును ఘనచిత్ప్రకాశంబును నగు నీరూపం
బెఱుంగుదు నిదియు ముందు ప్రత్యక్షంబై గనిపించుచున్నయది ఇదియు నాదు
హృదయంబున నెల్లకాలంబుఁ బ్రకాశించుఁగావుత యింక నితరంబు గాంక్షింప
ననిన రఘునందనుండును సుతీక్ష్ణుండు సేయు స్తోత్రంబునకు మందహాససుందరవద
నారవిందుం డై యిట్లనియె. 68

క. ఏ నెఱుఁగుదు నీచిత్తము, మానివర! వినిర్మలంబు మదుపాసనచే
నీవడర మెచ్చు నక్కఁ బడెఁ, గానఁగలే రన్యమార్గగాములు ధాత్రిన్. 69

వ. కాంచఁగలవా రెవ్వ రంటేని. 70

ఆ. నన్నెకాని యన్య మెన్నఁడు నెఱుఁగక, నాదుమంత్రజపము నాదుసేవ
నన్ను శరణు గనుట యిన్నియుఁ గలవారు, కాంతు రేను వారిచెంత నిలుతు. 71

క. మఱియును నామది సంతస, పడెడిన యీస్తోత్ర మెవరు పఠియించిన నే
మఱు వినిన వ్రాసినను మ, ద్వసథ క్తిజ్ఞానములు ధ్రువంబుగఁ గలుగున్. 72

తే. అన్నిటను నీవు ముక్తుండ వైతి విప్ర, డసఘ! మన్మంత్రజపముచేఁ దనువువిడిన
పిదప మామకసాయుజ్యపదవిఁ జెందఁ, గలవు నిస్సంశయంబు నాపలుకు మఱియు.

వ. భవద్దేశికోత్తముండగు నగస్త్యమునిపుంగవుం గాంచి కొంతకాలం బచ్చట వివ
సింప మనంబు తొందర సేసెడు వెడలవలయు ననిన సుతీక్ష్ణుండును వల్లె యని రాఘవా!
యాసంయమిం గనుంగొని తడవుకాలం బయ్యె నేనుఁను జనుదెంచెద నెల్లి వెడ
లుద మనుచు నారాత్రి నిజాశ్రమంబున నిలిపె నంత. 74

చ. రవి యుదయాద్రిఁ దోఁచినను రాముఁడు లక్ష్మణజానకీముని
ప్రవరులతోడ నత్తఱి వెడలి పల్మరు లోలతచేతఁ గుంభసం
భవుని మహాప్రతాపములు పల్కుచు మెల్లనఁ జేరెఁ దద్ఘటో
ద్భవసహజాశ్రమంబునకు భానుఁడు రెండవజాము నుండఁగన్. 75

వ. ఇట్లు సుతీక్ష్ణసీతాలక్ష్మణసమేతంబుగా మధ్యాహ్నంబున నగస్త్యానుజమందిరంబు చేరి యామునిపుంగవుచేతం బూజితుం డై వన్యాహారంబు లాదరించి యవ్వాసరం బయ్యాశ్రమంబునం బుచ్చి ప్రభాతం బగుడుం గాలోచితంబులు సల్పి యచ్చట వెడలి రామచంద్రుండు. 76

సీ. ఋతుషట్కధర్మసంయుత మై మహాసత్త్వసముదాయజాతివైరములు లేక
లలితపల్లవపుష్పఫలసమూహానమ్రశాఖాంచితావనీజముల మించి
బహువిధవిహగసంపత్కూజితంబుచే వసుమతి నందనవన మనంగ
బ్రహ్మర్షి దేవర్షి మండలసంకులం బై సమలంకృతం బై యనుత్త
తే. మంబు రెండవబ్రహ్మలోకం బనంగ, వేదఘోషల శాస్త్రానువాదములను
జరితస్వాహాస్వధామునిశబ్దములను, దనరు కుంభోద్భవుని తపోవనముఁ గనియె. 77

వ. ఇట్లు కుంభసంభవాశ్రమంబు గని లోనికిం జనక నిలిచి సుతీక్ష్ణుం గని నీవు చని సీతాలక్ష్మణులతోడ నేను వచ్చుట నగస్త్యసంయమి కెఱిఁగింపు మనిన మహాప్రసాదం బని శీఘ్రంబ యయ్యాశ్రమంబులోనికిం జని యచ్చట. 78

తే. యమిసమూహంబునడుమఁ బద్మాసనస్థుఁ, డగుచు శ్రీరామభక్తుల కతిముదమున
రామమంత్రార్థ మెల్లను బ్రేమ దెల్పు, ననఘుఁ గుంభోద్భవాఖ్యసంయమినిఁ గనియె.

క. కని చేరఁ జేరి వినయా, వనతుం డై మ్రొక్కి సుగుణవంతుఁ డగుట ని
ట్లనియెఁ బ్రహ్మమునీశ్వర!, మనవాకిలిలను పృత్త్యమాన్యం డిపుడున్. 80

క. ధరణిజయుఁ లక్ష్మణుఁడుం దో, నరుదేరఁ ద్వద్దర్శనార్థి యగుచుఁ బ
ఙ్క్తిరథాత్మజుఁ డగు రాముఁడు, కరుణాత్ముఁడు నిలిచె నిటలఘటితాంజలి యై.

సీ. అనిన సుతీక్ష్ణుచే నాదరంబున రామవృత్తాంత మెల్లను విని యగస్త్య
మునిపుంగవుఁడు మోదమున సాశ్రునయనుఁ డై పలికె సుతీక్ష్ణ! మంగళము నీకుఁ
దనరు వేగమె తోడ్కొనిరమ్ము మామకచిత్తాబ్జసదను లక్ష్మీసమేతు
రాము భూమిసుతాభిరాముఁ దదీయపాదాంభోరుహధ్యాన మాచరింతు
తే. వాఁడఁ గావున నిందున్నవాఁడ నగుచు, నేఁడు గనుఁగొందు వేడుకతోడ ననుచు
వెడలె నడవారిగమిఁ గూడి నడవ నసవ్య, దుగ్రకరవంతుఁ జూడఁ గుంభోద్భవుండు.

## శ్రీరాము నగస్త్యుఁ డాశ్రమంబునకుఁ బిలుచుకొని పోవుట.

వ. ఇట్లతిత్వరితంబున వెడలి రామచంద్రుసమీపంబునకు వచ్చి యిట్లనియె. 83

ఉ. రమ్ము శుభమ్ము నీకు రఘురామ! మహాగుణధామ దైవయో
గమ్మున నీసమాగమము గల్గె మహాతిథి వౌచు నాకు ల
భ్యమ్మయి తిర్యుఁడ౯ సఫలమయ్యె దినంబు మనంబునం దజ
స్రమ్మును నిన్ను నమ్మిన నిజమ్మగురూపముఁ జూపకుందువే. 84

ఆ. అనిన రామచంద్రుఁడును వచ్చు మునివర్యుఁ, గాంచి హర్షమునను గాంతతోడ
ననుజుతోడ సాఁగి యవనిపై దండప్ర, ణామ మాచరింప నామునియును. 85

వ. తూర్ణంబుగఁ గరంబులనెత్తి భక్తితోడం గౌఁగిలించి యమ్మహామహాసందర్శనాహ్లా
దంబునజాలువులగు బాష్పజలంబులం దడియుచుఁ బ్రహృష్టమానసుం డయి
రఘునందనుం డగు నారామచంద్రుకరంబు కరంబునఁ బట్టి తనయాశ్రమంబులో
నికిం గొనిచని యాసనంబిడి బహువిస్తరంబులగు పూజలవలనం బూజితుం జేసి పరి
పరివిధంబులగు వన్యాహారంబుల యథాన్యాయంబుగ భోజనంబు సేయించి సుఖో
పవిష్టుండగుశశినిభాననుఁ గౌసలేయుం జేరి యేకాంతంబున భగవంతుండగు నగస్త్య
ఋషికృతాంజలి యై యిట్లనియె. 86

సీ. నీసమాగమనంబె నే నిరీక్షింపుచు నున్నవాఁడ మహాత్మ! యెన్నఁ డీవు
బ్రహ్మచే దుగ్ధాంబురాశిమధ్యంబున ననుమతిభారనివారణమును
రావణహననంబుఁ గావింప సంప్రార్థితుండ వైతివో నాఁట నుండి యేను
దప మాచరింపుచుఁ ద్వద్దితదర్శనాకాంక్షినై మునిసంఘంబుతోడ

తే. నిన్నె మదిఁ జింతసేయుచు నిన్నిదినము, లుంటి మద్భాగధేయంబు గంటి వేఁడు
కొంటి నీకమీఁద నడ్డ మేమంటి నాల్గు, రంటి గంటితిఁ జాల నిన్నంటి యుంటి.

వ. దేవా! సర్గంబునకుఁ బ్రాక్తనకాలంబున నుపాధిరహితుండవును నిర్వికల్పజ్ఞానస్వరూ
పుండవును సన్మాత్రుండవు నగుచు నీ వొక్కరుండవై యుంటివి భవదాశ్రయంబును
భవద్విషయికంబును నగుమాయ భవచ్ఛక్తి యనం బరఁగు నేసమయంబున నిర్గు
ణుండవగు నిన్ను నాశక్తి యావరించు నప్పుడు వేదాంతపరినిష్ఠితులగు బుధులు
నిన్నవ్యాకృతుం డని పలుకుదురు మఱియు నాశక్తిని గొందఱు మూలప్రకృతి
యనియుఁ గొందఱు మాయ యనియు నవిద్య యనియు సంసరణం బను బంధం
బనియు నివి మొదలగు బహువిధనామంబుల వ్యవహరింతు రదియును నవ్యాకృత
రూపుండ వగు నీచేత సంచోద్యమాన యై మహత్తత్త్వంబును గనియె నట్టిశక్తి
చేతఁ జోదితమైన మహత్తత్త్వంబువలన నహంకారంబయ్యె నమ్మహత్తత్త్వాహంకారం

బులు రెండునుం గలసి సాత్త్విక రాజస తామసంబు లన మూఁడువిధంబు లయ్యె నందుఁ దామసంబునఁ దన్మాత్రలగు సూక్ష్మభూతంబు లయ్యె వాటివలనఁ బంచీకృతంబులు క్రమక్రమంబున నుత్తరోత్తరగుణాధిక్యంబులై జనియించె నింక రాజసంబువలనఁ ద్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులును వాక్పాణిపాదపాయూపస్థలును నగు దశేంద్రియంబులునుం బుట్టె శబ్దస్పర్శరూపరసగంధాదులును వచనదానగమనవిసర్గానందాగులును దత్కార్యంబులై వెలింగెఁ గడమ సాత్త్వికంబువలన మనంబును సర్వేంద్రియాధిష్ఠితులగు దేవతలునుం బుట్టిరి పూర్వోక్తంబులగు సూక్ష్మభూతంబులవలన సూత్రరూపంబును సర్వగతంబును మహత్తరంబునునగు లింగంబు వుట్టెఁ బిమ్మట స్థూలంబులగు భూతపంచకంబులవలన విరాట్టు సముత్పన్నంబయ్యె నవ్విరాట్పురుషువలనఁ జరాచరాత్మకంబగు జగంబును దేవతిర్యఙ్మనుష్యాదిభూతంబులును గాలకర్మక్రమంబున నుద్భవంబు లయ్యె మఱియును. 88

సీ. సురవంద్య! నీవు రజోగుణంబున జగత్సర్గకారణపద్మజన్ముఁ డనఁగ
సాత్త్వికంబునఁ జరాచరపోషణుండవై విధు లెన్న శ్రీమహావిష్ణు వనఁగఁ
దామసంబున జగత్ప్రళయకారణుండవై ధురికీర్తితోడ రుద్రుండ వనఁగ
నీదుమాయాగుణభేదంబులను దోఁచు లలిఁ జాగ్రత్స్వప్నములు సుషుప్తి
తే. యాదిగాఁ గల్గువృత్తిత్రయంబు బుద్ధి, జంబు గావునఁ దద్విలక్షణుఁడ వీవ
చిన్మయుండ వవ్యయుఁడవు సాక్షివియు నీవ, నీవ భువనంబులకు నెల్ల జీవనంబు.
వ. మఱియును 90

క. పరమేశ సృష్టిలీలా, చరణుఁడవగు వేళ సగుణచందంబున నీ
కగణ మొప్పుగ్రవు మాయను, నిలితశయుఁడ వగుణుఁడవు ననింద్యుఁడ వయ్యున్.

వ. రామచంద్రా! విద్యయు నవిద్యయు నన రెండువిధంబుల నీదుమాయ ప్రకాశించు నందుఁ బ్రవృత్తిమార్గంబునం దగులువార లవిద్యావశులై దిరుగువారును నివృత్తిమార్గనిరతులై యుపనిషదర్థవిచారంబు సేయుచు నీదుభక్తియుం దనుగ క్తిగలిగి యుండువారలు విద్యామయు లని పల్కంబడుదు రింక నవిద్యకు లోనై తిరుగువారలు నిత్యంబును సంసారదుఃఖంబునం బొరయుదురు విద్యాభ్యాసరతు లగువార లెవ్వ రమ్మహాత్ములు నిత్యముక్తులు లోకంబునం దెవ్వరు నీకు భక్తులై నీదుమంత్రోపాసనంబు సేయుదు రట్టివారలకు విద్య సంభవించుంగాని యితరులకు నెంతకాలంబున కయినను గల్గనేరదు నీదుభక్తియును సుధాస్వాదనంబు సేయనివారలకుఁ గలలో నయిన మోక్షంబు చేకూరదు కావున నీదుభక్తు లెవ్వరో వారలే ముక్తు లనఁ బరఁగుదురు సందియంబు లేదు రాఘవా యూరక బహువిధంబుల వచింప నేల యి

క్రాంత సారంబు నీకుఁ బల్కెద మోక్షహేతువున కయ్యెడను సాధుసాంగత్యంబు
ప్రసిద్ధం బని పురాతనయోగికథితంబుగావున నది యవశ్యకర్తవ్యం బట్టి నామం
బెవ్వరి కగునంటేని. 92

ఉ. కర్మములెల్లనుఁ విడిచి కామములన్ విడి నీదుభక్తిచే
నిర్మలులై సుఖాసుఖవిసర్జయభావము లేక తుల్యులై
ధర్మముఁ బూని నిస్పృహయు దాంతియు శాంతియుఁ గల్గువారలో
ధర్మకిరీటకుండల! కృపాకర! దాల్తురు సాధునామముల్. 93

తే. మతియు సమచిత్తులును సంగవిరహితులును, సర్వదా బ్రహ్మనిత్యరుల్ సత్త్వమాది
గుణగరిష్ఠులు నిర్జితేషణులు దేవ, నైన ముదమందువారు సజ్జనుఁ దగుదురు. 94

సీ. అట్టివారలతోడ నధికసాంగత్యంబు వీనిభాగ్యముచేత వెలసెనేని
జనియించు నీకథాశ్రవణకౌతుక మంతముఖ్యసనాతనమూర్తివైన
నీయందు భక్తియుఁ బొడముకుండెడు నట్టి భక్తిచే లభియించుఁ బ్రబలమైన
విజ్ఞాన మిది భక్తివిధము పురాతనయోగిసమ్మతము సర్వోత్తమంబుఁ
తే. గాన శ్రీరామ! ప్రేమలక్షణ యనంగఁ, బరఁగు నీపాదభక్తియు వారిసమాగ
మంబె యనఁదగు సత్సంగమంబు రెండు, సుప్రయత్నంబుచే నాకు సొంకుఁగాత.

మ. సఫలం బయ్యె భవత్సమాగమముచే జన్మంబు మద్యజ్ఞముల్
సఫలంబుల్ చిరకాల మేను విజితస్వాంతంబునం జేయుపు
ణ్యఫలం బయ్యెడ నీపదార్చనము నిత్యానంద! గోవింద! స
ర్వఫలప్రాపక! దేవదేవ! కరుణావారాశి! సీతాపతీ!. 96

ఉ. దేవ! వసింపు మింక భవదీయసతీమణితోడ నాదుచి
త్తావరణంబునందు భవదంఘ్రిసరోజయుగస్మృతి యెల్లకాలమున్
శ్రీవర! నాకుఁ బొలుపడఁజేయుము కాయుము మామకాపరా
ధావళి యంచు సర్వవిభు రమావిభుఁ జాల నుతించి మానియున్. 97

వ. తొల్లి మహేంద్రునిచేత రామార్థంబు సంస్థాపితంబగు నొక్కమహాధనువును నక్ష
యతూణీరద్వయంబును రత్నభూషితంబగు ఖడ్గంబును సమర్పించి యిట్లనియె
రామచంద్రా! భూభారభూతంబగు రాక్షసమండలం బెల్లం దెగటార్చుటకు మాయా
మానవరూపంబున నవతరించిన కార్యంబుఁ దీర్పు మిచ్చటికి రెండు యోజనంబుల
దూరంబున గోదావరీతీరంబునఁ బంచవటి యను పేర దివ్యకాననమండితంబగు నొ
క్కపుణ్యాశ్రమంబు గల దచ్చట నివాసంబగు వనవాసకాలంబు వెడలింపం దగు

నచ్చట దేవమానవసుఖావహంబు లగుకార్యంబు లనేకంబులు మీచేతఁ జేయం
బడుఁగానఁ గర్తవ్యం బనిన. 98

ఘనతత్త్వార్థసమన్వితంబుగ వెలుంగన్ గుంభజన్ముండొసం
గ్చిన సుస్తోత్రము నాలకించి విభుఁడా శ్రీమంతుఁ డాలోకలో
చనుఁ డత్యంతముదంబునన్ మునివరున్ సంభావితుం జేసి పి
డ్కొని తద్దర్శితమార్గమందు వెసలెన్ ఘోరాటవీమేదినిన్. 99

## శ్రీరాముఁడు పంచవటీతీరంబున కరుగుట

అనుచుఁ బురత్రాసదమనుఁడు, తనవామాంకస్థ యగుచుఁ దనస గుసుమా
వనిత కటిఁగిరంపుచును బల్కొను మరుఁగ రామచంద్రుకృతకార్యంబుల్ 100

ఇట్లు సీతాలక్ష్మణసమన్వితంబుగ నతిదుర్గమంబగు నమ్మహావిపినంబునం జనుచు నా
క్కొయెడ: బర్వతశృంగంబుభంగిఁ దనరారెడు నతివృద్ధు జటాయువుం గనుంగొని
యిది యేమియని విస్మయంబున రామచంద్రుండు తమ్మున కిట్లనియె. 101

కార్ముకఁ బిమ్ము లక్ష్మణ! మనముంగల నొకరక్కసుఁడు పడియున్నవాఁడు
పరిమార్తు ననిన నప్పలుకులు విని పక్షిరాజు మహోగ్రసంభ్రాంతుఁ డగుచు
నోరామ! యే యథార్థుఁడఁ గాను మిగుల మీతండ్రికి సఖుఁడ భద్రంబు మీకుఁ
దనరు నేను జటాయు వను గృధ్రజాతుండ మీకును బ్రియముగా మెలఁగువేడ్క
నిందు వసియించియుంటి మీ రెన్నఁడైన, వేఁటలాడంగఁ జనినయవ్వేళయందు
సీత లోకైకమాత నాచేత సుప్రయత్నమునఁ జాల రక్షిత యగు నిజంబు.
అనిన నవ్విహంగపుంగవువచనంబులను మందహాసంబుతోడ రఘునందనుం డి
ట్లనియె. 103

పక్షిసత్తమ! నీవు పరమసాధుఁడ వట్లె నేయుండు మత్ప్రియం భీయరణ్య
మందు మాకు సమీపమందు నిల్వుము దూరమున కేఁగకు మటంచు మనుజవిభుఁడు
వనితయు ననుజన్ముఁడును గూడ నడుమనంగ గౌతమీతటమునఁ గలుగుపంచ
వటిఁ జేరి కడుగుణవంతుఁ డౌ లక్ష్మణుచేత శాలలు రెండు నేయఁ బంచి
మనుజసంచారరహితమై మహిత మగుచు, జాహ్నవికి నుత్తరమున విశాల మయిన
యవ్వనంబున జనకకన్యావిభుండు, నిలిచె బహుభేద దివమునందు నిలుచునట్లు 104

ఇట్లు శంభాషణసమాతౌదిఫలవృక్షసమూహంబును రోగవిరహితంబును పవిత్రం
బును నగు నయ్యాశ్రమంబున విద్యాంసుండగు లక్ష్మణుతోడ జనకనందనకు వినో
దంబు గల్పించుచు సుఖంబుగ రామచంద్రుండు వసియించె నవ్వేళ సౌమిత్రి
యును ననుదినంబును గందమూలాదులు సంపాదించి కొనితెచ్చి సీతారాములకు

సమర్పించుచు ధనుర్బాణంబులు పూని జాగ్రతతోడ శత్రులయం దంతటఁ గాచి
యుండుచు రామసేవాతత్పరమానసుం డై యుండె నప్పుడు. 105

తే. వారు మువ్వురు గౌతమీవారియందు, ననుదినంబును స్నానంబు లాచరింతు
రవనినందనయును గమనాగమములఁ, జేయుతఱి రాఘవుల నీడఁ బాయకుండు.

వ. మఱియు నారామానుజుండును బ్రీతచిత్తుం డై యనుదినంబును గోదావరీజలంబులు
దెచ్చి యన్నకు వదినెకు నాయువెనకు రేయుఁబగళ్ళొసంగుచు నుండు నిట్లు ము
వ్వురు నవ్వనంబున నివ్వటిల్లుసుఖంబులం గొంతకాలంబు గడపి రంత లక్ష్మణుండు.

సీ. ఒకనాఁడు సూర్యసన్నయోగముద్రాస్థితు శాంతాదిలక్షణు దాంతు ధీరు
నానందసాగరు నచ్యుతు నపేతు మాయావిమూఢు నిర్మలు సుశీలు
నద్వైతు నమకూలు నజు సర్వభూతస్థు శివుని రాఘవసార్వభౌముఁ జేరి
వినయంబునను హస్తవనజంబులు మొగుడ్చి కరుణాకరాద్య! శంకర! మహేశ!

తే. దేవ! రఘునాథ! మీచేతఁ దెలియ నిచ్చ, గలదు సమ్మతమయిన మోక్షంపుదెరువు
నాయెడను జాల దయయుంచి మాయలెల్లఁ, బాపుటను దీనిఁ బల్కు సంక్షేపముగను.

వ. రఘువల్లభ! నీకంటె నొండొరులు పల్కువారలు గనఁబడరు గావున భక్తివైరాగ్య
శేషంబును విశేషజ్ఞానసహితంబును నగు జ్ఞానంబు నానతీయ యనిన లక్ష్మీవల్లభుం
డగు నారఘుకులోత్తముండు సుమిత్రాతనయు వినయభాషణంబులకు సంతసించి
సదయుండై యిట్లనియె. 109

## శ్రీరాముఁడు లక్ష్మణునకు బ్రహ్మోపదేశం బెఱింగించుట.

ఉ. తమ్ముఁడ! నీకుఁ బల్కెద ముదమ్మున నిప్డు ననుత్తమమ్ము గో
ప్యమ్ములకంటె గోప్య మెవఁ డైనను దీని నెఱింగి పాఱఁగాఁ
జిమ్ము వికల్పవిభ్రమముఁ జెప్పెద నీ కది నేఁ డటంచు మో
దమ్మునఁ బల్కె రాముఁ డరిదానవగర్వవిరాముఁ డప్పుడున్. 110

వ. సౌమిత్రీ! యాకర్ణింపు మేది కారణంబుగా నక్షేయుండగు పరమాత్మ నెఱింగి దుః
ఖంబువలన నరుండు విడువంబడు నట్టి కారణంబుఁ బ్రథమం బమ్మాయాస్వరూపం
బును దదనంతరం బజ్ఞానసాధనంబును నంత నాత్మస్వరూపవిజ్ఞానవిషయికంబగు
జ్ఞానంబును బల్కెద నింక ననాత్మయగు శరీరంబున 'స్థూలోఽహం కృశోఽ
ఽహ' మనుటయాదిగాఁ గల యాత్మబుద్ధి యెద్ది గలుగు నదియే మాయ యనం
బరఁగు నమ్మాయవలననే సంసారంబు వడయు రవికులనందనా! విక్షేపావరణంబులన
మాయకు రెండురూపంబులు పూర్వంబ నిశ్చితంబు లయ్యె నందు మొదటిదియగు
విక్షేపశక్తివలన స్థూలసూక్ష్మాదిభేదంబుల లింగాది బ్రహ్మపర్యంతంబును జగంబు

కల్పింపంబడియె. రెండవదియగు నావరణశక్తి యఖిలవిశ్వమైకవాస్తవజ్ఞానంబును నావరించుకొనియుండు. నింక రజ్జువునందు భుజంగభ్రాంతి దోఁచుభంగి విశ్వం బెల్లను మాయవలనఁ గేవలపరమాత్మయందుఁ గల్పితంబయ్యెం గాని విచారింప నొక్కింతయుఁ గనుపడదు వరుసచే నెయ్యది వినంబడుఁ జూడంబడుఁ దలంపంబడు నదియంతయు స్వప్నమనోరథంబులభంగి మిథ్యాభూతంబులు గాని సత్యంబు గాదు మఱియును దేహంబ యీసంసారవృక్షంబునకు మూలంబని దృఢంబుగఁ బల్కంబడియె. పుత్త్రదారాదు లెల్లను దన్మూలంబు లగుచుండు గావున నిర్వికారస్వరూపుండవగు నీవు పూర్వోక్తంబగు దేహవిషయికమార్గంబునం గాక తక్కినమార్గంబువలనఁ దద్బంధంబు లెక్కడి వట్టిదేహం బెట్టి దనినఁ బృథివ్యాదిస్థూలభూతంబు లయిదును దన్మాత్రలగు శబ్దాదు లైదును నహంకారబుద్ధులు రెండును జ్ఞానేంద్రియకర్మేంద్రియంబులు పదియును జిదాభాసుండును మనంబును మూలప్రకృతియునుం గూడఁ బంచవింశతితత్త్వాత్మకం బై క్షేత్రం బనియు దేహం బనియుఁ జెప్పంబడు వెండియు. 111

తే. అట్టిదేహంబునకు భిన్నుఁ డగుచు నామ, సుముఖుఁ బొరయక పరమాత్మ యనఁగ జీవుఁ
డలరుఁ దజ్జీవవిజ్ఞానమందు ముఖ్య, సాధనంబులు వినుము లక్ష్మణకుమార!. 112

వ. జీవుం డనినను బరమాత్మ యనినను 'కోకిలః పిక' యనుశబ్దంబులభంగి పర్యాయపదంబులు గాని జీవపరమాత్మలకు నొక్కింతయు భేదంబు లేదు నిజంబు. 113

సీ. పరఁగ వృద్ధాచార్యభక్తులయందు సద్గురుసేవ హింసాదివిరహితంబు
స్థిరత సత్క్రియలందు నిరహంకృతియు మానదంభవర్జనమును దపము పుత్త్ర
దారాదులందును ధనమందు నాసక్తి పొరయమి జనసంఘవిరహిత మగు
శుద్ధదేశమున నిల్చుట పరాక్షేపాదిసహన మిష్టానిష్టసమత శాంత

తే. మితరమతిలేక సకలవ్యాప్తస్థితుని నన్నుఁ, దెలియుటయుఁ బ్రాకృతులతోడఁ గలయకునికి
గలుగఁ గలుగును జ్ఞానంబు గలుగకున్నఁ, గలుగ దదిక్క మిబ్భంగిఁ దెలియవత్స!.

క. మఱియును బాహ్యాభ్యంతర, పరిశుద్ధియు వేదసారభావజ్ఞతయున్
సరవి! విషయాదుల భవ, మరణాద్యాలోచనంబు మానఁగవలయున్. 115

వ. సర్వకాలంబున సవక్రతయు వాజ్ఞానసంబుల దండించుటయు నాత్మజ్ఞానంబున నెల్లయెడల నుద్యోగంబును గర్తవ్యంబులు. 116

తే. ఏ మనఃప్రాణబుద్ధ్యహంకృతిశరీర, ముల విలక్షణుఁ డను నిత్యబుద్ధశుద్ధుఁ
డను చిదాత్మ నటంచు దార్ఢ్యమునఁ గట్టి, జ్ఞానమునఁ దోఁచునదియె స్వజ్ఞానమనఁగ.

వ. అవ్విధంబు సాక్షాదనుభవంబునం గాని విజ్ఞానంబున లభియింపదు. 118

సీ. అనపావృతుండునునై యాబ్రహ్మ తృణ కన్యములగు దేహాదుల వెలుఁగఁజేయు
స్వప్రకాశంబున సత్యసంపూర్ణుండు బుద్ధ్యాద్యుపాధులఁ బొరయఁడొక్కఁ
డద్వితీయుండు సత్యజ్ఞానముఖలక్షణాంచితుండును ద్రష్ట యవ్యయుండు
పరిణామముఖ్యషడ్భావవర్జితుండు విజ్ఞానంబునకు నైనఁ గానఁబడఁడు
తే. స్వప్రభువు సంగరహితుఁ డాచార్యశాస్త్ర, కథితముల నెప్పు డిట్టి విజ్ఞానమమరు
నయ్యెడను జీవపరమాత్మలందుఁ గలుగు, మూలమయిన యవిద్య నిర్మూలమవును.
వ. అదియుఁ గార్యకారణంబులతోడఁ జిదానందాత్మకుం డగు నప్పరమాత్మయందు
లీయంబగు జీవంబు కల్పితుండగు నవ్వేళఁ బరమాత్మ యెఱుఁగంబడుఁ గావున
నయ్యెఱుకయే ముక్తి యనం బరఁగు నదియు బంధరహితుండగు పరమాత్మయందు
నౌపచారికం బనంబడుఁ గాని యథార్థంబు గాదు వినుము. 120

చ. స్థిరమతి నెవ్వరైన మది జీవపరేశవినిర్ణయంబుఁ దా
రెఱిఁగిరయేనిఁ జెందుదు రహీనశుభావహనిత్యముక్తవి
స్ఫురదురుసేవితం బగుచుఁ సొంపు దలిర్చుపదంబుఁ గాన భా
స్కరకులపుత్ర! నీ కెఱుఁగఁగా గణుతించితి నిట్టి నెమ్మదిన్. 121
వ. పరమాత్మస్వరూపుండనగు నాదైన మోక్షస్వరూపంబును 122
తే. జ్ఞానవిజ్ఞానవైరాగ్యసమ్మతంబు, తిరముగఁ గానుపించని తెఱఁగు నాదు
భక్తిహీనుల కెఱుఁగంగఁ బడదు తెలియఁ బడును భక్తున కిలఁ బట్టపగటికరణి.
వ. ఇదియునుం గాక యొక్కింత నాదుభక్తియునుం గలుగవలయు యాథార్థ్యంబు
వల్కెద వినుము. 124

సీ. సతతంబు మద్భక్తసాంగత్యము మదీయసేవ మామకభక్తసేవనంబు
మొనసి యేకాదశీ మొదలగు మత్పర్వముల నుపవాసానుమోదనంబు
మత్కథాశ్రవణసమ్మతియును వ్యాఖ్యానతత్పరముల నిత్యతత్పరతయు
మత్పూజయందు సమ్యక్చిత్తనిష్ఠయు మదీయనామానుకీర్తనప్రేమ యిట్లు
తే. సంతతంబును గల్గిన సజ్జనులకు. భక్తి యవ్యభిచారమై పరఁగుఁ గాన
నేమి తక్కువ విజ్ఞాన మెనయు గాగ, మఱఁగు సుజ్ఞాని యగు ముక్తుఁడగు నిజంబు.
వ. భక్తిచేత నఖిలంబును వేగంబె చేకూరుం గావున నీవు సేయు ప్రశ్నవలన నింతయు
నా చేతఁ బల్కంబడియె నీమార్గంబున నెవ్వఁడేనియు మనంబుఁ జేర్చి వర్తించు
నతండు విగతకల్మషుండును భక్తిభాజనుండును నగు మఱియును. 126
ఆ. నాదుభక్తి లేని నరులకుఁ దెలియంగఁ, బలుకఁబోల దింకఁ బలుకవలయుఁ
బిలిచిరైన నాదు ప్రియభక్తులకు సుమి, త్రాతనూజ! విమలతపసతేజ! 127

ఎవరైన నిది నితాంతము, ప్రవిమలమతి వినవవారు పఠియించిన ని
బ్బవపటలధ్వాంతము విడి, శివకర మగు మోక్షలక్ష్మిఁ జెందుదు రనఘా!. 128

ఇంత పల్కనేల వినుము. 129

అతిశాంతాత్ములు మత్పదాబ్జయుగసేవాసక్తులున్ భక్తులా
తతవిజ్ఞానులు యోగు లైన జనులన్ దర్శింపుచున్ సంతతో
ద్యతచిత్తంబున నాదుసేవ యమచుం దద్భక్తి సేయన్ పర
స్థితమౌ మోక్షము వాని కెయ్యెడల నే దీపింతు హృద్వేదిన్. 130

సంశయము లేదనుచు భానువంశతిలకుఁ, డనుజాతోడుతి నానతిచ్చిన తెఱంగు
శైలసుతతోడఁ బల్కెఁ గపాలపాణి, భూరికరుణాంతరంగ! కస్తూరిరంగ!. 131

## శ్రీరామునికడకు శూర్పణఖ వచ్చుట.

వారుఁ దద్రితనయతో పురల నిట్లనియె నక్కాలంబునను మహాగహనమందుఁ
జరియించు నొకమహాసత్త్వయగు రాక్షసలలన జనస్థాననిలయ కామ
రూపిణి యదియు నేర్పుగను దానొకనాఁటి వేళ గోదావరీవిమలపులిన
తలముఁ దిరుగుచు జలజవజ్రాంకుశాద్యనుపమశుభరేఖ లమరియున్న

సర్వలోకసమస్కృతచరణయుగముఁ గాంచి తత్పాదసౌందర్యఘనత కెంతొ
భ్రమసి యాజాడఁ జనుదెంచెఁ బంచవటికి, మెల్లమెల్లన రామసమీపమునకు. 132

ఇట్లు చనుదెంచి యచ్చట. 133

కనియె రమాసతీశు జనకక్షితిపాలసుతాసమేతుఁ బా
వనఘనినీలాంగరాగు నభవప్రభు నిత్యనువర్ణవర్ణసం
జనకజటాకిరీటభరుఁ జండపరాక్రముఁ దాటకేయమ
ర్దను రతినాథసుందరు నిరామయుఁ బున్యవిశాలవక్షునిన్. 134

మఱియును. 135

అబ్జగంధిని నవ్యయు నచలు ననుపు, మానిని సీతాంబుజముఖాంప్రమహిత నేత్రు
నబ్జకంతు సమానుఘ నశుభచిహ్నుని, రాము శ్రీవత్సచిహ్నాంకితు రాముఁ గనియె. 136

కనుంగొని కామవిమోహిత యై యారక్కసి రాఘవుం జేరి నరిగి యిట్లనియె 137

ఎవ్వరివాఁడ వీ వెవఁడ వీయాశ్రమంబున జటావల్కలంబులు ధరించి
యేల చరించెద వద్ది సాధించెద వెఱిఁగింపు నాకు నే నెవయ రాక్ష
సిని గామరూపిణిఁ జెప్పెదఁ బేరు శూర్పణఖ మహోక్షుఁ డౌ రాక్షసేంద్రుఁ
డయిన రావణునకు ననుజన్మ నిమ్మహావన మానిశాచరవల్లభుండు

నా కొసంగెను మునుభక్షణంబె జీవ, నముగ నుండెద నిదండకమునఁ దమ్ముఁ

డైన ఖరుతోడ నీతెఱం గానతిమ్ము, దెలియఁగను వేఁడెద వదాన్యతిలక! యనిన.

ఉ. దానికి రాముఁ డిట్లనియె దానవి! రామసమాఖ్యుఁడ న్నయో
ధ్యానృపనందనుండ జనకాత్మజ మత్ప్రియభార్య సీత యి
మ్మానిని లోకసుందరి సమంచితలక్షణుఁ డైన లక్ష్మణుం
డౌను గనీయుఁడౌ ననుజుఁ డారయ నాకుఁ ద్రిలోకసుందరీ! 139

వ. మజ్జనకు నానతిఁ దలయిడి వనంబునకు వచ్చితి నిప్పు డెయ్యది నాచేత నీకుఁ జేయ వలయునని దాని నెఱింగింపు మనిన నదియు రామచంద్రువాక్యంబులు విని కామార్తయై యిట్లనియె. 140

తే. రమ్ము నాతోడ రామ! వనమ్ములందు, శైలములయందు మరుకేళి సలుపు మిపుడు
నిన్ను విడఁజాలఁ గామంబు నిలుపఁజాల, దడవు సేయకు మనిన నద్దాశరథియు.

వ. క్రేఁగంట జనకనందన నవలోకించుచు మందస్మితాననుం డై యిట్లనియె 142

సీ. కల్యాణి! యిదె నాకుఁ గాంత యున్నఁడు విడి యుండనేరదు యెట్టు లుందువీవు
సవతిదుఃఖముచేతఁ జనుము లక్ష్మణుఁడు నాతమ్ముఁడు మిగులసుందరుఁడు నీకుఁ
దగియుండు నాతని మగనిఁగా విహారింపు మనిన నద్దానవి యట్ల రామ
సోదరుకడ కేఁగి సుందర! మీయన్న యానతిచేఁ బతి వగుము నాకు
తే. వెడలుదము లెమ్ము వల దింకఁ దడవు రమ్ము, యనఁగ నతిమోహుఁడగు రాఘవానుజుండు
దానిపలుకులు విని పల్కె మానవతివి, నిపు నీకును మేలైన నెలవు వినుము. 143

క. ఏ సీతావల్లభునకు, దాసుఁడ ననుఁ జెందెదవని దాసి వగుదు వి
ట్లాసపడ కమ్మహామహుఁ, జేసికొనుము నీదు సేవఁ జేసెద నేనున్. 144

వ. నాకు భార్యవగుకంటె దుఃఖతరంబు లేదు వేగంబ యమ్మహాత్మునకడకు నడువు మతం డఖిలేశ్వరుం డగు రాజతిలకుండు గావున నీకును మంగళంబు చేకూరు ననిన నదియును దుష్టమానస యై మరల రాఘవుసమీపంబునకుం బఱచి క్రోధంబున ని ట్లనియె. 145

ఉ. ఏటికి నన్ను ద్రిప్పెద విటుగతితో ననవస్థితుండ వై
మాటికిఁ జూడు మిప్పు డొకమాత్రన నోటికి ముద్దఁ జేతు ని
బోఁటి నటంచు ఘోరునను భూసుతపై గమకింపఁ గోపదో
పాటిని బట్టి ముక్కు చెవు లయ్యెడ లక్ష్మణుఁ డాత్తఖడ్గుఁ డై. 146

## శూర్పణఖ లక్ష్మణునిచేత భంగపడి ఖరదూషణాదులం జేరి మొఱవెట్టుట.

వ. ఇవ్విధంబున. 147

క. అలఘుపరాక్రముఁ డగు రఘు, కులతిలకుఁడు లక్ష్మణుండు కొంకక సీతా

లలనావిభు నానతిఁ దన, చెలు వడఁచిన ఘోరరవము సేయుచు నదియుఁన్. 148

భయంకరంబుగ నెత్తుటం జొత్తిల్లు మేనితోడఁ బరుషాక్షరంబులు పల్కుచు నేడ్చుచుం బారి ఖరునికాల్వ్రనం బడిన నిది యేమి యని ఖరరాక్షసుండగు నారాక్షసుండును. 149

ఎవఁడు యమాలయంబునకు నేఁగుతలంపునఁ గ్రొవ్వి నీకు నేఁ
డవమతిఁ జేసెఁ బల్కు మిపు డార్చద సంతకతుల్యుఁ డైన ని
క్కువ మన నాత్మపాచరియుఁ గొంకక యిట్లనె తోడ లక్ష్మణుం
డవనితనూజయు న్నడువ నాయతబాహుఁ డొకండు లీలతోన్. 150

దండకం బెల్ల నిర్భయంబు సేయుచు గోదావరీతటంబున నిలిచియున్నవాఁడు వెండియు. 151

వాఁడు రాఘవుండు వానిపంపున వాని, యనుజుఁ డిట్లు చేసె యనివె నన్ను
నీవు కులజుఁ డౌట నిక్కంపుఁ బోటరి, వైన వానిబింక మార్చి రమ్ము 152

లెమ్ము వారలం దెమ్ము తద్రక్తపానంబు చేసి యాసురుత్సుగులం దినియెదఁ గాదేని.

మృతి నొందెద నన ఖరుఁ డు, గ్రత సప్తసునాల్గువేల రక్కసుల నతి
ప్రతిభుల సన్నద్ధులకై, యతిశీఘ్రమె వెడలుఁ డనుచు నానతి యిచ్చెన్. 154

ఇట్లు భీమకర్ములగు రక్కసులం గొనుచు నాహవకాంక్ష చేత ఖరుండును త్రిశిరుండును దూషణుండును దండనాయకులై నానాప్రహరణాయుధంబులు కరంబులం బట్టి యొక్కపెట్ట నార్చుచు రామనివాసంబు చేరం జనుదెంచు సమయంబునఁ దత్కోలాహలశబ్దం బాకర్ణించి భగవంతుండగు రామచంద్రుండు సౌమిత్రిం గనుంగొని యిట్లనియె. 155

కనుఁగొను లక్ష్మణా! దివిజకంటకు లల్లదె యేఁగుదెంచు నల్
మనపయిఁ బోరు గల్గు నిఁక మార్కొని యుక్కడఁగింపఁ గోరదన్
జనకజఁ దోడుకొంచు నొకశైలగుహన్ భయమందకుండ నీ
వునిచి ధనుర్ధరుండ వయి యుండుము చూడుము మత్ప్రతాపమున్. 156

ఇయ్యెడ నొండు పల్కంబోలదు నామీఁద యాన గల దనిన సౌమిత్రియు నట్లె యని జనకతనయం దోడుకొని గహ్వరంబు కడకుం జనియె నంత. 157

శ్రీమంతుఁ డగునట్టి రామచంద్రుండును బరికరం బెల్ల నేర్పడఁ గఁ గట్టి
యతినిష్ఠురంబగు నాత్మకోదండంబుఁ గొని యక్షయశరంబు లెనయునట్టి
కవదొనల్ మూఁపున ఘటియించి సన్నద్ధుఁడై నిల్వ నప్పుడు తొడవులును
బలువడి నొకపెట్టఁ బఱతెంచి చిత్రవిచిత్రాయుధములును శిలలు పాద

ఉ. ఆతనిచేత నీల్గిన ననంతసుఖావహమా విమంతరా
జ్యోతిశయంబుఁ గాంతు నిపు డాతనిఁ గ్రుంచిన దైత్యరాజవి
ఖ్యాతిఁ దనర్తు భక్తిమెయి నాథగవంతుఁడు వేగఁ గావఁడే
సీతను వొప్పఁ జెందెద సురేతరనిగ్రహు రామవిగ్రహున్. 182

తే. అనుచుఁ బరమాత్ము సచ్యుతు నవ్వరేశు, జానకీనాథు నెఱిఁగి రాక్షసవిభుండు
దలఁచె విద్వేషబుద్ధిచేఁ దత్పదంబుఁ, జెందెద నటంచును గుహాశిఖరితనయ! 183

వ. అనుచు మరల నారాజకేతనుం డిట్లనియె నివ్విధంబున విశాసముఖుం బెల్ల విచారించి ప్రభాతం బగుడు రథారూఢుండై యేకాకి కార్యంబు మనంబున నిశ్చయించి బుద్ధిమంతుండగు రావణుండు మహోదధికవ్వలిదరిఁ వెలయు మారీచమందిరంబునకుం జనియె నచ్చట వాఁడును మునితెఱంగున జటావల్కలధారుండయి నిర్గుణుండును గుణభాసకుండును నగు పరమాత్మను హృదయంబున ధ్యానింపుచు సమాధివిరమంబునఁ దనయింటికి వచ్చినరావణుం గనుంగొని సత్వరంబున లేచి యాలింగనంబు గావించి విధ్యుక్తంబుగఁ బూజించి తనచేత నాతిథ్యంబు నొంది సుఖంబునం గూర్చుండిన యప్పంక్తికంఠునితోడ నిట్లనియె. 184

క. ఒంటరివై రథమున నీ, యింటికి వచ్చుటలు నిశ్చయింపఁగ మదిలో
గొంటఁదగనిదుఃఖం బొక, టంటినచందంబు దోఁచు సమరవిరోధీ!. 185

తే. అయిన నెఱిఁగింపు మతిగోప్యమయినఁ జేతు, నీకుఁ బ్రియముగ దాసనన్నింతయైనఁ
గలుష మొందక యుండంగ వలయు ధర్మ, పథము దప్పకయుండఁగవలయు ననిన.

వ. రావణుం డిట్లనియె. 187

సీ. వినవయ్య! యొకరాజు వెలయు సాకేతాధిపతి యభిధానంబు పఙ్క్తిరథుఁడు
సత్యపరాక్రమశాలి యాతని కగ్రతనయుండు రామాభిధానుఁ డట్టి
వనచరప్రియుఁ బోవఁబంపెఁ గాననమున కమ్మేటియును దండ్రియాజ్ఞఁ బూని
యతివతోడను దమ్ముఁడౌ లక్ష్మణునితోడ నరుదెంచి పంచవట్యాశ్రమమున

తే. ఘోరవిపినంబునను నిల్చె నారఘూత్త, మునిసతీమణి లోకమోహిని విశాల
నయననయగు సీతయనఁగ నాహ్వయముతోడఁ, బరఁగు జనకునిముద్దుఁగూఁతురనివింటి.

ఆ. అతఁడు నిరపరాధు లగునట్టి మారాక్షులను భీమవిక్రముల నడంచె
ఖరు నడంచె దోషవిరహితయయిన శూ, ర్పణఖముక్కు సెవులు బలిమిఁ గోసె.

వ. వెండియు. 190

ఆ. ఇట్లు చేసి భయ మొకింతయుఁ లేక యా, దుష్టచిత్తుఁ డిపు డభీష్టలీల
వనమునందు నున్నవాఁడంట నీసహా, యమున వానికాంత నపహరింతు. 191

వ. రాఘవుఁడు లేకయుండవలయుఁ గావున నీవును మాయామృగాకారంబున రామల
క్ష్మణుల నయ్యాశ్రమంబు వెడలింపు మంతట వైదేహిం గొనిచనియెదఁ దానత్ప
ర్యంతంబు నాకు సహాయం బొనరించి పూర్వప్రకారంబున సుఖం బుండుమనిన
నిట్లు భాషించుదశాననుం గనుంగొని విస్మితుండై మారీచుం డిట్లనియె. 192

## శ్రీరాముని మహిమ మారీచుఁడు రావణుని కెఱింగించుట

క. వినుమెవ్వఁ డిటు నీనాశముఁ, గనుఁగొని యీ మూలఘాతకరమగు వాక్యం
బనుకూలపఱిచె వధ్యుం, డును దండ్యుఁడు వాఁ డమిత్రుఁడును నగు నిక్కన్. 193

ఉ. ఆవసుధేశు పేరు వినినంతనె తల్లడమందు గుండె నా
కీవఱ కున్న దేమి యన నీతఁడు బాల్యమునందుఁ గౌశికుం
బ్రోవఁగ నేఁగుదెంచి యొకభూరిశరంబున నన్నుఁ జిమ్మినం
జేవ దొలంగి కూలితిని సింధువునన్ శతయోజనంబులన్. 194

ఉ. అదిమొదలేను జాలభయ మందుదు రామకృతంబు మాటికిన్
మదిఁ దలపోయుచున్ భువనమాన్య రఘూత్తము నన్ని వేళలన్
హృదయమునం గనుంగొని యదేను వనమ్మున రాక్షసేంద్ర! య
వ్యాదితుని పిన్ననాఁటి భుజవిక్రమ మియ్యెడ నొప్పియుండదే. 195

వ. వెండియు. 196

సీ. దండకంబున నవ్విభుం గాంచు వేళలఁ బూర్వవైరము మనంబునఁ దలంచి
చని తీక్ష్ణశృంగుఁడన్ మునివేషి నాదు మత్సదృశు లనేకులు తగిలిరాఁగ
జనకజాసహితు లక్ష్మణసేవ్యమాను నా రఘునందనుని సత్వరంబుతోడ
నేను దాఁకిన నమ్మహీశుం డలిగి యొక్కశరము నాపై వైవ శరనిపాత

ఆ. భరముచేత నురము పరితులై చిరచిరఁ, దిరిగి వారిరాశిదరిసి కూలి
నాఁటనుండి యివ్వనంబున నున్నాఁడ, విల్లు వగలి మిగులఁ దల్లడమున. 197

క. ఏవేళ మదిని రామ, త్మావరు మఱపు గనఁ గ్రూరసర్పము గళమం
దావృతమా నరునకుఁ బలె, రావణ! కంటికిని నిదుర రాదింతైనన్. 198

వ. మఱియును. 199

ఆ. రాజరత్నరమణిరథముఖ్యరేఖాగు, లగు పదాళి వినినయపుడు రాముఁ
డదె యెదిర్చె ననుచు బెదరు దోఁచును గాన, విడిచితి బాహ్యకార్యవితతి నెల్ల.

వ. మఱియు నిరతంబు మాని యారామచంద్రు నశికంబును మనంబునఁ జింతనంబు
సేయుటచేత నిద్రాప్రాప్తుండనయినను స్వప్నదేశంబున నా రాఘవుండు సమాగతుం
డగున ట్లగు టావేళ నవ్విభుం గాంచి బెగ్గిలి మేల్కాంచి విగతనిద్రుండ నౌదు దశ

కంధరా! నీవును రామచంద్రునెడ నాగ్రహంబు మాని గృహంబునకుం జనుము. ప్రయత్నంబునం బెక్కుదినంబులు రాక్షసకులంబు రక్షింపు మవ్విభుండు మనం బునం దలంచి నేని మన మెల్ల నశియించుట నిక్కంబు గావున. 201

ఆ. నీకు హితములుగను నేను బల్కినపల్కు, లాదరించి వారి పరాత్మునందు
వైరబుద్ధి మాను మారఘుపుత్రుండు, పరమకారుణికుఁడు భక్తివలన. 202

వ. అదియునుం గాక మునివాక్యంబులవలన నికార్యంబు బశేషంబు నెఱింగినవాఁడ నెట్లనినఁ దొల్లిటియుగంబునఁ బరమేశ్వరుండగువారి బ్రహ్మదేవుచేత నర్చితుండై నీ కద్ది యాప్సితంబు దాని నొసఁగెంచెద ననిన నాచతురాననువలన నరవిందలోచనా! మహాప్రభూ! నీవు భూతలంబున మానుషదేహంబున దశరథాత్మజభావంబు నొంది తపవునేయుక లోకకంటకుండగు దశకంఠుం బరిమార్చు మనుచుఁ బల్కంబడి యప్పుడు 203

శా. మాయామానుషమూర్తిచేత మునలక్ష్మ మర్దింప నారాయణుం
డీయారణ్యమహీతలంబునకు నేఁ డేతెంచె నిక్కంబు తం
డ్రీ! యీమాటలు నమ్మి కుళ్లుమని మారీచుండు పల్కంగ దై
తేయాధీశుఁడు మించుకోపమున సందీప్తాత్ముఁడై యిట్లనున్. 204

క. ననుఁ ద్రుంపఁగఁ బరమాత్మయ, వనజజుచేఁ బ్రార్థనంబు వడసి మనుజుఁడై
పనుపడిన నేల వి...చుము, ఘనతరబాణముల మేను ఖండింప కిలన్. 205

వ. కావున నతిప్రయత్నంబున. 206

ఆ. అవనితనయుఁ దెత్తు నవ్విభుచే నీల్గి, పరమపదముఁ గాంతు వెరవ కీవు
మృగము వగుచు నతని మృగశాబకాక్షి నా, కందఁజేసి సుఖము నందియుండు.

వ. అటుగాక యాహవంబున నారామచంద్రుఁ నేన జయించితి నేని నిర్భయుండనై జానకిం గైకొందు మఱియు నీయొయ్యన. 208

ఆ. అడ్డ మాడవలవ దగు సత్యసంకల్పుఁ, డీశ్వరుండు విష్ణు మేలు కలుగు
నమ్మహానుభావుఁ డాత్మఁ దలంచిన, కార్యమునకు వేగఁ గదలు మిపుడు. 209

వ. వెడలి నీవును జిత్రమృగరూపధరుండవై యాశ్రమంబున కతిదూరంబుగ సలక్ష్మ ణుండగు రాఘవుం గొనిపోయి విడిచి పూర్వప్రకారంబున సుఖంబుండు మిట్లొనర్ప నొల్లకుండితివేని నా చంద్రహాసంబు గొనుకవట్లు పలికితివనేని యీసమయం బున ని న్నీకరవాలంబుచేత నతిరివై కాద నిస్సంశయం బనిన మారీచుండును దద్వా క్యంబు లాకర్ణించి తనమనంబున నిట్లని చింతించె. 210

తే. మించి నను రాఘవుఁడు సంహరించె నేని, యపుడ ముక్తుండ నౌదు భవార్ణవమున

నటులఁ గాకున్నఁ బలుకష్టుఁడైన వీని, చేతఁ జచ్చిన నిరయంబు సిద్ధమనుచు. 211

వ. రామచంద్రునిచలన మరణంబు నిశ్చయించుకొని వేగంబ లేచి రావణుం గనుంగొని లంకేశ్వరా! నీయాజ్ఞ యొనరింపవాఁడ ననుచుఁ బలికి యంత యారథం బెక్కి రామాశ్రమాభిముఖుండై చని దూరంబున. 212

## మారీచుఁడు మృగరూపంబున సీత కగపడుట.

సీ. జాంబూనదంబుతో సరియైన దేహంబునందుఁ దెల్లనిరౌప్యబిందుకలును
మణిఖురంబులు నీలమాణిక్యనయనముల్ సద్రత్నతుల్యవిషాణములును
ముద్దుగుల్కెడు పిన్నమోగమును మెఱుపులగమి మించు తనుకాంతి నమరి సీత
కగుపడునట్లు మాయామృగాకారుఁడై యవ్విపినంబున నాఖలుండు

గీ. నిలుచు నురుకునటులు నటులుగంతులువైచుఁ, బూరిగఱచుబెదరుఁబొంచు దుముకు
మతియుఁ దత్స్వభావమార్గముల్ చూపుచు, భ్రాంతిపఱచె రాముకాంత నపుడు.

క. అనుచు మహాదేవుం డుమా, వనిత కెఱింగించె లోకపావనమగు రా
మునిచరిత మఖిలమునిజీ, వన గంగాజనకచరణ వైభవసంగా. 214

వ. మరల నిశాకరకళావతంసుం డగేంద్రనందనతోడ నిట్లనియె రావణచేష్టితం బిట్టిద గువేళ రామచంద్రుండును. 215

ి. అవిధ మంతయుం దెలిసి యయ్యవనీసుతతోడ నిట్లనెన్
ఓవనజాక్షి పక్షిముఖుఁ డొయ్యన భిక్షునిభంగి రాఁగలం
డీవును నీస్వరూపముగ నిచ్చట ఛాయను డించి భక్తిచేఁ
బావకునందు నిల్వు మొకవత్సరకాలము నంతమీఁదటన్. 216

వ కల్యాణీ! రావణవధానంతరంబునఁ బూర్వోక్తప్రకారంబుగ నన్నుం జెందెద వని పలికిన. 217

౭. విని రామోక్తక్రమమున, నొనరించి హుతాశునందు నొగి లీయం బ
ర్యెను నట మాయాసీతయుఁ, గనుఁగొనియెఁ గురంగశాబకం బతివేడ్కన్. 218

వ. ఇటుల మాయాకల్పితంబగు నామృగంబు నిరీక్షించి నవ్వుకొనుచు రామచంద్రుం గదిసి వినయాన్వితయయి యిట్లనియె. 219

౯. కనుఁగొను రామచంద్ర! యదె కాంచనరత్నకురంగశాబకం
బనువుగ సంచరించెడు దయామతి నద్దిగ రుణింతు వేనిఁ జ
య్యన నది తోడితెమ్మనిన నమ్ములు విల్లును బూని యేఁగుచో
ననుజునితోడ నిట్లనియె నాదశకంధరవైరి పార్వతీ!. 220

వ. లక్ష్మణా! నీ విక్కడ సేమఱక సాధ్వియు ననిందితయును మహాపతివ్రతయు

నగు సీత నతిప్రయత్నంబునం గాచియుండుము మాయావంతులును ఘోరరూపు
లును నగుచు నివ్వనంబున. 221

తే. కలరు రాక్షసు లతిఘోరకర్మశాలు, లనిన నోయన్న! నీ వేమి యుక్తినట్లు
చనఁదలంతువు వీఁడు రాక్షసుఁడు మృగశ, రీర మూనె నిజంబు మారీచుఁ డిచట.

వ. కాదేని యిట్టివిచిత్రరూపంబు సాధారణమృగంబుల కెవ్విధంబున సంభవించు ననిన

క. మారీచుఁ డైనఁ ద్రుంచెదఁ. గూరిమి సారంగమైనఁ గొనివచ్చెద నం
భోరుహలోచన కిచ్చెద, ధీరత నిలు మనుచు రామదేవుం డంతన్. 224

వ. లోకమోహినియును జగత్స్వరూపిణి యగు మాయ యేవిభు ననుసరించి యుండు
నట్టి నిర్వికారుండును జిదాత్మకుఁ బూర్ణుండును నయ్యు మాయామృగంబునకు
వెనుదగిలె నట్లగుట కెయ్యది హేతు వనిన భక్తులయం దనుకంపాసహితుండు భగ
వంతుం డను వచనంబు సత్యంబు సేయ నది మాయ యని యెఱింగియు సీతాప్రి
యార్థం బాశ్రీహరి మృగయాయాసంబు వహించె నట్లుంగాక మఱియొండువిధం
బయినఁ బూర్ణకాముఁడును విదితాత్మకుఁ బరమాత్ముఁడును నగు రామచంద్రునకు
మృగంబుతోడుతను స్వప్రియ యగు సీతతోడుతియుం బనియేమి యివ్విధంబున.

సీ. తొడరి యైంద్రశరాసతుల్యమౌ బాణాసనముఁ బూని యారఘునందనుండు
వెనుదగులఁగ మృగంబును పటునిటుఁబోవు నిలుచు నిత్తెఱఁగున నిలువనీక
నడపు లనేకముల్ గడచిపోవఁగ నిజంబుగ రక్కసుండని బుద్ధిఁ దెలిసి
సాగ్రహంబున నొక్కయంబకం బడరింప వాఁడును దల రెండు వ్రయ్యలగుచు

తే. నోయి! లక్ష్మణ! పటుబాహుయుగళ గూలి, పోయితి నిఁక గావుమోయి! రావోయి! యనుచు
రాముగతిఁ గూసి యమ్మహారణ్యమందుఁ, బడియెఁ దొంటినిశాటరూపంబుతోడ.

వ. అప్పుడు. 227

మ. అవనిన్ బంచమహాఘవంతుఁడును దేహత్యాగకాలంబునం
దివిన్ నోట వచించి తత్సదృశుఁడై యేపారు నాజానకీ
ధవు నీక్షింపుచుఁ దచ్ఛరాళిహతుఁడై దైత్యుండు తద్రూపవై
భవముం జెందుట చిత్రమే మదిఁదలంపన్ బర్వచంద్రాననా! 228

తే. అట్లుగావున వాఁడు దేహంబునందు, నుండి జగమెల్ల నీక్షింపుచుండ రాము
నందుఁ జొచ్చె మహాత్తరమైన తేజ, మొకటి యమరులు విస్మయ మొందిరపుడు.

వ. మఱియు నవ్విబుధులు తమమనంబుల. 230

సీ. ఏమి యొనర్చె వీఁ డేమి ఫలంబందె బహుపాతకియు మునిభక్షకుండు
నైన దీనికి విస్మయం బందఁగాదు రామప్రభావం బీక్రమంబు నిక్క—

మెట్లన్న వీఁడు మున్నీ రాఘవునిచేత శరతాడితాంగుఁడై సంస్మరించు
కొనుచు మహాభయంబున గృహవిత్తాదికం బెల్ల విడి హృదయంబునందు
నంచితధ్యానమున రాము నుంచి విగత, సకలకల్మషుఁడై యంత్యసమయమందు
రాముఁ జూచుచు రాముచే నాదిరాము, నందుఁ జొచ్చెను సంతతానందుఁ డగుచు.
కావున. 232

బ్రహ్మకులజుఁడైన రాక్షసుం డైనను, బాపి యైన ధర్మవాపి యైనఁ
గాసలేయుఁ దలఁచి కాయంబు విడిచినా, తత్పదంబుఁ జెందుఁ దథ్య మిదియు.
అనుచుఁ దమలోన సంభాషించుకొనుచు దేవతలు దివంబునకుం జని రంత రామచం
ద్రుండును నిజస్వాంతంబున వితర్కించె నియ్యసురాధముండు మ్రియమాణుండగు
వేళ నూరకుండక హా లక్ష్మణా! యనుచు దుర్వాక్యంబు మొఱఁగి యొరగె నదియు
మద్వాక్యసదృశంబు గావునఁ జెవులం బడిన జనకనందన యేమగునో యనుచుఁ
జింతాపరీతాత్ముం డై దూరంబుననుండి మరలె నప్పుడు దురాత్ముం డగు మారీచుండు
పల్కినవాక్యంబును బర్ణశాలాప్రదేశంబున. 234

విని మిథిలేశుపుత్త్రి యతివిహ్వలయై వెత నొంది లక్ష్మణుం
గని పడి నేఁగు లక్ష్మణ! వనంబున దైత్యునిచేతఁ బీడనొం
దెను భవదగ్రజుండు చనుదేరదె లక్ష్మణ! యంచు నిన్నుఁ బి
ల్చెను వినలేదొ శీఘ్రముగ లెమ్ము సహాయివిగమ్ము యన్నకున్. 235

అనిన లక్ష్మణుం డిట్లనియె. 236

దేవి! యది రాఘవునెలుంగుతీరు గాదు, నిక్క మెవ్వఁడో యొకయామినీచరుండు
మరణకాలంబునం దట్లు మొఱఁగి సమసె, రాముఁ డేమి మొఱలుంగుట లేమి వింత.
అమ్మహానుభావుఁ డాగ్రహించిన నిమి, షంబులోన ముజ్జగంబులెల్ల
సమయఁ జేయఁ జాలు సాధ్వి యవ్విభుఁ డెట్లు, దీనవచన మాడఁ బూను నోటు.

## లక్ష్మణుని సీత కఠినోక్తులు పలుకుట.

అనిన జానకియుఁ గన్నుల బాష్పకణంబులు దొరఁగఁ గోపంబున లక్ష్మణుం గనుం
గొని యోరి! దుర్బుద్ధి! లక్ష్మణా! రామనాశాభికాంక్షుండవగు భరతునిచేతం బ్రేరి
తుండవై నీవును నన్నుఁ జావుఁగోరుచు రామచంద్రుండు నశియించినవెనుక నన్నుం
గొనిపోవుటకునై వెనుతగిలి సేవకుచందంబున నున్నవాఁడ వయ్యెదవో స్వభార్యా
హరణోద్యుక్తుండవగు నిన్నెన్నండును నారాఘవుం డెఱుంగఁడయ్యె నైనను. 239

కానిమ్ము రాఘవానన్యుని, నే నంటెదనే దురాత్మ! నిన్నైనను నిక
ట్టైనముచేసిన భరతుని, నైనను నీతోడుఁ గాక యట్లగునే నిక్. 240

వ. అనుచుఁ గరంబు లెత్తి యాననంబు మోఁదుకొనుచు రోదనంబు సేయం దొడం
నమ్మాటలు విని లక్ష్మణుండును గర్ణంబులు మూసికొని జాలదుఃఖితుండై నన్ను ని
ఱంగునం బలికితివి గావునఁ జండీ! నిన్నుం గాల్పక నాశంబు నొందంగల వనుచ
బలికి యమ్మహావనంబున నలుదిక్కులం బరికించి 2

క. వనదేవతలారా! కనుఁ, గొనుఁడమ్మా దోస మెఱుఁగఁ గ్రూరవచనముల్
గని పల్కితినైన మీ రి, వ్వనితను గాపాడుఁ డనుచు వగపున నపుడున్. 24

వ. రామచంద్రున కెదురుగ మెల్ల మెల్లన చనుచుండె నది సంగుచేసుకొని దండకవ
డలుధరుండై. 24

క. ఆసమయంబున భిక్షుని, వేసమున దశాననుండు వెసఁ జనుదేరన్
భూసుతి పూజ యొనర్చి ను, ఖాసన మిడి మధురఫలము లర్పించి తగన్. 24

ఆ. విశ్రమింపుఁ డిచట వేగంబ మత్ప్రభుఁ, డేఁగుదెంచుఁ దావకేప్సితంబు
లొసఁగు నన దశాస్యుఁ డొకకొన్ని యుద్దేవి, పలుకు లాలకించు తలఁపుతోడ. 24

మ. వనితా! యెవ్వరిదాన వీవు విభుఁ డెవ్వం డీ వనాంతంబునన్
దనుజావాసమునం జరించెదవు నీతత్త్వం బెఱింగింపు మో
య్యన సాకల్యముగాఁగ నంతయు విన న్నాదౌ వాస్తవం బెల్ల నీ
కును విస్తారము సేతు నన్న మది సక్రూరాత్ముఁ గా నెన్నుచున్. 24

వ. ఇమ్మానితోడం బల్కినఁ బ్రత్యుత్తరం బేమి యనుచు సీతాసతి యిట్లనియె. 24

సీ. యమివర్య! వినుము మహాత్ముండు శ్రీమంతుఁ డలరు నయోధ్యాపురాధిపుండు
దశరథుం డనుమేటి ధరణీశుఁ డమ్మహీనాథున కగ్రనందనుఁడు రామ
చంద్రాభిధానుండు సర్వలక్షణలక్షితుం డేను నమ్మహాత్మునకు ధర్మ
పత్నిని జనకభూపాలనందనను సుదాఖ్యసీత యనంగ నలరు సతిని

తే. తనకుఁ దమ్ముఁడు లక్ష్మణుం డనఁగ భ్రాతృవత్సలుం డొప్పు నమ్మహీవరుఁడు తండ్రి
యాజ్ఞఁ దల నిడి యీదండకాటవికిని, వచ్చినారు నితాంతప్రమాను లగుచు

వ. పదునాలుగేఁడులు నిలుచువారలింక భవద్వృత్తాంతం బెఱుంగ నానతిం డని
నప్పౌలస్త్యుం డప్పతివ్రతాతిలకంబుతోడ నిట్లనియె 24

ఉ. ఏ దశకంధరుండ దనుజేశుఁడ వైశ్రవణుండ నప్పుడున్
మోదముతోడ నీపయిని మోహము నాఁపఁగలేక వచ్చితిన్
నాదగు భార్యవై వనములన్ గల దుఃఖముఁ బాయు మానిను
ర్వ్యాదల నిల్చు రాముఁ గవఁ జేకున్ సుఖ మేమి శుభాంగి! నీ కటన్. 25

వ నన్నుం గూడి యఖిలభోగంబు లనుభవింపు మనిన నవ్వైదేహియు నమ్మాటలు వి
[illegible] 2

చ. దనుజ! కృతఘ్న! క్రుంగుటకుఁ దల్చెదొ రాఘవసాయకానలం
బున శలభంబువాడ్కి సురపుంగవుమానినిబోలె నొండొరుల్
వినఁ దనువంటనేర్తురె క్షణం బిట నిల్వుము భానువంశవ
ర్ధనుఁడు సుతీక్ష్ణబాణుఁడగుచుం దాఁకి నినున్ బడవైచు భూస్థలిన్. 252

వ. ఇవ్విధంబున నన్నుం బల్కెదవేని నీవును శీఘ్రంబ రామసాయకంబులవలన విభి
న్నుండవై మేదినిం గూలం గల వనిన రావణుండు సీతావచనంబులు విని క్రోధ
మూర్ఛితుండై పదితలలును నిరువదికరంబులునుం గలుగు మహాపర్వత సన్నిభంబగు
నిజస్వరూపంబు గనుపఱచి. 253

తే. కాలమేఘంబులో యనఁ గనుల కెఱుల, నిలువ నిలువంగలేక భూస్థలిని వ్రాలె
జనకనందన యంత రాక్షసుఁడు ధరణి, నాత్మనఖములఁ బెకలించి యతిరయమున.

వ. కదల్చి బాహువుల నెత్తుకొని తనయరదంబునకుం బఱచి యందు. 255

క. జలజాక్షి సత్సఖీమణిఁ, గలకంఠి సుమధ్యఁ బత్త్రి కంధరుఁ డపుడున్
నిలిపి పయోధరపథమున, గలవడి నిజరథముఁ దోలి యావలీలఁ జనెన్. 256

వ. ఇట్లు మహావేగంబున లంకాభిముఖుండై యరుగువేళఁ బరమసాధ్వియగు నవ్వైదే
హియుఁ గడు భయంబు నొంది యయ్యరణ్యం బంతయు నవలోకింపుచు దీనవదన
యై హాహాకారంబులు సేయుచు సకలలోకనాయకుండగు నిజనాయకు నుద్దేశించి.

## రావణుని జటాయువు వడ్డగించుట.

సీ. హా రామ! రామ! దైత్యాధముం డిటు నన్నుఁ గొనిపోవఁ గను గనుంగొన వదేమి
యని విలపింప నయ్యాక్రందనంబును విని జటాయువు రోషవివశుఁ డగుచు
నోరి నిశాట! నీపాటుట యెచటికి నాముందఱను లోకనాథుఁడైన
యారామచంద్రుభార్యను వారు లేకున్న యపుడు బల్ దొంగవై యపహరించి

ఆ. యధికమంత్రపూతమైన పురోడాశ, మధ్వరమున శునక మపహరించు
కరణిఁ బోకు పోకు పరిమార్తునని యగ, శృంగసంగతుఁడు విహంగముండు. 258

ఉ. తాఁకి నిశాతతుండమునఁ దద్రథ మెల్లను నుగ్గునుగ్గుగా
వీఁక నొసర్చి యద్దనుజవింశతిబాహులపైన్ బదంబులన్
వే కదలంగఁ దన్న నవివేకత వాఁడును శోక కాలద
ర్వీకరరోషమొప్ప నెదిరించె రథం బటు త్రిప్పి యుద్ధతిన్. 259

ఉ. భూమిని డించి ఖడ్గ మొంగిఁ బూని తనుజ్జ్వలపక్షయుగ్మమున్
భాసురలీలఁ ద్రుంప గతపక్షధరాధరమట్లకూలె నా
భాసురబుద్ధిమంతుఁడగు పక్షికులేంద్రుఁడు ప్రాణమాత్రుఁడై

యాసురవైరియుఁ మరల నస్యరథంబున నెక్కి నిర్వకన్. 260

వ. రక్షించువారు లేక రామ రామా! యనుచు దుఃఖింపుచున్న జనకతనయం గొని సత్వరంబునం జనియె నాసమయంబున నప్పతివ్రత యిట్లనియెను. 261

తే. హా జగన్నాథ! హా రామ! హా సమస్త, లోకపాలన! ననుఁ గొని వీఁడు దనుజుఁ
డరుగుచున్నాఁడు నేను నీ యట్టి విభునిఁ, గలిగియు ననాథగతి నిట్లు నిలువవలసె.

తే. చూడకున్నాఁడ వీ రాక్షసుండు నన్నుఁ జిక్కి, చాల దుఃఖించు నన్ను భూపాలతిలక
రాక్షసునిచేత నపహృతురాలనైన, ధర్మపత్నిని విడిపింప ధర్మమయ్య!. 263

వ. అనుచు సౌమిత్రిం దలంచి. 264

తే. ఓ మహాభాగ! లక్ష్మణ! యో గుణాఢ్య!, నీవు నాచేత వాక్ఛరనిహతి నొంది
తైన నయ్యెడ రక్షించు టర్హ మని తలంపు నా తప్పు లెల్ల మన్నింపు మఱఁది.

సీ. అనుచు దుఃఖింపంగ నద్దశాస్యుండును రామాగమనశంకచే మనస్సు
మానవేగంబున మైథిలిం గొని విహాయసమునఁ బఱవ రామాంగనయును
గ్రిందఁ జూచి గిరీంద్రమున దైగుగుగు వానరోత్తము లుండ నిజోత్తరీయ
మర్ధ ఖండము చేసి యాభరణాదికం బందుఁ జుట్టి మదీయుఁడైన రాఘ

తే. వునకు నెఱిఁగించువారు గావుత మటంచు, వారి నడుమను వైచె రావణుఁడు నంతఁ
దన ప్రయత్నంబు నిర్విఘ్నతను వహించె, ననుచు నుప్పొంగి యవ్విహాయసమువలన.

తే. ఉదధి లంఘించి లంక కింపొదవ నేఁగి, యట నశోకవనంబున నతిరహస్య
దేశమున నుంచి రాక్షసస్త్రీల మాత్ర, భావ మొనుపంగఁ బాలింపఁ బనిచె నపుడు.

తే. భూమినందయ్యును కృశీభూత యగుచు, నాటినాటికి రామ! రామా! యటంచుఁ
జాల దుఃఖంబునను మోముఁ జంద రుండు, గంగు గన నల్చె రాక్షసీబృందమందు.

వ. మఱియును. 269

క. అతిదీనయుఁ బరికర్శిత, హితయును, నతివిహ్వలాతిహితరైయు మిథిలా
పతికూఁతు నిలిచె నని తన, సతితోడుతఁ జంద్రమౌళి సంభాషించెన్. 270

వ. అనుచు మఱియు భగవంతుండగు మహాదేవుండు శైలకన్య నవలోకించి యిట్లనియె నంత నిచ్చట రామచంద్రుండును మాయావియుఁ గామరూపధరుండును నగు రాక్షసుని సంహరించి నిజాశ్రమంబు చేరుటకు మరలి ముందు దూరంబుననుండి యతిదీనవదనుండయి మొగంబు గంద నరుదెంచు లక్ష్మణుం గనుంగొని మహామతి యగు నా రఘునందనుండు తనచిత్తంబున నిట్లని తలంచె. 271

చ. ఇతఁ డిటు మాయసీత నొకయింత యెఱుంగఁడు మత్ప్రకటంబు ప్రా
కృతుఁడును బోలె సీతని శోకింపుచుఁ బంచవటీ గృహంబుఁ
యుతగతిఁ గాంతు నిత్తెఱఁగు నొందక యింట విడిచి నుండిన౯
హాతమగు నెట్లు ఘోరవనజాలనకోటు లిలాతలంబునన్. 272

వ. కావునఁ గాముకుం డెట్లు విలపించు నట్లు తేను దుఃఖసంతప్తుండ నయి విలపిం
చితి నేని యందఱుఁ గ్రమంబున దుఃఖించెద రంత ననురాలయంబునకు సీతం
బనిచి 273

క. సకులంబుగ రావణు సం, హతకసికల్పునిఁగఁ జేసి హరిణీసుత మా
మకకల్పితాగ్నిమందిర, వకుటింగతిఁ గొని యయోధ్య కనుగమునింతున్. 274

వ. ఏనును. 275

క. వనజాక్షుఁడు వేఁడ నుదయిం, చిన నాఁడ మనుష్యతనువుచే నిలపైఁ గా
వునఁ గొంతకాల మిత్తెఱఁగున నుండెద నెవ్వరైనఁ గోరినభక్తిన్. 276

వ. ఇట్టిమాయామనుష్యుండనయిన నాచరితంబులు వినిరేని వినిపించిరేని దాదృశభ
క్తిమార్గానువర్తులకు ప్రయత్నంబున ముక్తి సిద్ధించు ననుచు నిశ్చయించి చనుదెంచు
లక్ష్మణుం గనుంగొని యిట్లనియె. 277

తే. ఘోరకాననమున నాదుకూర్మి గరిత, నేల విడివచ్చితివి రాక్షసాలిచేత
నాజనకపుత్త్రి యింతకు భోజనమున, కపహృతప్రాణ గాకున్నె యనిన నపుడు.

వ. పరమార్థయగు నారామచంద్రుని భాషణంబులు విని లక్ష్మణుండును బాష్పకలి
తేక్షణుండై భక్తిగలవ శిరంబు వంచి నమస్కరించి కరంబులు మొగిడ్చి యిట్ల
నియె. 279

చ. దనుజుఁడు మీరెులుంగు క్రియఁ దా మొఱఁగ౯ విని మిమ్ముఁ గూడఁ బో
మ్మనుచును నన్నుఁ బల్కె వినుమన్న యిలుం గది గాదటంచు నే
నును బహుభంగులం దెలుప నొచ్చుచు నానన మెల్ల వాఁడుకొం
చనిసతెఱంగు మీసముఖమందు నవాచ్యము రాఘవేశ్వరా!. 280

వ. ఏనును కర్ణంబులు మూసికొని యచ్చట వెడలి నిన్నుం గనుంగొన వచ్చితి ననిన
మిక్కిలి యనుచితంబు సేయంబడె ననుచు రామచంద్రుం డిట్లనియె. 281

లక్ష్మణుఁడు పర్ణశాలలో సీతను విడిచి వచ్చుటకు రాముఁడు దుఃఖించుట.

మ. చనునే యొంటిగ డించి వచ్చుట మహీజన్మను ఘోరాటవి౯
వనితాబుద్ధి యెఱుంగవే యకట! యవ్వామాక్షి యేమయ్యెనో
యనుచు౯ దుఃఖముతోడుత౯ మరలి దైత్యా! యిల్లు నందెచ్చితే
యనుచు౯ స్వాశ్రమభూమిఁ జేరి యటఁకస్యక౯ లోకమాన్యుం డగన్. 282

వ. కనుంగొనం జాలక చాల విలపించుచు సీతాసతిం దలంచి. 283

తే. ఎచటి కేఁగినదానవో యిందువదన!, తొంటిగతిఁ బర్ణశాలయం దుంట మాని
గాక నను మోహకలితునిగాఁ నొనర్ప, లీల డాఁగితివో వనశైలములను. 284

వ. అనుచుఁ జింతింపుచు బహుభంగులం బలుకుచు నెచ్చటనుం గనుంగొన నోపక 285

సీ. గహనదేవతలార! కానరే మీరైన నెందుండెనో చెప్పుఁడు రాకేందువదన
మృగపక్షివృక్షపన్నగసమూహములార! మత్ప్రియాంగనపోక పలుకఁగదరె
యనుచు నెమ్మదిలోన నమ్మానిని దలంచి యోసీత యోబాల! యోసుమధ్య!
యోప్రాణవల్లభ! యోసుందరవదన! యోచంద్రాభవదన! యోజాతరూప

తే. వర్ణబింబాధర! సుమధ్య! వనజనయన!, రత్నమయకుండల! యటంచు రావదేమి
యనుచు సర్వజ్ఞుఁడయ్యు రామావనీశుఁ, డెఱుఁగనట్టుల వెదక నయ్యిందుముఖిని.

వ వెండియు సర్వదృశుండును సర్వవ్యాపకుండును మహానందమయుండును దుఃఖావి
షయుండును నిర్మలుండును నిరహంకారుండును నిత్యానందుండును నయ్యు. 287

క. "హా సీతే! హా బాలే!, నాని క్వగతాసి" యనుచు "ననుజ" యనుచుఁ దా
నాసక్తి లేక యుండియు నాసక్తునిభంగిఁ దిరిగె నతిదుఃఖితుఁడై. 288

వ. ఇట్లు మాయామయుండై జనించినకతన నద్దాశరథియును. 289

తే. ఆఁపఁజాలనిచింత నయ్యడవియందు, సక్తుఁడునుబోలె దిరిగె విరక్తుఁడయ్యు
మూఢులకుఁదోఁచునిబ్భంగి మోహనితత్త్వ, వినులకెఱుఁగంగఁబడగుతద్విధముతరుణి.

వ ఇవ్విధంబున లక్ష్మణుతోడుత రామచంద్రుండవ్విపినంబున నాత్మసతి నన్వేషిం
పుచుం జని చని. 291

క. ఒకచోట విఱిగి కూలిన, ప్రకటశరాసనరథకూబరంబులు గని పా
దకమలధాతమహీపా, తకుఁ డగు సీతావిభుండు తమ్మునితోడన్. 292

చ. కనుఁగొని వీఁడు భూతనయఁ గైకొనిపోవఁగ వీనిఁ గూల్చి తాఁ
గొని చనె నొండొకం డనుచుఁ గ్రొంతసమీపముఁ జేరి శోణితం
బునఁ దనువెల్లఁ గ్రుంగి ధర మూర్ఛితుఁడౌ విహగేంద్రుఁ గాంచి ల
క్ష్మణ ధరణీజ మ్రింగి చనఁ జాలక నిల్చెను వీఁడె కంటివే. 293

వ. దానలోన నమ్ములు దీసి 294

ఉ. తెమ్ము శరాసనమ్ముఁ గడతేర్తు ననన్ ఒకయించుకంతవా
క్యమ్ముఁ దెమల్చి యోదశరథాధిపనందన నీస్వకార్యమం
దిమ్మెయి నైతి బాణమున జేయకు నన్ను జటాయు వండ్రు జీ
వమ్మున నుంటి నిచ్చట భవత్సతి వార్త వచించ బల్కఁగన్. 295

క. కొనిచనియె రావణుం డను, దనుజుఁడు పోవంగనీక తలపడి యేనున్
విను వీథిఁ బోర బాణా, సనరథభుజశాఖ లెల్లఁ జక్కాడితి దుదిన్. 296
ఆ. తత్కరాసిచేత దళితపక్షుండనై, పడితి నిపుడు నీదుపాదదర్శ
నంబు దొరకె సతివిధంబును బల్కితి, నింక నిలువఁజాల నేను రామ!. 297
వ. జగన్నాయకా! కనుంగొనుము ప్రాణంబులు పరిత్యజించెద ననినఁ గంఠగతప్రాణుం
డును దీనుండును నగుచు నవ్విహంగపుంగవుం గాంచి రామచంద్రుండును మిగుల
దుఃఖంబున వెడలు కన్నీటికాలువలు నిజదేహనీలశైలంబునం బ్రవహింప దానని
వహామంగళాకరంబులగు తనకరంబుల సంస్పృశించి యిట్లనియెఁ బక్షిసత్తమా!
శుభావన యగు నాదుభార్య నెవ్వండు గొనిచనియె సవిస్తరంబుగఁ దద్వృత్తాం
తంబు మాకెఱింగింపు మక్కార్యంబుకొఱకు నీవు నిహతుండవైతివి గావున నాకుఁ
బ్రియబాంధవుండ వగుదు వనిన జటాయువు వదనంబున రుధిరంబుఁ గ్రక్కుచు
గద్గదస్వరంబున నిట్లనియె. 298
ఆ. భీమవిక్రముండు రామ! రావణుఁడను, రక్కసుండు జనకరాజతనయఁ
దనరథమున నునిచి దక్షిణాంబుధి త్రోవఁ, బఱచె నింకమీఁదఁ బలుకఁజాల. 299
వ. నీముందఱ ప్రాణంబులు విడిచెదం గైకొనుము నేఁ డంత్యకాలంబు సమీపించిన
నాకు దైవయోగంబునఁ బాపరహితుండవైన నీవు దర్శనం బొసంగితి వింకఁ బర
మాత్మవు విష్ణుండవు మాయామానుషశరీరుండవు గావున నేతాదృశమహాజనభాగధే
యుండవగు నిన్నుం బ్రాణప్రయాణకాలంబున నీక్షించుటవలన భవభయముక్తుండ
నైతి నసంశయంబు రఘుసత్తమా! రామా! సంతతకల్యాణకరంబులగు భవత్కరం
బుల మరల నన్ను సంస్పృశింపుము పరమపదంబునకుం జనియెద ననినఁ బరమద
యాస్వాంతుండగు సీతాకాంతుండును బెద్దతడవు విస్మయంబు నొంది యవ్విధంబు
సేతు ననుచుఁ దనకరంబున నతనికరంబు సంస్పృశించె జటాయువునుం బ్రాణం
బులం బాసి భూతలంబునం బడియె నంత. 300
సీ. దాశరథియుఁ దద్విధంబున కంతో బాంధవుభంగి మిగుల సంతాప మొంది
కనుల బాష్పజలంబు గ్రమ్మ దేరఁగ లక్ష్మణునిచేత వలయునింధనచయంబుఁ
దెప్పించి యప్పక్షిదేహంబును వహించి జలమునఁ గ్రుంకి చింతించు నమ్మ
హావనంబునఁ దనయనుజుతో నొకమృగంబును వైచి దాని ఖండనముచేసి
తే. గఱికచే మినిమిగలిగిన మెఱకభూమి, యందు వేర్వేఱఁ బరిపరిచందములుగ
మాంసఖండంబు లునిచి సమస్తపక్షి, గణము కిడెఁ దృప్తుఁ డగుఁ గాక ఖగవిభుండు.
వ. మఱియును సకలలోకంబులు గనుంగొనుచుండ మత్సాయుజ్యపదం బీజటాయువు
నకుఁ బ్రాపించుంగాక యని యానతిచ్చిన నప్పు డవ్విహంగపుంగవుండు. 302

మ. పరమార్తాండకళాభమై వెలయుదివ్యస్యందనం బెక్కి శం
ఖరథాంగాబ్జశరాసహస్తుఁ డగుచుం గంధర్వరూపాఢ్యుఁడై
హరిభృత్యుల్ ఇరువంకలందు ననుమాన్యప్రక్రియం గొల్వ నా
ఖరవిధ్వంసము ముంగటం నిలిచె లోకం బెల్ల వీఁకం గనన్. 303

వ. ఇట్లు కిరీటవరభూషణంబును బీతాంబరకలితంబును సములంబును నగు దివ్యరూపంబు
ధరియించి మునిగణస్తూయమానుం డై రాఘవుం జేరవచ్చి సంతసింపుచుఁ గృతాం
జలిపుటుం డై యిట్లని వినుతింపం దొడంగె. 304

## శ్రీరాముని జటాయువు స్తుతియించుట.

ఉ. ఓరఘువంశనాథ! జగదుద్భవసంయమహేతుభూత! ల
క్ష్మీరమణీకటాక్షపాత్ర! మేఘుసయబ్జజముఖ్య! దుఃఖసం
సారపయోధితారణలసత్స్వపదాంబుజపోత! భోగిరా
డ్చారువిభూషణా ద్రివర్గజాహృదయాలయ నీకు మ్రొక్కెదన్. 305

సీ. అవిరతిభవభవనాతిదూర! భవాతిదూరమానసమునిస్తూయమాన!
సితజలరుహనేత్ర! స్మితరుచిరవికాసితాననాబ్జసకాయకాంబకాశ!
సురుచిరశతకోటిసుందర! యతినాథ నిర్మలాంతఃపద్మనిత్యసదన!
శతపథగోచర! సద్భావనాదూర! రఘుపతిమూర్తిధర! సురవరద!

ఆ. యగణితగుణ! మందరాచలధర! వేద, సులభ! యప్రధృష్యసుఖ! సురేంద్ర
వినుతిపాత్ర! భువనవిశ్రుత! నీ కిదె, వందనంబు మోదమునను రామ!. 306

క. త్రిభువనకమనీయాకృతి, నభయుఁడవు గురువులకును నాదిగురుఁడవై
యిభరాజవరద! నీ విలఁ, బ్రభవించితి వమరనాథు ప్రార్థనకతనన్. 307

ఉ. దానవదేవమానవనతస్వపదాంబుజ! యప్రమేయ! సం
తానమహీరుహాశ్రయ! కృతఘ్నవిదూర! పరాత్మభూతమా
నీ సనుతేంద్ర! నీలమణినిల! దినేశకులీనముఖ్య! చం
ద్రావన! రామభద్ర! కమలాపతిసూధవ వాంఛితప్రదా!. 308

చ. తరఁగ మయూఖమాలి జలపాత్రలయందును దోఁచుమాడ్కి శం
కరవిధివిష్ణుభేదములఁ గన్పడె దీవు గుణప్రియుండవై
గురుతరమైన నీమహిమకుం గమలాసనముఖ్యులోడి యొం
డెఱుఁగక వేదపాఠముల నెల్లప్పుడుం భజియింతురో హరీ!. 309

చ. అనుదినముం భజింతు వికచాంబురుహాయతనేత్రుఁ జారుచం
దనమిళితాంగుఁ జక్రధరనందకపద్మకరు న్నిజాత్మకాం

చనసవరత్నభూషణుఁ బ్రసన్నముఖాంబుజు భర్మవస్త్రు స
జ్జనవనికావసంతు శుభసాధను నీలఘనాభదేహునిన్. 310

వ. అనుచు నివ్విధంబున నుతియింప నజ్జటాయువునకు రఘూత్తముండు ప్రసన్నుండై
పక్షివల్లభా! నీకు భద్రంబగు విష్ణుండనగు నాదు పరమపదంబునకుం జనుము. భూతి
లంబున. 311

తే. ఇంపుతోడుత నీస్తోత్ర మెవ్వఁడయిన, వినిన వ్రాసినఁ జదివిన విహగవర్య
ప్రాప్యు లగుదురు నాదుసారూప్యపదవి, నిజము మద్భక్తిఁ జెలువందు నీవపోలె.

క. అనిన జటాయువు రాఘవు, ఘనతరవాక్యముల కలరి కమలజముఖ్యుల్
వినుతించు పదవి నొందెను, వనితా! రఘునాథుకరుణ వశమే పలుకన్. 313

వ. అనుచుఁ దుహినాచలకన్యకతోడ శుభ్రాంశుమౌళి యవ్వాలివృత్తాంతం బిట్లనియె
నంత రాఘవుండు సీతాన్వేషణతత్పరుండై మరల దుఃఖంబు నాశ్రయింప దుర్గ
మంబగు నవ్విపినాంతరంబున సంచరింపుచు నొక్కయెడ నద్భుతాకారుండును
జత్రురాదివివర్జితుండును సర్వసత్త్వవిహింసకుండును నై యోజనంబు పొడవునఁ
గరంబులు సాఁచి మధ్యభూచరిష్ణులగు తమ్ముఁ గబళింప గమకించు కబంధనామ
నిశాటుం గాంచి తోడ వచ్చు తమ్మున కిట్లనియె. 314

సీ. దానవుం డిదె సుమిత్రాపుత్త్ర! కంటివే యూరునుంను వదనంబు కరము లివియు
యురుదీర్ఘములు మధ్యఁ జరియించువారలఁ దినుచుండు మనము నేఁ డనువు దప్పి
చనుదెంచితిమి వీనిఁ జనుభంగిఁ గనుపింప దేమిసేయుదము వీఁ డిపుడు మ్రింగు
నన లక్ష్మణుం డిట్టు లనియెఁ జింతిలనేల తునుము వీనికరంబు ననిన ఖడ్గ

తే. మునను దక్షిణహస్తంబు దునిమివైచె, నట్ల రెండవకరముఁ జక్కాడచె లక్ష్మ
ణుండు వాఁ డంతవిస్మితాత్ముండు మోద, భరితుఁడును నౌచు నిట్లని పలికెఁ జెలియ.

వ. ఆహాహా! మద్బాహువాననంబు చేసె నెవ్వండో దివంబున నిలింపులలో వాఁడగు
ననిన రాజీవనయనుండగు రామచంద్రుం డిట్లనియె. 316

తే. విను మయోధ్యాఖ్యపట్టణమునకు మేటి, పుణ్యచరితుండు దశరథభూవరుండు
అవ్విభున కగ్రసుతుఁడ నే నగుదు రామ, నామధేయుండ లక్ష్మణనాముఁ డితఁడు.

వ. బుద్ధిమంతుండు నాకుఁ దమ్ముండు సీత మత్సతి జనకనందన త్రైలోక్యమోహిని
యేను సానుజుండనై మృగయావినోదార్థంబు వెడల నెవ్వండో యొక్క యంతరంబు బరీ
క్షించి మత్కాంతారత్నంబు గొని పలాయనుండయ్యె నంత నేమును దలోదరిం
గానక నిఖిలకాననంబులు వెదకుచు నీకరంబులం జిక్కి ప్రాణరక్షకుం దఱిగివైచి
తిమి. వికృతరూపంబుం దాల్చి యున్నవాఁడ వీవెవ్వండ వనినఁ గబంధుఁ డిట్ల
నియె. 318

## కబంధుఁడు తనశాపనిమిత్తము శ్రీరామునితోఁ జెప్పుట

సీ. ధన్యుండ నైతి సీతారామ! భవదీయచరణారవిందసందర్శనమున
మును రూపవిభ్రమమ్ముల నన్యనారీమనోహరుండను నౌచు నొరులచేత
వధ్యుండఁ గాకుండ వరము ఘోరతపంబునను మించి నీరజాసనుని వలనఁ
బడసి గంధర్వాధిపతి నై చరింపుచు మహితు నష్టావక్రమౌనిఁ గాంచి
ఆ. నవ్వఁ గోపమునను నక్తంచరుని గాఁగ, శాప మిచ్చి యేను సన్నుతింపఁ
గరుణఁజేసి ముందు కమలాప్తకులమందు, దశరథునకు నగ్రతనయుఁ డగుచు. 319

వ. తనయుఁ డానై రామనామంబున 320

క. త్రేతాయుగమున హరిసం, జాతం బగునతఁడు నీభుజంబులు ద్రుంపన్
ఈతనువు వీడి గంధ, ర్వాతిశయం బొదవు సౌఖ్యమగు నీ కనియెన్ 321

వ. తపంబున విభాసితప్రభుండగు నమ్మునిముఖ్యుండు క్రుద్ధుండై యిట్టిదుర్భరంబగు శాపం బొసంగి యంతర్ధానంబు చేసె నేనును రాక్షసుండనై యుంటి నంత నొక్క-నాఁడు. 322

చ. హరిహయుఁ డేగుదేఁ గవయన్ నను వజ్రముఁ బూని వైవ వా
గ్వరునివరంబుచేత మృతిగానక కూయిడ దీర్ఘహస్తముల్
శిర ముదరంబునం గలుగఁజేసిన నేనును నాఁటనుండి మ
త్కరయుగమధ్యభూస్థలిని గల్గు మృగాళి జనాళి ద్రుంచుచున్. 323

చ. తినుచును నుందు నీవు జగతీవర! నన్ గృపఁజేసి నేఁడు మ
త్తనువు ఘనంబున న్నిలిపి దగ్ధ మొనర్పుమ యేను నంత నీ
వనితతెఱంగుఁ బల్కెద ధరిత్రిం బన శ్వభ్రముఁ ద్రవ్వి యందు సం
ధనములు నింపి తత్తనువుఁ దమ్మునిచే దహియింప వాఁడునున్. 324

వ. ఆదేహంబు వెడలి కందర్పసదృశాకారుండై. 325

తే. వివిధభూషణములు దాల్చి దివ్యరూపు, రాము రఘుకులకలశాబ్ధిసోముఁ గాంచి
ప్రేమ సాష్టాంగదండప్రణాముఁ డగుచు, వినుతియొనరింపఁదొడఁగెనిట్లనిమృగాక్షి.

సీ. వాఙ్మానసములకు వచియింప నూహింప నలవిగాక యనాదివైన నిన్ను
మన్మానసంబు సంభ్రమమున స్తోత్రంబు సేయంగఁ దలఁచు రాజీవనయన
పరఁగ హిరణ్యగర్భమన విరాట్టన వెలయుదేహద్వయములకు వేఱ
యైన యవ్యక్తదేహం బది దృగ్రూపమును సూక్ష్మమును నీవ మనుజనాథ!
ఆ. గానుపించు నజ్జగంబు జడంబు న, నాత్మకంబు గాన నంటకుండ
వేఱై యున్న నీదువిధ మెఱుంగఁగ మనం, బెట్టులోపు మాయ నెట్లు పొందు. 327

వ. బుద్ధియు నాత్మాభాసయు రెండును గలుగుటవలన జీవత్వంబు గలుగు నాబుద్ధ్యాదులకు బ్రహ్మయు సాక్షి యగునట్టి నిర్విషయుండును నిర్వికారుండును నఖిలాత్మయు నగు బ్రహ్మయందు నఖిలంబును నజ్ఞానవశంబున జీవుఁ డారోపించు నీదుసూక్ష్మదేహంబు హైరణ్యగర్భంబును స్థూలదేహంబు విరాట్టును నన నంబరఁగు భూతభవ్యభవిష్యద్రూపంబుగఁ గానఁబించు జగదాకారంబును స్థూలంబగు బ్రహ్మాండకోశరూపంబును మహదాదితత్త్వావృతంబును సప్తోత్తమగుణసంయుతంబును నీకు స్థూలంబును నగు విరాడ్దేహంబు ధారణాశ్రయంబై యుండు లోకంబులు నీయవయవంబులసం బరఁగు నెట్లనినఁ బాతాళంబు పాదమూలంబును బార్ష్ణిప్రదేశంబు మహాతలంబును రసాతలంబు నంగుళంబులును తలాతలంబు జానువులును సుతలం బూరువులును వితలంబు కటిప్రదేశంబును నతలంబు జఘనంబును భూమి నాభియును నురస్స్థలంబు జ్యోతిర్మండలంబును గ్రీవంబు మహత్తును సత్యలోకంబు శీర్షంబును నింద్రాదిలోకపాలురు భుజంబులును దిశలు కర్ణంబులును నశ్వినులు నాసికంబును వక్త్రంబు వీతిహోత్రుండును గన్నులు సవిత్రుండును మనంబు చంద్రుండును భ్రూభంగంబు కాలంబును బుద్ధి వాక్పతియు రుద్రుండహంకారరూపంబును వాక్కులు ఛందంబులును యముండు దంష్ట్రాప్రదేశంబులును నక్షత్రంబులు రదనంబులును నిఖిలమోహకారి యగు మాయ హాసంబులును సృష్టి యపాంగమోక్షణంబులును ధర్మంబు ముందును నధర్మంబు వెనుకయు నిమేషోన్మేషంబులు దివారాత్రంబులును సముద్రసప్తకంబు జఠరంబును నాడులు నగులును జ్ఞానశక్తి మహిమయు నిట్టిది నీదు స్థూలదేహం బగు మఱియును. 328

ఆ. సుభగమైన నీదు స్థూలదేహం బెవ్వ, రాత్మ నిలిపి కొలుతు రట్టివారి
కగును ముక్తి ధర ననాయాసమున నింకఁ, గొదువలేమి కలుగుఁ గువలయేశ. 329

వ. ఎవ్వండైనఁ బ్రేమరసంబున నీస్థూలవిగ్రహాబాధకుం డయ్యె నేని పులకాంకితదేహుండును ముక్తుండును నగునట్టి నీదుస్థూలవిగ్రహంబున నశ్రాంతంబుఁ దలంతు నైన నిష్పాదు. 330

తే. శరశరాసనములు దాల్చి శ్యామలాంగ, మును జటాకల్పితకిరీటమును వెలుంగ
ననుజాతోఁ గూడి నిజభార్యనతయు నీదు, విగ్రహంబే నుదలఁతు హృద్వీథి రామ!. 332

వ. మఱియును.

క. వారాణసీపురంబున, సారంగధరుండు నతనిసతియును నిన్నుఁ
శ్రీరమ్యతనువు దలఁచుచుఁ, దా రతిమోదమున నిలిచెదరు సంతతముఁ. 333

తే. మఱియును ముముక్షు లగువట్టి మానవులకుఁ, దారక బ్రహ్మవాచ్యమై తనరు మీదు
మహితనామంబు రామ! రామ! యటంచుఁ, గరపు గంగాతటంబునం దుమకంటె రామ!

వ. సంతుష్టమానసుండవై యుల్లాసంబున శివుండు నిల్చుఁ గావున నిశ్చయంబుగ నీవు పరమాత్మవు మాయచేత నారూఢులై యుండుటను నీ యాథార్థ్యం బెఱుంగఁ జాలరు మఱియును 335

క. నీకొఱకు వందనం బగుఁ, గాక గుణాతీత! లోకకారణదేహా!
నీకసమర్చిత! సానుజ!, సాకేతపురీశ! భక్తజనభయనాశా! 336

తే. త్రాహి మాం రఘునందన! దనుజహనన!, భక్తవందన! శత్రుతాపత్రయోగ్ర
పాపకేంధన! వ్యాతభవబంధన! గిరి, నందనాకృతనిత్యవందన! యటంచు. 337

వ. వెండియు. 338

తే. జానకీవల్లభాయ రాక్షసమహాట. వీరతారాయ వేధసే విష్ణవే ప
రాత్మనే తే నమోఽస్తు మాం నావృణోతు, నవ్యమాయా త్వదీయా యనంగసపుడు.

వ. కరుణించి రఘుభూనాథుం డిట్లనియె. 340

సీ. ఘనుఁడ వన్నిట దివ్యగంధర్వ! సంతుష్టుఁడను నైతి నీదైన వినుతి కిపుడు
యోగిగమ్యంబౌ మగజ్జ్యస్థానంబునకు నేఁగు మెవ్వరైనను దినంబు
భక్తితోఁ జుత నీవు పల్కినయి య్యాగమోక్తమౌ స్తోత్రంబు నుచ్చరింప
జపియింప నాగనుజ్ఞానసంపన్నులై ధయును నెల్లను నీటఁ బాఱఁదోలి

తే. యవ్యయానందమత్పదప్రాప్తు లగుదు, రనుచు రఘునందనుం డన్నయట్లు తనదు
పోలఁతితోడుతఁ బన్నగభూషణుండు, పలికి పలుకంగఁ దొడఁగెనవ్వాలితెఱంగు.

వ. ఇట్లు గంధర్వుండు సంప్రాప్తపరుండై చనుచు రఘునందనుం గనుంగొని. 342

క. దేవ! పురోభాగంబునఁ, దావకపదకమలభక్తితత్పర శబరీ
స్త్రీ వెలయు నేఁగఁ గనుఁగొను, మావనిత సవిస్తరముగ నంతయుఁ బలుకున్. 343

ఆ. అనుచుఁ బల్కి తాను నర్కసన్నిభముగు, వ్యోమయాన మెక్కి రామనామ
జపమహత్త్వమునకు సాశ్చర్యుఁడై విష్ణు, పదము నొందె నజ్జపత్రనయన! 344

వ. అంత రాఘవులును సింహవ్యాఘ్రిదూషితంబగు నవ్విపినంబుఁ గనుంగొనుచు శబరీతపోవనంబుఁ జేరవచ్చి రప్పుడు రామచంద్రుం గాంచి యవ్వనితయు. 345

## శబరి శ్రీరాములఁ జూచి స్తోత్రము చేయుట.

మ. అతివేగంబున నేఁగుదెంచి కనులం దశ్రుల్ వడిం జార స
మ్మతిఁ దత్పాదయుగంబుపై వ్రాలఁగి నేమంబే యటంచున్ ముఖ

స్థిరముగం జేసి పదాబ్జముల్ గడిగి తత్సంభూతపవిత్రాంఘ్రిసం
ప్లుతతోయంబులు దాల్చె మస్తకమునన్ బుణ్యంబు లంచున్ గడున్. 346

తే. వివిధకుసుమంబులను యథావిధిని బూజ, లప్పుడొనరించి యమృతతుల్యంబు లగుచు
రాఘవార్థంబ యొనగూర్చి రహిఁ జెలంగు, ఫలములను దృప్తియొనరించి పలికెనిట్లు.

వ. రఘుశ్రేష్ఠా! తొల్లి యియ్యాశ్రమంబున మద్గురువులగు మహాత్ములకు శుశ్రూష
యొనరింపు చుండుదు. వారును ననేకవర్షసహస్రంబులు చనినపిమ్మట బ్రహ్మలోకంబు
నకుం జనుచు నన్నుం గనుంగొని సనాతనుండును బరమాత్ముండు నగు నారాయ
ణుండు రామనామంబున దాశరథియై యిప్పుడు చిత్రకూటనగంబున నిల్చియున్న
వాఁడు. రాక్షసవధయును ఋషిపరిపాలనంబునుం గావింప నిచ్చటికిఁ జనుదెంచు
వాఁడు. తావత్పర్యంతంబు నేకాగ్రచిత్తంబున స్థిరవై కళేబరంబు రక్షించుకొని
యుండుము. అవ్విభుం గాంచి నమస్కరించి తత్పదంబు నొందెద వనుచు బ్రహ్మలో
కంబునకుం జనిరి. ఏనును నాఁటనుండి భవదీయసందర్శనాకాంక్షిణినై ప్రతీ
క్షింపుచు నుంటి. నేఁటికి మద్గురుభాషితంబు సఫలంబయ్యె. వారలకుం జూడఁగల్గని
నీదుపుణ్యమూర్తిఁ గంటిఁ. గృతార్థనైతి మఱియును. 348

చ. ననితను మాధవచిత్తను భవత్పరిచారకభృత్యభృత్యులం
దనఘ! శబరాయుతాంశలను నైనను బోల్పఁగరానిదాన నే
మని నుతియింతు వాక్కునను స్వాంతమునం దెలియంగఁ బోల వీ
వనుపమతేజ! నన్ గరుణ నాదిఁ బ్రసన్నుఁడ వమ్ము రాఘవా!. 349

వ. అనినఁ గరుణించి భక్తివైరాగ్యయుక్తంబుగ రఘునందనుం డిట్లనియె. 350

సీ. వినుము మత్సంతుష్టి యొనరింప నాశ్రమమ్ములు గావు కారణమ్ములు దలంప
మద్భక్తి యదిగాక మనుజుఁ డెన్ని యొనర్పఁ గనుపింప మద్భక్తి గలుగకునికి
నది యొకింత యెఱుంగునటు నేతు సజ్జనసాంగత్య మొకటి నిశ్చయము రెండ
వది మత్కథాలాప మొదవుట మూఁడవయద్ది మద్గుణేరణ మరయ నాల్గ

తే. వది గుణవ్యాఖ్యపరుఁ డౌట లరయ నైదు,వది సదాచార్యసేవ చెల్వగుట యాఱ
వదియు యమనియమాదుల నొదవి యుంట, మాయయవిబుద్ధిఁ దలఁచుట మానవులకు.

వ. మఱియుఁ బుణ్యశీలత్వంబును నిష్ఠయు నాఱవసాధనం బనం బరఁగు సప్తమం
బగు మన్మంత్రోపాసనంబును మద్భక్తజనుల మన్నించుటయు సర్వభూతంబుల
మన్మతియు నగు భక్తి జనియించిన మత్తత్త్వానుభవుండగు రామతత్త్వానుభవసిద్ధి
యగువానికిఁ దజ్జన్మంబుననే ముక్తి సంభవించుఁ. గావున మద్భజనంబు మోక్ష
ప్రదంబు నిశ్చయంబు ప్రథమసాధనంబగు సాధుసాంగత్యంబు గలిగినఁ గ్రమం
బున నన్నియుం గల్గు నీకు మద్భక్తియు దర్శనంబునుం గలుగుటవలన ముక్తియుం
గల్గినయది మఱియును. 352

ఆ. మది నెఱింగరేని మద్భాగ్యతెఱఁగు నీ, వెఱుఁగఁబల్కు మెవ్వఁ డింత వైర
మేల దలఁచె నెచటి కెత్తుక చనియె నే, దనిన శబరి యిట్టు లనియె నపుడు 353

సీ. దేవ! జగన్నాథ! భావనాతీత! నీ వెఱుఁగనున్నపదార్థ మేమి గలుగు
నైన లోకంబుల ననుసరించితి గానఁ బలికెద నిపుడు నీభార్యతెఱఁగుఁ
బౌలస్త్యుఁ డనువాఁడు పటుపరాక్రమమునఁ గొని లంక కరిగె భూతనయ నిదియ
పంపాసరోవరప్రాంతంబునను ఋశ్యమూకం బనఁగ శైల మొండు గలదు

తే. గలఁడు సుగ్రీవు డను ప్లవంగప్రభుడు, అన్న యగు వాలికోడి యయ్యచల మతఁడు
మౌనిశాపంబుచేతను రాని తెఱఁగు, దెలిసి నలువురు మంత్రులు గొలువ నచట. 354

క. కావున నీ వచటికిఁ జను, భూవల్లభ! కార్య మెల్లఁ బొందగు నేనున్
బావకుఁ జొచ్చి రఘూత్తమ!, నీవిమలపథంబుఁ గాంతు నిలు మిం దనుచున్ 355

వ. కళేబరత్యాగపర్యంతంబును ముహూర్తం బనుగ్రహింపు మనుచు హుతాశనుం
జొచ్చి నిమిషంబున నవిద్యాకృతబంధనం బెల్ల దహించి రామచంద్రప్రసాదంబున
నతిదుర్లభంబగు మోక్షంబుఁ బ్రాపించె మఱియును 356

ఆ. ఎద్ది దుష్కరమగు నీశుఁడౌ రఘునాథు, పదము నమ్మి కరుణఁ బడసినట్టి
యధమజాతి కైన నరయ నాశబరియె, సాక్షి జనులు దెలియ శైలతనయ! 357

వ. అదియునుం గాక. 358

ఆ. విప్రుఁడైన మనంబు వేదవేద్యుండగు, వనరుహాక్షునందు నునిచె నేని
ముక్తిఁ గొందు భక్తిముక్తిప్రదాయిప, ద్మాక్షకల్పతరువు నందు నిజము. 359

వ. పుణ్యులును శ్రీరామచింతకులును నగువారలు ముక్తులు గావున. 360

చ. నరవరు ధారుణీస్థలి వసంతసుఖావహ మాను రాజశే
ఖరుఁడగు రామచంద్రుపదకల్పమహీరుహభక్తిపుణ్యు లి
ట్లరసి సుమంత్రతంత్రవివిధాజ్ఞత లెల్లను బాఱఁదోలి భా
స్కరకులవర్య నీలఘనకాయ రఘూత్తముఁ గొల్వఁ గాం దగున్. 361

క. అని శివుఁ డంబిక కెఱిఁగిం, చినగతి విధి నారదునకుఁ జెప్పిన వ్యాసుం
డును నారఁ బల్కె వినుఁడం, చనియెను సూతుండు శౌనకాదిమునులకున్. 362

స్రగ్విణీవృత్తము రమామానినీనాథ! రమ్యప్రభావా!
సముద్యద్దయా! దీనసారంగరక్షా!
హిమక్షోణిభృన్నందనేశాప్తతేజో
రమాధామ! శ్రీరంగరాజాభిధానా. 363

గద్య. ఇది శ్రీమొరులోటముక్తీశ్వరప్రసాదలబ్ధ కవితాపవిత్ర కోటమరాజు భాస్క
రమంత్రిపుత్త్ర నాగయామాత్య ప్రణీతంబయిన శ్రీమదధ్యాత్మరామాయణం
బను మహాకావ్యంబునం దారణ్యకాండంబు సర్వంబు నేకాశ్వాసము.

శ్రీరస్తు.

# అధ్యాత్మరామాయణము

## కిష్కింధాకాండప్రారంభము.



రంగనాయక! యశ

శ్శ్రీరంగ! కృపాంతరంగ! సింధుసుతాహృ

త్సారసభృంగ! భవార్ణవ

తారకనిజనామ! రంగధామ! మురారీ. 1

వ. దేవా! యవధరింపుము శైలరాజతనూభవం గనుంగొని భోగిభూషణుండు మఱలఁ బల్కిన తెఱంగు సూతుండు శౌనకాదుల కిట్లనియె నట్లు దాశరథులు క్రోశమాత్ర విస్తీర్ణంబును నగాధామలోదకంబును వనంబును సుత్ఫుల్లాంబుజకహ్లారకుముదోత్పల మండితంబును హంసకారండవాకీర్ణంబును జక్రవాకోపశోభితంబును జలకుక్కుట కోయష్టికక్రౌంచనాదోపనాదితంబును నానాపుష్పలతాఫలనగావృతంబును బద్మకింజల్కవాసితంబును నగుచు సజ్జనచిత్తసమానంబగు నమలోదకంబునఁ జెలువొందు పంపానామసరోవరంబునుం గాంచి తజ్జలంబులు స్పృశించి కొన్నిజలంబులు గ్రోలి విగతశ్రములై చల్లనిగాలి వీవ శీతలపథంబున ఋశ్యమూకంబుతెరువుఁబట్టి చనుచున్నయెడ నలువురు మంత్రులతోడఁ దద్గిరిమూర్ధంబున నుండి. 2

మ. వరకోదండశిలీముఖాంకుల జగద్వంద్యప్రతాపాఢ్యులం

జిరదాంతాత్ముల వల్కలాధరితులన్ శ్రీమంతులం గాంచి భా

స్కరసూనుం డతిభీతచిత్తుఁ డగుచున్ శైలాగ్రముం జేరి సం

గరశూరుండగు మారుతాత్మజుని వీఁకం జేరి పల్కెం దగన్. 3

చ. పవనతనూజ! నీవు నొకబ్రాహ్మణడింభకుభంగి నేఁగి యా

హవజయశీలు లాహరిపరాక్రము లెవ్వరో వాలి పంప న

న్నవమతి సేయ వచ్చిరొకో యంత యెఱింగి విరోధులైనఁ గ

న్గవలను సైగసేయు సుముఖత్వము గల్గిన నవ్వు మేనునన్. 4

వ. ఇట్లయిన నిశ్చయం బెఱింగెద.

## శ్రీరాములకడకు హనుమంతుఁడు వచ్చుట.

క. అని పలుక వటుని తెలిఁగునఁ, జని వినయముతోడ వారిచరణములకు వం
దన మాచరించి మారుతి, యవనతుఁ డిట్లనియె ముకుళితకరాంబుజుఁ డై. 6

మ. ధరణీభారముఁ బాపి భక్తులకు మోదం బివ్వ సాక్షాత్పరా
త్పరు లిబ్భంగిఁ జరింతు రాద్యులు జగత్ప్రాధాన్యులున్ మాయచే
నరులై యుండిరి సర్వభూతములు హృన్నాళీకమందుండు న
న్నరనారాయణు లట్లుగాని తెలఁగైసం గాంతి యిట్లొప్పునే. 7

వ. మఱియును. 8

మ. పురుషవ్యాఘ్రులు వీరసమ్మతులు సత్పుణ్యు ల్జగత్కర్తలి
ద్ధరణిన్ క్షత్రియవేషధారు లగుచున్ ధర్మేతరధ్వంసన
స్ఫురణ న్వచ్చిరి యంచుఁ దోఁచెడుఁ దనుస్ఫూర్తుల్ మహాంభోదముల్
సురధాత్రీధరమున్న దల్పెదుకళాసోముల్ యశస్సోములున్. 9

వ. ప్రధానపురుషులును జగత్కారణులును జగన్మయులును లీలలభంగి సర్గస్థితిలయం
బులు సేయువారలును నగు భంగి నాకుం దోఁచెడు ననిన విని రామచంద్రుండు
లక్ష్మణున కిట్లనియె. 10

క. విను మితఁడు శబ్దశాస్త్రము, గనె నపశబ్దం బొకింత గనుపింపదు ప
ల్కినపల్కుల నని రాఘవుఁ, డనియెను బవనసుతుతోడ నంబుదవేణీ. 11

ఉ. ఏ రఘువీరుఁడన్ దశరథేశ్వరుపుత్త్రుఁడ దండ్రిపల్కునన్
గౌరవ మొప్పఁ దమ్ముఁడును గాంతయుఁ గూడఁగ దండకాటవిన్
జేరి నిశాచరాధమునిచే సతిఁ గోల్పడి కాననంబులన్
జోరుని భూసుతన్ వెదకుచుం జనుదెంచితి మెవ్వ రీవనన్. 12

వ. విజ్ఞానగరిష్ఠుం డగు రఘుశ్రేష్ఠునిపలుకులకు మారుతాత్మజుం డిట్లనియె. 13

సీ. వినవయ్య రఘునాథ! వనచరశ్రేష్ఠుండు సుగ్రీవుఁ డనఁగల్గు సుభగుఁ డతని
సతిని నిష్కారణం బతని యన్న హరీశుఁడును నూరువెడల ద్రొబ్బిన నెదుర్ప
లేక యిచ్చట ఋశ్యమూకాద్రియం దున్నవాఁడు నల్వురు మంత్రివరులుగూడ
నతనికి సఖుఁడ నే నంజనీగర్భసంజనితుండ పవననందనుఁడ నాదు
తే. పేరు హనుమంతుఁ డండ్రు యంభోరుహాక్ష, యతను సఖ్యంబు నీకు నాతనికిఁ జూడ
నీదు భార్యాపహారిని నిఁక వధింపఁ, దోడగును రమ్ము రామ! నాతోడ నిపుడు. 14

క. అనిపలికిన రాఘవుఁ డిటు, లను కపివర! యేఁగుదెంతు వధికప్రీతి
న్నాదరింతు నీప్రియంబిక, తనయుఁడ నని పలుకఁ బవనతనయుఁడు భక్తిన్. 15

తే. స్వస్వరూపంబు ధరియించి సకలలోక, నాథుఁడగురామునకు మ్రొక్కి నాదుమస్త
కంబుపై నెక్కుఁ డిదె వాలిచేత నవిజుఁ, డున్నశైలంబు చేర్తు నంచన్న నపుడు.

వ. అనుమతించి తమ్మునితోడ రామచంద్రుఁడు స్కంధారోహణముఁ జేసె నంత వాయు
నందనుండును విహాయసంబున కొఁగనిక్షణంబున గిరిమూర్ధంబుఁ జేరి యచ్చట నొక్క
మహీరుహచ్ఛాయ రామలక్ష్మణుల నునిచి తాను సుగ్రీవుసమీపంబునకుం జని
కృతాంజలి యై యిట్లనియె. 17

ఉ. లెమ్ము భయమ్ముఁ జేల సుఖలీలను వారలు రామలక్ష్మణుల్
సమ్మతి నీకు వారలకు సఖ్యముఁ జొప్పడఁ జేసి తట్లు ని
క్కమ్మది యగ్నిసాక్షిగను గాఁదగు నంచన వేగ భానుజాం
డమ్మనుజేంద్రు లున్నయెడ కప్పుడు వచ్చె హిమాద్రినందనా. 18

వ. అప్పుడు హనుమంతుం డొక్కభూరుహశాఖవిఱిచి రామలక్ష్మణులకు బదపీఠంబు
గావించె నవ్విధంబ యాలక్ష్మణుండు నొనరించె నిట్లందఱు సుఖాసీనులై యుండిరి.
లక్ష్మణుం డయ్యవసరంబున వనవాసాభిగమనంబును సీతాహరణంబును నాదిగాఁ
గలవృత్తాంతంబు పల్కిన సుగ్రీవుం డిట్లనియె. 19

ఉ. ఏ నొనరింతు భూతనయ నెన్నివిధంబులఁ గాంచుభంగిఁ ద
ద్దానవుఁ ద్రుంచి యింకొకవిధం బొకవాఁ డిట మంత్రివర్యులన్
నేనును నిల్చియున్నతఱి నెవ్వఁడొకో కొనిపోవ రామరా
మా నను గావు మంచు భయమందుచు నేడ్చుచు నంబరంబునన్. 20

ఆ. చనుచు మమ్ముఁ గాంచి వనిత నిజోత్తరీ, యంబుఁ జించి భూషణంబు లునిచి
చుట్టి వైచె నవియ చూడుఁడు మీ యవి, యవునొ కావొ యనుచు నపుడు చూప.

వ. గుహాంతరనిక్షిప్తంబు లగుసీతాభరణంబులు దెచ్చి చూపిన రామవిభుండును హృద
యంబున నడుకొని ప్రాకృతునిచందంబున. 22

క. హా సీత హా మహీసుత, హా సరసిజనేత్రి యనుచు నతిదుఃఖమునన్
గాసిలినొందఁగ లక్ష్మణుఁ, డాసమయంబునను శోక మడఁచుచుఁ బలికెన్. 23

ఉ. ఏటికి చింత రామధరణీశ్వర! వేగ సురారిఁ ద్రుంచి నీ
బోటిని గాంతు వీప్లవగపుంగవుతోడున నంచుఁ బల్కి న
మ్మాటకు భానునందనుఁడు పల్కె రఘూత్తమ! యగ్నిసాక్షి మ
మ్మాటికి నేను దానవుని మార్కొని ద్రుంపుదుఁ దెత్తు భూసుతన్. 24

క. అనిపల్కి వేగ పవనజుఁ, డొనరించె హుతాశు నప్పు డురువిక్రము ల
య్యినకులుఁడు నినతనూభవుఁ, డనువుగఁ గూర్చుండిరగ్ని కభిముఖు లగుచున్. 25

వ. ఇట్లు కూర్చుండి యకల్మషు లగురామసుగ్రీవులు బాహుదండంబులు సాచి పరస్ప
రాలింగనంబులు గావించి రంత సుగ్రీవుండు వందనం బొనరించి పరమసఖుండ
వగు రామచంద్రా! వాలిచేసిన యపకృతి యెఱింగించెద. తొల్లి మయపుత్త్రుం
డును పరమదుర్మదుండు నగు మాయావి యనురక్కసుండు కిష్కింధానగరంబు
నకు జనుదెంచి రోదోంతరంబు నిండ సింహనాదంబుచేసి వాలి నాహవంబునకుఁ
బిల్వ నతండును గ్రోధతామ్రాక్షుం డై పఱతెంచి దృఢముష్టి వానివక్షంబుఁ
బొడువ వాఁడును నిలువలేక పఱచిన వాలియు నేనును వెనుదగుల భీతుం డై
యొక్కశైలగుహ సొచ్చె నంత రోషంబు విడువక వాలి నన్నుం గనుంగొని. 26

ఉ. వాని వధించివచ్చెద నవార్యపరాక్రమ నిల్వు మంచు న
ద్దానవుతోడ నేఁగె నట దాకొన మాంసమునిండ రక్తమున్
ఫేనము మెండుగా వెడల బెగ్గిలి వాలి యడంగె నంచు లో
నూనిన చింతతోడ శిలయొక్కటి యగ్గుహవాతిమూఁతగాన్. 27

క. ఊనిచి పురంబున కప్పుడు, చనుదెంచి యెఱుంగఁ బల్క సచివులును బురుషుల్
ఘనశోకకలితు లై రట, వనచరపతి లేకయున్న వనచరమంత్రుల్. 28

క. నను నధిపుఁ జేసి రేమును, జన కొన్నిదినంబు లట్టులసలిపితి నంతన్
దనుజునిఁ బొరిగొని విలయా, ర్కునగతిఁ జనుదెంచి వాలి క్రూరత నన్నున్. 29

వ. అరిందమా! పటురోషంబున పరుషవాక్యంబులాడి. 30

సీ. భర్జించి తనదు దుర్భరముష్టిహతులచేఁ బొడిచి యన్నగరంబు వెడలద్రొబ్బ
నతిభయంబున భువియంతయుఁ జరియించి మునిశాపమునఁ జేరకునికి దలచి
యిమ్మహీధరముపై నిటు వసియించిన నదిమొదల్ వాలి మత్సుదతిఁ గూడి
సకలభోగములచే సంతృప్తుఁ డై యుండె నేనిరాశ్రయుఁడనై యింతిఁ గోలు
తే. పోయి రఘునాథ! దుఃఖసంపూరితాంత, రంగుఁడను నౌచు నీపాదమంగళాభి
దర్శనంబున దుఃఖము ల్దఱిగి సంత, సంబు నొందితి నన రామచంద్రుఁ డపుడు.

చ. వెఱవకు మర్కపుత్త్రి! యిఁక వేఱొయనన్ బనిలేదు వాలినిన్
బొరిగొని రాజ్యమున్ సతిని బొందఁగఁ జేతు వటన్న రాఘవా!
తరమె వధింతు నంటివి కృతాంతునికైనను వాలిదార్ఢ్యముం
రతిమతిరయే బలాఢ్యులు సఖా గ్రుల్లు గారె తలంప వాలికిన్. 32

## సుగ్రీవుండు శ్రీరాములతో వాలిసామర్థ్యము సెప్పుట.

వ. బలవత్ప్రిధానుండవగు రఘునందనా! వాలి దేవతలకును దురాసదుం డతని బలం
బెఱింగించెద నొకనాఁటివికాసమయంబున మహాకాయుండగు దుందుభియను

దుష్టాసురుండు మహిషాకారుండై కిష్కింధానగరంబునకుం జనుదెంచి సమరంబు
సేయ భీషణంబుగ వాలి నాహ్వానంబు చేసిన విని పరమకోపనుం డగుచు 33

క. చనుదెంచి తద్విషాణం, బనువుగ నొకచేతఁ బట్టి యవనిఁ జరచి త
న్నిన జిరజిరఁ దిరుగుచు ని, మ్మునివరాశ్రమమందుఁ బడియె మునినుతచరితా!. 34

వ. దూరపాతంబున దేహంబు పగిలి వనంబెల్ల రుధిరప్లుతం బైన మతంగమునీంద్రుం
డును క్రోధఘూర్ణితుండై. 35

క. ఇదిమొదలు వాలి యిచటికిఁ, బదపడి చనుదెంచెనేని భగ్నశిరుండై
తుదిముట్టు ననియె నిటు గాఁ, దదితెలిసి యిటుండువాఁడ నదియే నొకఁడన్. 36

వ. కాన భయవర్జితుండనై యుంటి నీ విప్పుడు. 37

ఆ. పర్వతోపమం బఖర్వపరాక్రమ!, కాంచు మాహిషంబుఁ గదలుపంగ
నోపెదేని వాలి నుక్కడంచెద వంచు, నమ్మెదనిన నగుమొగమ్ముతోడ. 38

వ. పాదాంగుష్ఠంబున. 39

తే. భూధరముఁబోలు నాదైత్యుభూరితనువుఁ, జిమ్మ నదియును శతయోజనమ్ము లరుగ
సాధు వనుచును నిజమంత్రిజనులు దాను, సంతసమ్మున మించె భాస్కరసుతుండు.

వ. మరల భక్తపరాయణుండగు రామచంద్రునకు నిట్లనియె. 41

చ. కనుఁగొను సాలసప్తక మఖండపరాక్రమశాలి వాలి తా
ననువుగఁ బట్టి పర్ణముల నన్నిటిఁ గోయును నొక్కచేత నీ
వును నొకసాయకంబున మహోజ్జ్వలతం ధరఁ గూల్చెదేని ని
న్ననువుగ నమ్ముదుం గనుమ నౌదువు వాలి నటంచు నెమ్మదిన్. 42

మ. ఇటుపల్కం బటుకార్ముకంబున శరం బేపార సంధించి ది
క్తటిభీమంబుగ నేయఁ దచ్ఛరము తత్సాలంబులం ద్రెంచి మి
క్కుటమౌ రాముబలం బహీంద్రునకుఁ బల్కం బోవుమాడ్కిన్ మహా
స్ఫుటిమై శైలము భూమి గాఁడిచని శుంభద్విక్రమప్రక్రియన్. 43

తే. మరల రాఘవతూణీరమధ్యతలము
నందు నిల్చిన రవిజుఁ డానందుఁడును స
విస్మయుఁడు నాచుఁ గేల్మోడ్చి వివిధగతులఁ
బొగడఁ దొడఁగెను రఘునాథు నిగమవినుతు. 44

సీ. నరవరోత్తమ! జగన్నాయకుండవు నీవు మత్పూర్వకృతపుణ్యమహిమచేతఁ
గలిగె నీస్నేహంబు ఘనులు నిన్ భజయింతు రీశ! సంసారనివృత్తికొఱకు
మోక్షప్రదాయివౌ ముక్తికి నినుఁ గాంచి చనునె భవాబ్ధిలో మునుఁగ బుద్ధి

పుత్త్రదారధనాదిభోగంబు లెల్ల నీమాయాకృతంబులు మనుజనాథ!

తే. కాన సత్యంబు వేడ నను గరుణ జూడు, మవని మంటికిఁ ద్రవ్యదృశ్యమగునట్టి
నెన్ని ధానంబుగతిఁ గామపించి తీవు, రామ! గిరికన్యకాస్తుత నామ! కరుణ. 45

వ. నాదుభాగ్యగౌరవం బెంతని వర్ణింతు నానందానుభవుండ నైతి మఱియు ననాద్య విద్యాసంసిద్ధంబగు బంధం బిపుడు వీడఁగంటి యజ్ఞదానతపఃకర్మాదులును నిష్టాపూర్తంబులును దార్ఢ్యంబగుఁ గాని సంసారంబు జీర్ణంబు గాదు భవత్పాదసందర్శనంబు సద్యోనాకం బసంశయంబు క్షణార్ధంబయిన నెవ్వనిచిత్తంబు నీయం దచలంబుగ నిల్చు వానియనర్థహేతువగు నజ్ఞానంబు తత్క్షణంబ సమూలంబుగ నశియించు నది యటులుండనిమ్ము నీయందయినను గాక వానిపూర్వవాసనచేఁ నొందు దేసనైనను మనంబు నిల్పిన మోసంబులే దిం దొక్క విధంబు పల్కెద. 46

ఆ. రామ రామ రామ రామ రామ! యటంచు, మధురముగ నెవండు మంజువాణిఁ
బాడు నిముసమైన బ్రహ్మఘ్నుఁడును నురా, పాయిదైన ముక్తపాపుఁడగును 47

సీ. కాంక్షింప విజయంబు కనకపుత్త్రికళత్రమిత్రాదిసుఖము సౌమిత్రివినుత!
భవబంధములఁ బాపు భవదంఘ్రియుగభక్తిఁ గాంక్షింతు నఖిలలోకప్రశంస!
నీదుమాయావృతంబై దనర్చు నెటులంగ సంసారమేను నీయంశ మనఘ!
భవసంకటములనన్నాపి నీపదభక్తి యుపదేశ మిమ్ము లోకోపకార!

తే. యఖిలమును దొల్లి నీగుమాయావృతుండ, నగుచు మిత్త్రులు శత్త్రువు లని తలంతు
నిపుడు భవదీయచరణాబ్జవిపులదర్శ, నమున సకలంబు బ్రహ్మచందమునఁ దోఁచు.

తే. ఎవఁడు మిత్త్రుఁడు శాత్త్రవుం డెవఁడు నీకు, మాయచే బద్ధుఁ డగుమందు మనుజుఁ డెంత
తడవు నానాత్వబుద్ధియుఁ దనరు నంత, తడవు గుణయుక్తుఁ డగును సుందరశరీర!.

క. నానాత్వ మెంతతడ వజ్ఞానంబునఁ గలుగు నంతసమయము ధాత్రిన్
మానవుల కభయ మొందదు, గాన నవిద్యావిరోధి గావలయు భువిన్. 50

వ. అవిద్యోపాసన సేయువాఁడు 'మహాంధకూపంబున మునుంగు మాయామూలంబున సకలంబునకు మోహసాగరంబు లభియించుచుండుఁ గావున రఘూత్తమా! నీకు దాసుండనగు నాయందుల నమ్మహామాయ దూరంబు సేయుము మఱియును. 51

శా. నీపాదాశ్రితచిత్తవృత్తి యెపుడున్ నీనామసంకీర్తన
వ్యాపారంబుగ వాణియున్ గరము లత్యాసక్తి నీభక్తినే
వాప్రావీణ్యము తావకీనతనుసంవాసంబు గా దేహమున్
భూపాలోత్తమ! మాకొసంగఁ గదవే పుణ్యప్రదస్వాంతతన్. 52

క. నీమూర్తియందు భక్తియుఁ, బ్రేమన్ నినుఁ జూచుకనులు పృథివీస్థలిపై

నీమహిమకథలు విను చెవు, లేమఱక త్వదాలయముల కేఁగెడుపదముల్. 53

క. కరుణింపు భువనరక్షా, నిరతవ్రత! కమలనయన! నిరుపమ! వక్తం
చరజలధిమథనమందర!, శరణాగతభరణ! రామచంద్ర! నరేంద్రా!. 54

వ. అని సుగ్రీవుండు పలికిన నని మధురకవ్యకతోడ నభ్రకేశుం డవ్వాలితెఱంగు మరల నిట్లనియె నంత సాన్వత్మపతిష్వంగంబున నిర్ధూతాశేషకల్మషుండగు సుగ్రీవుం గనుంగొని చిఱునగవుతలిర్ప రామచంద్రుం డిట్లనియె. కపివరా! మోహకారిణియు ధారణార్హ్యయుం గాదని దెలిసినను మాయను గార్యసిద్ధికొఱకు వాలికుందు వృద్ధిం బొందింపవలయు నెందు కనిన. 55

ఆ. నీవు పల్కినంత నిజముకాని జనంబు, లెల్ల రామచంద్రుఁ డేమి చేసెఁ
బ్రతినచేసి భానుసుతున కంచుఁ బరాప, వాద ఐచ్చుఁ గాన వాలికడకు. 56

## సుగ్రీవుండు వాలితోడ యుద్ధముసేయఁ జనుట.

క. చని కదనమునకుఁ బిలువుము, ఘనముగ నొకసాయకమున ఖండించి కృపన్
వనచరపతి నినుఁ జేసెద, నన నతివేగమునఁ జని మహాహ్వానసేయన్. 57

వ. రామశాసనంబున నిట్లు కిష్కింధోపవనంబునకుం జని యాహ్వానంబుచేసిన. 58

ఉ. ఆనినదంబుఁ దా విని మహాగ్రహుఁడై చనుదేర వాలినిన్
భానుజుఁ డేపునన్ బొడిచె బల్విడి వాలియు గ్రుద్దె నొప్పునన్
భానుజుఁ డిట్టు లొండొరు లపారబలంబునఁ బోర రాఘవుం
డానలినాప్తపుత్త్రదివిజాధిపపుత్త్రులఁ జూప నొక్కలై. 59

తే. కానుపించిన విస్మయకలితుఁ డగుచు, నీతఁ డినసందనుం డీతఁ డింద్రతనయుఁ
డనుచుఁ దెలియఁగలేక యేయకయయుండె, నార్తుఁడగుభానుజానకట్టులగునొ యనుచు.

వ. సుగ్రీవవధశంక చేత నుండె నంత సుగ్రీవునిఁ బొడిచియు గ్రుద్దియుం బడఁదన్నియు దరప్రహారంబులఁ గంఠగతప్రాణుం జేసి నిర్భగ్నుండై దేవేంద్రపుత్త్రుండు నిజభవనంబునకుం జనియె నంత సుగ్రీవుఁడును వదనంబున రుధిరంబు గ్రక్కుచు భయాకులుం డై రామచంద్రుసన్నిధానంబునక్కుం జనుదెంచి. 61

చ. పగతునిచేత నన్నిటులఁ బ్రాభవదూషితుఁ జేయ రామ! నీ
కగునె వధింతు నందు మనసైనను నీవె వధింపరాదె నేఁ
డగణితపుణ్యమూర్తివి దయానిధి వీవని విశ్వసించి మూఁ
మిగిలి చనంగ నన్యగతి మిన్నక యుంటివి పల్కు టేటికిన్. 62

వ. శరణాగతవత్సలా! ప్రతినచేసి యుపేక్షసేయఁదగునె యనిన రామచంద్రుండును.

ఆ. అపుడు సాశ్రునయనుఁ డగుచు నయ్యినపుత్త్రుఁ, గౌఁగిలించి మిగుల గారవించి

భయము నొంద కిపుడు పరికింప నాకు మీ, రిపువు రొక్కపగిది సెఱుఁగఁబడక.

వ. నాదుసాయకం బమోఘంబు గావున మిత్రద్రోహభయంబున నేయకుంటిఁ గాని యిప్పు డొక్కయానవాలు భ్రమకాంతికి నేయించెద మరల నాహ్వానంబు సేయుము నిముసంబున హతుఁడగు వాలిం గాంచెదవు రాఘవుండ నసత్యంబు పల్క నీయాన యనుచు నూఱడించి లక్ష్మణుం జీరి. 65

క. ఒకపుష్పమాల రవిసుతు, నకు గళమున నునుపు మని యన న్నిల్ప సము
త్సుకమతిఁ బనుపఁగ సంతో,షకలితహృద్వనజుఁ డగుచుఁ జండాంశుక్రియన్.

చ. మనుపతిభంగి నన్న గిరిమూఁగల నిల్చి భయంకరంబుగా
నినద మొనర్ప వాలి మది నిండఁగ రోషముతోడ వీఁడు నె
మ్మనమున సిగ్గులేక బలుమానిసివోలె రణం బొనర్ప న
న్నెనయఁగ వచ్చె నిట్టిమొగ మేమిగఁ జెల్లెనొ వింత చూడఁగన్. 67

ఆ. అనుచుఁ బరికరంబు ఘనతరం బొనరించి, చనఁగ నిశ్చయించుసమయమునను
దార వల్కె నోయుదారగుణాకర!, వినుము నాదువాక్య మనువుతోడ. 68

వ. ఎట్లు లనిన. 69

సీ. ఇపుడు నీచే బలం బెల్లఁ గోల్పడిపోయి మరలి వచ్చునె యొక్కమహితదార్ఢ్య
వండలేక యటన్న నపు డిట్టు లనియె సహాయ ముండిననేమి సేయఁగలఁడు
పాపచిత్తుండగు భానుజుం డోసతి విడువు హస్తము చింత విడువు నిలువు
మిదిగాక శాత్రవుం డిటు బిల్వ పూరుఁ డేక్రియ నిల్చు భీతునిక్రియ సుమధ్య

తే. యనిన నిటుపల్కెఁ దార వేఁటాడఁజనిన, యంగదునిచేత వింటి రామాభిధానుఁ
డలరు సాకేతపురికి నాయకుఁడతండు, జనకుపనుపున ననుజుండు సతియుఁ గొల్వ.

తే వనమునకు వచ్చి దండకమున దశాస్యుఁ, చేత సతిఁ గోలుపడి ధారుణీతలంబు
నెల్ల వెదకుచుఁ జనుదెంచి యినజుఁగాంచి, సఖ్య మొనరించె ననలంబు సాక్షిగాను.

వ. అప్పుడు. 72

చ. ప్రతిన యొనర్చె నిన్ దునిమి భానుతనూజున కాధిపత్యమున్
జతపడుపంగ నీ విఁకను శాంతి వహించి పతంగనందనున్
బతినిగ యౌవరాజ్యమునఁ బట్టము గట్టి సమస్తలోకవి
శ్రుతు శుభకీర్తి రామవిభుఁ జేరుము ప్రోవఁగలండు సత్కృపన్. 73

వ. ఇట్లమ్మహీనాథు శరణంబు నొంది. 74

తే. అంగదుని నన్నుఁ గులము బ్రోవంగఁ గదవె
యనుచుఁ బదములఁ బడుచు రోదనము సేయు

గారవించి దయామతిఁ గౌఁగిలించి
పాకశాసనతనయుండు పల్కె నిటుల. 75

తే. కాంత నీవగుటను భయభ్రాంతవగుదు, వింతకాక కౌఁటింత యొక్కింత గల్గ
దింతి! రాముఁడె యైన మా కిరువురకును, మైత్రి వాటిల్లుఁ బనిలేదు శాత్రవంబు.

ఉ. ఈయెడ వడ్డగింప కొకయింతయు నారఘుపుంగవుండు నా
రాయణుఁ డిమ్మహీభరమునంతయుఁ బాప జనించె నేను ద
ద్ధ్యేయుఁ బరేశు విష్ణు జగదీశు ననంతుఁ గృపాపయోనిధిన్
బాయక తోడితెత్తు నతిభక్తి యొనర్తు భజింతు వేడుకన్. 77

వ. ఆమ్మహాత్మునకు స్వపక్షపరపక్షంబులు లేవు పరమేశ్వరుండు భక్తిగమ్యుండు భజియించువారి మిగుల మన్నించుఁగాక సుగ్రీవుం డొక్కరుండ చనుదెంచినఁ దత్క్షణంబున వధియించి జయంబు గొనివచ్చెద సకలలోకంబుల శూరుం డనం బరఁగి యుద్ధార్థియై యాహ్వానంబు సేయు సుగ్రీవు నెవ్విధంబున భీతునిగతి వేఁడం జనుదు నదిగావున దుఃఖంబు పరిత్యజించి మందిరంబున నిలువు మని యశ్రులోచనయై విలపించుతార నూరార్చి సుగ్రీవవధోత్సుకుండయి యప్పుడు. 78

మ. పఱతేరన్ సుమమాల కంధరమునం బంధించి సుగ్రీవుఁ డం
బరవీథిం జెలువొందు భాస్కరుగతిన్ బల్వేఁకమై క్రుద్ధ నా
సురనాథాత్మజు నంత భానుజుని వక్షోరంగమధ్యంబునన్
గిరిభిన్నందనుఁ డేపునం బొడిచె రాకేందుప్రపూర్ణాననా. 79

వ. ఇట్లు వాలిసుగ్రీవులు కులాచలంబులచందంబునం దలపడి పోరొనర్చునెడఁ బ్రయత్నంబునఁ దన్నవలోకించుసుగ్రీవుపయిం గరుణించి ప్రతాపవంతుండును దయాళుండును గావున. 80

## శ్రీరాముఁడు వాలిని సంహరించుట.

మ. తరుషండంబులఁ బొంచి రాఘవుఁడు ప్రత్యాలీఢుఁడై స్వేషుధిన్
గిరిభిత్సాయక మేపునన్ బెఱికి దృగ్లక్ష్యము ల్వాలివా
త్సరసీజంబున నిల్పి కార్ముకము శ్రోత్రాంతంబు గాఁ దీసి యే
సె రమేశప్రతికూలి వాలిఁ గరిభిత్సూనానుకూలిం బడన్. 81

వ. ఇట్లేసిన నదియును మహావేగంబున నశనిసన్నిభంబై యురంబు గాఁడిన వాలియు మింటి కెగసి బిట్టార్చి నేలం బడి నిశ్చేష్టుండై ముహూర్తంబున కొక్కింత చైతన్యంబు నొంది కను విచ్చి ముందఱ. 82

సీ. అవ్యయు దుర్వారశౌర్యు మహాబాహు వనమాలికాసముజ్జ్వలితు సువిక
చాంభోజనయనుఁ బీతాంబరు వరజటామకుటశోభితు లసన్మందహాసుఁ
గుందేందురదను సంకుచితమధ్యు ధనుశ్శిలీముఖాంకుఁ బ్రపూర్ణకాము రాము
సుగ్రీవలక్ష్మణశోభితోభయపార్శ్వు నంబుజానను సుభ్రు నాయతోరుఁ
తే. గాంచి నిందింపుచును రామ! పొంచియేయఁ, దగునె యిది రాజధర్మమే తప్పొకింత
రైనఁ జేసితినే నీకు వనికిఁ బిల్చి, కానఁగవలవదె జయలక్ష్మి జనులు నగరె. 83
తే. బాంధవుఁడవు పరాక్రమప్రబలులైన, క్షత్రియుల కింక మనువంశసంభవుండ
వడవిలోని కిరాతునియట్లు డాఁగ, నేర్చితివి ధర్మకీర్తులు నిలుపఁగలవె. 84
తే. ఇనజుఁ డేమి యొనర్చె నే నేమి నీకుఁ, జేయనైతిని దశకంఠుచేత సతిని
గోలుపడియర్కజుని వేఁడుకొనుట దెలిసె,నహహ!యిదివింతమద్బలంబనఁగ వినుము.

చ. పనిచితివేని రావణు సబాంధవుఁ గాఁగను జుట్టి లంక న
జ్జనకజతోడఁ దెత్తు నిముసంబునఁ గాకటు ధార్మికుండ వం
చనఁదగి పొంచి యేయఁదగునా కనఁజాలవు భక్ష్యదూష్యమా
వనచరమాంస మేపనికి వచ్చు వృథా ననుఁ ద్రుంచి తక్కటా!. 86
వ. అని బహువిధంబుల భాషించు వాలిం గనుంగొని రామచంద్రుం డిట్లనియె. 87
సీ. శరచాపయుతుఁడనై సకలధర్మచయంబుఁ బాలింపుచుండుఁ బాపాత్ములను
ద్రుంతు సద్ధర్ముల నెంతయుఁ బోషింతు మఱియుఁ గూఁతురి భ్రాతృమహిషి భగిని
నెవ్వఁడు కామార్తుఁడై తివిలి భోగించు వాఁడతిపాతకుఁడు ద్రుంప నగు విభునకు
రాజకాంతయు గురురమణియు భ్రాతృసుందరియు స్వస్త్రీమాత తనదుమాత
తే. తల్లులన నొప్పువారు గృహదాహకుండు, గరదుఁడును క్షేత్రదారాపహారుఁడు శస్త్ర
ధరుఁడు ధరఁజోరుఁడును నాతతాయు లనఁగఁ, బరఁగుదురు వీరలార్గురు గిరిచరేంద్ర!.
తే. ఆతతాయులు చనుదేర నవనివిభుఁడు, పట్టి యసిధార శిరముఁ ద్రుంపంగవలయు
ధర్మశాస్త్రప్రచోదితధర్మ మిదియు, గాన నిటు చేసితిని ధర్మకలితబుద్ధి. 89
వ. ఎందు కనిన. 90
తే. నీవు సుగ్రీవుసతి రుమాదేవిఁ బట్టి, బలిమి రమియించెదవు గానఁ గలిగె నిట్లు
ధరణిపాలన మొనరింప నరుగుదెంచు, పుణ్యుల నెఱుంగ విటు కపిబుద్ధితోడ. 91
వ. ఇంక భాషించుట యుచితంబు గాదనిన వాలియు భయసంత్రస్తుండై రామచం
ద్రుండు రమావల్లభుం డని యెఱింగి యిట్లనియె. 92
సీ. శ్రీరామ! రఘురామ! శృంగారగుణధామ! మది నెఱింగితిఁ బరాత్పరుఁడ వనుచు
క్షమియింపు మెఱుఁగఁజాలమి నెగ్గు పలికితి నిపుడు నీశరముచే నపరిమితము

లగుపాపముల నెల్ల నడఁచి మేనుఁ దొలంగి యవ్యయానందసౌఖ్యాభియుతుఁడ
నగుదు నీదర్శనం బతిదుర్లభము మృతివేళ నేధన్యుని విమలనామ
తే. కీర్తనాసక్తుఁడైవఁ దన్మూర్తిఁ జెంది, మరలి రాకుండునట్టి భానురచరిత్రుఁ
డిపుడు మోక్షార్థి నగు నాకుఁ గృపను గానఁ, బడెను మద్భాగధేయంబు పలుకఁ దరమె.
చ. ఎఱుఁగుదుఁ దీర్ఘపాదుఁడ వధీశుఁడ వాద్యుఁడ వాదిమూర్తి వీ
పరిభటగర్వనిర్దళన! యంబుజసంభవనీత! రావణుఁ
గరిమ నడంపముఁ గమలగర్భుడు వేఁడ జనించి తీవు భా
స్కరకులమందు నీ పదవిఁ గాంచెద నేఁ గరుణింపు రాఘవా!. 94
మ. ననుఁ బోలు న్భుజవిక్రమంబున జగన్నాథా! మదీయాత్మజుం
డనిలోఁ దోడగు నీకు నంగదుఁడు దిక్కై వీనిఁ బాలింపు మ
ద్ఘపవక్షంబున, బాణముఁ బెఱుకు మింక న్నిల్వఁగా నోప నం
చన హస్తంబున నంటి తీసె శర మయ్యాదిత్యవంశుం డొగిన్. 95
వ. అప్పుడు మర్కటదేహంబు విడిచి యమరేంద్రుఁ డయ్యె నిట్లు. 96
క. మునిజనసౌఖ్యప్రదుఁడగు, వనజాక్షునిచేత నీల్గి వాలి కపిత్వం
బును బాసి పరమహంసలు, కను గన్ని పదవి నొందెఁ గుధరేంద్రసుతా!. 97
వ. ఇట్లు పరమాత్ముం డగు రాఘవుచేత వాలి నిహతుం డయిన సకలవానరులును భయవి
హ్వలులై పాఱి కిష్కింధానగరంబుఁ జొచ్చి తారం గనుంగొని. 98

## వాలి మృతినొందుట విని తార దుఃఖించుట

శా. దేవీ! రాఘవుచేత నీల్గె నిచటన్ దేవేంద్రపుత్త్రుండు నీ
వీవేళం బురి నాల్గువాకిళులు మూయింప న్బ్రభు న్నంగదుం
గావింప న్నిజమంత్రులుం బనుపు మన్నన్ ముఖ్యులై కర్ణమం
దావాక్యంబులు దాఁకఁ దాఁ బడె దుఃఖాక్రాంతయై భూస్థలిన్. 99
వ. పడి తనకరంబులచేత నురంబును శిరంబును. 100
ఆ. మోఁదికొనుచు రాజ్యమును నంగదుఁడు ధనం, బేల నాథుఁ గూడ నిపుడు చనుదు
ననుచు ముక్తకేశ యగుచు నేడ్చుచు వచ్చి, కనియె దివిజరాజతనయు నచట. 101
వ. ఇట్లు రుధిరపంకప్లుతదేహుం డయి యున్న నిజవల్లభుం గాంచి తచ్చరణంబుల
పయిం బడి 102
క. హా నాథ! నన్ను విడుచం, గా నగునె యటంచు రాముఁ గని పల్కె నహో
భూనాథ! వాలి నేసిన, బాణంబున నన్నుఁ ద్రుంచి పనుపవె ఘనతన్. 103
క. ననుఁ బాసి యొక్కనిముసము, వనచరపతి నాకమైన వలదను నీవున్

వనితాదుఃఖ మెఱుంగుదు, వన సేటికి నన్నుఁ బ్రశ్నింతు వైనను నీకున్. 104

శా. పత్నీదానఫలంబు గల్గునని కోపం బొప్ప సుగ్రీవ! నీ
యత్నంబుల్ ఫలియించె నన్ను మడిసెన్ దృక్తారిబాధుండవై
పత్నీయుక్తముగా సుఖింపు మిఁక సాపత్న్యుల్ సతిం జేర స
ద్యత్నానందుఁడ వైతి వంచుఁ బతిదేహం బెల్ల నీక్షింపుమన్. 105

క. కీలూడిన ప్రతిమగతి, న్నేలం బడు తారతోడ నిరుపమకరుణా
శీలుఁడు వినుతాఖిలభూ, పాలుఁడు రఘుపాలుఁ డిట్లు పలికెన్ దరుణీ. 106

సీ. శోకావిషయుఁడైన నీకాంతునకు దుఃఖ మేల నీకాంతుఁ డీయేను గాక
పలుకు జీవుం డొక్క తెలియఁ ద్వఙ్మాంసాస్థికలితంబు పంచాత్మకంబు తనువు
కాలకర్మగుణానుకలితమై నీముందు నిలిచె జీవం డని దలఁప నాతఁ
డామయవర్జితుం డరుగఁ డెచ్చట నిల్వఁ డవనిఁ బుట్టఁడు చావఁ డాఁడుదియును

తే. బురుషుఁడును షండుఁడును గాఁడు పూర్ణుఁ డమలుఁ
డద్వితీయుండు దాను విహాయసంబు
పగిది నిర్లేపకుఁడు జ్ఞానమయుఁడు నట్టి
వాఁడు దుఃఖింప నగువాఁడె వనిత! తెలియు. 107

క. అని పలికినఁ దారయు ని, ట్లనియెన్ రఘునాథ! కాష్ఠ మంటివి తను విం
కను జీవుఁ డమలుఁ డంటివి, యెనయఁగ సుఖదుఃఖబంధ మెవరికిఁ జెపుమా?.

సీ. అనిన రాఘవుఁ డిట్లు లనియె దేహేంద్రియములలో నహంకారమూలబంధ
మాత్మకుఁ దాతాత్మ్య మనెడు మిథ్యాజ్ఞాన మెంతవట్టును గల్గు నంతవట్టు
సంసృతి సుఖదుఃఖసహితంబు మిథ్యయైనను వీడ దమలవిజ్ఞానమునను
గాని సంసారంబు కలలోన లేని దైనను స్వశిరశ్ఛేదనాద్యనర్థ

తే. సూచనము సత్యమనుచుఁ దోఁచుగతి వినవు, సంతతధ్యాయమానవ కింత నిక్క
మనుచుఁ దోఁచును సంసార మాత్మ నెట్టిఁగి, ఘనులు కామాదులను బాఱఁగదుమవలయు.

వ. అనాద్యవిద్యాసంబంధంబువలనను దత్కార్యంబగు నహంకృతివలనను రాగద్వేషాదిసంకులంబగు నౌపాధికసంసారంబు దోఁచు మనంబ సంసారంబును బంధంబును నగువిచారింప రంజనంబు లేకయుండియు లత్తుకసమీపంబున శుద్ధస్ఫటికంబు తద్వర్ణంబుగ దోఁచుభంగి మనంబుతోడఁ స సంభావితతాదాత్మ్యంబు నొంది యాత్మయుఁ దత్కృతబంధానుభవుం డగు నిట్లు బుద్ధీంద్రియాదిసంబంధంబువలన నాత్మకు సంసారంబు బలవంతంబుగఁ గల్గు నాత్మయు స్వసూచకంబగు మనంబును బరిగ్రహించి తదుద్భవంబులగు కామంబుల ననుభవించుచుఁ దద్గుణబంధుండును నవశుం

డును నై సంసారంబున వర్తించు మొదల మనోగుణంబులును ననేకవిధంబు లగు కార్యంబులును శుక్లలోహితకృష్ణాదులును దత్సమానజంబులగు సాత్త్వికాదిగతు లును బుట్టించి భూతసంప్లవపర్యంతంబును గర్భవశంబునందిరుగుచుండు నిట్లు పరు నియందును విషయరహితుండై యనాద్యవిద్యాసంబంధంబునను స్వకర్మవాసనను నఘునివేళనుండై యుండి పునస్సృష్టికాలంబునఁ బూర్వవాసనావశంబున నవ శుండై ఘటయంత్రంబుభంగిఁ బుట్టుచుండు మఱియును 110

మ. తనపుణ్యంబున నెవ్వఁడైన భగవత్సంబంధసాంగత్య మొం
దునో వాఁడంతట మత్కథాశ్రవణమోహుండౌ స్వరూపాజ్ఞతల్
చను వాక్యార్థమెఱుంగువాఁ డగు సదాచార్యోపదేశంబుచే
తను దేహాదివిలక్షునిం దెలియు నాత్మజ్ఞ ముక్తుఁడౌ భామినీ! 111

వ. దేహేంద్రియమనఃప్రాణాహంకృతులకు వేఱ యున్నవాఁడును సత్యుండును జిద్రూపుండును విజ్ఞానానందుండును నగు నాత్మ నెఱింగి సద్యోముక్తుం డగు మద్వాక్యంబు సత్యంబు మఱియును. 112

తే. అనిశ మెవఁడైన నేను బల్కినతెఱంగు, నెఱిఁగి యాలోచనము సేయ నిశ్చయించు వానిఁ జెందవు కలలోన నైన ఘోర, భవభయంబులు నమ్ము మిప్పగిది వనిత. 113

క. నీవును మది నాలోచన, గావింపుము యేను బల్కు క్రమ మొకగడియన్
జీవన్ముక్తవు నయి దుః, ఖావళి విడనాడి మోద మందెదవతివా!. 114

తే. పూర్వజన్మంబునం దీవు పురుషవర్య, నను భజించితి వటుగాన నాదుసేవ నెనసి మోక్షంబొసంగ నీకిపుడు గాను, పించితినిసంశితముబుద్ధి నుంచు మిదియు.

వ. అదియునుం గాక. 116

మత్తకోకిల. ఏను బల్కినవాక్యముల్ మది నెంచి భక్తిఁ దలంపని
న్నానవింకఁ బ్రవాహపాతము లట్లు చేసినకార్యముల్
మానినీ! యన మోదమంది తలంచె రాఘవరామసం
తానభూజము నాశ్రయింప గతోభిమానజదుఃఖయై 117

వ. ఆత్మానుభవసంతుష్టయై జీవన్ముక్త యయ్యె నిట్లు. 118

క. రఘురాముని చరణంబు లో, కఘుఁడిటు గనుఁగొనుట నఖిలకల్మషబంధా
ద్యఘములు విడనాడి మహా, సుఖిలీలన్ వెలిఁగె వాలిసుందరి తరుణీ!. 119

వ. క్షణసంగమమాత్రంబునఁ బరమాత్మయగు రాముని చేత నాదిబంధంబు విడనాడి విముక్తయు విగతకల్మషయు నయ్యె నప్పుడు. 120

క. ఆమ్మాటలు విని రవిజుఁడు, నెమ్మది నజ్ఞాన మెల్ల నిరసించి సుచి
త్తమ్మున నుండెను రాఘవుఁ, డమ్మహిరాత్మజునిఁ గాంచి యపు డిట్లనియెన్. 121

క. నయమొప్పఁగఁ బరలోక, క్రియ లంగదుచేత వాలికి నొనర్పుము భం
గి యొనర్పు మదాజ్ఞ వినఁగ, ను యథాశాస్త్రముగఁ జేయ మగ్యక్తుండై. 122

వ. బలవంతులగు వానరులచేత నిఖిలరాజోపచారంబులం జేయింపుచు వాలికళేబరంబు బుష్పకంబునం బెట్టించి భేరీదుందుభినిర్ఘోషంబులతోడ బ్రాహ్మణమంత్రిజనసహితుండై ప్లవంగయూథాధిపతులును దారాంగదులును విలపింపుచుఁ జనుదేరఁ గొని చని విధ్యుక్తంబుగ సర్వంబు నొనర్చి కృతస్నానుండై మంత్రులతోడ రామచంద్రుసమీపంబునకుం జనుదెంచి తచ్చరణంబుల కెఱఁగి హృష్టచిత్తుండై యిట్లనియె 123

క. శాసింపు ప్లవగరాజ్యం, బోసజలాంబుదశరీర! యుండెద నే నీ
దాసుండ నగుచును సుమి, త్రాసుతుగతి ననిన విస్మితస్వాంతమునన్ 124

వ. రామచంద్రుం డిట్లనియె. 125

## సుగ్రీవుని-ప్లవగరాజ్య పట్టాభిషేకము.

చ. వినుమిపు డేను నీ వనెడు వేఱొక యుండుట కాని తండ్రియా
జ్ఞను బురిఁ జేరనొల్లఁ బదునాల్గు సమంబులు లక్ష్మణుండు నా
యనుజుఁడు వచ్చుఁ బోయి దయ నంగదునిన్ యువరాజుఁ జేసి నీ
వనువుగఁ జెందు మివ్వనచరాఢ్యత వేగ మదాజ్ఞతోడుతన్. 126

క. ఏ నివట పర్వతాగ్రము, పై నిలిచెద ననుజుతోడఁ బ్రావృట్సమయం
బౌనంత వెదకఁ బంపుము, జానకి సుఖలీలఁ జనుము జలజాప్తసుతా!. 127

మ. అని పల్కన్ రఘునాయకాంఘ్రులకు నత్యామోదుఁడై మ్రొక్కి మీ
పను లెల్లైన నొనర్తు నంచుఁ బురికిన్ బల్వెఁక సౌమిత్రితోఁ
జని రామోక్తముభాతిఁ జేసి నిజరాజ్యశ్రీయుతుండయ్యె నో
వనితా! రాఘవు నాశ్రయింప సుఖసంవాసంబు గాకుండునే 128

వ. అంత లక్ష్మణుండును సుగ్రీవుచేత యథాన్యాయ్యంబుగాఁ బూజితుండై మరలి యన్నపాలి కరుగుదెంచి పాదంబులకు నమస్కరించి నిలిచె నప్పుడు రాఘవుండచ్చట వెడలి. 129

తే. తత్సమీపంబునను బర్వతంబు భూరి, శిఖరము ప్రవర్షణాఖ్యంబుఁ జేరి యందుఁ
గందరం బొండు సుస్ఫాటికంబు వర్ష, శీతవాతాదిభయవివర్జితముఁ గాంచి. 130

వ. దివ్యంబును దీప్తిమంతంబును శుభ్రంబును ఫలమూలసమీపగంబును నగు వాసువాస్తంబు నివాసంబునకు విచారించి. 131

చ. నిలిచిరి రామలక్ష్మణులు నిర్మలహాటకశాతకుంభజాతప
ల్వలము విచిత్రపక్షిగణకూజితశోభితకుంజపుంజస
త్ఫలకలితావనీరుహయుతంబును నై తగు నాప్రస్రవణా
చలమున మాయచేత మనుజత్వము నొందిరి గాన భా వ్రతీ! 132

క. ఇటు వార్షికదివసములఁ, జ్చట మణికందరము నందు సౌమిత్రియుతుం
డెటినటునికరణి రాఘవుఁ, డటనముఁ గావించె ఘనగుహాలాపముగన్. 133

వ. తత్కాలంబునఁ బవనప్రేరితంబులును నంతర్గర్జితంబులును నగుచుఁ జెలరేఁగి విహా
యసం బెల్ల నాక్రమించు కాదంబినీనిచయంబులును నభూతోపమానంబులుగ
సానువుల విహరించు తత్సమానమత్తకుండలంబులును బరమాత్ముఁడగు నారా
యణుం డివ్విధంబు మానవుం డై రామరూపంబున గిరికాననప్రదేశంబులం జరి
యించెడు నని యెఱింగి సిద్ధగణంబు లెల్ల నిట్టిరూపంబులఁ దద్విగ్రహావలోక
నంబు సేయుదురో యన నవదూర్వాంకురగ్రాసంబులఁ దృప్తిం జెంది పరఁగి దాశర
థులం గని విస్ఫారితేక్షణంబుల నిశ్చలంబులై పరమయోగధ్యాననిష్ఠాగరిష్ఠులగు
యోగీంద్రులమాడ్కి నిలుచు మృగపక్షిగణంబులును సీతావిరహానలతప్తుండగు
దాశరథికి విశ్వకర్మ నిర్మించిన చలువపందిళ్లన వారిధారాకణసంసృతంబు లగుచుఁ
దనరు పాదరిండ్లును నిమ్నార్ధాభిషిక్తునకు విరోధియగు పౌలస్త్యపయిం గమకించు
తద్వీరభటసందోహంబులనఁ గయ్యంబులకుఁ గాలుద్రవ్వుచు రామనివాసస్ఫాటిక
కందరం బాశ్రయించి తిరుగు సింహవ్యాఘ్రభల్లూకవాహవరాహాదిప్రబలసత్త్వ
సముదయంబులును రాఘవకరాగ్రస్థంబగు కాండాసనసౌష్ఠవంబున కోడి తలచూపి
పఱచునో యనఁ బ్రభవత్క్షణార్ధాదృశ్యంబులగుబలభిచ్చాపనంబులును మనుజలో
కవిడంబనార్థంబు ప్రభాతంబు సాఁగనీక భిక్షాటనంబునకుఁ గాలానుసరణుండగు
లక్ష్మణాగ్రజాచందంబున సాంద్రతరమేఘమండలావృతంబున నిజమయూఖంబులు
చోరరాఁగ శీఘ్రగమనోద్యోగుండై విష్ణుపదంబునం బఱచు నభోమణియును
భవిష్యద్రాక్షసాయకదార్ఢ్యం బెల్లలోకంబులవారికి సూచించెడు నన లోనికిం
జను సింధువల్లభవయోవిభవంబును సీతావిరహానురాగగమనంబున నగు రాముని మా
నసంబుభంగిఁ గలంకంబులగు సరిత్సముదయంబులును రామవిజయాభికాంక్షులై శీత
వాతాతపంబుల కోర్చి ముక్తజటాబంధంబులఁ దపంబులు సలుపు పరమభక్తాగ్ర
గణ్యులన నిచుల వంగ లుంగ మాతులుంగ కోవిదారాదిమహీరుహనిచయంబు
లును దశాననున కవిజయంబు పల్కెడుభంగి నారెడు జనపదమ్ములును నగుచు
దనరు నద్ధరాధరవతంసంబున రామచంద్రుఁడు వార్షికసమయం బంతయు లీలయ
పోలె వెడలింపుచుండె నంత నొక్కనాఁ డేకాంతంబున. 134

క. విను ప్రాలేయాచలవర, తనయా! రఘునాథు సంతతధ్యానపరుఁ
గని తత్సమాధివిరమం, బున లక్ష్మణుఁడిట్లు పలికెఁ బొల్పగుభక్తిన్. 135

సీ. జగదీశ! శ్రీరామచంద్ర! మీకృపచేత మును వింటి నైన నెమ్మనమునందుఁ
దలఁగ దనాద్యవిద్యాసంశయము గాన వినఁ గ్రియామార్గంబు వేడ్క గలదు
వ్యాసనారదపంకజాసనాదులు ద్విజక్షత్రియాదులకు నాశ్రమములకును
స్త్రీశూద్రులకును సుశ్రేయస్కరంబును ముక్తిసాధనము నిమ్ముగను నిదియ
తే. యనుచుఁ బల్కుదు రిపుడు నీవనుజుఁడనుచుఁ, గరుణదలఁకొ త్రిలోకోపకారమయిన
తావకారాధనక్రమం బేవిధమున, యోగు లొసరింతు రొగిఁ బల్క బాగుమీఱ.

శ్రీరాముఁడు లక్ష్మణునికి నర్చనవిధానంబు దెల్పుట.

క. అని పల్క రామవిభుఁ డి, ట్లనియె సుమిత్రాతనూజ! యమితము నాదౌ
ఘనపూజాపరినిష్ఠత, విను సంక్షేపమున నీకు వినిపింతుఁ దగన్. 137

వ. ఎట్టులనిన. 138

సీ. ఒనరంగఁ దనదు గృహ్యోక్తప్రకారంబు నను ద్విజత్వము తాను గనఁగవలయు
మద్భక్తిసహితుఁడై మహితబ్రహ్మిష్ఠునిఁ జేరి మంత్రం బభ్యసింపవలయు
నది నిక్కముగ నమ్మి హృదయమందున విభావసునందుఁ బ్రతిమాదివిసరమందు
వెలయ సాలగ్రామశిలలయందులనైనఁ బాయక నను బూజ సేయవలయు
తే. నెట్టులన దేహశుద్ధికై యొలమి దేవఁ తంత్రముల నుక్తములగు మంత్రముల స్నాన
మొనర మృల్లేపనవిధానముగ నొనర్చి, వలయు సంధ్యాదికంబులు సలిపి యంత.

వ. మొదల స్వకర్మశుద్ధికొఱకు సంకల్పంబు గావించి. 140

ఉ. ఏ ననుబుద్ధితో గురువు నెంతయుఁ బూజయొనర్చి యాపలం
బైనను స్నానముల్ ప్రతిమలైనను మార్జనము నొనర్చి స
న్మానసిరై బుధోత్తముఁ డమాయికవృత్తిఁ బ్రసిద్ధగంధమా
ల్యానువిధానయుక్తముగ నర్చన సేయుఁదగుల్ గుణాకరా. 141

వ. అందుఁ బ్రతిమాదులయందు నలంకారంబును వీతిహోత్రునందు హవిస్సున
హోమంబును దివాకరునందు స్థండిలప్రదేశంబునం బూజయొనరింపవలయు. 142

ఆ. సలిలమైన నాకు సద్భక్తి నొసఁగంగ, మెచ్చు వచ్చు నింక నిచ్చలోడ
సకలభక్ష్యభోజ్యచయధూపదీపపు, ష్పాదు లొసఁగఁ బ్రేమ పలుకఁదరమె. 143

క. మఱియు ససంతుని కెదుటను, గుత్రి దర్భాద్యాసనములఁ గూర్చుండి లస
ద్వరమానసమున బహిరం, తరమాతృక లాత్మఁ దలఁచి తన్న్యాసంబుల్. 144

వ. ఒనరించినంత. 145

సీ. మదిఁ గేశవాదినామముల మద్రూపపంజరమంత్రముల న్యాసవయి యొనర్చి
ప్రతిమాదులను సట్ల ప్రతిదినంబు నమర్చి కలశంబు వామభాగమునఁ బుష్ప
సమితి దక్షిణమున నమర నాచమనార్ఘ్యపాద్యాదులకు నాల్గు పాత్రలచట
నునిచి హృత్కమలంబునను భానునిభమాచు జీవాఖ్యతోడ రంజిలు నాదియ
తే. చిత్స్వరూపంబుఁ దలఁచి తచ్చిత్స్వరూప, మయు దేహంబు బంధుఁదన హితకళచుఁ
బ్రతిమయందును నిలుకడపఱచి బుధుఁడు, పూజయొనరింపఁదగు జగత్పూజ్యసన్ను.

వ. అది యెట్టు లనినఁ బాద్యార్ఘ్యాచమనీయాదులును స్నానవస్త్రవిభూషణాదులును లేకున్నఁ దనకుఁ గలుగుకొలంది మాయలేక నన్నర్చింపవలయు. విభవాపేతుం డైనఁ గర్పూరకుంకుమాగరుచందనంబులను గంధవంతంబులగు కుసుమంబులను మంత్రోదితంబుగ నర్చింపుచు నగస్త్యోక్తప్రకారంబున దశావరణపూజలును నీరాజనధూపదీపంబులును బహువిస్తరంబులగు నైవేద్యంబులును నొసంగి సంతుష్టి సేయవలయు నిట్లు. 147

తే. మించునాసక్తితోడఁ బూజించె నేని, యఖిలలోకంబులకు దొర నైన యేను
భక్తపరతంత్రుఁడను గానఁ బరఁగ నరిగి, యంతకన్నను శ్రద్ధచే నారగింతు 148

వ. అంత మంత్రకోవిదుం డగువాఁడు. 149

క. అమలుఁ డగస్త్యుఁడు పల్కిన, క్రమమున హోమంబు భక్తిఁ గావింపఁదగుఁ
విమలాత్ముఁ డగుచు గుండము, న మదీయాంఘ్రిద్వయాములు సమ్మివభక్తిఁ. 150

వ. అప్పుడు. 151

తే. దవిలి పుంసూక్తమూలమంత్రముల నైన, నమరు నౌపాసనాగ్నియం దయినఁ జరుహ
విన్సులను నైన హోమంబు వేదవేద్య, నను భజింపుచు నొనరింపఁజను బుధునకు.

వ. అంత స్వస్థచిత్తుండయి తప్తజాంబూనదప్రభంబును గిరీటకుండలకైరవేయకౌస్తుభాదిదివ్యాభరణభూషితంబును ననలమధ్యస్థంబును నగు మద్రూపం బెల్లెడల హోమకాలంబున బుధుం డగువాఁడు ధ్యానింపవలయు నంత మత్పార్షదవర్గంబులకు బలులొసంగి శేషంబగు హోమంబును గావించి పావకునందు నన్ను స్మరియింపుచు జపం బొనరించి ముఖవాసనంబునుం జేసి. 153

సీ. తనరుకర్పూరముక్తాచూర్ణకలితమౌ తాంబూల మటు నివేదన మొనర్చి
మత్సమీపమున సన్మంగళస్తుతిపాఠవివిధవాద్యంబులు వెలయ సలిపి
నిజహృదంతరలసన్నిర్మలాబ్జమున నన్ దలఁచి భూస్థలిని వందన మొనర్చి
యే నొసంగెడుభంగి మానసంబున నిల్పి తత్ప్రసాదము భక్తిఁ దల ధరించి
తే. వినయసంయుక్తుఁ డగుచు మద్వివ్యచరణ, పంకజంబులు శిరముపైఁ బరఁగ నిల్పి

ఘోరసంసారజలనిధిఁ గూలు నన్నుఁ, గని కటాక్షింపు మని వేఁడుకొనఁగవలయు.

వ. ఇట్లు పలుకుచు బుద్ధిమంతుఁడై పూర్వప్రకారంబునఁ బ్రత్యగ్జ్యోతిస్సునందు మత్కళాంశంబు నిలుపవలయు. 155

క. ఈతీరున నెపుణ్యుఁడు, చేతోమోదమునఁ బూజసేయు నతఁడు ప్ర
ఖ్యాతియు స్వమంత్రసిద్ధియు, భాతిఁ గను నిజము మత్కృపాతిశయమునన్.

వ. ఇట్లు. 157

ఆ. వాఁడు భక్తి గలిగి నన్నుఁ బూజసేయుచుఁ, బ్రొద్దు గడుపునట్టి పుణ్యతముఁడు
సంశయంబు లేక సారూప్యపద మొందు, నమ్ము రఘుకులేశ! నెమ్మనమున. 158

ఆ. పరమపావనంబు దురితహారంబు ర, హస్య మేను బల్కునదియు దీని
మానసించి వినిన మఱి పఠించిన నిత్య, పూజసేయుఫలముఁ బొందు నతఁడు. 159

వ. అని యివ్విధంబునఁ బరమాత్ముఁ డగు రామచంద్రుండు స్వభక్తుండగు లక్ష్మణునిచేత యాచితుండై యనుత్తమంబగు క్రియాయోగం బుపదేశం బొసంగి మరలి మాయ నవలంబించి ప్రాకృతునిచందంబున జనకరాజనందనం దలంచుచు నాహారనిద్రల నొల్లక దుఃఖితుండై యుండె నంతఁ గిష్కింధానగరంబున. 160

మ. హనుమంతుం డతిశబ్దశాస్త్రపఠనవ్యాపారదక్షుండు దు
ర్జనపాథోభవగంధసింధురము కంజాతాప్తసూనున్ సుహృ
జ్జనకల్యాణుఁ జేరి యేఁ డిటు నిజేచ్ఛన్ నీవు మత్తుండవై
మనమం దింతయు రాముఁ దల్ప విడి ధర్మం బే యశం బబ్బునే. 161

వ. నీకు హితంబు పల్కెదఁ గృతఘ్నుండవగు నీచేత రామోపకారంబు విస్మృతం బయ్యె నెట్లనిన 162

ఉ. వాలి జగత్ప్రసిద్ధుఁ డటువంటి బలాధికు నొక్కయమ్మునం
గూలిచి నీకు రాజ్య మొనగూర్చెను నీవు సుఖంబు గాంచి ప
మ్మే లోకయింత దల్ప విడి మేలసనేసమయంబు దప్పి నీ
పాలికి వచ్చినం జాలకపాటొనరించెదవే రఘూత్తమున్. 163

వ. ఇదియు గాదు. 164

తే. అమ్మహాత్ముని దయచేత నందరాని, తార లభియించె నీకు సీతావిభుండు
నీ వెపుడు వచ్చెదవొ యని త్రోవఁ జూచు, వాఁడె యివ్వానలందుఁ బర్వతమునందు.

క. మును సీత వెదకఁ బంపెద, నని యావిభు నెదురఁ బల్కి యగచరభావం
బున సతులఁ గూడియుండిన, నినుఁ ద్రుంపఁడె వాలి సేయునిశితాస్త్రమునన్ 166

వ. అమ్మహాత్ముండు కార్యగౌరవంబున నున్నవాఁడు. 167

ఉ. కావున నీకు నే లొదవఁగా నెఱిఁగించెద నన్న భీతి సు
గ్రీవుఁడు పల్కె నీ వనివరీతి ప్రసిద్ధము భాస్కరోదయా
స్తావనిభృత్సుసేతుతుహినాచలమధ్యధరాశ్రయాప్లవం
గావలిఁ దోడితే నతిబలాఢ్యులఁ బంపుము వేగ మారుతీ!. 168

వ. పదివేల ప్లవంగపుంగవులఁ బయనంబు సేయుము వారును. 269

క. చని సప్తద్వీపగతుల, వనచరులను దోడితేరవలయును బక్షం
బునఁ దారును రాఁదగు మిం, చిన ఘనదండన లొనర్చి చెండుదుఁ దనువుల్. 170

క. అని యివ్విధమున శాసన, మొసరించి నిజాలయమున కొగిఁ జనె నయ్యా
జ్ఞను మంత్రివరుఁడు మారుతి, వినతానుతిపవనతుల్యవేగులఁ గపులన్. 171

చ. అగణితసత్త్వులన్ వరకులాచలతుల్యమహోగ్రకాయులన్
సుగుణగరిష్ఠులం దనుజశోభనతాపసకృత్ప్రతాపులన్
మిగులఁగ దానమానముల మిత్రత సొంపు దలిర్పఁ బంపె స
మ్యగుపవనాచలాళిఁ గలయట్టి హరీంద్రులఁ దోడితేఁ గన్. 172

వ. అనుచు నిజభామినిం గనుంగొని మహాదేవుం డవ్వాలివృత్తాంతం బెట్లనియె నచ్చట
రామచంద్రుండును స్ఫటికశిలాతలంబులందునంగూర్చుండి నిశాముఖసమయంబున
సీతావిరహజంబగు దుఃఖంబు సహింపఁజాలక సౌమిత్రిం గనుంగొని. 173

## శ్రీరాముఁడు సీతం దలంచి దుఃఖించుట.

చ. కనుఁగొను లక్ష్మణా! జనకకన్యక జాడ యొకింతయైననుం
గనఁబడ దేమిసేతు జనకంటకుఁ డెత్తుకపోవ నీల్గెనో
వనటను గుందుచుండెనొకొ వారిరుహాననసౌఖ్య మెవ్వఁడై
నను బలుకం గుతూహలమున న్సుఖియించెదఁ గాదె యియ్యెడన్. 174

వ. అంతలోనఁ గ్రోధంబున. 175

క. వినుము ప్రతిజ్ఞ యొనర్చెదఁ, దనయాప్తకళత్రసంయుతంబుగఁ గూల్తున్
వనజాక్షిఁ గొనుచు నేఁగిన, దనుజుని నిక్కం బటంచుఁ దనమదిలోనన్. 176

తే. ఓజనకముగ్ధకూఁతుర! రాజవదన!, నిన్ను విడి దుఃఖమునఁ గుందుచున్న నన్నుఁ
గనుఁగొనక రాక్షసాలయమున వసించి, తెట్టు ప్రాణంబులను చిక్కఁబట్టి తీవు.

సీ. చంద్రుండు నాపాలఁ జండాంశుఁడై తోఁచుఁ బూర్ణచంద్రాస్య! నీపొందు లేమి
రోహిణీనాథ! వైదేహి నంటినశీతకిరణాలి నన్నంటి గరిమ గనవె
రవిపుత్త్రుఁ డెంతనిర్దయుఁడు గ్రీఁగంటనైనను జూడఁడిఁక నేమి యని తలంచెఁ
గాఁబోలు నిష్కంటకముగ రాజ్యమునొంది స్వేచ్ఛ బోటులతోడఁ దుచ్ఛభోగ

తే. భక్తవత్సలుఁడవు సాధుభావయుతుఁడ, వీవు లక్ష్మణా! రమ్ము సుగ్రీవునందు
కరుణతోడ నెఱుంగమిఁ గాచి కని. జగము పనుమాన్ప లేని సంభ్రమము నొందవవు.

చ. ఇరుమునఁ జేత నీతని కనేకనంబులు చెల్లె మీరు గ
న్పఱుటను నేఁటి కీసుఖము పొందెడిఁ గావున లేకలేఁ జే
వ్పఁడుటను వీనిఁజాలక కృపాకరు సోదరుఁడవు వ్యధ గ్రజా
గడు భయభక్తిఁ గొల్వక యుగ ధ్వజుండెఁ తనుసేయఁగాఁ దగుఁ. 98

వ. అయినను మీ కార్యంబున నాగరూకుండై యున్నవాఁడు సకలదిగ్భాగంబులం గల శాఖామృగపత్తిమలం దోడితేఁ దశసహస్రపంఖ్యల నిజభృత్యులం బనిచిన వాఁడు. శీఘ్రంబ మహాపర్వతసన్నిభులును సప్తద్వీపగతులు నగు వానరులు చను దేరం గలవారలు సుగ్రీవుండును వానరయూథాధిపసహితుం డయి చనుదెంచి రామ విరోధియగు దశానను మూలఘాతంబు సేయంగలండు గావున సౌమిత్రీ! కోపంబు సేయక లోనికిం జని పుత్త్రదారసుహృత్పరివేష్టితుం డగు సుగ్రీవుం గాంచి య భయం బొసంగి రామదర్శనంబునకుం గొనిపొమ్మని లక్ష్మణునకుం దార వినయవా క్యంబులవలనఁ గృశక్రోధుండయి సుగ్రీవుం డున్న యంతఃపురంబునకుం జని యుచ్చుట. 199

సీ. తగ హంసతూలికాతల్పంబునను రుమ నాలింగన మొనర్చి యర్కసుతుఁడు
చనుదెంచు రామానుజుని గాంచి భయ మొందె ధరణిపైఁ బడ సుమిత్రాతనూజుఁ
డతికోపమున నోమదాంధ! రాముని హితు మఱచితే వాలి దోర్మద మణంగి
చనిన మార్గముఁ జెంద మన సయ్యెనే వాలి నేయు క్రూరవ్యాళసాయకంబు

తే. మొక్క వోవదు నినుఁ జేయమక్క జంప, గుముకు వనగంధవహుమును సుకొమరుఁడపుడు
లక్ష్మణునిఁ గాంచి తగునయ్యా! లఘుతరంబు, సేయఁ దర్హానసము చింతసేయ కిపుడు

వ. మదవిహ్వలితేక్షణుండ వాట యేల రామార్థం బప్రమత్తుండై యున్నవాఁడు వినుము. 201

క. నీకన్న మిగులభక్తుఁడు, కాకుత్స్థకులాధిపునకుఁ గనుఁగొను మిదె భ
ల్లూకవనాటులు వీరలు, నీకై చనుదెలుచువారు నిర్మలచరితా!. 202

క. వెదికింపఁగలఁడు భూసుత, సద యుంపగు రామకార్యసంసిద్ధి ముదం
బొదవ నొనర్పం గలఁ డన, మది లజ్జితుఁ డయ్యె రఘుకుమారుం డంతన్. 203

తే. అర్ఘ్యపాద్యాదివిధుల నెయ్యమునఁ బూజ. చేసి వెసఁ గౌఁగిలించి దినేశసుతుఁడు
లక్ష్మణార్యా! రఘూత్తముకిత్తుగొముద, ప్రణీతిని రామదాసుండ సతత మేను.

చ. మఱియును మత్సహాయ మనుమాట యొకింతయె కాని స్వప్రభా
గరిమ జయింపఁ జాలుఁ ద్రిజగంబులతోన సృజించు రాముభూ

వరుఁడు క్షణంబులో ననిన వానరసత్తమ! నీదుమానసం
బెఱుఁగక పల్కితింక క్షమియింపుము నాయెడఁ గూర్మితోడుతన్. 205

వ. అని లక్ష్మణుండు వెండియు. 206

చ. తడవిడఁ జేయఁబోలదు పతంగతనూభవ! రామచంద్రుఁ డ
య్యెడ శోకరుండు భూతనయ నెంతయుఁ దల్చుచు దుఃఖమందుచుం
డెడు నిట నాకుఁ బాదములు నిల్వవటన్న దినేశపుత్త్రుఁ డె
క్కుఁడు రథమందు సన్మణులు గూర్చినయుక్కురథోత్తమంబునన్. 207

## శ్రీరాముకడకు సుగ్రీవుఁడు లక్ష్మణసహితుండై వచ్చుట.

వ. లక్ష్మణు నెక్కించి తానును నంగఁ గూర్చుండి ముందు భేరీమృదంగశంఖకాహళంబులు మ్రోయ ననేకులగు ఋక్షవానరులు శ్వేతాతపత్రవ్యజనంబులు వీవ వాయునందననీలాంగదప్రముఖులగు మంత్రిసత్తములు బలసి కొలువ రామదర్శనకుతూహలుం డయి మార్తాండనందనుండు వెడలె ననుమ భవానీసతిం గనుంగొని పురారాతి యవ్వాలివృత్తాంతం బిట్లనియె నట్లు లక్ష్మణసుగ్రీవులు వెడలి ప్రవర్షణాచలసమీపంబు నొంది యందొకశిలాతలంబున. 208

చ. కనిరి విశాలలోచను నగప్రతిపక్షమణిప్రభాంగుఁ గాం
చననిభసజ్జటామకుటు సస్మితచారుముఖాబ్జు జానకీ
ఘనవిరహాభితప్తు దశకంధరహానివిచారతత్పరున్
వనవిహగావలోకను నినప్రభు లక్ష్మణసౌరు లయ్యెడన్. 209

క. ఇవ్విధమున దవ్వులఁ గని, యవ్వనచరలక్ష్మణులు రయంబున రథమున్
జివ్వన దిగి భక్తి మదిన్, నివ్వటిలఁగ రామచరణనీరజములపై. 210

క. పడి రంత భానుపుత్త్రుని, వడిఁ జేతుల నెత్తి కుశలవార్త లడిగి యె
క్కుడు పూజసేయ సంతస, పడి భానుజుఁ డనియె రామభద్రునితోడన్. 211

చ. వరనుతశీల చూడుము ప్లవంగచమూవిభవంబు మేరుమం
దరకులపర్వతోద్భవు లుదగ్రపరాక్రమవిక్రమక్రియా
కరులు చతుస్సముద్రగిరికందరకాననవాసు లుగ్రవా
నరులు జగత్ప్రసిద్ధులు ఘనాఘనలక్షులఁ గేరువారలన్. 212

వ. మఱియును. 213

చ. విదితసురాంశజుల్ కుధరవిశ్రుతకాయులు యుద్ధసద్విశా
రదులు గజోపమానబలరాజితమూర్తులు కొంద ఱందు దం
తిదశబలాఢ్యులం దయుతదేవగజోపము లందుఁ గొంద ఱ
భ్యుదయసుశీల! పల్కఁగను బోల రనంతబలాఢ్యు లాదటన్. 214

సీ. కొందఱు అంజనమహీధరసన్నిభదేహు లందుఁ గొందఱు కాంచనాభతనులు
మఱికొంద ఱాగ్రహోన్నదభీకరాస్యు లురుదీర్ఘవాలభీకరులు కొంద
ఱమలస్ఫటికదేహు లరుణోపములు కొంద ఱెద గర్జనముల నియ్యవని పగులఁ
దావకాంఘ్రిద్వయదర్శనాపేక్షులై యనలమైనను జొత్తు రహీనకులేంద్ర
తే. దంష్ట్రులైనను దుర్జయ దండధరుని, గూల్తు రిదె మమ్ముఁ జూడు రఘూత్తమోత్త
మా! యటంచను జనుదెంచు మహితకీశ, సైన్యములుగంటె శ్రీరామచంద్ర యిపుడు.
వ. ఫలమూలాశనులు మఱియును. 216
సీ. కోటిభల్లూకముల్ గొలువ మన్మంత్రిసత్తముఁడు జాంబవదాఖ్యుఁ డనరు నితఁడు
పటుబలాఢ్యుఁడు జగత్ప్రాణనందనుఁ డాంజనేయాఖ్యుఁ డనరు దుర్జేయుఁ డితఁడు
నలనీలగవయపనసగంధమాదనగజబలీముఖగవాక్షకుముదాదు
లలఘుఁ డితఁడు తండ్రియగు నాంజనేయుని కమరఁ గేసరియనునాహ్వయుండు
తే. వీర లందఱు ముఖ్యులు వీర-వర్య!, శక్రతుల్యపరాక్రముల్ సాహసులును
గోటికోటిపనాకను ల్గొలువ నిప్డుఁ, గొలువ వత్తురు నీయాజ్ఞఁ దల ధరించి. 217
మత్తకో. వీఁడె వాలితనూజుఁ డద్భుతవీర్యవంతుఁడు దైత్యులన్
బోడి మెల్ల నడంచుఁ దండ్రిని బోలు బాహుబలంబునన్
జూడు మంగదు నర్క తేజుఁడు సొంపుమీఱఁగ బ్రాణముల్
వీడ నేఁ డిటు లున్నవారు తవేప్సితం బొసఁగన్ గపుల్. 218
వ. పర్వతాగ్రంబులను శాఖానిచయంబులనుం బోరుసలుప నేరుపరులును నీకు వశవర్తులును గావున రఘునందనా! చిత్తంబుకొలంది నవధరింపుం డనిన రాఘవుండు సుగ్రీవుం గౌఁగిలించుకొని హర్షాశ్రుపూర్ణలోచనుం డై యిట్లనియె. 219
చ. ఎఱుఁగుదు నీగుభక్తి మది నెంతయు సంతస మందితింక నీ
వరయఁగఁ బంపు భూతనయ వంచన సర్వదిశాళికిన్ మహీ
ధరసముకాయులన్ బనిచి దక్షిణదిక్తటికిన్ బ్రియంబుతో
నరయ సుషేణనీలపవనాత్మజజాంబవదంగదాదులన్. 220
వ. మఱియు శరభమైందద్వివిదు లాదిగాఁగలవారల సుపర్ణానిలవేగులం జూచి. 221

## సుగ్రీవుఁడు సీతను వెదకుటకు వానరవీరులం బంపుట.

చ. కపివరులార! భూతనయఁ గన్గొని మాసములోన రండు నే
మఱకృతిఁ బల్కినట్లు గన నోపక మాస మతిక్రమించి యే
కపి చనుదెంచువానిఁ గడికండలు చేసి మహోగ్రదండనన్
వ్యపగతదేహుఁ జేతు నన వారును మ్రొక్కి చనంగ రాముఁడున్. 222

చ. పవనతనూజుఁ జేరి కులపావన! నీ కిది యానవాలుగా
శివకరమైన ముద్రిక ప్రసిద్ధము నాదగు రామనామ మిం
దవిరళమై చెలంగెడు రహస్యముగా ధరణీజ కిమ్ము గం
ధవహసమానవేగ! ప్రమదంబునఁ బొమ్ము శుభంబు నీ కగున్. 223

వ. నీపరాక్రమం బెఱుంగుదు ననుచుఁ బనిచిన వారును దిగిభరాజకర్ణకోటరంబులు పగుల సింహనాదంబులు సేయుచు వెడలి. 224

చ. వెదకఁగఁ జొచ్చి రంత బృథివీధరగహ్వరకాననంబులన్
బొదలు ధరాధరంబులను బుట్టల వాగుల నిమ్నభూములన్
ముదిపెదుఱల్లఁ గ్రిక్కిఱిసి మోమటు ద్రిప్పఁగరానిచోటులన్
బదపడి ధారుణీసుత నపారలాఢ్యులు వానరోత్తముల్. 225

వ. ఇట్లు వెదకుచుఁ జనిచని వింధ్యభూధరంబున భీషణాకారుండును బర్వతోపముండు నగుచు వనగోచరంబులగు మృగంబులను గజంబులనుం దిను నొక్కనిశాచరుం గాంచి రావణుం డని కిలకిలాశబ్దంబులు సెలంగ ముష్టిప్రహారంబుల వానిం బొడిచి కాఁ డనుచు వదలి యమ్మహారణ్యంబునఁ బిపాసాపరవశు లై తిరుగుచు నెందును జలంబులు గానక శుష్కకంఠంబులఁ బెదవులు దడుపుకొనుచుఁ జనిచని యార్ద్రపక్షంబులై హంసక్రౌంచంబులు చనుదెంచుతృణగుల్మావృతంబు నగు నొక్క కందరంబుఁ గాంచి యిందు జలంబులు గల్గు నిశ్చయం బని ముందు మారుతాత్మజుం డతిసాహసంబునం జొచ్చె నప్పిఱుంద నఖిల వానరులు నొండొరుల బాహుదండంబు లూఁతగాఁ గొని గాఢాంధకారంబగు నమ్మహాగహ్వరంబున నతిదూరం బరిగి 226

క. కనుఁగొనిరి విమలజలమున, వనరుహకలితంబుఁ బక్వఫలభూతియుతం
బనుపమపక్వాన్నయుతం, బనిమిషవననిభము వనము నగచరవీరుల్. 227

వ. కాంచి మనుష్యవర్జితం బగుట వెఱఁగంది కొంతదూరంబు చనిన నచ్చట. 228

సీ. తనప్రభారాశిచే వన మెల్ల వెలుఁగంగఁ గనకపీఠమున నిల్చినమహాత్మ
సతతదివ్యజ్ఞానసహితఁ జీనాంబరఁ గని భయభక్తి వందన మొనర్ప
నమ్మహాభాగ యయ్యగచరేంద్రులఁ జూచి యెవరు మీ రిందుల కేల వచ్చి
చరియించెదరు పల్కుఁ డెఱుఁగంగ నన జగత్ప్రాణనందనుఁ డిట్లు పల్కె నపుడు
తే. దేవి! సాకేతపుర మేలు ధీయుతుండు, దశరథేశ్వరుఁ డమ్మహీధవున కగ్ర
తనయుఁ డగు రామచంద్రుండు తండ్రిపనుప, వనమునకువచ్చె దైత్యుచే వనితనచట.

క. కొలుపడి భానుజుని కను, కూలంబుగ వాలిఁ జంపి కువలయమున ను

మ్మా లలన వెదకఁ బనుపఁగఁ, బోలఁగఁ జనుదెంచి యగ్గిఁ బొరలి పిపాసన్. 230

క. నీమందిరమున కిప్పుడు, నే మరుదెంచితిమి యెవ్వ రీ విటు తెలియం
గా మాకుఁ బల్కు మన నపు, డామహితచరిత్ర యిట్టు లనియెన్ దరుణీ!. 231

ఉ. వానరులార! మీమనసు వచ్చినయట్టి ఫలాధికంబులన్
ఊని యథేచ్ఛ రం డెఱుఁగ నొప్పఁగఁ జెప్పెద నన్న వారలుం
బూని ఫలంబులన్ మధువుఁ బొట్టలు నిండఁగఁ గ్రోలి తృప్తులై
మానినిఁ జేరి నిల్చినను మారుతి కిట్లనె నత్తపస్వియున్. 232

వ. ఇట్లు బద్ధాంజలిపుటులగు వానరులయందు హనుమంతుం గాంచి యద్దివ్యదర్శన
యిట్లనియె. 233

క. విను విశ్వకర్మనందన, యన హేమ యెలుంగు నదియు నభవుని నృత్యం
బున సంతసం బొనర్పఁగ, ఘనమగు నీ పట్టణంబు గరుణించెఁ గృపన్. 234

వ. అదియును. 235

క. అయుతాయుతవర్షంబులు, నయ మొప్పఁగ నిల్చి యేను నమ్మినసఖ్యం
బు నొనర్ప బ్రహ్మపురమున, కు యథేచ్ఛం జనుచు నాదుకోరిక లొసఁగన్.

వ. తలంచి విష్ణుతత్పర నై మోక్షంబుఁ గాంక్షించు నన్నుం గనుంగొని నీవును దపంబు సేయుచు సర్వప్రాణివర్జితంబగు నిమ్మహాగుహాసంబున వసియింపుము త్రేతాయుగంబున దశరథరాజనందనుం డై నారాయణుండు శ్రీరామాభిధానంబున జనియించి భూభారహరణార్థంబు వనంబున సంచరింపుచుఁ దత్సతీమణిని రావణుండు గొని పోయినఁ దదన్వేషణార్థంబు వీరవానరసందోహంబులం బనుపవారును నీగుహాప్రాంతంబునకు రాఁగలరు. వారిం బూజించి చనినపిమ్మట రామచంద్రుని భజియింపుచు సనాతనంబును యోగిగమ్యంబును నగు విష్ణుపదంబు నొందెద వని బ్రహ్మలోకంబునకుం జనియె పవననందనా! మద్వృత్తాంతం బిదియ యింక రామచంద్రుం గనుంగొన నేఁగెద మీరును. 237

ఆ. కనులు మూసికొనుఁడు కడువేగ నన నట్లు, సేయఁ దొంటిభంగి వాయుజాది
వృక్షచరుల నెల్ల వే వనంబున డించి, చనియె రామచంద్రుసమ్ముఖమునకు. 238

## స్వయంప్రభ శ్రీరాముని సన్నిధానమున కేఁగుట.

వ. చని యచ్చట. 239

సీ. నీలజీమూతసన్నిభవర్ణు సంపూర్ణచంద్రాస్యుఁ గలితవిశాలవక్షు
నాజానుబాహు కర్ణాంతలోచను జటాకోటిశోభాఢ్యుఁ గువలయేశు
సర్వలక్షణయుక్తు సర్వభూతస్థితు నజు శాంతు సర్వజ్ఞు నప్రమేయు
సశరాసు జీర్ణకృష్ణాజినాంబరు నిత్యు వేదాంతగోచరు విబుధవంద్యు

తే. సానుజు సకీశవర్యు నీశ్వరు విశుద్ధు కలితమాయాస్వరూపు రంగత్పవిత్రు
నాదినారాయణుఁ బరేశు ఖేదమోద, రహితు సీతాభిరాము శ్రీరాముఁ గనియె.

వ. ఇట్లు దూరంబునం గాంచి యతిరభసంబునం జనుదెంచి ప్రదక్షిణంబు చేసి నమస్కరించి యిట్లనియె. 241

ఉ. నమ్మినభక్తి మ్రొక్కెడు ననాథుఁ బ్రోచెదు దేవరాయ! స
త్కర్మము మహోగ్రమౌ తపము కల్పసహస్రము నొక్కశైలమం
దిమ్ముగ దేహ మెల్లఁ గృశియింప నొనర్చి సుఖింపగాను హృ
ద్యమ్మగు తావకాంఘ్రినికచాబ్జము నేఁ డిటఁ గంటి రాఘవా. 242

ఉ. నాదుతపంబు పండె శరణంబు చొరన్ బహిరంతరంబులన్
మేదిని సమస్తభూతములనుండియుఁ జూడఁగఁ బోలు దీవు దా
మోదరమాయ కావలన నుందువ యిట్టిమహానుభావు ని
ష్ఖేదుఁ బరేశు నేక్రియను గీర్తన సేయఁగ నేర్తు రాఘవా!. 243

వ. దేవా! నీవు వేషధారిచందంబున యోగమాయాయవనికాచ్ఛన్నుండవై యజ్ఞానదష్టులకు నెఱుంగఁ బడవు మఱియు భక్తియోగంబు పరమభాగవతోత్తములకు నెఱింగింప నుదయించిన నిన్నుఁ దామసి నయిన యే నెవ్విధంబున నెఱుంగ నోపుదు. లోకంబుల నొక్కొక్కరు నీదుతత్త్వం బించుకంత యెఱుంగుదురు నీదురూపంబు నాదుహృదయకమలంబున నెల్లకాలంబు నచ్చలంబుగ వెలుంగుం గావుత! మోక్షసాధనంబు నీదుచరణకమలధ్యానంబు లేకునికి సకలపాపంబులకు మూలంబును నగుఁ గావున మానవుండు ధనపుత్త్రకళత్రాదివిభూతిపరిదర్పితుండై యకించనధనుండవగు నిన్ను నెఱుంగనోపఁడు రఘునందనా! నివృత్తిగుణరూపా! నిష్కించనధనస్వాత్మాభిరామా! నిర్గుణాత్మకా! నీకు వందనం బగుఁగావుత! నిన్నుఁ గాలరూపుండవని యీశానుండవని యాదిమధ్యాంతవర్జితుండవని సర్వసమవర్తనుండవని పురుషోత్తముండవని పరుండవని నాదుచిత్తంబున నెఱింగెద నెవ్వరిచేతనైనను నరలోకవిడంబనంబగు నీదుచేష్టితంబు తెలియంగంబడదు వారలు నీదుమాయాపీడితాత్ములై తాదృశాద్భుతకర్ముండవగు నిన్నెఱుంగంజాలరు. మఱియుఁ గొందఱు అజుండవని సత్తకుండవని యీశుండవని లోకవిడంబనార్థంబు దేవతిర్యఙ్మనుష్యాదిజన్మకర్మంబులఁ దత్కృతిగుణకథాశ్రవణంబుల జనులు భవసాగరంబు తరియింప నధోక్షజుండవిష్విధంబున జనియించితి వనుచుఁ బల్కుదురు మఱియును. 244

సీ. కొందఱు దశరథకువలయేశుతపంబు పంటవై కలిగినప్రభుఁడ వనుచు
మఱికొంద ఱంతఃప్రముదు నిన్నుఁ గౌసల్య కోసియాడఁ బుట్టిన ఘనుఁడ వనుచు

నింకఁ గొందఱు యామినీచరాళి నడంప విధి వేఁడ నరుఁడవై వెలసి తనుమఁ
బలుకుచుందురు నీదుభవ్యచారిత్రముల్ వినినఁ బఠించిన జనులు భవమ

తే. వార్ధి దాఁటుదు రీశ! గుణాశ్రయుండ, వనఘుఁడవు నతిరిక్తుండ వైన నిన్ను
నీదుమాయాగుణావృతస్సై దనర్చు, నేను దెలియంగఁ గలనె సన్మౌనివినుత!. 245

వ. నీవు స్తోత్రంబుసేయ నవిషయుండవు మఱియును. 246

చ. జనవర! నిన్నుభజింతు శరజాలశరాసనహస్తు సానుజున్
మునినుతుఁ దీక్షపాదు నన మోదము నొంది పరంబు వేఁడు మీ
వనిన రఘూత్తమా! యొకటికైనను నేఁగిన నిల్చియుండినన్
ఘనమగు నీదుభక్తి మదిఁ గల్గఁగఁ జేయుము నిశ్చలంబుగన్. 247

ఆ. మఱియు నీదునామమంత్రాక్షరంబులు, పలుకునట్లు జిహ్వ పరమభాగ
వతులతోడ మైత్రి సతతంబు గలుగంగఁ, గరుణ నొసఁగు విమలకమలనయన. 248

వ. వెండియు. 249

చ. అమరినభక్తిఁ గొల్చెద ఘునాథము లక్ష్మణభానుతోసమే
తము శరకార్ముకాంకముఁ బతంగనిభోజ్జ్వలరత్నకుండల
ప్రముఖవిభూషణాఢ్యముఁ గృపాకరమున్ రఘునాథరూపమున్
శమనసమప్రతాపమును సన్మునివంద్యకథాకలాపమున్. 250

వ. ఇంకితరంబు భజియింప నొల్లననినఁ గరుణించి మహాయోగినియు స్వభక్తయు
నగు స్వయంప్రభం గనుంగొని రామచంద్రుం డిట్లనియె. 251

క. వనితా! విను బదరీవన, మునకేఁగి మదీయనామమును నతిభక్తిం
దనర జపింపుము పరమా, త్మను నన్నుఁ జెందెదవు శుభతమం బిది నీకున్. 252

వ. భవవర్గకంబు లీడెదవు నిశ్చయంబు. 253

చ. అని యిటు లానతిచ్చిన స్వయంప్రభ సంతసమంది రాఘవుం
గనుఁగొని మ్రొక్కి యాబదరికావనభూమికి నేఁగి రామచం
ద్రునిపదపద్మము ల్భవముదూలఁ దలంపుచుఁ ద్యక్తదేహ యై
కనియెఁ బరంపదంబు సనకాదినుతంబు హిమాద్రినందనా!. 254

వ. ఇట్లమృతపారతుల్యంబులగు రామవాక్యంబులఁ దరుపండజాప్తంబగు బదరీవనంబున
స్వయంప్రభ ముక్తి నొందె ననుచు గౌరీకాంతం గనుంగొని యవ్వెలిదలంగు
భుజంగహారుం డిట్లనియె నంత నిచ్చట నిఖిలవానరులును జనకనందనం గనుం
గొని మిక్కిలి చింతింపుచున్న సమయంబునం దంగదుం డిట్లనియె. 255

చ. మన మిటు వ్యర్థమానటు భ్రమంబున నిగ్రహయందుఁ గాలమున్
జొనిపితి మింక భూతనయ చూపోవకయింతయుఁ గానమైతి మి
ట్లినజానిఁ గాన నేఁగిన నొకింతయు నైఁపడు చంపు బందు న
న్మనుఁ బరిమార్చు శాత్రవతనూజుఁడటంచు విరోధబుద్ధియై. 256

ఉ. ఎక్కడిప్రేమ భానుజున కింతయు రామకటాక్షవీక్షణ
న్నిక్కము నిల్చియుంటి నతినీచుఁడు మాతృసమానఁ దారఁ బెం
డ్లొక్కి రమించువాఁడు వధియింపక యుండునె నన్నుఁ గాన నే
నిక్కడ ప్రాణముల్ విడిచి యేగతి మృత్యువునైనఁ జెందెదన్. 257

క. అని రోదన మొనరింపఁగఁ, గని వనచరు లిట్లు మేము గలుగఁగ దుఃఖం
బున నొందఁ దగునె తండ్రీ!, విను మింక సాధనముశుభము వెలయును నీకున్. 258

వ. అది యెట్టు లనిన. 259

క. మనమందఱ మియ్యచలం, బునఁ జొత్తము రాముఁ డెఱుఁగఁబోలఁ డెఱిఁగినన్
గునుమంగనోపఁ డని యివ్వనచరు లిటు పల్క జాంబవంతుం డపుడున్. 260

## జాంబవంతుం డంగదాదివానరుల శోకము నివారించుట.

చ. కనుఁగొని దుర్విచారములఁ గాఁగలదే మిటు వాలిపుత్త్రినిన్
ఘనముగఁ జూచు లక్ష్మణునికంటెను రాముఁడు నమ్ము తారకుం
దనయుఁడ వౌట నారుఁనును దండ్రిగతిం గరుణించు నేఁడు ని
ట్లనుటలయె గాని నిల్వఁగలరయ్య ప్లవంగులు సచ్చటందఱున్. 261

వ. అదియునుం గాక. 262

చ. కనుఁగొనఁ జాల రంద ఱెఱుఁగన్ రఘునాయకుఘోరసాయకం
బున కడుకే తలంపఁగను భూధరము ల్తృణతుల్యవానరుల్
వినుము కుమార! మర్కటుల వెఱ్ఱులభంగిని బోక యేను బ
ల్కినగతి నమ్ము గోప్యమును గేశవజన్మకథాకలాపమున్. 263

క. నారాయణుఁ డవ్వయుఁ డమ, రారుల నిర్జింప రాఘవాఖ్యను మనుజా
కారమునఁ బుట్టె భువనా, ధారుండగు ఫణివిభుండు తదనుజుఁ డయ్యెన్. 264

వ. బ్రహ్మప్రార్థితజన్ముండై వెండియు. 265

తే. మోహకారిణి మాయ వైదేహి యయ్యె, నతనిపార్షదవర్గంబు లరయ మనము
విష్ణు వైకుంఠనిలయుండు వెలయు మాన, వాకృతిని నిట్లు స్వేచ్ఛావిహారలీల. 266

క. చరియించె నతనిమాయను, ధర జనియించితిమి తొల్లి తప మొనరింపం
గరుణించెఁ బాక్షదత్వము, కరమర్థిఁ బరాత్పరుండు కపికులతిలకా. 267

క. మన మిప్పటికైన ముకుందుని భృత్యుల మగుచు భక్తితోడఁ జరింపన్
ఘనముగ నలవైకుంఠముఁ, గని సుఖియించెదము తొంటికరణిని వత్సా 268

వ. అని యివ్విధంబున జాంబవంతుం డంగదునకు బుద్ధి గఱపుచుఁ జని వింధ్యభూధరంబుఁ గాంచి యచ్చట భూమినందన నెఱుంగం జాలక పవిత్రంబగు దక్షిణ సముద్రతీరంబున మహేంద్రశైలంబు నెక్కి. 269

చ. కనుఁగొని దుర్విలోకము నగాధజలంబును భీతివర్ధనం
బనుపమమైన దక్షిణమహాంబుధిఁ గాంచి సమస్త వానరుల్
మనముల భీతి నొంది యట మంతనము ల్పొనరింపఁ జొచ్చి రి
ట్లని నిజబుద్ధి మీఱి వికచాంబుజపత్రవిశాలలోచనా! 270

చ. జనకజఁ గానమైతి మని చయ్యన నేఁగిన నుగ్రదండన
ల్పనల నొనర్చు నక్కజుఁడు మానఁ డొకింతయుఁ గాన వానిచే
తను మృతిఁ బొందుకంటె సుఖదం బిట చచ్చుటయందు దర్భలో
య్యన విశదంబుగాఁ బఱచి యందఱు మేనులు చేర్చి యచ్చటన్. 271

వ. దృఢనిశ్చయులై శయనించి రయ్యవసరంబున మహేంద్రాచలగుహాప్రాంతంబున నుండి యొక్క పర్వతాకారంబగు గృధ్రంబు మెల్ల మెల్లన చనుదెంచి యచ్చట శయనించియున్న వానరులం గనుంగొని సంతసంబున నిట్లనియె. 272

సీ. కలిగె నాహారంబు కరుణించె దైవంబు దినము నొక్కొకనిఁ దినుచునుండు
వన వానరులు భీతు లగుచు నక్కట రామకార్యం బొకింతయు నిర్వహింపఁ
జాలమైతిమి నేఁడు జలధితీరంబునఁ గ్రూరగృధ్రమునోటఁ గ్రుంగవలసె
నెంత పుణ్యాత్ముండొ సంతతంబు జటాయు వహహా రాఘవు కార్యమం దడంగి
తే. కనియె యోగులకైనఁ బేర్కొనఁగరాని, విష్ణుపద మన సంపాతి విని కపీంద్రు
లార! కర్ణామృతంబులై చేరె మీదు, వాక్యములు మీర లెవ్వరి వార్ధిదరిని. 273

వ. శయనించి జటాయు వని భాషించెదరు మీకు భయంబు లేదు పలుకుం డనిన నంగదుం డిట్లనియె. 274

చ. వినుము రఘూత్తముండు జనవిశ్రుతుఁ డాతఁడు తండ్రిపంపునన్
వనమున కేఁగుదెంచి నిజవల్లభఁ గోల్పడి వచ్చుచుండఁగా
మును దనుజుండు సీతఁ గొనిపోవఁగ ఘోరరణం బొనర్చి యు
ద్దనుజునిచే జటాయు వమితంబగు దార్ఢ్యము దూలి యచ్చటన్. 275

వ. రామార్థంబు విదళితపక్షుండయి కూలి తద్వృత్తాంతం బంతయు రాఘవున కెఱింగించి యతనిచే దగ్ధదేహుండయి యాక్షణంబ రామసాయుజ్యంబు నొందె నంత

రాఘవుండును సుగ్రీవుతోడ నగ్నిసాక్షికంబుగ సఖ్యం బొనరించి దురాసదుం
డగు వాలి నుక్కడంచి తద్రాజ్యంబు సుగ్రీవున కొసంగ నేమును సుగ్రీవునిపం
పున సీతాన్వేషణంబు సేయం జనుదెంచితి మింతకాలంబు వ్యర్థంబుగ నిగ్గుహా
భ్యంతరంబునం గడచె నిటుజనకనందనె ఱుంగక చనిన సుగ్రీవుండు మమ్ము నుగ్ర
దండనల పాలొనరించుం గావున. 276

క. నీ వెఱిఁగిన నెఱిఁగింపుము, రావణుతెఱఁ గనిన వనచరాధిపులారా!
మీవాక్య మేను బల్కెద, నీవననిధిఁ జేర్చుఁ డిప్పు డెలమిని నన్నున్. 277

వ. జటాయువునకు జలంబు లొసంగవలయు నాకు ననుజుం డగు ననిన నట్ల సేయ
జలంబు లొసంగి మరలి వానరులు నిజస్థానంబునం జేర్ప సుఖాసీనుండై యిట్లనియె.

క. వినుఁ డిచట నొక త్రికూటం, బను పర్వతమందు లంక యనఁ దగుపురమం
దనువొప్ప నశోకవనం, బున రాక్షసతులు గొలువ భూసుత దనరున్. 279

తే. అమర నిచటికి శతయోజనములపాడవు, నను మహాంబుధిమధ్యమందున జెలంగు
లంక గృధ్రత్వమున నాకు లక్ష్యమొప్పఁ, గానుపించును గనుపించు జానకియును.

క. ఇమ్మకరాలయ మెవ్వఁడు, సమ్మతితో దాఁటు నట్టి సామర్థ్యఁపు వాఁ
డమ్మహిసుత గనుఁగొని వే, గమ్మునఁ జనుదెంచు శుభము గడలుకొనంగన్. 281

ఉ. ఏను దశాస్య భ్రాతృహరు నెంతయుఁ ద్రుంచెదఁ గాని పక్షము
ల్లేనితెఱంగునం బలుకలే కిటు లుంటిని మీరు యత్నము
ల్పూనుఁడు యిజ్ఝషాలయముఁ బొల్పుగ దాఁటుఁడు రామచంద్రుఁ డ
ద్దానవుఁ ద్రుంచు నెంతపని దార్కొనినన్ నిముసంబులోపలన్. 282

క శతయోజనాయతంబై, యతులితమగు జలధి దాఁటి యవనిజకును స
మ్మతిఁ బల్కి వేగ రాఁగల, యతులితబలశాలి యెవ్వఁ డరయుఁడు మీరల్. 283

## సంపాతి తనపూర్వవృత్తాంతం బంగదాదుల కెఱింగించుట.

వ. అని పలికిన తెఱంగు కథనంబు చేసి తదనంతర క్రమంబు నుమాదేవితోడ నీశ్వరుఁ డిట్లను
నాసంపాతి మరలఁ దనపూర్వవృత్తాంతం బిట్లని పల్కఁదొడంగ 284

మత్తకోకిల. అగచరోత్తములార! యేను జటాయు వన్నయుఁ దమ్ముఁడున్
మిగులదార్ఢ్యపరీక్ష సేయ నమేయబాహుబలంబునన్
గగనమార్గమునందు భానుని గానఁ నేఁగి తదీయచం
డగరిమోజ్జ్వలదగ్ధపక్షుఁడనై తిఁ గూలితి నిద్ధరన్. 285

వ. అప్పుడు. 286

తే. నాదుపక్షంబు లండఁగా నూఁది బ్రతికె, నజ్జటాయువు యేను మధ్యందినార్క
తప్తపక్షుండ నగుడు భూస్థలిని బడితి వింధ్యపర్వతమునఁ గపివీరులార!. 287

వ. ఇట్లతిదూరపతనంబున మూర్ఛనొంది దినత్రయంబునకు మరలఁ బ్రాణంబు లొంది
దగ్ధపక్షుండనై. 288

తే. దేశములో పర్వతమ్ములో దెలియలేక, భ్రాంతచిత్తుండ నగుచు రెప్పలను దెఱచి
యచట పుణ్యాశ్రమముఁ గాంచి యల్లనల్ల, నేఁగినను జంద్రమస్సను యోగివరుఁడు.

క. కనుఁగొని సంపాతీ! మును, ఘనబలుఁడవు రెక్క లిట్లు కాలినవిధ మే
మన నివ్విధంబుఁ బల్కుచు, మునుకొని శోకింప మాని ముదమున నన్నున్. 290

వ. కనుఁగొని దయార్ద్రచిత్తుండై యిట్లనియె. 291

సీ. వినుము పక్షికులేంద్ర! తనువు మూలము దుఃఖములకు దేహము కర్మమునను బుట్ట
హంకారమునఁ గల్గు నమ్మేనునందునఁ గర్మంబు లెల్లను గల్గుచుండు
నదియుఁ జూడఁగ నవిద్యాసంభవ మనాదిజడము విచ్ఛాయచే సంతతంబుఁ
దనరుత ప్తంబునై యొనయు నయఃపిండమట్లు నందునను దాదాత్మ్యభావ

తే. మునను జెందుచు దేహంబు మొనసి చేత, నత్వ మొందును దనువు నే ననుటనాత్మ
కును నహంకృతివలనను దనరు నదియె, మూల మగుచుండు సంసారమునకుఁ దెలియ.

వ. మఱియును. 293

ఆ. అమరు నిర్వికారుఁ డగు నాత్మ కగునె తా, దాత్మ్యభావ మింకఁ దనువు కర్మ
కర్త నే నటంచుఁ గడఁగి జీవుఁడు కర్మ, ములు నొనర్చి ఫలముఁ బొందుచుండు.

వ. మఱియు జీవుండు. 295

చ. అరయ స్వపుణ్యపాపఫల మాని యధోర్ధ్వములైన లోకముల్
పోరిఁ బోరిఁ జెందుచున్ సతతపుణ్యుఁడు స్వర్గము నొంది సౌఖ్యసం
భరితుఁడ నౌదు నంచుఁ జని పల్మఱుఁ దత్ఫల మెల్ల నొందుచున్
దఱిఁగినఁ గూలు భూస్థలిని దాను నధోముఖుఁడై విహంగమా! 296

వ. ఇట్లు దేహం బే నను మిథ్యాతాదాత్మ్యాధ్యాసచేత జీవుండు కర్మచోదితుండై
యిచ్ఛలేక యుండియు శశాంకమండలంబునం బడి యందు నీహారసంయుతుండై
ధాన్యంబులయందుఁ జెంది తడవుకాలంబు నిలిచి యంతఁ జతుర్విధభక్ష్యవస్తుస్వ
రూపుండై పురుషునిచేత భుజింపంబడి రేతోరూపంబున ఋతుసమయంబున
స్త్రీయోనిసంచితుండై యోనిరక్తంబునం గూడి యొక్కొక్కదినంబునకుఁ గల
లంబయి రూపత్వంబునొందు నంత నయిదురాత్రంబుల బుద్బుదాకారంబగు
పేశిత్వంబు నొందు నంత నొక్కపక్షంబున రుధిరపరిప్లుతంబగుఁ బంచవింశతి
రాత్రంబుల నంకురంబునొందుఁ గంఠంబును శిరంబును బృష్ఠంబును మధ్యం
బును నుదరంబును మొదలుగాఁగల పంచాంగంబులును గ్రమక్రమంబున మాసం

బునం గలుగు రెండవమాసంబున హస్తంబులును పాదంబులును పార్శ్వంబు
లును జానువులును జెలువొందు మూఁడవమాసంబున నిఖిలాంగసంధులును బొడ
రింపంబడు నాలవమాసంబున సర్వాంగుళంబును నైదవమాసంబున నాసాకర్ణనే
త్రంబులును నమ్మాసంబుననె యించుకంత దంతపఙ్క్తియు నఖంబులును గుహ్యం
బును నొప్పు నాఱవమాసంబున స్ఫుటంబులుగఁ గర్ణాదులును బాయు మేఢ్రోప
స్థోదరంబులును నరులకు సంపాదింపంబడు నటుపిమ్మట నేడవమాసంబున రోమం
బులును శిరఃకేశంబులును నుద్భవంబులగు నవయవవిభక్తులును సర్వంబును నష్టమమా
సంబునఁ జేకూరు నివ్విధంబున స్త్రీగర్భంబు చెలువొందు విహంగమా! యష్టమ
మాసంబునఁ జైతన్యంబు నొంది నాభిసూత్రంబగు నల్పరంధ్రంబున మాతృభుక్తా
న్నసారంబుఁ గొనుచు స్వకర్మంబుల వశియింపక గర్భస్థుండగు పిండంబు వృద్ధిఁ
బొందుచుండు నప్పుడు మాతృజఠరానలతప్తుండై పూర్వజన్మంబునం దొనరించిన
కర్మంబులు స్మరియింపుచు దైన్యభావంబున. 297

సీ. అయ్యయో! యోనిసహస్రంబులను బుట్టి తనయాదిఘోరబంధములఁ దగిలి
న్యాయ మన్యాయ మెయ్యదియుఁ జూడక కుటుంబభరణార్థ మల్పులఁ దఱుచు వేఁడి
ధనము నార్జించియుంటిని విష్ణుకీర్తన లల్పలనైనఁ జేయంగఁ గాంచనైతి
నహహ తత్ఫల మిప్పు డనుభవింపఁగ గర్భనరకంబు గలిగె దుర్భరము నగుచు
తే. శాశ్వతము గానితనువు శాశ్వత మటంచు, నాసచేతను నిర్భంగి నాత్మ కింత
హితము సేయఁగనైతి నే నిటు స్వకర్మ, కలితదుఃఖంబుపాలు గావలసె నేఁడు.

ఉ. ఏగతి దాఁటువాఁడ నిఁక నీజఠరానలఘోరకీలలన్
హా గజరాజపోషణ! మదార్తి హరింపఁ గదయ్య యింక నీ
వే గతిగాని వేఱొకరు లే రిటు సంతతముం భజింతు రా
వే గనవే ముకుంద! తగు నే తలపోయుట మత్కృతాఘముల్. 299

క. అని యివ్విధమున జఠరా, గ్నిని గుందుచు వేఁడి యపుడు కేశవుకరుణన్
జనియించి నిరయ మటు గై, కొనఁబడుపాతకునికరణిఁ గూలు ధరిత్రిన్. 30

వ. ఇట్లు కూలి బాల్యాదిదుఃఖంబు లనుభవింపుచునుండు నీవు ననుభవించినవాఁడవ
యని వర్ణింపంబనిలే దివ్విధంబున దేహంబు నేనను నధ్యాసంబువలన నిరయాదికం
బులును గర్భవాసాదిదుఃఖంబులునుం గలుగుచుండు నిట్లుగావున దేహాదుల మమ
తను విడిచి దేహత్రయవిలక్షణుండును బ్రకృతికిం బరుండును జాగ్రదాది నిర్ము
క్తుండును సత్యజ్ఞానలక్షణుండును శుద్ధుండును బుద్ధుండును నిత్యశాంతుండును నగు
పరమాత్మ నెఱుంగవలయుఁ బరుండగు చిదాత్మ నెఱింగి యజ్ఞానజంబగు మోహంబు

విడిచినఁ బ్రారబ్ధవశంబున దేహంబు చనినను నిల్చినను యోగి యైనవాఁ డవిద్యా
కృతంబులగు సుఖదుఃఖంబుల నొందఁడు గావున. 301

క. నీవును బ్రారబ్ధక్షయ, మై వెలసెడునంతపట్టు నహి కంచుకమం
దేవెరవున నిల్చునొ యటు, లీవిహగత్వమున నిల్వు మిఁక నొకటి మదిన్. 302

సీ. తెలియంగఁ బల్కెదఁ ద్రేతాయుగమునందు దశరథాధీశ్వరతనయుఁ డగుచు
నారాయణుఁడు రామనామంబునను బుట్టి జనకునాజ్ఞను ఘోరవనమునకును
జని దైత్యుచే నిజవనితఁ గోల్పడి భానుజాని గూడి జనకనందనను వెదక
వీరవానరులను వేసఁ బంప వారును నినుఁ గాంచఁగలరు వారిధిసమీప

తే. మునను నీవును జనకనందనతెఱంగు, పలుకు యాథార్థ్యమున నంత పక్షయుగము
గలుగు నని సోముఁడనుముని పలికె నిల్లు, చూడుఁ డిదె పక్షములు గల్గె సొంపుమీఱ.

తే. స్వస్తి గలుగును మీకుఁ బ్లవంగులార, చనియెదను మీరు ఘోరమౌ జలధి దాఁటి
జనకనందనఁ బొడఁగను సరభసమున, మరలి చనుదెందు యత్నంబు లరయుఁ డిపుడు.

వ. అదియునుంగాక. 305

ఉ. ఏపరమేశు నామ మొకయింత తలంప భవార్ణవంబునం
దాపద లెల్లఁ బాసి చను సమ్మహనీయముకుందమందిరాం
తోపరిసౌధమందునఁ గకుత్స్థితుఁడై చనునట్టి రామధా
త్రీపతిదూత లౌనఁట నదీపతి దాఁటఁగ నెంత మీకిటన్. 306

వ. అట్టి త్రిలోకస్థితికారకుండగు రామునివారలగు మీకుఁ గొఱఁత గలుగ నేరదనియు
నని తదూర్ధ్వకథనంబు పార్వతితోడ మహాదేవుం డిట్లనియె. 307

## అంగదాదులు సముద్రము దాఁటుట కాలోచించుట.

తే. అనుచు నిటు పల్కి సంపాతి యరిగె నపుడు, హర్షసంయుక్తు లగుచుఁ గీశాధిపతులు
జనకనందనఁ గనఁగోనుమన్నము లలరఁ, బలికి రొండొరులు వార్ధిఁ గలయఁ జూచి.

క. కని నక్రగ్రాహశతం, గని కాయధ్వనుల దిగిభకర్ణాచ్ఛదమై
తనరు పయోనిధి నెవ్వఁడు, మునుకొని దాఁటంగఁ గలుగు ముఖ్యుం డిందున్.

వ. అనిన నంగదుం డిట్లనియె. 310

చ. వినుఁడు కపీంద్రులార బలవిశ్రుతమూర్తులు నంద ఱిందులో
వననిధి లీల దాఁటి రఘువల్లభుదేవిని గాంచి సమ్ములం
గనికర మొప్పఁ బ్రోచు ఘనకార్యధురంధరుఁ డెవ్వఁ డొక్కఁ డా
డనయము రాములక్ష్మణుల సత్కృతనూజాని బ్రోచువాఁ డగున్. 311

వ. కావున. 312

ఆ. మమ్ముఁ బ్రోవఁ గల్గు మహితచారిత్రుండు, దలఁప నెవ్వఁడో వాఁడు దడయవలవ
దిప్పు డనిన బ్లవగు లెల్ల నూరకయుండి, యొకరి నొకరు చూచికొనిరి యపుడు.

వ. అది గనుంగొని మరల నంగదుం డిట్లనియె. 314

క. మీరలబలములు పలుకుఁడు, కూరిమితో నరసి పలుకఁ గొనకొను ననినన్
వారలు దశయోజనములు, వారక గొని తచ్ఛతాంకపర్యంతంబున్. 315

తే. పలుకఁ దొడఁగిరి తమతమబలము లపుడు, జాంబవంతుండు తనదైనజవముఁ దలఁచి
జలధి తొంబదియోజనంబులు చనంగ, నోపుదును వృద్ధ నటమీఁద నోప ననియె.

వ. ఎందు కనిన. 317

క. మునుపు త్రివిక్రమదేవుఁడు, ఘనమగు చరణమున జగముఁ గప్పినయపు డా
ఘనునకుఁ బ్రదక్షిణత్రయ, మొనరించితిఁ దద్విధానమున నతిభక్తిన్. 318

వ. వార్ధకంబును వచ్చె శక్తుండఁ గా ననిన నంగదుం డిట్లనియె. 319

ఉ. ఈలవణాబ్ధి దాఁటిచన నెంతయు నోపుదుఁ గాని మళ్ళిరాఁ
జాలుదునొక్కొ చాలనొకొ సంశయ మన్నను జాంబవంతుఁ డో
వాలితనూజ! దార్ఢ్యమున వాలిని బోలుదు వింతసేయఁగాఁ
జాలుదు వైన నిన్బనుపఁజాలము మాకుఁ బ్రభుండ వౌటచేన్. 320

ఆ. అనిన వాలిపుత్త్రుఁ డనియెఁ బ్రాయోపవే, శంబు చేత మీఁక ముదంబుతోడ
మనలఁ బ్రోచునట్టి ఘనుఁడు లేఁ డన జాంబ, వంతుఁ డిట్టు లనియె వాలిజునకు.

క. విను మంగద మనప్రాణము, లనయముఁ గరుణించునట్టి యతఁ డేమి యెఱుం
గనిరీతి నుండె గనుఁగొను, మనిలాత్మజుఁ డనిలవేగుఁ డని ముద మొప్పన్. 322

వ. హనుమంతుం జేరి యిట్లనియె. 323

సీ. ఏమయ్య! హనుమంత! రామకార్యధురంధరా! యిట్లు మౌనంబుఁ బాయకునికి
తగునె సాక్షాజ్జగత్ప్రాణనందనుఁడ వీ వెనయంగఁ దండ్రిఁ బోలినఘనుండ
పవని శ్రీరామకార్యము నిర్వహింపంగ జనియించి చెలువొంద ఘనయశుండ
వరుణబింబము ఫలం బని లక్షయోజనంబులు లీల నెగసిన యనఘమూర్తి

తే. యనినఁ ద్రిజగద్భయంకరంబగు మహోగ్ర, సింహనాదంబుఁ గావించి చెలఁగి మేను
మును త్రివిక్రమదేవుండు పెనుచుకరణిఁ, బెనిచె నొకపర్వతాభమై తనరునట్లు.

వ. ఇట్లు రామకార్యంబు నిర్వహించి మాకుఁ బ్రాణదానంబు సేయు మనిన హనుమం
తుండును. 325

వ. జలనిధి దాఁటెదన్ దివిజశత్రునిపట్టణ మెల్లఁ గాల్చెదన్
జలజభవాదుల్ పొగడ జానకిఁ దెచ్చెదఁ బఙ్క్తికంధరుం

దలలఁ దరంగ మొత్తి యటు దాఁటొనకున్నను ద్రాటఁగట్టి యు
జ్జ్వలముగ త్రికూటగిరిసంయుతుఁ డౌనటు లాని వేగముగన్. 326

ఆ. పట్టితెచ్చి రాముపాదాబ్జములముందు, నుంతుఁ గాక యున్న నౌనర సీతఁ
గాంచి సేమ మరసి కడువేగఁ జనుదెంతు, ననిన జాంబవంతుఁ డనియె నపుడు.

ఆ. మమ్ము బ్రోచుతండ్రి! విమలప్రతాప! వి, వేఁటటికిఁ దగుదు వింతె కాదు
చని మహీజఁ గాంచి చనుదెంచు మటపైని, రాఘవుండె కల్గఁజు రావణునకు. 328

వ. రాఘవుతోడ ముంగు ప్రతాపంబుఁ గాంపింపవచ్చుఁ గనుంగొని రమ్ము. 329

ఆ. మంగళప్రదంబు మారుతాత్మజ! నీకుఁ, గలుగుఁగాత జయము గలుగుఁగాత
రాముకార్య మెల్ల రహిఁ జెలంగెడుఁగాత, విజయశీల! చనుము వేగ మిపుడు. 330

వ. మఱియు జగదీశ్వరుండగు రామచంద్రు కార్యంబుఁ బూని చనియెదవు గావున నీకుఁ బ్రభంజనుండును దోడగుం గాక యని దీవన లొసంగి పునర్దర్శనంబు శీఘ్రంబున నె కల్గు నని వీడుకొల్పిన మారుతాత్మజుండును మహేంద్రాద్రిశిఖరంబునకుం జని యద్భుతదర్శనుండై. 331

శా. క్రూరవ్యాళనిభోగ్రమై వెఱయు లాంగూలంబు భూభృత్సమా
కారంబై చెలువొందు మేనుఁ ద్రిజగత్కల్యాణసంధాయకా
ధారస్వాంతరఘూత్తమారివారచింతాసక్తభూతాస్యదు
శ్రీ రంజిల్లఁగ నొప్పె మారుతి జగచ్ఛ్రేణిబల్ దనుం జూడఁగన్. 332

క. అని శివుఁ డంబిక కెఱిఁగిం, చినగతి విధి నారదునకుఁ జెప్పిన వ్యాసుం
డును నాకుఁ బల్కె వినుఁ డిం, చనియెను సూతుండు శౌనకాదిమునులకున్. 333

మ. బలభిన్నీలసమానవిగ్రహ! లసత్ప్రాకారసత్తీర్థ్య! ని
ర్మలవాఃపూర! కవేరజాతటమహీమందారగ్రైవేయకుం
డలకేయూరకిరీటభూషణ! మహానాగేంద్రభోగాగ్రని
శ్చలనిద్రాయుత! భక్తపాతకచమూసంత్రాస! రంగేశ్వరా!. 334

ఉత్సాహవృత్తము.
ధీర! పన్నగేంద్రతల్ప! దేవదేవ! సజ్జనాధార! పాంచజన్యదరసుదర్శనోరుహస్త! ని
శ్శారమాధరాసతీసులాలితాంఘ్రియుగ్మ! కా, వేరికానుతీర! వేదవేద్య! రంగనాయకా.

మాలిని. వరసరసిజనాభా! వారిసంభృద్ఘనాభా!
నిరుపమగుణసాంద్రా! నిర్మలాహ్లాదచంద్రా!
తరుచరనుతపాదా! ధర్మమార్గానుమోదా!
కరకలితరథాంగా! కౌస్తుభోపేత! రంగా!. 336

గద్య. ఇది శ్రీ మోరుతోటమూర్తీశ్వరప్రసాదలబ్ధకవితాపవిత్ర కోటమరాజు భాస్కరమంత్రిపుత్త్ర నాగయామాత్యప్రణీతం బయిన శ్రీమదధ్యాత్మరామాయణం బను మహాకావ్యంబునందుఁ గిష్కింధాకాండంబు సర్వంబు నేకాశ్వాసము.

శ్రీరస్తు.

# అధ్యాత్మరామాయణము

## సుందరకాండప్రారంభము.



మత్ఫణీంద్రశయన! మ
హీమండలదక్ష! సంతతేడితదివిజ
స్తోమ! విరాజితగౌతమ
భామాశాపార్చితాంఘ్రిపంకజరంగా! 1

వ. దేవా! యవధరింపుము సర్వమంగళం గనుంగొని శశాంకశేఖరుం డిట్లనియె నట్లు పవమాననందనుం డానందకందళితహృదయారవిందుం డయి మహానందంబున శతయోజనవిస్తీర్ణంబగు నమ్మకరాలయంబు దాఁటి చన నిశ్చయించి పరమాత్మయగు రామచంద్రుం దలంచి నిఖిలవానరులం గనుంగొని 2

సీ. వనచరోత్తములార! కనుఁగొనుం డిదె విహాయసమార్గమున లీల నరుగు నన్ను
రఘునాథు వరశిలీముఖముభంగిని నేఁగి ధరణిజఁ గనుఁగొని మరలి వత్తుఁ
గడుఁ గృతార్థుండనై కడువేగ రఘువీరుఁ గనియెదఁ బ్రాణాంతమునను నెవని
విమలనామము భక్తి నమరఁ దల్చిన ఘోరసంసారమను పెద్దజలధి దాఁటి
తే. యవ్యయానందహరిపదప్రాప్తుఁ డగునొ, నరుఁ డేనె నట్టి శ్రీరామనామధేయుఁ
డగు పరాత్పరుదూతనై యతని నామమహిమఁ జెలువొందు నంగుళీయకముఁ దాల్చి.

ఉ. ఈలవణాబ్ధి దాఁటి చను టెంత యటంచు మహాహితుల్యమా
వాలముఁ బెంచి పాదముల వక్రతఁ గాఁగను గీలుకొల్పి దృ
గ్జాలము నవ్విహాయసముఖంబునఁ జేర్చి భుజాళి సాఁచి ది
క్పాలురు గాంచ సద్యుదధిఁ బైకొనె మారుతసూనుఁ డయ్యెడన్. 4

క. ఇటు దక్షిణాభిముఖుఁడయి పటుతరవేగమున నేఁగు పావనిఁ గనియా
చ్చటఁ గల్గు దివిజసంఘము, లిటునటు పలుకంగఁ దొడఁగి రిభసిభగమనా! 5

దేవతలు సురసాభిధానయగు నాగ
మాత నాంజనేయునియొద్దకు బంపుట.

ఉ. ఈకపివీరుఁ డెంతొ పడి నేఁగడు లంక జొరంగ నోపునో
గాక తలంగునో తెలియఁగాఁదగునంచు భుజంగమాత నా
భీకరవక్త్ర నాసురసఁ జేర్కొని నీవు తదీయదోర్బలో
ద్రేక మెఱింగి రమ్మనిన దేవత నాసురసాభిధానయున్. 6

క. తగఁ జనుదెంచి భయంకర, ముగ మార్గముఁ గప్పి పలికె మోద మందెద నో
నగచర! నా కాహారము, వగు మిప్పుడు నిన్ను విడువ నంగుక తింగున్. 7

వ. అప్పుడు 8

మ. విను వాతాత్మజుఁ డిట్లు పల్కె నిది దేవీ! నీకు నే మ్రొక్కెదన్
ఘనుఁడౌ రామమహీశు కార్య మిది వేగం బోవఁ దత్సుందరిం
గని యవ్వాక్యము నమ్మహీశున కెఱుంగం బల్కి నీవక్త్రమం
దునఁ జొత్తుం గరుణింపు మిప్పు డన నత్యుగ్రాస్య యై యిట్లనున్. 9

క. నా కాహారమవగు మిపు, డీకొఱగాముల నడంచు మెటు నమ్మగు ని
న్నోకపివర భక్షించెదఁ, గాకేమి యటన్న రోషకలితాత్ముండై. 10

తే. తెరవు మయ్యాననమటంచుఁ దరిమి తోఁప, నిలిచె నొకయోజనము మేను నివ్వటిల్ల
నంత సురసయు వక్త్రంబు నయిదుయోజ,నముల పొడవున వెడఁద యొనర్చె నపుడు.

ఉ. అంత సమీరపుత్త్రుఁడు నిజాకృతిఁ దద్ద్విగుణంబొనర్ప న
య్యింతి నిజాననంబు బల మెక్కఁగఁ దద్ద్విగుణం బొనర్చె న
ట్లంతయుఁ జూచి మారుతి రయంబున ముప్పదియోజనంబు లా
నంతట యోజనాయతము నాస్య మొనర్చె భుజంగమాతయున్. 12

వ. అంత. 13

తే. మారుతాత్మజుఁ డంగుష్ఠమాత్రుఁ డగుచు, వక్త్రమునఁ జొచ్చి వెడలి యావనిత! చూడు
జొచ్చితి వెడలి వచ్చితి హెచ్చుమీఱ, ననిన సురసయు మెచ్చి యిట్లనియె నపుడు.

చ. వనచరవంశపావన! భవద్గరిమం బెఱుఁగంగ దేవతల్
పనుపఁగ వచ్చి కాంచితిని భద్రము నీకగు వేగ జానకిన్
గనుఁగొను మంచు నేఁగె సురకాంతయు మారుతిసూనుఁ డంత స
వ్వనధి విలంఘనప్రబలవాంఛితుఁడై విహగేంద్రుచాడ్పునన్. 15

వ. చనుచుండె నంత నదీవల్లభుండు మైనాకం బను మణికాంచనపర్వతంబు గాంచి
నీవు వేగంబ మహాసత్త్వసంపన్నుండును జగత్ప్రాణనందనుండును నగు నాంజనే

యుండు శ్రీరామకార్యార్థి యై చనుచున్నవాఁడు వేగంబ యయ్యగచరోత్తము
నకు సచివుండవు కమ్మేనును సగరపుత్త్రులచేత వర్ధితుండనై సాగరుఁ డనం బరఁగితి
నామహీపతియన్వయంబున దశరథరాజనందనుం డయి రామచంద్రుండు జని
యించె ననిన మైనాకుండును జలంబులు వెడలి మహోన్నతంబును వివిధమణిమ
యశృంగంబునునై శైలంబు దనరార నందు నరాకారుండయి నిలచి వాయునం
దనుం జేరి. 16

ఉ. ఓకపివర్య! యే నిది మహోదధి సంపఁగ వచ్చినాఁడ మై
నాకుఁడ నిల్వు మింత కరుణన్ ఫలముల్ గొనుమన్నఁ బల్కె నో
హో కుధరేంద్ర! యీఫలము లొప్పుగఁ గైకొని నిల్వఁ బోలునే
నా కిట రామకార్యము నొనర్పక యుం చట దానిశృంగమున్. 17

వ. శరాగ్రంబున నంటి మిత్త్రత్వంబు నెఱపి మహావేగియై చనుచుండె నాసమయం
బున. 18

క. మాయాగ్రాహము సింహిక, వాయుజుఁ డయ్యుదధి దాఁటి వడి నేఁగఁగఁ ద
చ్ఛాయ గ్రసించెను నంతట, వాయుజుఁ డరుగంగలేక వడి నుగ్రుం డై. 19

ఉ. ఈవనరాశిమధ్యమున నింతయుఁ గన్పడదేమి చూడ నా
లావు కృశించె నంచు సలిలంబులు గన్గొని యందు సింహికన్
బావని గాంచి వారిధి సుభల్లని మ్రోయఁగఁ గ్రుంగి తచ్ఛిరో
జావళిఁ బట్టి గ్రుద్ది చరణాహతిఁ జంపి సమీరవేగియై. 20

వ. చనిచని 21

మ. కనియెన్ గంధవహాత్మజుం డచట రంగత్పక్షికోలాహలం
బును నానాఫలసంయుతద్రుమలతామోదంబు శైలంబునం
దున లంకానగరం బనేకవరసౌధోపేతమున్ దేవతా
జనహృద్భేద్యము దైత్యరాడ్భటభుజాసంరంభసంచారమున్. 22

ఉ. ఏగతిఁ జొత్తు నిప్పురము నేగతి భూమిసుతం గాంతు నైన నే
నీగిరియందువన్ నిలిచి యేపుగ భాస్కరుఁ డస్తశైలమున్
దేఁగిన సూక్ష్మరూపమున నేఁగద నంచుఁ దలంచె నంతలో
నాగతిఁ దా నెఱింగి స్వకులాధిపుకార్యముఁ బొంచు వేగియై. 23

తే. చనెనొకో యనఁ గ్రుంకె నవ్వనజబంధుఁ, డంతఁ దిమిరంబు నగ్గలం బయ్యె నపుడు
పవనతనయుండు సూక్ష్మరూపము ధరించి, చొచ్చె లంకాపురిద్వార మిచ్ఛతోడ.

వ. ఇట్లు సూక్ష్మాకారుండై చనుచుండఁ దత్పట్టణంబు రాక్షసీవేషధారిణియై నిల్చి ధర్షిం
చి యిట్లనియె. 25

ఉ. ఓరి వెడంగువానర! మహోజ్జ్వలమౌ దివిజారిపట్టణం
బీరయి సూక్ష్మరూపమున నేటికిఁ జొచ్చెద వేమిసేతు వం
చారజనీచరాధమ మహాగ్రహియై పొడువంగ ముష్టిచే
మారుతి దానిపెన్నురము మ్రగ్గఁగ మొత్తె హిమాద్రినందనా!. 26

ఆ. అంత నదియు రుధిర మంతయుఁ గ్రక్కుచు, నేలఁగూలి లేచి నిలిచి పవన
తనయ! నీదుచేతఁ దఱిఁగె లంకావైభ, వంబు నేఁడు కొను జయంబు నీవు. 27

వ. ఇంకఁ దొల్లిటివృత్తాంతం బెఱింగించెద భూభారహరణార్థంబు తనచేఁ బ్రార్థితుం
డై యష్టావింశతిపర్యాయంబునఁ ద్రేతాయుగంబున నారాయణుండు శ్రీరామాభి
ధానంబున దశరథరాజనందనుండై జనియించు యోగమాయయు జనకమందిరంబున
సీతయై పుట్టు రామచంద్రుండును భార్యాసమేతుండై మహావనంబున కరుగు
దెంచి యచ్చట రావణునిచేత మాయాసీతం గోల్పడి సుగ్రీవుతో సఖ్యంబు సేయు
సుగ్రీవుండును సీతాన్వేషణంబు సేయఁ బ్లవంగవీరులం బనుచు నందొక్క శాఖా
మృగసత్తముండు రాత్రియందుఁ జనుదెంచు నతండును నీచేతఁ జర్చితుండై ముష్టి
ప్రహారంబునం బొడుచు నంత నీవును దుఃఖింప నాసమయంబునఁ బంక్తికం
ఠుండు దుర్దశాప్రాప్తుం డగు నిక్కం బని చతురాననుచేత వింటి నివ్విధంబున.

క. నీచేఁ ద్రుంపఁగఁ బడె రజ, నీచరసామ్రాజ్యలక్ష్మి నిక్కము మనుజుల్
నీచరితంబులు దలఁపఁగ, నీచారిధియాళిఁ గవరు నిర్మలచరితా!. 29

వ. ఇంక సీతవిధం బెఱిఁగించెద. 30

క. రావణు నంతఃపురసౌ, ధావళి కటమీఁద శింశుపావనిరమ్యా
వావసుధారుహమున రఘు, భూవల్లభుదేవి దనుజపాలఁతులు గొలువన్. 31

క. చెలువొందు వేగఁ గనుఁగొని, తెలియంగను బల్కు రామదేవున కిఁక నిన్
గలియంగ నెంతపుణ్యము, తొలిజన్మమునం దొనర్చితో నేను హరీ!. 32

ఆ. పరఁగ ధన్యనైతి భవపాశమోచన, రైన రామభక్తి యమర రామ
భక్తు నిన్నుఁ గంటిఁ బోయిక నామది, నిలువవలయు రాముఁ డెలమి నింక. 33

వ. అంత. 34

చ. అనిలతనూభవుండు లవణాంబుధి దాఁటినతక్షణంబునన్
జనకసుతాసురేంద్రులకు సంచలితంబులు నయ్యె వామమా

స్తనయనముల్ రఘూత్తముని దక్షిణనేత్రభుజంబు లక్కడన్
జనులు నుతింపఁగా నదరెఁ జారుసరోరుహపత్రలోచనా! 35

వ. అనుచు ఫాలాంబకుండు నిజకుటుంబినియగు పర్వతరాజనందనతోడఁ దదనంతరవృత్తాంతం బిట్లనియె. 36

## హనుమంతుండు లంకలోఁ జొచ్చి సీతను వెదకుట.

క. అంత నిశాముఖమున హను, మంతుం డణుమాత్రుఁ డగుచు మనుజాశనసౌ
ధాంతరగోపురసీమల, నంతట వెదకంగఁ దొడఁగె నవనీతనయన్. 37

వ. ఇట్లు పరమశోభనం బగు లంకానగరం బంతయుఁ బరీక్షించుచు నొక్కయెడ సురపాదపసంబాధంబును రత్నసోపానవాపికాకలితంబును నానాపక్షిమృగాకీర్ణంబును స్వర్ణప్రాకారంబును ఫలభారానమ్రశాఖాగ్రపాదపపరివారితంబును నగు నశోకవనంబుఁ గని ప్రతిపక్షం బరసి గనుంగొనఁజాలక చనిచని మణిస్తంభశతాన్వితం బగుచు మేఘమండలంబు నొరయు చైత్యప్రాసాదంబుఁ గాంచి తత్పురోభాగంబున. 38

సీ. కనియె శాఖాపర్ణకలితమౌ శింశుపాతరుమూలమున దైత్యతరుణు లెల్లఁ
గొలువ రామా! యని పలుకుచుఁ దలయెల్ల జడకట్టి రక్షించుజనులు లేక
మలినాంబరముచేత మదిఁ గుందు మిథిలేశుకన్యకామణి నిట్లు గాంచి యొక్క
పర్ణాంతరమున నేర్పడ డాఁగి కడుఁగృతార్థుఁడఁ గృతార్థుఁడఁ గృతార్థుఁడను నేఁడు
తే. కంటి జనకాత్మజను రామకార్య మెల్లఁ, జక్కఁబడియెను నాచేత నిక్క మనుచు
నిలిచె నంతటఁ గలకలకలయటంచు, రవము వీతెంచె దనుజపురాంగణమున. 39

ఉ. ఆనినదంబుఁ దా విని తదంతరపర్ణములందు డాఁగి య
ద్దానవనాథు దైత్యవనితాయుతు వచ్చెడువట్టివాని ఘో
రాననుఁ గాంచి విస్మయము నంది దృఢంబుగ నుతడునంత న
ద్దానవుఁ డేఁగుదెంచుచును దద్దయు బుద్ధిఁ దలంచె నిట్లుగన్. 40

వ. అంతకుమున్న రావణుండు రాఘవుచేత నవ్విధంబున మరణంబు గలుగు భార్యార్థంబైనఁ జనుదేరం డయ్యె ననుచు నిట్లు రామధ్యానతత్పరుండై యుండి యర్ధరాత్రంబున రామప్రేరితుఁడగు పావని శాఖామృగరూపధరుండై యొంటిగ శాఖాగ్రంబున నిలిచెనని యాయర్ధరాత్రంబున నట్లు స్వప్నంబు గాంచి సత్యంబగు ననుచు జానకిం బట్టి బంధించిన నవ్వానరుండు రాఘవున కెఱింగించెడు నని రూఢచిత్తుండయి యంజనశైలంబువోలె నిజశరీరంబు వెలుంగ దనుజాంగనాపరివృతుండై చనుదెంచుచుండె నాసమయంబున. 41

క. వనితల కంకణరవములు, తనచెవులకు సోఁక జనకతనయయు దుఃఖం
బునఁ దల వంచుచుఁ దనలోఁ, దను గుందుచు రాఘవార్పితస్వాంతయు నై. 42

వ. నిలిచియుండె నాసమయంబున రావణుండు సమీపంబునకుం జనుదెంచి. 43

చ. వినుము సుమధ్య! సొక్కి పలవింపఁగ నేటికి నీదుభర్త య
వ్వనచరులందు నిల్వఁ గనవచ్చు నొకప్పుడు గానరాఁడు నే
ననయముఁ గఁ బంపఁ గన్పడఁ డొకింతయు నా క్రియ నిస్పృహాత్ముఁడై
నినుఁ దలపోయకున్నఁ జనునే తలపోయఁగ నీవు నాతనిన్. 44

వ. మఱియును. 45

చ. ఘనముగ నిన్నుఁ గూడ సముఖంబున నీ వెపు డున్ననైన నా
తని కొకయింత ప్రేమ మదిఁ దాఁకదు నీదగు సర్వభోగముల్
గుణములు గాంచి నిన్ గనఁడు క్రూరుఁడు నిర్దయుఁడున్ గృతఘ్నుఁడున్
గన నటుగాకయున్న నినుఁ గైకొనిపోవకయున్నె భామినీ!. 46

ఆ. అట్టిశక్తిహీను ననుసరింపఁగ నేల, దైత్యలోకనాథుఁ డగులు నన్ను
దేవకాంత లెల్ల నీవు పల్కినయట్లు, సేయువారు చింత సేయ కింక. 47

వ. ఏను నీయందు మిక్కిలి మనంబు చేర్చినవాఁడ ననుచు వల్లభుండ రాఘవుండు నిర్మ
లుండును నిరహంకారుండును వియూథుండును మునిమార్గవంతుండును బ్రహ్మచర్య
వ్రతాచార్యుండును విమానియు లోకచారుండును నరాధముండును నీయందుల
విముఖుండును నగు నతని నేమి సేయంగలవు నన్నుం గవయుమనిన దశానను
వాక్యంబులకు రోషశోకంబులు నివ్వటిల్లఁ బరమపతివ్రతాతిలకంబు గావున
భాషింప నోడి యధోముఖియై యొక్క తృణంబు పట్టి యిట్లనియె. 48

క. దనుజా! మఖమున హవ్యముఁ, గొని చను శునకంబుభంగిఁ గొనివచ్చితి వ
మ్మనుజేశుఁ డెఱుఁగకుండఁగ, నినుఁ ద్రుంపకయున్నె కనిన నిశితాస్త్రములన్. 49

వ. అయినను. 50

క. వేగమె తత్ఫల మందెదు, రాఁగలఁడా విభుండు నిన్ను రణరంగమునన్
నేగి యొనరించి చెండఁగ, బాగుగ నెఱిఁగదవు రాముఁ బరమాత్మునిగాన్. 51

చ. మఱియును నిర్ఝరాలయము మార్కొని శోషిలఁ జేసినైన భీ
కరశరపంక్తి నద్ధముగఁ గట్టియు నైనను నిన్నుఁ దాఁకి సో
దరపరివారయుక్తముగ ధారుణిఁ గూల్చి యయోధ్య కింపుతో
సురలు నుతింప నన్ గొనుచు సూర్యకులోత్తముఁ డేఁగు రావణా!. 52

క. అని యిటు భూసుత పలుకఁగ, దనుజుఁడు తామ్రాక్షుఁ డగుచుఁ దగ ఖడ్గము గై

కొని త్రుంతు ననుచు నెగయఁగఁ, గని మండోదరి సుధర్మకలితోక్తులచేన్. 53

వ. పరిహితంబు దలంపుము గావున. 54

క. పలికె నిశాచరవల్లభ!, కర మలర భుజంగముఖ్యకాంతలు నిన్నున్
వలచినవారలు వారలఁ, దలఁపక మానుషిని గోరను దలఁపఁగఁ దగునే. 55

వ. ఇట్లు పలుకు మండోదరివాక్యంబుల కుపశమితక్రోధుండై రావణుండు నిశాచర
వనితలం గనుంగొని యిట్లనియె. 56

క. ఏవిధమున వశమౌ నటు, గావింపఁగవలయు నట్లు గావింపుము నా
జీవనితను సమకూర్చిన, యావనితకు రాజ్య మిత్తు నగు నిజ మనుచున్. 57

వ. ఇందుకు రెండుమాసంబులు గడువుచేసిన యటపైని నాదుశయ్యాగమనంబున
కొడంబడక యున్నఁ బ్రాతఃకాలాశనంబునకు విశసించి తెండని పలికి నిజాంతః
పురంబున కరిగె నంత నిశాచరకాంతలెల్ల జనకనందనం గనుంగొని తర్జనల భర్జింపం
దొడంగి రం దొక్కతె యిట్లనియె. 58

మ. వనితా! యూరకె నీదుజవ్వనము పోవన్ రిత్తమై యుండఁగాఁ
జను నే దానవనాథుఁ డెందుము యథేచ్ఛ న్భోగము ల్పొందె దీ
వన నం దొక్కతె మాటలేటికి దీ కాయంబెల్ల ఖండింత మం
చన వేఱొక్కతె ఖడ్గ మెత్తి తెగవ్రేయం జూచె ని ట్లుండఁగన్. 59

క. భర్జింపఁదొడఁగి రచ్చట, నిర్జీవియుఁపోలె సీత నిలిచెను నందున్
గర్జ మెఱిఁగి త్రిజట యనెడు, నిర్జరరిపుకాంత లేచి నిజసఖుల నటన్. 60

క. వారించి పలికె దుర్వ్యా, పారంబులు మానుఁ డింకఁ బదములకు నమ
స్కారంబు సేయుఁ డివ్వని, తారత్నము దుగ్ధవార్ధితనయ దలంపన్. 61

వ. ఇందుకు నొకస్వప్నంబుఁ గాంచితి నెటు లనిన. 62

సీ. కమలాక్షుఁడును జగత్కల్యాణుఁడని యొన్నఁదగు రాముఁ డైరావతంబు నెక్కి
మనలంకఁ గాల్చి రావణుకంఠములు ద్రుంచి జనకనందన నంకమున నమర్చి
శైలాగ్రమున నిల్వఁ బౌలస్త్యుఁ డొకగోమయహ్రదంబున సుతాద్యఖిలజనులఁ
గూడి క్రుంగఁగ భక్తితోడ రాఘువునకు మనవిభీషణుఁ డెంతో ఘనమా చూప

తే. మేలుకలగంటి దశకంఠు శ్రీలు నెల్ల
దలఁగ నింతయొనర్పంగఁ గలఁడు రాముఁ
డనుచుఁ ద్రిజటయుఁ బల్కె భూతనయ యింత
నమ్మకయ దుఃఖమనుబొందె నెమ్మనమున. 63

వ. ఇట్లు రక్షించుజనులు లేక చింతాభరంబునం గుందుచుఁ బ్రభాతంబయిన నన్నుం
దినియెద రింక నెవ్విధంబున నయిన మృతినొందుట కార్యం బని తలంచి. 64

ఆ. ముక్తకంఠ యగుచుఁ బొగిలి దుఃఖాబ్ధిలో, మునిఁగి మునిఁగి హస్తమునను నొక్క-
శాఖ వంచి మృతి నిజంబని తగుపాయ, మెఱుఁగకుండె రామగరిత తరుణి!. 65

వ. అనుచుఁ బల్కి చలిమలపట్టితోడఁ గరకంఠుం డవ్వలివృత్తాంతం బిట్లనియె నావిదే
హకన్యారత్నంబు మిగులఁ జింతాభరంబున. 66

మ. అకటా! రాఘవుఁ బాసి యిచ్చటను గ్రవ్యాదాంగనామధ్యమం
దు కడున్ దీనత నుండఁగావలసె మద్బుద్ధిన్ విచారింప సౌ
ఖ్యకరం బొక్కటి వేణిచే బిగియఁగాఁ గంఠంబు బంధించి నే
ను కడున్ మేను దొఱంగె దంచు మనమం దూహించి యున్నంతటన్. 67

## హనుమంతుండు సీతనుఁ జూచి సంభాషించుట.

క. మెల్లనఁ గనుఁగొని పవనజుఁ, డుల్లంబునఁ దనదు కార్య మూర్వీసుతకున్
దెల్లంబు సేయ నిటులని, యుల్లసిఁ బలుకంగఁ దొడఁగె నగరాజసుతా!. 68

సీ. సాకేతపట్టణస్వామియౌ దశరథుం డతనికి లోకవిశ్రుతులు నలువు
రాత్మసంభవు లందు నగ్రజుం డగు రాముఁ డతఁడు భూసుతయు నిజానుజుఁడును
దోడ రా జనకాజ్ఞతోడ గౌతమియను పుణ్యాశ్రమమున నింపుగ వసింప
నతఁడు లేకుండంగ నతనికాంతఁ బతివ్రతాత్మ జానకి సజ్జనాభివంద్య

తే. రావణుఁడు దొంగిలి కొనిపోవ నావనాళి, వెదకుచును నేలఁబడియున్న విహగవర్యు
ఘను జటాయువుఁ గని మోక్ష మొసఁగ నొసఁగి, యంత సుగ్రీవుతోడి సఖ్యం బొనర్చి.

ఆ. అతని కహితుఁడైన యవ్వాలి నిలఁ గూల్చి, భానుజునికి రాజ్యభార మొసఁగి
మమ్ము సీత వెదక మహిమీఁదఁ బనుపంగ, వెదకి యేము భూమివివరమునను. 70

వ. కనుంగొనక యందు నే నొక్కండ సుగ్రీవుసచివుండ సంపాతివాక్యగౌరవంబున
శతయోజనవిస్తీర్ణంబగు నిమ్మకరాలయంబు నిమిషంబునం దాఁటి దుర్గమంబగు లంకా
నగరం బెల్ల వెదకి యిశ్శోకవనంబునం గృశీభూతయగు రామభార్యను మత్పు
రాకృతపుణ్యాతిశయంబునం గంటిఁ గృతకృత్యుండ నైతి నని పలికి బుద్ధిమం
తుఁడగు హనుమంతుం డూరకుండిన జనకనందనయుం గ్రమక్రమంబున నవ్వా
క్యంబులు విని విస్మయంబు నొంది. 71

మ. కనిపింపం డొకఁ డైనఁ జూడఁగను మత్కర్ణామృతాభంబులై
యొనయున్ వాక్యము లొప్పు స్వప్నమున నే నింతైన నిద్రారతిం
గన నేధన్యుఁడొ నాకు నిచ్చట నెఱుంగం బోలు నంచన్న న
వ్వనితారత్నము వాక్యము ల్విని జగత్ప్రాణాత్మజుం డంతయున్. 72

తే. సంతసము నొంది కనిపించుమనుచు మిప్పు, డమరె శ్రీరాఘవానుగ్రహమున ననుచు

దివ్యరూపంబుఁ దాల్చి యాభవ్యచరితుఁ, డెలమి వందన మొనరించి నిలిచె నపుడు.
వ. ఇట్లు రక్తాస్యుండును బీతవాలుండును నై నిలిచిన పవమాననందనుం గాంచి
భయంబు నొంది రావణుం డివ్విధంబున మాయావనచరుండయి నన్ను మోహంబు
నొందింపఁ జనుదెంచెనో యనుచు నాననంబు వంచి పలుకకుండె నంతఁ గృతాంజలియై
రామభక్తిస్వాంతుండగు హనుమంతుం డిట్లనియె. 74
శా. తల్లీ! నాయెడ భీతిఁ బోవిడువు నీదాసుండ దాసుండ స
త్ఫుల్లాబ్జేక్షణుఁడైన రాఘవున కేఁ బుత్త్రుండఁ బ్రాణాత్ముఁడై
యిల్లోకంబుల నొప్పు వాయువున కే నీప్రొద్దు సన్మైత్రి రం
జిల్లన్ భానుజుఁ గూడియుండెదను నీచిత్తేశు నాజ్ఞం దగన్. 75
వ. కోసలేంద్రుండును బరమాత్ముండు నగు రామచంద్రునకు దాసుండఁ దచ్ఛాసనం
బున 76
క. వచ్చితి నిష్కల్మషుఁడను, సచ్చరితుఁడ బ్రహ్మచర్యసద్వ్రతుఁడ ననన్
అచ్చెరువు నొంది పలికె వి, యచ్చరనుత సీత మారుతాత్మజుతోడన్. 77
క. నరులకు వానరులకుఁ జే, కురునే సఖ్యంబు సేవకుఁడ వంటివి నీ
వెఱిఁగిన వారినితనువును, గరిమము గుణములును నెఱుఁగఁగాఁ బల్కు మొగిన్.
వ. అనిన వాయునందనుం డిట్లనియె. 79
సీ. సజలాభ్రనిభతనుచ్ఛాయాసమేతుండు శ్రోత్రాంతనయనుండు సుందరుండు
వరజటాకోటీరవల్కలాజినధరుం డసమానపూర్ణచంద్రాననుండు
తూణబాణాసనపాణిసరోరుహాచతురుండు మృగరాజసదృశమధ్యుఁ
డురుభుజాగ్రుండు సింధురయానుఁ డంభోధిగంభీరుఁ డయుతార్కకాంతియుతుఁడు
తే. నీమనోనాయకుఁడు దుష్టనిగ్రహుండు, దేవమునిగణవినుతప్రభావజలధి
నిఖిలభూతదయాళుండు నీవు లేక, యునికిఁ గుందుచు నున్నవాఁ డుక్కు దక్కి.
తే. నీవిభుఁడు కాంతిచేఁ బద్మినీవిభుండు, నీవయఃశక్తిచే భవానీవరుండు
నీధవుఁడు బల్మి సంయమనీధవుండు, నీపతి గభీరమునఁ దటినీపతి సతి!. 81
తే. అన్న కన్నగుణంబుల కనుగుణుండు, తమ్ముఁ డనఁదగు నాసుమిత్రాసుతుండు
దగవు కిసలయములఁబోలు తత్పదములు, వనములఁ జరింప బంగారువంటివాఁడు. 82
వ. దేవీ! నిన్నుఁ గోలుపడి నిఖిలకాననంబులు వెదకుచు శబరిచేతఁ బూజితుం డయి
ఋశ్యమూకంబునకుం జనుదేర సుగ్రీవుండును భయంబున వారల హృదయంబు
లెఱుంగ నన్నుం బనిచిన నేనును వటురూపంబునం జని వారల సద్భావంబు
లెఱింగి స్కంధంబుపై నెక్కించుకొని సుగ్రీవుసముఖంబునకుం జనుదెంచితి నంత
నగ్నిసాక్షికంబుగ సుగ్రీవుతోడ సఖ్యం బొనరించి యతని భార్యాపహారియగు

వాలి నొక్క సాయకంబున ద్రుంచి వనచరరాజ్యంబునకు సుగ్రీవు నభిషిక్తుం
జేసెనంత సుగ్రీవుం డఖిలదిగ్భాగంబులకు మహావీరులగు వానరులనమ్ము వెదకం బని
చె నాతనిపనుపున వెడలువారలలో సాదరంబుగా నన్ను. 83

## హనుమంతుం డంగుళీయకము సీత కొసంగుట.

సీ. కని భవన్నాథుఁడో కమలాప్తకులవర్యుఁ డతిముదంబున నిట్టు లనియె నపుడు
పవనజ! నీచేత బాగగు మత్కార్య మటుగాన భూపుత్త్రి నెచటఁ గనిన
నపుడు మత్కుశలంబు నంతయు నెఱిఁగింపు మంగుళీయక మిదె యానవాలు
గాఁగఁ గైకొనుమంచుఁ గడువేగ నొసఁగె నే నదియు సద్భక్తిచే నమర నిచటి
తే. కిదియె తెచ్చితిఁ జూడు సంపదలవెలఁది!, భద్రముద్రికఁ గైకొను పరమసాధ్వి!
యనుచు ముద్రిక నొసఁగి పావని సభక్తిఁ, దోడ నిలిచెను దలను జేతులు ధరించి.
వ. ఇట్లు సాధువర్తనుండగు హనుమంతుండు దూరంబున నిల్చిన జనకనందనయు రామ
నామాంకితంబగు నమ్ముద్రికారత్నంబుఁ గాంచి శిరంబున ధరియించి యానంద
బాష్పకలితలోచన యై యిట్లనియె. 85
చ. పవనతనూజ! నా కిపుడు ప్రాణ మొసంగితి వింత భక్తి లిం
కెవ రిట లక్ష్మణాగ్రజున కింతటివాఁడవటం చెఱింగి ని
న్నవనిపుఁ డిందుఁ బంచెఁ గని యచ్చట నాదగుబాము లెన్ని రా
ఘవున కెఱుంగఁ బల్కి దయఁ గ్రమ్మఱుసాధన మీవు సేయవే 86
వ. ఇచ్చటి తెఱంగు వినుము. 87
మ. వను మాసద్వయ మింక సైఁతు రటపై నానాయుధోపేతు లై
తను వింతింతలు సేతు రయ్యసురకాంతల్గాన నీలోన ని
ద్దనుజుం జేరడఁగింపఁ దీక్షకరు నత్యాప్తిశాలు మార్తాండసం
దనసౌమిత్రులతోడఁ దెమ్ము కను వాగ్ధర్మంబు సర్వంసహా!. 88
వ. అనవుఁ బావని సవినయంబుగా నిట్లనియె. 89
మ. జననీ! నమ్ముము నాదువాక్యములు కంజాతాప్తవంశాబ్ధిపూ
ర్ణనిశానాయకుఁ డైన నీవిభుఁడు బాణాసారఘోరంబుగా
ననిలో రావణు నుక్కడంచి నిజవామాంకంబున న్నిన్నుఁ జ
య్యనఁ గైకొంచు నయోధ్యకేఁగు దివిజాధ్యక్షాదు లగ్గింపఁగన్. 90
వ. అనిన నమేయాత్ముండగు రామచంద్రుం డపారంబగు నిమ్మహనీయాకూపారంబు
వానరానీకంబులతోడ నెట్లు దాఁటువాఁ డనిన మారుతి యిట్లనియె. 91
క. విను శాఖామృగసైన్యము, లను భానుజరామచంద్రలక్ష్మణులను గ్ర

న్నన నాదుస్కంధమున నిడు, కొని వచ్చెదఁ దల్లి! దైత్యకుల మడఁగింపన్. 92

వ. నీనిమిత్తంబున సకలరాక్షసనాశంబు గాఁగల దైనను. 93

క. చనవలయు రామచంద్రుని, గనవలయు రఘూత్తముండు గని నమ్మెడుమా
డ్కొని నానవా లొసంగుము, జననీ! యని విన్నవింప జనకాత్మజయున్. 94

వ. ఇంచుకంత విచారించి కేశపాశాంతస్స్థంబగు చూడామణి యొసంగి కమలలోచనం
బుల సాదరంబుగాఁ జూచుచు. 95

క. ఇమ్మణిఁ గొనిచను సువ్రత!, నమ్ము రఘూత్తముఁడు మఱియు నమ్మెడువృత్తాం
త మ్మొక్కటి పల్కెద మును, సమ్మతితోఁ జిత్రకూటశైలమునందున్. 96

వ. వసియించియుండ నొక్కనాఁడు నాతొడపై శిరంబుఁ జేర్చి. 97

శా. ఏకాంతంబున రామచంద్రుఁడు సుఖం బింపొంద నిద్రింపఁగాఁ
గాకం బొక్కటి మత్పదాగ్ర మెఱుపై కన్పట్ట మాంసేచ్ఛచే
వీఁకన్ గోరులఁ జీరి పోక మఱి వేవేగంబ పైరాఁగ నా
భూకాంతుం డది లేచి చూచి తృణముం బోనీక పై వైచినన్. 98

క. అదియును బ్రహ్మాస్త్రం బయి, వదలక వెనుదగులఁ బ్రోచువా రొకరైనన్
వెదకంగ లేక రఘువరు, పదములపైఁ బడియె మరలి పరువగు భీతిన్. 99

వ. బ్రహ్మేంద్రాదులకును నపరిహార్యంబైన నిజాస్త్రప్రభావంబున కోడి దయానిధే
యనుచు శరణుసొచ్చిన కాకంబు నీక్షించి శరణాగతవత్సలుండు గావున రామచం
ద్రుం డిట్లనియె. 100

తే. విను మమోఘంబు నాదగు ఘనశరంబు, నీదు సవ్యాంబక మొసంగు నేఁ డవంగ
నట్లొసంగుచుఁ జనియె నేఁడట్టిపౌరు,షంబు లెటు బోయె నను రామచంద్రుతోడ.

వ. అట్టివాఁ డియ్యెడ నుపేక్షితుం డగునే యని విన్నవింపు మనిన సీతాసుభాషితం
బులు విని హనుమంతుం డిట్లనియె. 102

ఉ. ఏనెఱిఁగింపు టాలసమ యిమ్మకరాలయ మెంత దాఁటిలం
కానగరంబుఁ జుత్తుమురుగా నొనరింపఁగ జాలుకార్ముక
జ్యానినదప్రముక్తశరజాలములన్ రఘుసత్తముండు నీ
పైన మనంబువెట్టి యొకపండువు దెమ్మనఁ జాగింపఁగన్. 103

వ. అనిన జనకనందన యిట్లనియె, 104

క. అతిసూక్ష్మదేహుఁడవు నీ, గతి సందఱు దలఁప విలయకాలమహోగ్ర
ప్రతిభులు దానవు లిఁక నే, గతిఁ బోరెద రన్న జనకకన్యక కపుతున్. 105

వ. మేరుమందరసంకాశంబును రక్షోగణవిభీషణంబును నగు పూర్వరూపంబుఁ గనఁబ
ఱచినఁ బర్వతోపమానుండగు నాకపికుంజరుం గనుంగొని మిక్కిలి హర్షంబుతోడ
నద్దేవి యిట్లనియె. 106

ఉ. చాలుదు నెంతకైన బలశాలిని నీ కిఁక మార్గమందునన్
మేలగు రామకార్యమును మేలుగఁ బొమ్మన వాయుపుత్త్రుఁడుం
జాఁగిలి మ్రొక్కి పోవుచు మనంబునఁ దల్చెను రామకార్యమున్
మేలు దలంకకుండ నటమీఁద నొనర్పఁగఁ బోలు నెంతయున్. 107

వ. అదియునుం గాక యూరక చనుట కర్జంబు గా దొక్కింత పౌరుషంబు చూపెదం గాక యనుచు మనంబున నిశ్చయించి మహాసాహసుండును బలియు నగుచుఁ బావనియు సీతాశ్రయనగంబు దక్క యయ్యశోకవనం బంతయు నిముసమాత్రంబున నిర్వృక్షంబు నొనరించె నాసమయంబున విపినోత్పాటనుం డగు హనుమంతుం గాంచి రాక్షసవనిత లెల్ల జానకిం జేరి యివ్వానరరూపధరుం డెవ్వం డనిన వైదేహియు. 108

తే. తగని దుఃఖాబ్ధిఁ బొగిలెడుదాన నాకు, దనుజమాయలు దెలియునే యనిన వారు
భయమునను బాఱి పౌలస్త్యపదములకును, నెఱిఁగి తెలియంగఁ బలికిర త్తెఱఁగునపుడు.

వ. ఇట్లు వానరదేహధారియై యెవ్వఁడో మహాసత్త్వుండు సీతతో సంభాషించి యశోకవనం బెల్ల క్షణంబునఁ బెఱికి చైత్యప్రాసాదంబును భంగంబు సేసి తద్రక్షకుల నెల్ల నేలం గలిపి యతివిక్రముం డై యచ్చోటనె యున్నవాఁ డనిన స్వప్రియంబగు వనభంగంబునకుఁ గనలి. 110

ఉ. అంత నిశాటకోటుల బలాఢ్యులఁ బంపఁగ వారు తద్వన
ప్రాంతము కేఁగుదెంచి పటుభల్లపరంపరఁ బాలుసేయ ను
ద్వాంతుఁడు మారుతాత్మజుఁడు వాల మొకింత చలింప భీకర
క్రాంతవిలోచనుం డగుచు నార్చుచు ముద్గరఘోరపాణి యై. 111

చ. తల లురముల్ కరంబులు పదంబులు జానువులున్ గటీతటం
బులు వికలంబు లౌనటులఁ బొల్పగు ముద్గర మెత్తి వ్రేయఁ గా
ల్బలములు ఘోటకంబులును భద్రగజంబులుఁ దన్నుకొంచు న
య్యలఁ బడెఁ బఙ్క్తికంధరున కంతయుఁ గీడెఱిఁగించుపోలికన్. 112

వ. ఇట్లు నిముసమాత్రంబున బలంబు నేలం గలపిన విని మండోదరీవల్లభుండు క్రోధమూర్ఛితుండై పరమదుర్మదుల నైదుగురు సేనాపతులం బనిచిన వారల లోహస్తంభాయుధంబునం జంపిన విని క్రుద్ధుం డై మంత్రిపుత్త్రుల నేడ్గురం బనుపఁ బూర్వక్రమంబున వారలను నిముసంబున నిశ్శేషం బొనరించి తోరణస్తంభంబు చేరి రక్షకులరాక కొఱకు చూచుచుండె నాసమయంబున రావణుశాసనంబున బలవంతుండు ప్రతాపశాలియు నగు నక్షకుమారుండు వెడలిన మారుతియు సింహనాదంబు సేయు

డు సముద్గరుండై విహాయసంబున కెగసి వానిరథంబుపై దుమికి మూర్ధంబు పగుల
వడచి తత్సైన్యం బెల్ల హతంబు గావించిన. 113

క. విని క్రోధమూర్ఛితుం డయి, దనుజాధిపుఁ డింద్రజిత్తుఁ దనయశ్రేష్ఠుం
గని తనయ! యవ్వానరుని, గొనివచ్చెదఁ బుత్రహంతకుని నని పడిగెన్. 114

వ. ప్రాణంబులనైనం గొనిరమ్మ నని మృతుండయిన కుమారుసామర్థ్యంబు దలంచి.

తే. కవలి దుఃఖించు తండ్రియావనముఁ గాంచి, మేఘనాదుండు పలికెను మేఘనినద
భాషణంబులఁ దండ్రి! యీపట్ల నీకు, నేను గలుగంగ దుఃఖంబు పూననేల. 116

క. బ్రహ్మపాశంబునను వానిఁ బట్టికట్టి, తెచ్చెద నటంచు రథమట్లు తేరఁబంచి
పలునిశాటులు గొలువ సుపర్వనాథ, వైరి చనుదెంచె వెడలి సామీరికడకు 117

వ. ఇట్లు వీరవిక్రముండై చనుదెంచినఁ బవననందనుండు. 118

సీ. పటుసింహనాదదుర్భరరవంబున దిశాదంతావళములు చిందఱ గొనంగ
వినువీథి కెగసి యవ్విహగవల్లభుమాడ్కిఁ దిరుగ దానవనాథవరసుతుండు
ఘనశరంబున నైగు నెనిమిది ముఖమున నాటించి హృదయంబునను బదంబు
లను నాఱు మఱియు వాలమున నొక్కొక్కటిఁ బఱఁప వాయుతనూజుఁ దురవడించి

తే. దుమికి రథసారథుల దురగములఁ బట్టి, నుగ్గు గావింప వాఁడును నగ్గలంపు
రోషమున నొండు తే రెక్కి రుచిరదార్ఢ్య, మైన బ్రహ్మాస్త్రముదరించె ననిలసుతుని.

## ఇంద్రజిత్తు హనుమంతుని బ్రహ్మాస్త్రముచే బంధించుట.

వ. ఇట్లు బ్రహ్మపాశంబునఁ బావనిం బంధించి మహాబలుండగు మేఘనాదుండు దశ
కంధరు సభాభవనంబునకుం గొనిపోవుచుండె నప్పుడు. 120

సీ. ఏజగత్స్వామి నేప్రొద్దు నారాయణాద్యనంతాఖ్యల ననవరతము
నూరులు దలఁచుచు దారుణాజ్ఞానకర్మకృతబంధనములం బాసి కోటి
భాస్కరతుల్యమౌ పదముఁ బ్రాపించెద రట్టిశ్రీరాముపదాంబుజములు
మఱవక యేప్రొద్దు మానసాబ్జమునందు నిలిపి భజింపుచు నిఖిలబంధ

తే. నములవలన విముక్తుఁడౌ నగచరేశుఁ, డనిలనందనుఁ డతని కియ్యల్పదనుజ
కల్పితములయినబంధముల్ గణనయగునె, తలఁచి చూచిన తుహినభూధరతనూజ!.

వ. అనుచు. 122

క. గిరితనయతోడ దోషా, కరమౌళి యొఱుంగఁ బల్కి కాకుత్స్థకులే
శ్వరుతదనంతరకథనము, మరలఁగ బల్కఁగ నుపక్రమం బొనరించెన్. 123

వ. తత్సమయంబున. 124

తే. పగ్గములచేత బద్ధుఁడై పట్టణంబుఁ, జూచుచును శోలగతిఁ జనుచుండు పవన

తనయుఁ జూడంగ వచ్చి మొత్తంగ దొడఁగి, తప్పరంబునఁ గలవార లచలతనయ.

వ. ఇంద్రజిత్తును వివిధరత్నప్రభాభాసురంబగు దనుజరాజసభాభవనంబునకుం గొని చని యప్పౌలస్త్యుముందఱం బెట్టించి యిట్లనియె. 126

ఆ. తండ్రి వీఁడె పెక్కుదానవశ్రేష్ఠులఁ, జంపి విఱ్ఱవీఁగు శైలచరుఁడు
దెచ్చినాఁడ మదికి వచ్చినట్టులు శిక్ష, సేయు మనిన దైత్యశేఖరుండు. 127

వ. కాటుకకొండతెఱంగున ముందునిల్చియున్న ప్రహస్తుం గనుంగొని యిట్లనియె.

ఉ. ఎవ్వఁడు వీఁడు నాదువన మేటికిఁ ద్రుంచెను ఘోరదైత్యులన్
ద్రొవ్వడఁగించె నేక్రియను గొంకక నాపుర మెల్లఁ జొచ్చెఁ దా
నివ్విధమంత నీవరయు మిప్పు డసన్ గరుణాదరంబులన్
నివ్వటిలం బ్రహస్తుఁడు వినిర్జితశత్రు సమీరపుత్త్రునిన్. 129

వ. కనుంగొని యిట్లనియె. 130

చ. నిను విడుపింతు వేగ రజనీచరనాయకుసన్ముఖంబునన్
వనచర! నీతెఱం గెఱుఁగఁ దెల్పు మనన్ రఘునాయకాంఘ్రులన్
మనమున మాటిమాటికిని మక్కువమీఱఁ దలంచి యంజనీ
తనయుఁడు పల్కఁగాఁ దొడఁగెఁ దత్కథ నంబుజపత్త్రలోచనా. 131

వ. ఇట్లు లోకత్రయకంటకుండును దేవగణాదుల కమిత్త్రుండును నగు నయ్యసురవల్లభుతోడ స్ఫుటంబుగ విను మనుచు నిట్లనియె. 132

క. చావునకై యే దేవుని, దేవిని శునకము హవిస్సు తెచ్చినగతి నీ
పావనమునఁ దెచ్చితో నే, నావసుధాధిపుబంట ననిలాత్మజుఁడన్. 133

సీ. మలయాచలముపొంత వెలయు మతంగపర్వతమునందున భానుసుతునితోడ
నగ్నిసాక్షిగ సఖ్య మాచరింపుచు వాలిఁ దునిమి రాజ్యము భానుజుని కొసంగి
నఖిలవానరచమూనిచయంబులును గొల్వ నిలిచెఁ బ్రవర్షణాచలమునందు
మఱియు భూసుతఁ గాంచ గరుడానిలసమానవేగులౌ వానరవీరవరుల

తే. బనిచె భూభాగమున కంతఁ బవనసుతుఁడ, నే నొకండను వేగ వార్నిధిని దాఁటి
లంక నిటుచొచ్చి పద్మపలాశనేత్రి, సీతఁ జూడఁగంటి సద్గుణోపేత నిచట. 134

వ. వనంబుఁ ద్రుంచితి నంతేని. 135

తే. వానరుఁడఁ గానఁ జెకలించితి నింక, నఖిలదేహులకును బ్రియం బగుటఁ జేసి
దేహసంరక్షణార్థంబు తివిరినీదు, సైన్యములఁ ద్రోలితిని మృత్యుసదనమునకు. 136

వ. అంత. 137

మ. అమరన్ మేఘనినాదనాముఁడు బ్రహ్మాస్త్రంబుచేఁ బట్టి బం
ధము గావించి యిటు దెచ్చె చూడు మిది తద్బ్రహ్మాస్త్ర మింతైన బం

ధము గావింపదు గాని నీ కిది యసద్ధర్మంబు వల్దంచు బు
ద్ధిమతుల్ పల్కఁగ వచ్చితిన్ భుజబలోద్రేకాపహాప్రక్రియన్. 238

సీ. జీవవివేక మాత్రోప బుద్ధి నెఱుంగు మిఁక దైత్యబుద్ధిఁ బోవకుము దైవ
గతియె సంసారమోక్షత్వహేతువు దేహంబునకు నాశ్రయింపఁ జాల్పడు సుఖంబు
దనర బ్రహ్మాన్వయంబున జనియించితివి ధనేశబంధుఁడ వీవు చూడఁ
దనువు నేఁ గుటచే దానవుండవుగాని యయ్యాత్మబుద్ధి లేదయ్యె నేని
తే. దైత్యుఁడవు గావు దుఃఖసంతతియు లేదు, దేహబుద్ధీంద్రియాదులఁ దివిరియున్న
నిర్వికారుండ వీమాట నిజము నీదు, బుద్ధినూనుము సతతంబు పొందు సుఖము. 139

వ. మఱియు నీవు నిద్రించుసమయంబున నజ్ఞానహేతుభూతంబగు సంతతి యెల్ల నస
త్యంబుగదా యిది నీవునుం గావు నీకు వికారంబులు లే వాకాశంబు సర్వగతం
బయ్యును సంటని తెఱంగున నీవు దేహగతుండ వయ్యు సౌక్ష్మ్యంబునఁ దజ్జన్యవి
కారంబుల నంటవు దేహేంద్రియప్రాణవ్యాదాదిసాంగత్యంబు స్వాత్మ యని
భావించినవాఁ డఖిలబంధభాజనుం డగు నేను జిన్మాత్రస్వరూపుండ నజాండ
సత్క్షరుండ నానందభావుండ నని తలంచుపుణ్యుండు సంసారబంధంబువలన విడు
వంబడు నిదియునుం గాక. 140

సీ. ఆత్మదేహంబున నది మృద్వికారంబు ప్రాణం బనంగను బవనయుతము
మనము నహంకారమమకారకలితంబు ప్రకృతివికారజ పరఁగ బుద్ధి
మఱియుఁ జిదానందమయుఁడు నిరంజనుం డవికారయుతుఁడు దేహాదిసంఘ
ముల వ్యతిరిక్తుండు ముక్తాశ్రయుండును నీశ్వరుఁ డని బుద్ధి నెపుడు నాత్మ
తే. నెఱిఁగియుండునో ముక్తుఁడౌ నరుఁడు మఱియుఁ, బ్రస్తుతము నీకు వలసిన పరమధర్మ
మెఱుఁగఁ బల్కెదఁ దత్పరాత్ముఁడ వైన, విష్ణుచరణాబ్జభజన గావింపుమదిని.

వ. అదియును విశోధనిగావున నతినిర్మలంబగు జ్ఞానంబు బొసంగు నంత శుద్ధతత్త్వానుభ
వుండ వయ్యెదవు దానఁ బరమపదంబునుం గలుగు సంశయంబు లేదు నీవును
వేగంబ మనంబున శత్రుభావంబగు మాఢ్యంబు విడిచి ప్రకృతివిలక్షణుండును
బురాణపురుషుండును హరియును శరణాగతప్రియుండును నగు రామచంద్రుసమీ
పంబునకు సపరివారుండవై జనకరాజనందనం గొనిచని యొప్పించి యమ్మహాత్మువర
ణకమలంబులకు నమస్కరించి యశుభంబులు వాపుకొని గతకల్మషుండవు గమ్మిది
యునుం గాక. 142

చ. అనుదినమున్ సభక్తిని నిజాంతరవృత్తియు సౌఖ్యరూపకుం
దనుపముఁడున్ బరాత్పరుఁ మహాధికుఁడై వెలుఁగొందు రాఘవుం

గనని నరుండు దుఃఖఘనకల్పితభూరితరంగఘూర్ణితం
బనఁ జెలువొందు భీషణభవాంబుధిపారముఁ గాంచ నేర్చునే. 143

చ. మఱియును నీ వొనర్చిన యమర్షణకృత్యము లగ్నికీలలై
పొరిఁబొరిఁ గాల్ప శాత్రవునిపోలిక నాత్మను మేలుసేయకే
నరకమునందుఁ ద్రోతు రిది న్యాయము మోక్షము నీకు దూరమం
దతికిని దోఁచుఁ జేసెదువి[illegible]ంబు గయుంగొను సన్మనీషితన్. 144

వ. అనుచుఁ బలుకు నమృతాస్వాదనసమానంబగు వాయుసూనుభాషితంబు విని యసు రవరుం డగు దశకంధరుం డమృష్యమాణుండును రక్తాంతలోచనోజ్జ్వలుండును నగుచు నిట్లనియె. 145

ఉ. ఎవ్వఁడు రాఘవుం డసఁగ నెవ్వఁడురా కపిజాం డవంగ వా
నవుఁడో వారుండో నాదుభుజసార మెఱుంగవు వాని నిన్ను ని
య్యవనిజఁ బట్టి చంపెద బలాఢ్యునిపోలిక నాదుముందఱన్
గవఁగొని కూసె దింత యనఁ గాలభుజంగమహోగ్రకోపుఁడై. 146

ఉ. పావని పల్కె నిట్టులని పంక్తిరథాత్మజుఁ బోల నేర్తురే
నీవును గోటిరావణులు నిక్కపుబంటు యమోఘబాణుఁడా
నావసుధాసుతాధిపతి కంచు నాజ్యము పోయ మండు న
ప్పావకు నంగి రాత్రిచరపాలుఁడ మండి సమీపదైత్యులన్. 147

వ. కనుంగొని. 148

చ. పొడువుఁడి వాసరాధముని బొంక మడంపు డటన్న దానవుల్
గడువడి ఖడ్గము ల్గొనుచుఁ గ్రమ్మఁగ నంత విభీషణుండు కా
దుడుగుఁ డటంచు రావణుని నొప్పుగఁ గన్గొని యన్న! వానరున్
వడిగలవానిఁ జంప బలవంతుల కొప్పునె రాచపాడియే. 149

క. పరరాజుఁ బట్టి వీనిన్, బొరివుచ్చిన కార్య మెట్లు పొసఁగును గానన్
బొరివుచ్చుకంటె మిక్కుట, మగఁటిగ శిక్షచేసి యంపుట యొప్పున్. 150

వ. నీవు రామచంద్రుతోడ సమరంబుఁ గాంక్షించి యింతసేసితివి గావునఁ గొర్క పండువ ట్లొనరించిన వీఁడును. 151

ఆ. చిహ్నతోడఁ బోయి చెప్పు రాఘవులకు, వారు సేనతోడ వత్తు రపుడు
పొసఁగుఁగ యుద్ధ మనినఁ బొలుపొంద దశకంఠుఁ, డనియె నిజభటాళి నపుడు గాంచి.

## హనుమంతుఁడు లంకను దహించుట.

క. వానరులకు లాంగూలము, మానం బటుగాన మీరు మంచిపటంబుల్
నూనియతోడుతఁ జుట్టుం, డనలము పురికొల్పుఁ డనిన వా రబ్బంగిన్. (?) 153

వ నల్కులంబులును మఱియును. 154

క. పురమునఁ గల చీరెలు న, త్వరమునఁ గొనివచ్చి నూనె దడిపి తదుద్య
ద్గురుతరపుచ్ఛంబున కం, దఱుఁ జుట్టుచుఁ దుదను వహ్ని దరికొల్పి రొగిన్. 155

వ. ఇట్లు మహాబలులగు నిశాచరులు పవమానసందను వాలంబునం దనలంబు మండ
మూఁది పగ్గంబుల బంధించి. 156

సీ. పురమెల్లఁ జోరుఁ ఢీకరుచరాఘనుఁ డంచుఁ బిడికిటిపోటులఁ బొడిచి పొడిచి
ప్రతివీథులందునఁ బణవశబ్దములచేతను ద్రిప్పఁజూచి యంతయు సహించి
చని పశ్చిమద్వారమున మేను తక్కువచేసి బంధము లెల్లఁ బాసి యెగిరి
యొక్కగోపురమునఁ జక్కనౌ స్తంభంబుఁ గొని నిశాచరులఁ జెక్కుర నడంచి
తే. యమరవైరికొక్కొక్కగృహముపై గుమికిదుమికి, యటవిభస్మంబుసేయు దవానలంబు
కరణిఁబవనాత్మజుఁడులంకఁ గాల్చెఁదొడఁగె, నంతఁదత్పురజనము లత్యావసరమున.

సీ. భయదమై గృహము గప్పఁగ నెట్లు చనలేక సముయదోషాచరసంఘములును
సౌధముల్ చేరి యచ్చటనుండి ధర వ్రాలి కములు దైత్యాంగనాసముదయములు
రవిబింబములభంగి రహిమించు విస్ఫులింగములు దాఁకి యడంగుకరివరములు
కనుల ధూమముఁ గప్పఁ గనిపింప కింతైన, భయముచే మూర్ఛిల్లు హయచయంబు
తే. నగుచు భస్మంబు లయ్యె దైత్యాలయములు, ధర్మమార్గానువర్తియై తనరు నవ్వి
భీషణునిమందిరమునందుఁ బెట్టఁడయ్యెఁ, గాన నది దక్క పవమానసూనుఁగరిమ.

వ. ఇట్లు నిముసమాత్రంబున నట్టాలకప్రాసాదతోరణసహితంబుగా లంకానగరంబు
హుతాశనార్పితంబుగాఁ జేసి రత్నాకరంబుఁజేరి నిజలాంగూలం బమ్మహోదధిజలం
బులన్ ముంచి స్వస్థచిత్తుం డయ్యె ననలుండును వాయువునకు సఖుం డగుటవలన
జనకనందన ప్రార్థించినకతంబునను వాయుసందనుపుచ్ఛంబు దహింపక యతిశీతలుం
డయ్యెఁ గాదేని. 159

మ. ఇల నేదేవుని నామసంస్మరణచే నిందంబుఁ దాపత్రయా
నలమున్ వీడి మహాఘముక్తు లగుచున్ మర్త్యు ల్సుఖం బొంది ర
జ్జలజాతాక్షుని ముఖ్యభక్తుఁ డచలోత్సాహుండు సామీరి దై
త్యులు గావించిన వహ్నిపీడఁబడునే దూర్వాదళశ్యామలా!. 160

తే అనుచు రజతాచలమున హేమాద్రి యనఁగ, మూఁగు రఘువంశవర్ధను సుందరాంగుఁ
బాడి యన్వాలితెలుఁగు నుపక్రమించె, బలుక నేత్రీకృతార్కాంశుపావకుండు.

ఉ. అంత సమీరపుత్త్రుఁడు ధరాత్మజఁ గన్గొని దేవి! రామభూ
కాంతునిఁ బాసి గావలయు గ్రక్కున నంచుఁ బ్రదక్షిణత్రయం

చెంతయుఁ దా నొనర్చి భజియించి నమస్కృతిఁ జేసి యేఁగ శ్రీ
మంతు నతిప్రశాంతు హనుమంతుని గన్గొని సీత యిట్లనున్. 162

వ. ననుఁ జూడ నరుగుదెంచువాఁడై నీవార్త లెఱుంగ నెదురుచూచుచుండుఁ గావున
రామసన్నిధానంబునకు నేఁగు మని మఱియును. 163

క. కనుఁగొను వనచరవర! నను, దనుజస్త్రీముఖ్యమునను దాపత్రయపు
హ్నాని గుంగుచుండు నీ విఁకఁ, జను రాఘవువార్త వినక క్షణ మెటు నిలుతున్.

చ. అనిన సమీరజాం డనియె నంబ! భవద్విభుఁ డైన రాఘవుం
డినతనయాదిభూధరచరేంద్రు లనేకశతాయుతంబులన్
దనుఁ గొలువంగ రాఁగలఁడు తాలిమి మానిన నాదుస్కంధమం
దనువుగ నెక్కి భాస్కరకులాధిపుఁ జేర్తు క్షణంబులోపలన్. 165

వ. అనిన జనకనందన యిట్లనియె. 166

ఉ. సాగర మింకునట్లయిన సాయకపంక్తి నిగుడ్చి కట్టఁగా
బాగుగఁ జేసి సైన్య సుతబాంధవసంయుతుఁగా దశాస్యు ము
ఖ్యాగచరుల్ దనున్ గొలువ సత్కులాగ్రణి యాహవంబునన్
నేఁగి యొనర్చి నన్ గొనిన సిద్ధము తద్యశ ముందు భూస్థలిన్. 167

వ. అది గావున నింక నెవ్విధమ్మునసైనఁ బ్రాణంబులు దిక్కఁబట్టి తెరువుఁ జూచుచుం
డెద నను చు వీడుకొల్పిన మారుతాత్మజుండు జనకనందనపాదారవిందములకు నమ
స్కరించి మహోదధిం గనుంగొని పునర్విలంఘనోత్సుకంబున నొక్కపర్వతంబు
పైకిం జని 168

## హనుమంతుం డంగదాదులం గూడి సంభాషించుట.

సీ. కుప్పించి యెగయఁ దత్కుధరావతంసంబు పౌలస్త్యజయలక్ష్మిపగిదిఁ గ్రుంగఁ
జటువేగమునను ముప్పదియోజనము లేఁగి గగనాంతరస్థుఁడై జగతి నిండ
సింహనాద మొనర్పఁ జెలఁగి జాంబవదాదు లదె కార్యసిద్ధుఁడై ముదముతోడఁ
జనుదెంచువాఁడు పావని యంచు నొండొరు ల్పలుకంగ నమ్మహాచలమునందు

తే. దిగి వనౌకసులను నెల్ల మిగులఁ గాంచి, కంటి జనకావనీపాలకన్య ధన్య
మాన్య వారాశిజునితోడ మాటలాడి; వానిలంకాపురముఁ గాల్చి వచ్చి తిపుడు.

వ. ఇంక రామసుగ్రీవులఁ గనుంగొన నేఁగుద మనిన వారును నతిహర్షంబునఁ బవన
నందనుం గౌఁగిలించుకొని. 170

క. ఆడుదురు కొంద ఱతనిం, బాడుదు రొకకొంద ఱతని బాంధవమొప్పన్
గూడుదురు వాలములు ము, ద్దాడుదు రవ్వానరులు హిమాచలతనయా. 171

తే. అంతఁ బవనాత్మజునిఁగూడి యఖిలవృత్త, చరులు రఘునాథుఁ గాంచి సత్వరముతోడఁ
జనుచుఁ బ్రస్రవణాచలంబునను మధువ, నంబు సుగ్రీవునాజ్ఞాపితంబు గాంచి.
వ. అంగదునితోడ వనచరులెల్ల నిట్లనిరి. 170
క. మనమందఱ మాఁకటఁ బడి, చన నేటికి మధుఫలములు జలమును వేడ్కం
గొని తృప్తి నొంది చనియెద, మన నంగదుఁ డట్లు పలుక వగచరు లంతన్. 171
చ. వన మటు సొచ్చి యడ్డమగువారల నుక్కడఁగించి తద్వనం
బునఁ గలమాతిముఖ్యఫలము ల్గొన భానుజమాతులుండు త
ద్వనపరిరక్షకుండు దధివక్త్రుఁడు కోపముతోడ భానునం
దనుసముఖంబుఁ జేరి వననాశము చేయు నిజావమానమున్. 172
క. పలికి వనౌకసనాయక!, తలఁపఁగ నీవనము దేవతలకైనను గ
న్నులఁ జూడఁ బోల దది నేఁ, డిలఁ గూల్చిరి పవనతనయుఁ డిటు నీసుతుఁడున్.
వ. చిరకాలాభిరక్షితంబు వ్యర్థం బయ్యె. 174
చ. అనిన ముదంబు నొంది కపినాథుఁడు భూసుతఁ గాకయున్న మ
ద్వన మెటుచొత్తు రందులను వాయుతనూజుఁడె కాంచఁ బోలు నం
చన రఘువీరుఁ డేమి జనకాత్మజఁ జేర్కొని మాటలాడె దీ
వన రవిజుం డనెన్ దశరథాత్మజఁ గాంచిరి త్వత్సఖీమణిన్. 175
తే. పవనజాంగదు లటు గానిపగిదినైనఁ, ద్రొక్కి నేర్తురె నాదుమధువన మట్లు
గాన నిక్కంబుఁ గాంచి రక్కపులు జనక, కన్య నని మేనమామను గాంచి పలికె.
క. మామా! భయ మేటికిఁ జని, యామారుతి మొదలు గాఁగ వగచరవరులన్
నేమమునఁ దోడితెమ్మన, నామాటకు సంతసించి యాదధిముఖుఁడున్. 177
వ. అతివేగుండై. 178
చ. చని ప్లవగేంద్రులార! రఘుసత్తముఁడున్ రవిజుండు మిమ్ములం
గనుఁగొను వేడ్క నన్ బనిచెఁ గావున మీ రరుదెం డనంగఁ బా
వనియును నాదిగాఁ గలుగువానరు లంబరవీథి వైనతే
యునిగతి వచ్చి కాంచిరి పయోజహితాత్మజుఁ దక్కలీనునిన్. 179
వ. ఇట్లు కనుంగొని సుందర రామచంద్రునకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి
నిలువంబడి రందుఁ బవమాననందనుండు కౌసల్యానందనున కిట్లనియె. 180

## శ్రీరామున కాంజనేయుండు సీతవృత్తాంతముఁ దెలుపుట.

సీ. కనుఁగొంటి మిథిలేశుకన్యకారత్నంబు నచట నిరామయ యగుచుఁ దనరు
శింశుపావృక్షంబుచెంత మీఁదుకలంబు నడిగి నెమ్మదిలోన నుడుగ నెపుడు

శ్రీరామ! రామ! రామా! రామ! యనుచుండు దానవాంగన లెల్లఁ దన్నుఁ గొలువఁ
గుడువ దన్నము మంచి కోక గట్టదు కంట నీరు నించును బుద్ధి నిన్నె దలఁచు
తే. చుండు నేనును నొకశాఖయందఁ జేరి, మీకథావళు లెల్లను లోకమాత
రైన నద్దేవి కెఱిఁగించు నాత్మతోడఁ, బలుకఁ దొడఁగితి రామభూపాల! యపుడు.
వ. ఎట్టు లనిన. 182
చ. ఇనకులమందుఁ బుట్టి బల మెక్కఁగఁ దాటకిఁ ద్రుంచి గాధిపు
త్రునిఁ గరుణించి గౌతమునితొయ్యలిఁ గాచి మహేశుచాపమున్
ఘనత నొనర్చి భూతనయ నంది పథంబున జామదగ్న్యు నొ
య్యన గతగర్వుఁ జేసి జనకాజ్ఞ నిజానుజుఁడు న్మహీజయున్. 183
సీ. తనవెంటఁ జనుదేర వనభూమి కేతెంచి కులకాంత నసురుచేఁ గోలుపోయి
దినవాథసుతునితోడను మైత్రి యొనరించి యతని కింపుగ వాలి నడుగుపఱచి
నంత భానుతనూజుఁ డతిబలాఢ్యుల ఋక్షవానరాధిపుల భూవలయ మెల్ల
నవనిజఁ గనఁ బంచె నందు నే నొకఁడ మద్భాగ్యంబునను లంకఁ బరఁగఁ జొచ్చి
తే. కాంచితిని రామభూపాలు కాంత నిచట, నాదుకష్టంబు ఫలియించి మోద మొదవె
ననినఁ గనువిచ్చి చూచి యవ్వనిత యిట్టులనియె శ్రీరామదాసుఁడ ననుచు నెఱిఁగి.
క. కర్ణామృతతుల్యము లయి, వర్ణింపఁగఁ బోలునట్టి వాక్యము లెసఁ
పూర్ణయశస్కుఁడు పల్కె నొ, నిర్ణయముల యేని యిచట నిలువఁగ వలయున్.
వ. అని యప్పతివ్రతాతిలకంబు పలికిన నేనును శాఖాగ్రంబు డిగి చరణకమలంబులకు నమస్కరించి దూరంబున ముకుళితకరకమలుండనై నిలిచిన నమ్మహీనందనయు నాదువృత్తాంతం బంతయు నడుగ నేనును సవిస్తరంబుగా నెఱింగించిన నమ్మకుండె నంత నరిందమా! భవన్నామాంకితం బగు ముద్రికారత్నం బొసంగిన సంతసించి శిరంబునఁ బెట్టుకొని నన్ను విశ్వసించి యిట్లనియె. 186
చ. కనుఁగొనవయ్య! యియ్యసురకాంతల మధ్యమునందు భీతిచే
ఘనముగు దుఃఖ మొంది యిటు గ్రాఁగుట లింతయు నీ వెఱుంగఁగా
మనవి యొనర్పు రామునకు మారుతి! యంచన నేను బల్కితిన్
జనని! రఘూత్తముండు నిను సంతతముం దలపోయుచుండెడిన్. 187
వ. అహోరాత్రంబులు నీదువార్త నెఱుంగక. 188
మ. మదిఁ జింతింపుచు నుండు నెల్లపుడు శ్రీమంతుండు రాముండు నే
నిదె వేగంబున నేఁగి పల్కఁగనె కేశుండు తమ్ముండు బ
ల్లిగులౌ వానరయూథపుల్ గొలువ దోర్లీలన్ సురారాతినిం
గదనక్షోణి నడంచి ప్రాంతమున నిన్ గైకొందు సంతోషియై. 189

తే. చనెదు సాకేతపురికిఁ గావునను దల్లి!, యానవా లిప్పు డొసఁగు మయ్యవనివిభుఁడు
నమ్ము నటు లన్నఁ దనమది సమ్మతించి, రమణి కరుణించి తనశిరోరత్న మపుడు.

వ. ఇట్లు చూడాంతరస్థంబగు నిమ్మహారత్నంబుఁ గరుణించి తొల్లిటిచిత్రకూటనగంబునం గలుగు నతిరహస్యం బగు కాకాసురవృత్తాంతం బెఱింగించి సాశ్రులోచనయై మిమ్ముం దలంచి. 191

సీ. అడిగితి ననుము దైన్యముఁ బాపు మనుము నామనవిగా ముద్దులమఱఁదియైన
లక్ష్మణుతోడఁ దూలఁగనాడు ఫల మిప్పు డనుభవింపుచు నుంటి ననుము యింక
క్షమియించి మీయన్న కరుణపుట్టెడునట్లు పలుకంగదే యని పలుకు మనుచు
దుఃఖించె నేను దద్దుఃఖోపశమనంబు లగువాక్యములు పల్కి యచటువెడలి
తే. వానివన మెల్లఁ బెకలించివైచి వాని, భటుల సమయించి తత్పుత్త్రుఁ బట్టి చంపి
పురము దహియించి నీపాదసరసిజములు, గాంచ నేతెంచితిని మించుకాంక్షతోడ.

వ. అనిన రఘునందనుండు సంతసించి పవననందనా! నీ వొనరించు మహాకార్యంబు తొల్లి దేవతలచేతనైన నొనరింపంబడ దింక నీకుఁ బ్రత్యుపకారం బే నొనర్పం జాల నాదు సర్వస్వమ్మును గైకొమ్ము ఇది యునుం గాక హరిపుంగవా! పరమాత్మునగు నాదుదుర్లభంబగు పరిరంభణంబుఁ గంటి వతిధన్యుండ వనుచుఁ బెద్దతడవు గాఢాలింగనంబుసేసి బాష్పజలపూరితలోచనుండై యత్యంతముదంబు నొందె ననుచు మహాదేవుం డిట్లనియె. 193

చ. అనుదిన మేమహాత్ము చరణాంబుజముల్తులసీదళంబులన్
మనుజుఁడు బూజసేయుఁగ సమస్తశుభావహమైన మార్గమున్
గనునో యట్టి రాఘవుని కార్య మొనర్చి మహాకటాక్షముం
గనిన మరుత్తనూజునకు గారి! యసాధ్యము లింక గల్గునే. 194

క. అని శివుఁ డంబిక కెఱిఁగిం, చినగతి విధి నారదునకుఁ జెప్పిన వ్యాసుం
డును నాకుఁ బల్కె వినుఁడం, చనియెను సూతుండు శౌనకాదిమునులకున్. 195

క. మునిసముదయపాపతమో, దినకర! వనజదళనేత్ర! ధృతరథచరణా
సనకసనందననుతపద, వనరుహ! కస్తూరిరంగ! వసుధాసంగా!. 196

పంచచామరము. దిగంతసంతతప్రకీర్ణదివ్యకీర్తిశోభితా
ఖగేంద్రవాహ! సర్వలోకకంటకాసురాపహా!
జగత్త్రయైకపోషణానుసార్యమాణసద్గుణా!
దృగంతభక్తభాగధేయ! ధీర! రంగనాయకా!. 197

గద్య. ఇది శ్రీమోరుతోటముక్తీశ్వరప్రసాదలబ్ధకవితాపవిత్ర కోటమరాజు భాస్కరమంత్రిపుత్త్ర నాగయామాత్యప్రణీతం బయిన శ్రీమదధ్యాత్మరామాయణం బను మహాకావ్యంబునందు సుందరకాండము సర్వంబు నేకాశ్వాసము.

శ్రీరస్తు.

# అధ్యాత్మ రామాయణము

## యుద్ధకాండప్రారంభము.



శ్రీ రంగనాయకీముఖ
వారిరుహసహస్రకిరణ! వరకావేరీ
తీరసదన! నిఖిలధరా
భారవిదారణ! స్వభక్తపాలన! రంగా!. 1

క. అవధరింపుము తుహినశైలాధినాథ, కన్యకామణి కన్నీలకంఠుఁ డెంతో
ప్రేమ దళుకొత్తఁ బలికె శ్రీరామపుణ్య, కథలు సద్భక్తజనసుధానిధులు దెలియ. 2

ఉ. అంత సమీరపుత్త్రుఁడు రయంబునఁ దాఁ గనినంత రామభూ
కాంతునితోడఁ బల్కెఁ గను గాంచి ముదంబునఁ బొంగి సాహస
స్వాంత! భవత్సమానులు నరామరవర్గములందు నెల్లెడన్
జింత యొనర్పఁ గల్గుదురె చెందితి వింక మదీయదుఃఖముల్. 3

అదియునుం గాక. 4

ఈ యకూపార మవలీల నెవఁడు దాఁటు, లంక దగ్ధం బొనర్చి నిశ్శంకతోడ
మరలి చనుదెంచుఁ గానఁ గింకరకృతం బ,శేషమును జేయఁబడె నీదుచేత నిపుడు.

అని మఱియును. 6

మిత్త్రత్త్రిజానిబోలు మిత్త్రుండు చూడంగఁ గలుగఁ డింకమీఁదఁ గలుగఁబోఁడు
ఏను లక్ష్మణుఁడు కీశకుండు రఘువంశ మవనిజఁ గాంచుట యనిలసుతుని
చేత నిశ్చయము రక్షింపఁగఁబడితి మయ్యతివ బాగుగ నేఁడు వెతకఁబడియెఁ
గాని భీషణమత్స్యకచ్ఛపాకీర్ణ మా జలధిఁ జేరొక్కన బుద్ధి కలఁక నొందుఁ
గడవ శరకోటిజనంబులపావవు చూడ, నెవ్విధంబున దాఁటెద నిందుముఖిని
గాంతు నెట్లొకో యనినఁ దత్క్రియ మెఱింగి, భానునందనుఁ డిట్లని పలికె నపుడు.

చింతిల నేల భానుకులశేఖర! వార్ధి యనంగ నెంత దు
ర్దాంతపరాక్రము ల్పవనతార్క్ష్యజవాఢ్యులు చూడు వానరుల్

పంతములాడి నీ వనుపఁ బావకునైనను జొత్తు మంచు బల్
గంతులు వైతు రభ్యుదయకౌశలు లందఱు నీకుఁ జూడఁగన్. 8
చ. మఱియును జింత కార్యగరిమంబు లడంచును నట్లుగాక సం
గరమున నిల్చి నీవు పటుకార్ముక మెక్కిడ నీదుముందరన్
సురనిజసంధివాదులును జాలుగు రే నిలువంగఁ జింతఁ బోఁ
దఱుముముఁ దన్నిమిత్తములు తాఁకొని తోఁచుచు నున్న విచ్చటన్. 9
తే. కాన మన కిప్డు జయలక్ష్మి గలుగు మించ
నింక నవ్వార్ధి దాఁటి యాలంకఁ జొచ్చి
దైత్యుఁ దునుము నుపాయంబుఁ దలఁపవలయు
ననిన మది మెచ్చి వాయునందనునిఁ గాంచి. 10
వ. పవననందనా! యింక నెన్నియుపాయంబుల నైన మహార్ణవలంఘనంబు నిశ్చయం బైనను దేవదానవులకును దుస్సాధ్యంబగు నాలంకాస్వరూపం బెఱింగింపు మంత యు నెఱింగి వలయు నుపాయం బొనరింపం బోలు ననిన హనుమంతుండును గరం బులు మొగిడ్చి యతివినయంబునఁ దాను గనినంతవట్టు నెఱింగించువాఁడై యిట్ల నియె. 11
సీ. వినవయ్య! రఘునాథ! వనధిమధ్యంబునఁ జనుఁ ద్రికూటంబను శైల మొకటి
యందు లంక యనంగ నమరారిపురము కాంచనసౌధములచేతఁ దనరుచుండు
నొకని మెచ్చనిదార్ఢ్య లోకరు తిత్వరమునందుఁ గల రేను నాలంకఁ గాల్చి వాని
బలములో నాలవభాగం బడంచితి యంత్రముల్ విరిచితి నచటి కింక
తే. మీరు విచ్చేయ నది గడతేరుఁ గాన, వేగ యత్నంబు పూనుఁ డీవేళ ననిన
సంతసము నొంది యారామచంద్రుఁ డపుడు, భానుజానితోడ నిట్లనిపలికెఁ దరుణి!.

## శ్రీరాముఁడు వానరవీరులసహితముగ లంకమీఁదికి దండెత్తి వెడలుట.

చ. రవిసుత! యిమ్ముహూర్తమతిరమ్యము నా కెనయంగ లంకపైఁ
గవయఁగఁ గాన నాభువనకంటకుఁ బట్టి సపుత్రమిత్రబాం
ధవునిఁగ నిమ్ముహూర్తమునఁ దాఁకొని చంపి యయోధ్యకు న్మహో
త్సవముగ జానకిం గొనుచుఁ జయ్యన పోఁగద నింక నిప్పుడున్. 13
వ. నాకును మేలు గలిగెడు తెఱంగున దక్షిణాంగంబు లదరుచున్న యవి లంకాప్రస్థా నంబు నిరూఢం బిట్లు గావున వేగంబ మనసేనలవారలకుం బయనంబు చెప్పు మువ్వాహినులకు వెనుకముందఱ నుభయపార్శ్వంబుల నుద్దండతరుశిలాపాణులై నిలిచి దండనాయకు లతిప్రయత్నంబున రక్షింపవలయు. సేనను సుమిత్రాపుత్రుం

డును వాయుజాంగదుల స్కంధారోహణంబు చేసి చనుదెంచెదము భానునందనా! నీవును నాతోడనే యుండుము గజ గవయ గవాక్ష గంధమాదన నల నీల మైంద ద్వివిద జాంబవదాదిభల్లూకప్లవంగసేనావల్లభులును సప్రమత్తులై బలసి చనుదెంచెద రనుచు సుగ్రీవలక్ష్మణసహితుండై యతిహర్షంబున రామచంద్రుండును నక్షత్రగణపరివేష్టితుండగు రోహిణీవల్లభుపోలె సేనామధ్యంబున నిలచె నాజగత్ప్రభుండు సేయునుత్సాహంబునకు ననురూపంబుగాఁ గామరూపసంపన్నులును వేదండతుల్యులును నగు వనచరు లాసమయంబున. 14

సీ. వాలము లుద్దాడువారు గంతులువైచువారు మల్లలు సరచువారు మఱియుఁ
పాదపంబులు దీసి పక్వఫలంబులు దినువారు రఘునాథ! దనుజ నిదియె
పొరివుత్తు మనువారు ధరణి యీనినయట్లు శ్లిష్టగు లీక్రియ దన్ను బలసి కొలువఁ
దనుకాంతి యాతపంబు బాలభానునిగతి నొప్పె నాజగద్ధితయుతుండు
తే. మఱియుసంధులతోఁ గలు చఱచిచఱచి, శైలములు దాఁటియవలీలఁ జనుచుఁ జనుచు
వానిగను సింహనాదము ల్చేసిచేసి, వాయువేగంబునను నేఁగువారు కపులు. 15

వ. ఇవ్విధంబున రామచంద్రుండు పెన్నిధానంబు ప్రాప్తి యుక్తిఁ జేసి మహోత్సాహు లయి యహోరాత్రంబులు సంచుకంతైనను నిలువక చనిచని. 16

తే. సహ్యమలయాచలంబున సకలకాననములుఁ గనుఁగొంచు వివిధసైన్యములతోడఁ
జని యపారంబు భీమనిస్వనము మత్స్య, కచ్ఛపాకీర్ణమగు వార్ధిఁ గాంచి రపుడు.

వ. ఇట్లు దక్షిణపారావారంబుఁ గాంచి లక్ష్మణుండును వాలినందనుం దిగియె నప్పుడు రాఘవుండు... 18

చ. అనిలతనూజ డిగ్గి మిహిరాత్మజుఁ గన్గొని యింతవట్టు చే
తను నగునట్లు సేసితిమి దాఁటఁగ నింక నశక్యమైన నీ
వును మనసైన్యముల్ గొని మహోదధితీరమునందు నిల్పి మీ
మనములఁ దోఁచుచందముల మంత్రము ల్చేసి సేయుఁ డంచనన్. 19

వ. ఇవ్విధంబున సుగ్రీవుండును రత్నాకరతీరంబున సైన్యంబును డించి దండనాయకులం గాచియుండ నియోగించిన వారును మహోన్నతతరంగాఢ్యంబును భీమనక్రభయంకరంబును నగాధసలిలంబును గగనాకారంబును నగు మకరాలయంబుఁ గనుంగొని కడుదుఃఖితులై. 20

. మనరఘునాయకుదేవిని, గొనిపోయినదనుజ నిపుడె కూల్చెద మైనన్
వననిధి సంపారార్ణవ, మును బోలె నపార మగుచు మొనసెను నిచటన్. 21

. ఎవ్విధంబునం దాఁటి లంకానగరంబుఁ గాల్చెదమో యంచు నందఱుఁ జింతాపరులై రామపార్శ్వంబున నిల్చి రంత నద్వితీయుండును జిదాత్ముఁడును నొక్క రుం

డును బరమాత్ముయు సనాతనుండును నగు రామచంద్రుండు దేవకార్యంబుకొఱకు
మానుషవేషంబు ధరియించెం గావున మహాత్తరంబగు దుఃఖంబుచేత నావృతుండై
జనకరాజనందనం దలంచి బహువిధంబుల విలపింపందొడంగె మఱియును. 22

చ. తనదగు సుస్వరూపమును దత్త్వ మెఱింగిన మానవోత్తము
ల్గనరఁట దుఃఖసంఘములఁ గన్గొనఁ దద్రఘునాథమూర్తికిన్
ఘనమగు నీయెఱుంగమిని గల్గెడు శోకము లోభమోహము
ల్పెనచెఁ గ్రోధహర్షభయపీడలు చెందునె శైలనందనా!. 23

వ ఈయజ్ఞానచిహ్నంబు లప్పరమాత్మయందు నెట్టులుండు దేహాభిమానులకుంగాని
లేనివారలకును నాత్మజ్ఞానసంపన్నులకును దుఃఖంబులు లేవు. బుద్ధినైర్మల్యంబున
రెండవపదార్థంబు లేదని యెఱింగనేని పరమసౌఖ్యంబు చేకూరు నింక గాఢసుషు
ప్తియందు మనంబు లీయంబైన దుఃఖంబు ప్రాపింప దట్లు గావున నఖిలదుఃఖం
బులకు మూలకారణంబు బుద్ధియ యసంశయం బగు నదియునుంగాక. 24

తే. నిత్యుఁడు పురాణపురుషుండు నిత్యసుఖుఁడు
నధికుఁడు నిరీహుఁడును బరమాత్ముఁ డాద్య
వెలయు మాయాగుణంబులఁ గలిసి సుఖియు
దుఃఖియును రాఘవుఁ డసంగుఁ డోఁచుఁ జెలియ!. 25

తే అనుచు విమలాత్మయైన యయ్యచలతనయ, తోడ దక్షాధ్వరధ్వంసి యాదకైన
రామచారిత్ర మిది యామూలమణి! యనుచుఁ,బలికి యావ్వలితెఱఁగు నుపక్రమించె.

వ. అంత లంకానగరంబున రావణుండు. 27

## రావణుఁడు హనుమంతునిపరాక్రమంబుఁ దలంచి చింతించుట.

ఉ మారుతి యట్లొనర్చిన యమానుషవిక్రమ మాత్మలోపలం
జేరిచి మోము వంచి బలుచింతను మంత్రులఁ జీరి పల్కె నో
శూరవరేణ్యులార! యిటు చూచితిరే యొకవానరుం డకూ
పారము లీల దాఁటి మనపట్టణ మంతయుఁ జొచ్చి భూసుతన్. 28

తే కని వనం బెల్లఁ జెఱిచి యక్షునిమదియు,బాలకుని ద్రుంచి పురము లాంగూలవహ్ని
భస్మ మొనరించిచనియె నిర్భయముతోడ,నహహ యిటువంటి ప్లవగులెందైనఁ గలరె.

వ. మఱియును బలపరాక్రమసంపన్నుల రగు మిమ్ము నందఱ లెక్కగొనక పూర్వప్రకా
రంబున గోష్పదంబు లంగి నపారంబగు పారావారంబు దాఁటి స్వస్థచిత్తుండై చనియె
మీరును బుద్ధిమంతులగు గావున నింక మనకుఁ గర్తవ్యం బగు నుపాయంబు విచా
రింపుం డనిన వార లిట్లనిరి. 30

సీ. పాకశాసనుఁ బట్టి పగ్గంబులను జుట్టి నిలిపెఁ గారాస్థలి నీసుతుండు
చని కుబేరునితోడ సంగరం బొనరించి పొసఁగఁ గైకొంటివి పుష్పకంబు
మయుఁడు నీదుప్రతాపమహిమంబునకు నోడి మెచ్చుపుట్టఁగఁ గూఁతు నిచ్చె నియము
గాలదండ మొకింత గడవనేరదు యనేకదైత్యనాయకులు నీభృత్యవరులు
తే. గాన శంకింప నేల యవ్వానరుండు, వానరుం డని యుపుడు గర్వంబుతోడ
నే ముపేక్ష యొనర్చిన నింత చేసెఁ, గాక నిలిచిన బ్రతికిపోఁ గలఁడె వాఁడు. 31
వ. అయినను. 32
క. ఒకరొకరిని బంపు చతు, ర్మకరాలయమధ్యమంద మానవ మకపి
ప్రకరంబుఁ గొనరించెద, మిఁక మే మనఁ గుంభకర్ణుఁ డిట్లని పలికెన్. 33
ఉ. నీవు తలంచుకార్య మది నిక్కము దానవవంశనాశనం
బావసుధాసుతాధిపు దయాకరుఁ గన్గొన నేర వైరి వా
భూవిభుఁ డింకఁ జూడ నిను బొంక మడంపక పోవనిచ్చునే
రావణ! రామచంద్రుఁడు పరాత్పరుఁ డవ్వఁడటం చెఱింగితో. 34
క. నారాయణుఁ డివ్యధమున, శ్రీరాఘవుఁ డయ్యె లక్ష్మి సీత యనంగన్
ధారుణి నుదయించె దురా, చారుల నడఁగింపఁ గమలజన్ముఁడు వేఁడన్. 35
క. గాలము మీనము మ్రింగెను, పోలిక లోకైకమాత భూసుత స్వకులో
న్మూలన మొనరింపఁగ నీ, వీలంకకుఁ దెచ్చితివి సురేంద్రవిరోధీ!. 36
వ ఇదియు కాదు. 37
చ అనుచితమైన కర్మచయ మంతయుఁ జేయక యొప్పె నీకు చే
తను నిఁక నే మొనర్చెదవు డాఁకొననైనను దోడొనర్తు నీ
యనుజుఁడఁ గాన స్వస్థహృదయంబున నిల్వుమటన్నఁ గుంభక
ర్ణుని వచనంబులున్ విని తనూభవుఁ డింద్రజిదాహ్వయుం డనున్. 38
క. పంపుము దాశరథుల బల, సంపద లడఁగించి కీశసముదాయములన్
జంపి భవత్సముఖంబున, నింపుగఁ జెనుదెంతు నేన యిపు డని పలికెన్. 39

## విభీషణుఁడు రావణునకు నీతిఁ జెప్పుట.

వ. అప్పుడు విశుద్ధబుద్ధియు సురబృందసన్నుతుండును బుద్ధిమంతులలోన గరిష్ఠుండును బరమభాగవతశ్రేష్ఠుండును నగు విభీషణుండు శ్రీరామచంద్రవిమలచరణకమలయుగళంబు లాత్మీయహృదయకమలంబునం దిడుకొని రావణుసభాభవనంబున కరుగుదెంచి యామండోదరీవల్లభునకుం బ్రణమిల్లి యుచితాసనంబునం గూర్చుండి కొలువున్న కుంభకర్ణాదిమహాప్రమత్తయాతుధానవర్గంబులం గాంచి యతి

విస్మయంబున వార లందఱు వినుచుండ ధర్మానుకూలంబులగు వాక్యంబుల దశాన
నున కిట్లనిరి. 40

ఉ. పరఁగఁగఁ గుంభకర్ణుఁడు సుపార్శ్వుఁడు మేఘనినాదుఁడున్ మహో
దరుఁడు నికుంభకుంభులును దాశరథుల్ వరచాపపాణులై
దురమున నిల్చి తీవ్రమగు తూపులు పైఁ బఱపంగ నిల్తురే
శిరములు కంధరంబులు చకాచకలై చనువారు కావునన్. 41

వ. ఇదియుఁ గాక. 42

క. సీతయను దుర్భరగ్రహ, మీతెరువున నిను గ్రసించె నిఁకనైనను ధా
త్రీతలనాథున కయ్యువ, నీతనయ నొసంగు విడుచు నిను బ్రాణముచేన్. 43

క. మఱియును రాఘవుదుర్భర, శరములు మనలంకఁ జొచ్చి సకలబలంబుల్
పరిమార్పకమున్నె శుభా, కర సీత నొసంగి మమ్ముఁ గావుము కరుణన్. 44

వ. ఇదియుఁ గాక. 45

మ. కులశైలాభులు సింహవిక్రములు లాంగూలాఢ్యులు న్మించదం
ష్ట్రిలచేతన్ నఖపంక్తిచేత దురముల్ సల్ప న్నుపాయజ్ఞులం
దలఘు ల్వానరు లింక వారు మనపై దండెత్తకున్నన్నె భూ
తలనాథాగ్రణిఁ జేరఁ బ్రోచుఁ గరుణన్ దైతేయవంశాగ్రణీ. 46

వ. ఇట్లు గాదేని. 47

క. నిను విడువఁడు పాతాళం, బునఁ జొచ్చిన జమునిఁ గనినఁ బురహరు వీక్షిం
చిన దేవనాథుఁ జెందిన, ధనదుని మఱుఁగునకుఁ జనినఁ దలఁగక త్రుంచున్. 48

వ. ఇవ్విధంబున శుభప్రదంబులును హితకరంబులును బవిత్రంబులును గాఁగ విభీ
షణుండు పలుకువాక్యంబుల కులికిపడి రెట్టించిన కోపంబున మృతిఁ బొందెడు
వానికి దివ్యౌషధంబులైనను నసహ్యంబులై తోఁచుభంగిఁ గాలచోదితుండై
రావణుం డిట్లనియె. 49

క. ఏ నొసఁగిన భోగంబుల, మేనును బలిపించి క్రిందుమీఁ దెఱుఁగక నా
తో నెదిరించెద వహితుఁడ, వై నా కినయంగఁ దమ్ముఁ డందురె నిన్నున్. 50

క. శత్రుత్వము మది నుంచుక, మిత్రునిక్రియ నుంటి వీవు మిత్రద్రోహీ
గాత్రము ఖండింపనె మ,చ్ఛాత్రవునకుఁ దోడువలుకుజను నింకొకనిన్. 51

వ. ఇట్లు కావున వనార్యులతోడను గృతఘ్నులతోడను మాకు సాంగత్యంబు ఘటి
యింపనేర దిదియుఁ గాదు జ్ఞాతియైనవాఁ డెల్లకాలంబుఁ గీడు దలంచుం గావున నీవును
నవ్విధంబ యనినఁ దద్వాక్యంబులు విని సహింపక విభీషణుండును గదాపాణి

రై నల్వురు మంత్రులం గూడుకొని యంబరంబున కెగసి రావణుం గనుంగొని.

క. జనకసుతానునిగను నినుఁ, గనుఁగొని నీబ్రతుకు తెరువు గఱపిన నీవున్
నను దూలఁగ నాడితి విఁకఁ, గనుఁగొనియెద నాఫలంబు కాలము చేరన్. 53

వ. అది యెట్లంటేని. 54

సీ. కాలుండు రఘునాయకస్వరూపముతోడ దశరథాలయమునఁ దగ జనించె
జనకభూవిభుగృహంబున సీత యనఁగ మృత్యువు నీకుఁ గీడు సంభవము నొంద
వారలిద్దఱు మహీభార మంతయు మాన్పఁ జనుదెంచి రిట వారిపనుపుచేత
హితవాక్యము లొకింత మదినెంచ వారాముఁ డఖిలకార్యములచే నరయఁ బ్రకృతి
తే. కిని బరుండునునై కూడి తనరుచుండు, వెలుపటను లోపటను భూతములకు నామ
రూపభేదంబులను దత్స్వరూపుఁ డట్లు, నమలుఁ డయ్యును నొప్పు దైత్యాధినాథ.

వ. మఱియు నొక్కటయ్యును మహానలంబు సమస్తపాదపంబులయందును నంత
ర్గతంబులై తోఁచుభంగి నతినిర్మలంబయ్యును స్ఫటికంబు నీలపీతాదిసంయోగం
బునఁ దత్తన్మయంబై తోఁచుచందంబునను బంచకోశాదిభేదంబులఁ దత్తద్రూ
పుండై జ్ఞానదృష్టులచేత నెఱుంగంబడు నతండు నిత్యముక్తుం డయ్యును స్వమా
యాగుణబింబితుండై నలువొందు నదియునుం గాక కాలం బనియుఁ బ్రధానం
బనియు నాలుగువిధంబులు గల వంగఁ బ్రధానపురుషులచేత నజుండగు నీశ్వరుండు
జగం బంతయు సృజియించు నంతఁ గాలస్వరూపుండై సర్వంబును నవ్యక్తుండు
కలనంబు నొనరించు నట్టికాలస్వరూపుం డగు నారాయణుండు కమలసంభవుచేతఁ
బ్రార్థితుండయి మాయామానుషరూపంబున నిన్నుం బరిమార్ప రామచంద్రుండయి
యవతరించె నింక సత్యసంకల్పుండగు నీశ్వరుండు రెండవ మార్గం బెవ్విధంబున
వహించు నట్లుగావున సపుత్త్రబలవాహనంబుగా నిన్ను నుక్కడంచి నిజభార్యా
యుక్తుండయి సుఖంబున నయోధ్యకుం జను నింక సన్నువైనకతంబున నింతవట్టునుం
బలుకవలసె నేను రామచంద్రభుజాసారంబునం దెగు నిన్నుం గనుంగొనఁజాల
నింక నాశ్రితరక్షాపరతంత్రుఁ డగు నమ్మహాత్ముచరణకమలంబు లాశ్రయింప
నేఁగెద సుఖంబున వసియింపు మనుచుఁ దాను 56

చ. కలుషతరంబులైన దశకంధరువాక్యము లెల్ల నాత్మకున్
గలఁక యొసర్ప రాఘవుని గన్గొని తత్పదవారిజంబులన్
బలుమఱు పూజసేతుఁ గడుభక్తి నటంచు సమస్తమోహముల్
దలఁగఁగఁ ద్రోచి యంబరపథంబున నేఁగె సమీరవేగియై. 57

తే. అనుచు నారావణానుజు నధికమైన, మానసం బద్రిరాజకుమారితోడఁ

బలికి యతఁడింక శ్రీరామభద్రుఁ గాంచఁ, గలఁడనుచుఁ బల్కెఁ దోడఁ గొలంకరుఁ డుమరల.

## విభీషణుఁడు శ్రీరాముని శరణుఁ జొచ్చుట.

తే. ఇటు విభీషణుఁ డారాఘవేంద్రుఁ గొలుచు, కౌతుకంబునఁ జనుదెంచి గగనతలము
నను సమీపంబునను నిల్చి మనుజనాథు, పాదపంకజములు గాంచి పలికె నపుడు.

మ. శరణో హో రఘునాథ! విస్ఫురితకంజాతేక్షణా! నన్ను నీ
తరుణి న్బల్విడిఁ దోడితెచ్చిన సురేంద్రారాతికిన్ దమ్ముఁడం
దురు నామంబు విభీషణుండు తగ దీదుర్బుద్ధి నీ కన్న స
త్వర మొప్పన్ దగవ్రేయఁ జూచిన భయవ్యాప్తైకచిత్తుండనై. 60

క. శరణనువారలఁ బ్రోవఁగ, బిరుదు వహించితి వటంచుఁ బ్రియముగ విని నీ
చరణంబు లాశ్రయింపఁగ, ధరణీశ్వర! వచ్చినాఁడ దయఁ జూడు ననున్. 61

వ. ఇట్లు విహాయసమార్గంబున నుండి పలుకు విభీషణువాక్యంబులను రామభద్రుం
గనుంగొని సుగ్రీవుం డిట్లనియె. 62

క. మనుజోత్తమ! వీఁ డరయఁగ, దనుజుఁడు మాయావి నీదుతరుణిని గొనిపో
యిన పాపకర్తతమ్ముఁడు, మన వివరము లరసి తునుమ మది నరుదెంచెన్. 63

వ. ఇట్లు గావున విశ్వాసంబున కనర్హుం డాజ్ఞయొసంగదరేని వానిదేహంబు నింతిం
తలు సేయింతు నాకు నిత్తెఱంగునఁ దోఁచుచున్నయది చిత్తంబుకొలంది నవధ
రింపుం డనిన మందహాససుందరవదనారవిందుండై రఘునందనుం డిట్లనియె. 64

చ. నియమమునన్ సమస్తధరణీస్థలిఁ ద్రుంప సృజింప సత్త్వ మిం
పమరెడు నాకు నేఁ డభయ మాతని కిచ్చితిఁ దోడితెండు వీ
రముచెడి నీగువాఁడ నని ప్రాంజలి చేసినఁ బ్రోతు నంచు ని
త్యముఁ జెలువొందు మద్వ్రతము తప్పదు సత్యము సత్యమం చనన్. 65

వ. ఇట్లొక్కసారైన నీవాఁడ నని శరణంబు వేఁడిన సకలభూతంబులకును నభయం
బొసంగెద ననుచుఁ బలుకు రఘునందను సత్యభాషణంబులకు హర్షంబు నొంది
సుగ్రీవుండును యథాన్యాయంబుగ విభీషణుని ముందటికిం దోడితెచ్చె నంత. 66

మ. శరచాపాంచితబాహు నీలజలదశ్యాము న్బ్రసన్నాననాం
బురుహు న్గాంతు సలక్ష్మణు న్గని మహామోదంబుతో సాఁగి మ్రొ
క్కి రమావల్లభ! యంచు లేచి నుదుట న్గేల్మోడ్చి సద్భాషణ
స్ఫురణ న్సన్నుతిసేయఁ దాఁ దొడఁగె నప్పూర్వామరేంద్రుం డొగిన్. 67

ఉ. నీ కిదె వందనంబు ధరణీతనయావర! రామ! భూవరా
నీరమ్యగేంద్రభక్తజననీరద! పూర్వసమీరక్రూరద

ర్వీకరతుల్యచాప! పటువిక్రమ! రావణగర్వయామినీ
శోకసమూహాపహ్వ! కపికుంజరమిత్ర! పవిత్ర! రాఘవా! 68

ఆ. అమితతేజసే మహాత్మనే శాంతాయ, అఖిలజనసభరణావనమూల
కారణాయ మునిగణవందితాత్మయ, వాస్తవాయ తే నమో స్తటంచు. 69

వ. మఱియు నిట్లని స్తుతియించె. 70

సీ. తెలియంగ నీ వనాదిగృహస్థుఁడవు లోకములవారలకు నెల్ల ముఖ్యతముఁడ
వంతంబులేని రామాఖ్యుఁడవును గాన మఱిమఱి నీకు నమస్కరింతు
జగములు గలిగింప సంస్థితి గావింప విలయంబు నొందింప విభుఁడనంగఁ
దనచిత్త మరుగుభంగిని బోవఁ గలఁడన స్థావరజంగమాత్మకములైన
తే. భూతముల వ్యాపకవ్యాపభూరిమహిమ, బయలలోపలఁ దగు జగన్మయుఁడనంగ
వేదములఁ జాటు దొర వీవ ఖేదమోద, రహిత! గతకామకోప! శ్రీరామభూప!

వ. దేవా! భవదీయమాయామహిమంబున మనంబు భ్రమియించి వినష్టజ్ఞానులై పుణ్య
పాపఫలంబుల నెల్లకాలంబు నూర్ధ్వాధోలోకంబులకుం బోవుచుం గూలుచుండెద
రిదియద్భుతంబు గాదు మఱియును. 72

ఆ. జ్ఞానబుద్ధి నిన్ను జానకీనాథున, ద్వయునిఁ దెలియ నెంతపట్టు చనుట
యంతపట్టు సత్య మగు జగం బిల శుక్తి, యందు రజతబుద్ధిచందమునను 73

వ. నీదుయాథార్థ్యం బెఱుంగమి నెల్లకాలంబు నాసక్తులై యంతంబున దుఃఖప్రదా
యకంబులగు విషయాదులఁ బుత్త్రదారగృహాదులయందు రమియింతురు వారలం
జెప్ప నేల. 74

తే. వాసవ హుతాశ యమ దైత్య వరుణ పవన, ధనద గిరిశాది దిక్పాలతతియు నీవ
కొద్దికన్నను గొద్దియు గొప్పకన్న, గొప్పవై యొప్పియున్న మాయప్ప వీవ. 75

తే. నీవ తల్లివి దండ్రివి నిఖిలమునకు, నాదిమధ్యాంతరహితుండ వచ్యుతుండ
వవ్యయుండవు పరిపూర్ణ భవ్యయశుఁడ, వీవ గనుఁగొను మ్రొక్కెద దేవ! నీకు. 76

వ. నీవును. 77

సీ. చెవులు లోచనములు చేతులు నడుగులు లేనివాఁడవు జన్మ లేనివాఁడ
విశ్వరూపుండవు తంత్రి విటులయ్యు వినఁగనుఁ గన్గొనుచుఁ జేకొనుచును జనుచు నుందు
వరయ లోకాలికి వ్యతిరిక్తుఁడవు నిర్గుణుండవు నిరుపాశ్రయుండ వొండె
జనియించెఁ జెరిఁగను సంచరించెను దగ నడఁగె ననంగ నియ్యాలుభావ
తే. ములను లేని నిరీశ్వరమూర్తి వాది, పురుషుఁడవు మాయచే మర్త్యపోల్కిఁ దోఁతు
వెలుఁగఁ జేర్చిన భక్తులు పరమమైన, నీగుకైవల్యభాజను లౌదు రనఘ! 78

తే. ఏవికల్పంబు నేగుణం బేవికార, మెట్టియాకారమును లేక యొసఁగి ప్రకృతి
కంటెఁ బరుఁడవు నై యొప్పు కమలమిత్ర, వంశవారాశిహిమధామ! వందనంబు.

చ. జనవర! నీదుపాదయుగసద్భజనం బను మంచినిచ్చెనన్
గొని వడి జ్ఞానయోగ మను గొప్పగు సౌధము నెక్కఁగోరెదన్
ఘనకరుణాలవాల! జనకక్షితిపాలసుతానుకూల! స
న్మునిసురసాల! నన్ భవసముద్రముఁ ద్రోయక ప్రోవవే కృపన్. 80

చ. అని యిటు లవ్విభీషణుఁ డనాశ్రయుఁడై వినుతింప మెచ్చి గై
కొను మభయంబు మేలుగుచు గోరుము కోరిక లన్న రాఘవుం
గని కృతకృత్యుఁడన్ గలితకార్యుఁడ ధన్యుఁడ నీపదాబ్జముల్
గనుఁగొన ముక్తిఁ జెందితి విఖండితమోహమదాంధకారినై. 81

క. నాకన్న ధన్యు లెవ్వరు, లోకంబుల నీపదావలోకమ్మున నా
లోకభవామరవందిత, కాకుత్స్థకులేశ! జనకకన్యాధీశా!. 82

వ. దేవా! కర్మబంధవినాశంబులో నగు భక్తిలక్షణంబగు నీగుజ్ఞానంబును బరమార్థం
బగు నీదుధ్యానంబును గరుణింపుము. మఱియును. 83

ఆ. విషయజంబులైన వివిధసౌఖ్యంబులు, మదిఁ దలంప నీదుమృగుపదంబు
లందు భక్తి యొసఁగు మఖిలేశ! యనిన స, త్కరుణతోడఁ బలికె మరల నపుడు.

వ. అది యెట్టు లనిన 85

## శ్రీరాముఁడు విభీషణున కభయం బొసంగుట.

సీ. అతిరహస్యము సుఖాన్వితము మన్నిశ్చయం బిది విభీషణ! నీకు నెఱుఁగఁజేతు
యోగివర్యులు వీతరాగులు మద్భక్తు లతిశాంతు లగువార లాత్మయందు
నను దలంచెద రేను నచట నిల్చెదఁ గాన నీవును శాంతసద్భావి వగుచుఁ
గల్మషాపహుఁడవై కడుభక్తి ననుఁ గొల్వు మనఘ! సంసారఘోరాబ్ధి దాఁటఁ
తే. గలవు మత్ప్రీతికరముగా వెలయు నీదు, స్తోత్ర మెవ్వరైన వ్రాసిన సొంపు మీఱ
వినినఁ జదివిన సారూప్య మొనరఁ గలుగు, నిది నిజం బని కరుణ చెన్నొందనపుడు.

వ. భక్తవత్సలుండగు రాఘవుండు లక్ష్మణునిం గనుంగొని సుమిత్రానందనా! నాదు
సందర్శనంబుల నగు ఫలంబు గనుంగొనుము వేగంబ సముద్రోదకంబులు దెప్పింపు
మీక్షణంబ లంకారాజ్యంబునకు విభీషణు నభిషిక్తుం గావించెద ననిన నతండును,

క. ఎంతతడవు రవిరజనీ, కాంతులు మేదినియు నాదుకథలు నిలుచుఁ దా
నంతతడవు విభీషణుఁ డెంతయు లంకాపురంబు నేలెడు సుఖియై. 88

వ. అని నిర్దేశించి సముద్రజలంబులు దెప్పించి పవిత్రులను లక్ష్మణుని నియోగించి శాశ్వ
తంబుగా నభిషిక్తుం జేయించె నంత. 89

ఆ. సాధుసాధు యనుచు సకలవానరులును, బొగడి రెలమి రామభూతలేంద్రు
నర్కతనయుఁ డప్పు డవ్విభీషణుఁ గాంచి, కూర్మి నెరయఁ బలికెఁ గుధరతనయ!.

చ. వినుము పరమాత్ముఁడైన రఘువీరుని దూతల మంచు నీవు రా
ముని సుపరిగ్రహంబునను ముఖ్యుఁడ వింక సహాయి కా దశా
ననుఁ బరిమార్ప రాముని కనన్ విని భానుజ! లోకనాయకుం
డనఁదగు రామమూర్తికి సహాయ మొనర్చెదునంతవాఁడనే. 91

ఆ. ఇంక దాస్యవృత్తి యే నొనర్చెద మిమ్ముఁ, గూడి శక్తి కలుగుకొలఁది ననినఁ
బత్త్రికంఠుచేతఁ బనుపంగఁ బడి శుకుం, డను నిశాచరుఁడు విహాయసమున. 92

వ. నిలిచి సుగ్రీవునిం గనుంగొని భానునందనా! మత్ప్రభుండగు దశాననుండు దనదు
వాక్యంబులు గాఁగ నీ కెఱింగింపు మన్న తెఱంగు వినుము. 93

చ. ఎనయఁగ గొప్పయింట జనియించితి పెక్కుడు వానరాళికిం
దనయుఁడ వంశుమాలికిని దమ్ముఁ బోలుదు వింక నాకు నీ
వనితయు గాదు వేలోకనివల్లభఁ దెచ్చిన నీ కిదేమి పా
మ్మనుము ప్లవంగసైన్యముల నందఱఁ దోల్కొని బుద్ధితోఁ జతన్. 94

వ. ఇట్లు గాదేని. 95

తే. సురల కైనను గను విచ్చి చూడఁ దగని, లంక ప్రాకారులగునట్టి ప్లవగమనుజ
కీటకంబుల కెటు లోటుపాటునొందు,ననియెనని పల్కుమని పల్కె నగచరేంద్ర!.

వ. అనిన విని ప్లవంగవీరు లతిరయంబున. 97

క. వినువీథి కెగసి వానిన్, ఘనతరముష్టిప్రహారములఁ గంతగతప్రా
ణుని చేయ రామచంద్రునిఁ, గనుఁగొని యెలుఁగెత్తి పలికెఁ గంపభీతుండై. 98

మ. చనునె దూతల నిట్లొనర్పుటల్ల రాజశ్రేష్ఠ! ధర్మంబె వే
దన సైఁపంగను జాలఁ బ్రోవఁ గదవే దాతృత్వ మూహింపవే
యనినన్ బుణ్యుఁడు గాన వారలను హాయన్ బల్కెఁ బల్కంగ న
ద్దనుజాం డంబరవర్తియై మిహిరపుత్త్రా! యంచు సోచ్చారతన్. 99

వ. ఇట్లు సుగ్రీవుం గాంచి. 100

క. ఏమని పల్కెదు దనుజ, గ్రామణితో ననిన వాలిగతి యత్నమునన్
రాముని చేతను సుతికాం, తామాత్యసమేత్యముగను జడఁతు నను మనెన్. 101

వ. మఱియు సకలలోకనాయకుండగు రఘునాయకునారీరత్నంబునుం దోడితెచ్చి
కులంబు నేలం గలుపుట కర్జంబు గాదనుచు తెఱంగం బలుకు మనినఁ బ్లవంగవీరు

లను రఘునాథునాజ్ఞ నన్నిశాచరుం బట్టి బద్ధుం గావించి రంతకుమున్న రావణప్రే
రితుండై శార్దూలుం డను దానవుం డొక్కరుండు చనుదెంచి కపిబలంబులం గనుం
గొని భయంబునం బఱచిన లోకవిరావణుండగు రావణున కెఱింగింప వాఁడును
జింతాభరితమానసుండై యుండె నంత రాఘవుండును నిజతరంగభంగనిస్స్వనితబ
ధిరీభూతకమలజాండం బగు మకరాలయంబుం గనుంగొని రక్తాంతలోచనుండై
సుమిత్రానందనున కిట్లనియె. 102

శా. రింఖత్తుంగతరంగుఁడై పటురవోద్రేకంబునన్ విద్విష
త్సంఘంబుల్ మదమంద భృత్యునిగతిన్ దన్మానసామోదియై
పుంఖీపించి మనుష్యమాత్రునిఁ గనన్ బుద్ధి న్విచారించి మ
త్సంఖ్యాటోప మెఱుంగ కొప్ప లవణాంభోరాశి వీక్షించితే 103

వ. మఱియును. 104

క. కోఁతుల నీతని లక్ష్యము, సేతువె యని నన్ను గడనసేయం డిదె ని
ర్ధూతజలాఢ్యునిఁ జేసి మ, హీతలమునభంగిఁ గపుల నిదె నడిపింతున్. 105

వ. అని పలికి క్రోధతామ్రాక్షుం డయి కరాగ్రంబున నిజకీర్తిధ్వజంబుభంగిఁ జెలు
వొందు బాణాసనంబు ధరియించి 106

## శ్రీరాముఁడు సముద్రునిపై బాణము సంధించుట.

మ. తుదిరేయిన్ జెలువొందు భాస్కరుగతిం దూణీరముం గుజ్జ్వల
ప్రదరం బొక్కటి దీసి కార్ముకమునం బల్వేఁక సంధించి దు
ర్మదపాథోధి హరింతుఁ జూడుఁ డిదె రామజ్యావినిర్ముక్తకాం
డదఘోరానలకీల లంచు భుజదండస్ఫూర్తి శోభిల్లఁగన్. 107

వ. నిలిచి ధనుష్టంకారంబు గావించి శరమోక్షణంబు సేయం గమకించుసమయంబున
సశైలవనకాననంబగు ధరాచక్రం బంతయు సంచలింపం దొడంగె నఖిలదిగ్భాగం
బుల సంధకారంబు బంధురం బయ్యె మకరాలయంబు సంక్షోభించుచు వేలాస్థలంబు
దప్పి యతిభయంబున యోజనమాత్రదూరంబు లోనికిం జనియె నందుఁ జెలు
వొందు నక్ర గ్రాహ పాఠీన కమఠ కర్కట కాకోదర ప్రముఖజలచరానీకంబులు
నిజజీవనశంకాంకితులయి పరువం దొడంగె, నంత సముద్రుండును దివ్యరూపధరుం
డయి దేహకాంతుల జగం బంతయు వెలింగింపుచుఁ దనయందుఁ జెలువొందు దివ్య
రత్నంబు లమ్మహామహునకు నుపాయనంబులు గాఁగఁ గరంబులం బట్టి చనుదెంచి.

తే. క్రోధతామ్రాక్షుఁ డగు నద్ధరాధినాథు, పదము సేవించి మ్రొక్కి యుపాయనంబు
లొసఁగి తత్పాదకంజము లసిమసింగి, భక్తితోడుతఁ బొగడ నుపక్రమించె. 109

సీ. కరుణఁ జూడు మమోఘశరశిలీముఖ! చరాచరనుపోషణ! ధరాధరగభీర!
జగములెల్ల సృజించుపగిది నీవే నన్ను సృజియించితివి జడాకృతిని నిట్లు
దేవనిర్మితస్వస్వభావ మెవ్వరు మాన్పఁగలరు స్థూలంబులై వెలయు పంచ
భూతంబులును జడంబులు స్వభావమున నీచే నొప్పి నీయాజ్ఞ సేయుచున్న
తే. తామసజడత్వములను భూతములు పుట్టు, నరయఁ గారణదేహానుసరణమునను
వెనుక పల్కిన విభూతివిసరములకుఁ, దామసత్వజడత్వముల్ రామచంద్ర!. 110

వ. దేవా నిర్గుణుండవు నిరాకారుండవు నెవ్వేళను మాయాగుణంబులవలన ననుకరించి లీలావిభూతి నొసరించెద వవ్వేళను విరాట్పురుషుండ వనం బరఁగుదువు నీదుసత్త్వగుణంబులవలన సత్త్వగుణప్రధానులగు కమలసంభవాదిప్రజాపతులు దమోగుణంబువలన దమఃప్రధానులగు భూతనాథాదిరుద్రులును నావిర్భవించిరి. మఱియు మాయాసంభిన్నుండవు లీలామానుషవిగ్రహుండవు విచారింప నిర్గుణుండవు నగు నిన్ను జడుండ నగు నే నెవ్విధంబున నెఱుంగ నోపుదు నదియునుం గాక. 111

ఆ. తగనిపశువులకును లగుడంబుగతి మూర్ఖ, నరుల కెల్ల దండనము ప్రసిద్ధ
మదియ యగును సత్పథావలోకనయుక్తుఁ, జేయు రామ! మేలు సేసి తిపుడు. 112

తే. శరణు జగదీశ! భక్తవత్సల! రమేశ!, దీనపోషణ! యభయప్రదాన మిమ్ము
మార్గ మొసఁగెద దశకంఠు మద మడంచి, జనకజాయు క్రమముగ నేఁగు దనుజహరణ!.

వ. అని యివ్విధమున వినుతించుసముద్రుం గనుంగొని కరుణాసముద్రుండగు రామభద్రుం డిట్లనియె. 114

ఉ. నాదుశరం బమోఘ మిఁక నాశ మొనర్చు ధనుర్వియుక్తమై
గా దడఁపంగ లోకములఁ గావునఁ జోటొక టింకఁ జూపు మం
చాదర మొప్పఁ బల్కఁగ ధరాధ్య! మరుత్తరభాగమందుఁ గ్ర
వ్యాదులు బాధసేయుదు రహర్నిశము ల్గడుఁ గ్రూరచిత్తులై. 115

వ. ఇయ్యమోఘసాయకం బప్పాపాత్ములపైఁ బఱపు మది మృగకుల్య యనుచోటనిన రామచంద్రుండును నటసేయ నయ్యంబకంబును నిమిషమాత్రంబున నాభీరమండలం బంతయు దగ్ధంబుచేసి సరిత్పతికి సుఖంబుఁ గరుణించి మగిడి తూణీరంబున నిలిచె నంత వాహినీవల్లభుండును మోదంబు నొంది రామచంద్రా! ధీమంతుండును నికార్యంబున సమర్థుండును లబ్ధవరుండును విశ్వకర్మతనయుండును నగు నలుని చేత మామకజలంబుల సేతుబంధనంబు సేయింపుము సకలలోకమలాపహంబును యోగిజనగేయంబును నగు నీకీర్తి యఖిలలోకంబులవార లెఱింగెదరు నిత్యంబై వర్ధిల్లెడు నని పునఃపునః ప్రణామంబు లాచరించి యంతర్హితుం డయ్యె నంత. 116

ఆ. సేతుబంధనంబు చెలఁగి శాఖామృగ, సైన్యములను గూడి సల్పఁ బనిచె
రామచంద్రవిభుఁడు రాజీవనేత్రుండు, విశ్వకర్మతనయు విపులవినయు. 117

వ. ఇట్లు పనిచినఁ దచ్ఛాసనంబు శిరంబున ధరియించి నలుండును. 118

మ. తరువుల్ శైలములున్ వనౌకసము లుత్సాహంబునం దేఁగఁ దా
నిరుహస్తంబుల వాని నందుకొని నీరేశున్ మదిన్ దల్చుచున్
వరుసం గూర్చి నలుండు గట్టెఁ ద్రిజగద్వంద్యంబుగా రామభూ
వరు తేజంబు వెలుంగ నయ్యుదధి భాస్వత్పర్వచంద్రాననా. 119

క. అనుచు రథాంగీకృతశశి, దినకరుఁ డగతనయతోడఁ దెలిపి వనాటుల్
వనరాశి గట్టుతెఱఁగె, ల్లను బల్కఁగఁ దొడఁగె రంగవిహితాపాంగా. 120

వ. ఎట్టు లనిన. 121

సీ. అమరఁ దదారంభసమయంబున సుమేరుఁ దరుణాబ్జధరుఁ బురాసురవిరోధి
నఘవిమోచనుఁ గాంచనాచలోగ్రశరాసు ఫాలనేత్రు నమేయశూలహస్తు
ధవళాంగు గరళకంధరు భూతిరుద్రాక్షమాలికాలంకృతమహితవక్షు
గంగాతరంగసంగస్నాతశీతహేళిసమధికరూపుభాస్వత్ప్రతాపు

తే. మేరుమందరకైలాసధారుణీధ, రేంద్రసువిహారు భూరిభోగీంద్రహారు
నార్తజనపోషు రామేశ్వరాఖ్యతోడ, నిలిపె రఘునాథుఁ డచ్చటఁ దలిరుఁబోఁడి

వ. ఇట్లు జగదీశ్వరుండగు రామేశ్వరు నచ్చట సంస్థాపనంబు సేసి పూజించి సకల
లోకహితార్థంబుగ శ్రీరామచంద్రుం డిట్లనియె. 123

ఆ సేతుబంధమునకుఁ జేతు లెత్తి నమస్కరించి పార్వతీశుఁ గాంచినట్టి
విప్రుఁడైన భూమివిభుఁడైన విట్శూద్రు, లైన ముక్తిఁ గాంతు రనుచు లగుదు.

వ. ఇది యుకాదు బ్రహ్మహత్యాదిమహాపాతకంబు లయినను విడంబడి మదనుగ్రహం
బున మోక్షంబు ప్రాపించు మఱియును. 125

శా. ఏమర్త్యుం డిట సేతుబంధనమునం దింపొందఁ దాఁ గ్రుంకి శ్రీ
రామేశుం జగదీశు ఫాలనయనున్ రంజిల్ల సేవించి హ
త్యాకామంబు ల్ఫలియింప నిష్ఠఁ దగుచుం గళ్యాణసంధాయియౌ
శ్రీమందాకినిఁ జెల్వమీఱు వరకాశీపట్టణం బేంతయున్ 126

వ. కనుంగొను కౌతుకంబున. 227

మ చని గంగానదిఁ గాంచి తజ్జలములన్ సద్భక్తితోఁ గొంచు నే
డ్కను రామేశ్వరపుణ్యమూర్తి కభిషేకం బింపుఁగాఁ జేసి య
వ్వనధిం భారము డించి బ్రహ్మమున భాస్వత్పుణ్యసాలుఁడై
యొనయున్ మానవసత్తముండు నిజమా నీయర్థము ల్భాస్థలిన్. 128

వ. అని యివ్విధంబున భవతారకవాక్యంబు పల్కి యంత. 129

సీ. ప్రథమవాసరమునఁ బదునాల్గుయోజనంబులును రెండవదినంబున నిరువది
యోజనంబులు నిర్వదొక్కటి మూఁడవదినము రెండును నిర్వదియును నాలు
గవదినంబున మూఁడుఁ గడఁక నిర్వదియును నైదవదివసంబునందు నిట్లు
జలరాశి బంధించె నలుఁడు యోజనశతంబుగ శైలభూమిజంబులను బూని

తే సంతసించిరి ఋషులెల్ల సకలదివిజు, లింతకార్యంబు సేయువా రెవ్వ రనుచు
విరులవానలు గురిసి రవ్వేళ వేడ్క, పడుచుఁ గౌసల్యముద్దులపట్టిపైని 130

వ. ఇవ్విధంబున శతయోజనవిస్తీర్ణంబగు పారావారంబు నైదుదివసంబుల నలుండు
బంధించె నంత నతిరభసంబున రాఘవుండును లక్ష్మణుండును వాయునందన వాలినం
దనుల స్కంధారోహణంబు చేసి సేనామధ్యంబున నిలచి యాత్మసైన్యంబులు
నిశాచరఖేచరభీకరసౌఖ్యాకరంబులై చెలువొందు రెండవసముద్రంబుభంగి నడ
పింపం దొడంగిరి వారును భుజాస్ఫాలనలాంగూలచాలనసింహనాదంబులును నగు
తమతమజాతిచేష్టితంబుల దాశరథుల మనంబులు పల్లవింప నడువం దొడంగి రిట్లు.

తే. కలితపాఠీనవిషధరగ్రాహకమఠ, నక్రమగు దక్షిణాబ్ధి నతిక్రమించి
చని సువేలాచలంబుపై సకలకీశ, సముదయంబులు విడిచి రాసమయమునను. 132

వ. ఇట్లు ససైన్యంబుగ వేలాచలారోహణంబుచేసి రాఘవుండు 133

సీ. కమనీయనవరత్నఖచితంబులై మేరుభూధరంబులఁ బోలు సౌధములను
వసిచర్మపాణులై గసిమసంగు నిశాటకోటు లింపగునట్టి గోపురముల
హరినీలరుచులఁ జెన్నగు పతాకంబుల తోరణంబుల నొప్పు ద్వారములును
భర్మనిర్మితలసత్ప్రాకారముల నగాధంబులై తగు నగడ్తలను మఱియు

తే. నమరభయదంబులైనట్టి యంత్రములను, జటలు సెప్పెడు బ్రహ్మరాక్షసులవలన
వ్యోమమున నల్లికొను హోమధూమములను, రహిఁ జెలంగెడులంకాపురంబుఁ గనిరి.

వ మఱియు నాగమయంబున దశాసనుండును దనదు దశకిరీటంబులు దీప్తిమంతం
బులై వెలుంగ మహావీరులగు ప్రహస్తప్రముఖమంత్రిసత్తము లుభయపార్శ్వంబులం
బలసి కొలువ నీలాద్రిశిఖరాకారుండును గాలమేఘసమప్రభుండును నై రత్నదం
డసితఛత్రంబులు భృత్యవర్గంబులు పట్ట దేవతావల్లభువెన్నుఁదన్ను వైభవంబునఁ
బ్లవంగచమూవిభవంబుఁ గనుంగొను వేడ్క నొక్కవిశాలంబగు సౌధాగ్రంబుపై
నిలిచి కనుంగొనుచుండె నప్పుడు. 135

క. కడు భయమున రాఘవుచే, విడువఁగఁబడి వచ్చు శుకుని వీక్షించి శుకా!
తడవేమి ప్రహారణంబులఁ, బడితే యని నవ్వ శుకుఁడు పల్కె మృగాక్షీ!. 136

మ. అసురేంద్రా! లవణాబ్ధి కింపగు సుదక్షప్రాంతంబునం దే విహా
యసమార్గంబున నిల్చి నీవనిన వాక్యంబుల్ వచింప న్వనౌ
కసు లుద్యద్గతి నన్నుఁ బట్టికొని మ్రగ్గన్ మొత్తె రామా! యటం
చును భీతిన్ మొఱవెట్టినం గృపను దత్పూర్వార్యాన్వయాధీశుఁడున్. 137

## రావణునకు శుకుండు వానరులబలంబు లెఱింగించుట.

క. కనుఁగొని వీనిన్ విడువుఁడు, చన దిటు సేయంగ ననిన జనపతివాక్యం
బున నన్ను విడిచి రేనును, గనుఁగొంటి నిశాచరేంద్ర! కపికులబలమున్. 138

వ. వానరులకు మనకుం జూడ సురాసురులభంగి బలంబులు దోఁచుచున్న యవి సఖ్యంబు
గా నేరదు దాశరథులును నిజభుజాసారంబు చూపుటకు సమయంబు చేకూరె ననుచు
నాసంభ్రమంబున నున్నవార లింక మనపట్టణం బంతయు నాక్రమింపంగలరు. నీవును
బుద్ధిమంతుండవేని తత్కాంతారత్నంబు నొసంగుట యొండె నిజసేనాయుక్తుం
డవై యాహవంబునకుఁ గడంగుట యొండె నొక్కకార్యంబు వేగంబ సేయు
మింక రాఘవుండు తనదువాక్యంబులు గాఁగ నీకెఱింగింపు మనిన తెఱంగు వినుము.

క. ఎవనిబలంబున నలనాఁ, డవనిజఁ గొనిచనెనొ తద్బలాఢ్యత యిఁక నా
హవమునను జూపు మనుమా, యవమతి! నీకులముఁ జెఱచు ననుమిఁక మఱియున్.

క. రేపటిదినము ప్లవంగచ, మూపతులను విడిచి నీదుమూకల నుతులన్
గోపురముల స్త్రీపురుషుల, మాపించెద ననుచుఁ బలుకు మాపలుకుక్రియన్. 141

క. మఱియును సప్తాహమునను, శరముఁ దొడిగి యేసి నీదుసకలబలంబు
న్వరిమార్చెద నను మిఁక మ, చ్ఛర మాఁపఁగఁ జాల రనుము శక్రాదు లిలన్. 142

వ. అని యివ్విధంబునం బలికి తానును సుగ్రీవవిభీషణులును లక్ష్మణుండును నొక్కర
హస్యప్రదేశంబునకుం జని యాలోచింపం దొడంగి రింకఁ బంక్తికంధరా! మన
బలం బంతయు నుక్కడంప సమర్థులయుండు నొక్కండ చాలు నక్కడివనౌకస
వర్గంబులం గనుంగొనినఁ ద్రికూటశిఖరంబు లంకానగరంబుతోడఁ బెఱికి యియ్య
కూపారమధ్యంబునం బడవైచెద ననుచు నుక్కుమిగిలి శౌర్యంబునకుఁ గాలు
ద్రవ్వుచు నున్నవారలు వారలబలం బంతయు నన్నుం బట్టి ముష్టిప్రహారంబులం
బొడుచునప్పు డెఱింగితి నివ్వాక్యంబుల నెల్ల నమ్ముకుండెదవేని గనుంగొను
మల్లదే పర్వతోపమానశరీరులై భూనభోంతరాళంబులు చెవుడుపడం జెలువొందు
ఋక్షవానరచమూనిచయంబు లింక వారలం గణుతింప సామర్థ్యంబు చాల దైనను
ముఖ్యయూథాధిపతుల నెఱింగించెద. 143

సీ. లక్షసేనలు గొల్వ లంకాభిముఖుఁడునై యార్చువాఁ డదె నీలుఁ డగ్నిసుతుఁడు
వాలంబుఁ జఱచి దోస్స్ఫాలనం బొనరించువాఁడె వాలిసుతుం డవార్యబలుఁడు
పండ్లు గీటుచు వాఁడె పావని నీపుత్త్రిఁ దునిమి భూసుతఁ గాంచి చనినఘనుఁడు
యినజుఁ గన్గొని మఱియేఁగువాఁ డదె శరభుఁ డతిబలాఢ్యుఁడు రజతాద్రిసముఁడు
తే. కోటియూథపులనుగొల్చు మేటిమగఁడు, శరభుఁడతిసాహసుఁడు శైలచరుఁ డుపనసుఁ
డురుపడించుచు నొకరికి నొకరుతోడు, పలుకు క్రియ నొప్పెదరుకీశబలముఁగంటె.
వ. మఱియును. 145

క. వారలు మైందద్వివిదులు, వారలకుఁ బిఱుంద ప్రేలువడి గఱచుచు ని
ట్టూరుపువుచ్చెడువాఁ డతి, ఘోరాస్యుఁడు నలుఁడు చీరికిం గొనఁ డొరులన్.
క. ఈతఁడు బంధించె జగ, త్ఖ్యాతిగఁ బాథోధి వీరి గణుతి యొలర్పన్
ధాతకు శక్యముగాదు బ, లాతిశయు ల్వీరి సాఁప నగునే మనకున్. 147
తే. వీర లందఱు పటుతరవిక్రములును, సతతయుద్ధాభికాంక్షులు సాహసులును
రాక్షసులతోడ లంకాపురంబు నేల, రాచెద మటంచు నున్నవారలు సురారి. 148
వ. ప్రత్యేకంబ వీరలబలంబు లెక్కింగించెద నిరువదియొక్క బృందశతంబులును నన్నియ శంఖసహస్రంబులు నొక్క కోటియు నిరువదియొక్కసహస్రంబులును నగు వీరులు సుగ్రీవునకు పరమమిత్రులును ముఖ్యయూథాధిపులును నది యట్లుండనిమ్ము.

## శుకసారణులు శ్రీరామునిమాహాత్మ్యము రావణునకుఁ జెప్పుట.

సీ. ఆదినారాయణుం డఖిలేశ్వరుఁడు రాముఁ డవ్యయుండగు మనుజుఁడే యసురవర్య!
సీత సాక్షాజ్జగద్ధాత్రిఁడో రఘునాథు చిచ్ఛక్తి జగదాత్మ చిత్స్వరూప
స్థావరజంగమాత్మకమైన జగ మెల్లఁ బ్రభవించు వారిలోపలన మఱియుఁ
దలిదండ్రు లఖిలభూతముల కిం కిటువంటివారితోడను నీకు వైర మేలఁ
తే. బరఁగ నీదేహమును త్రిగుణభంగురంబు, పంచభూతాత్మకంబును బంచవింశ
తియునుదత్త్వంబులననొప్పుఁ దెలియ మాంస, మూత్రదుర్గంధములకెల్ల మూలతలము.
వ. మఱియు నహంకృతికి నాలయంబును జడాత్మకంబును నగు దేహంబువలన విలక్షణుండవగు నీకు మమకారం బేటికి? ఈదేహంబుకొఱకు బ్రహ్మహత్యాదిమహాపాతకంబు లెల్ల నొనరించి భోగంబు లనుభవింపం దలంచెద వాదేహం బవశ్యంబును నశియించు. జీవునికిఁ బుణ్యపాపంబులవలన సుఖదుఃఖాదికారణంబులు గలుగుచుండు నాత్మయు దేహయోగాదులవలన సర్వంబు నొనరించుచుండు నెంతతడ నహంకృతివలన నవశుండై దేహంబును కర్తయును భోక్తయును నేన యని తలంచు నెంతతడవును జన్మనాశాదిసంభవంబగు నధ్యాసనిరంతరంబై యుండు నాలి

వినిర్మలుండును శుద్ధుండును విజ్ఞానాత్మకుండును నచలుండును నవ్యయుండును
నగు నింకఁ దనదైనయజ్ఞానవశంబున బంధంబులం జెందుచు విడుపంబడుచు నుండు
నదికారణంబున నీవును విశుద్ధమానసుండవై దేహాదులయం దభిమానంబు విడచి
పరమాత్మ వెలుంగుచుఁ బుత్త్రదారగృహాదులయందు విరక్తుండవు గమ్ము భోగంబు
లన నిరయప్రాంతంబులగు జీవులకును శునకసూకరంబులపోలిక ననిముక్తంబులై
గలుగుచుండు నదియునుం గాక. 151

సీ. జనియించితివి పద్మసంభవాన్వయమందు బ్రాహ్మణుండవు వేదపారగుఁడవు
పొలసిన భారతవర్షమును నందు దుర్లభంబగు కర్మభూమియు సత్ఫలద
మిన్నిగల్గియు భూమి సెవఁడు విద్వాంసుఁ డిట్లాత్మసాక్షాత్కార మమరి మేను
భోగానువశముగాఁ బోవనిచ్చును బామరుఁడవైన నీ వొక్కరుఁడవు దక్క
గీ. యొరకనైనను నిక్కాంత లెల్ల మాని, భక్తితో నంత శ్రీరామభద్రు నిత్యు
ధీరుఁ బరమాత్ముఁ గాంచి తద్దేవియైన, జనకజ నొసంగి సౌఖ్యంబు గనుము దనుజ!.

ఆ. ఇటు లొసంగి యమ్మహీశుభక్తులఁ గూడి, యుండు మిట్లు నీవు నుండెదేని
విష్ణులోకమునకు విమలస్వరూపివై, చనియెదవు మహాఘచయముఁ బాసి. 153
వ. కాదేని యపునరావృత్తివర్జితంబులగు నధోలోకంబుల నొందెదవు కావున నేను
బల్కెడుహితవాక్యంబు లన్నియు నంగీకరించి. 154
చ. హరిపదభక్తిగల్గు సుగుణాత్ముఁతోడను మైత్రి సల్పు భా
స్కరకులభూషణుం గలితకార్ముకసాయకు సౌఖ్యదాయకుం
గురుతరవిక్రముం మరకతోపలకాంతిసుకాంతుఁ ద్వత్సహో
దరనిజసోదరార్కజసదాశ్రితు రాఘవుఁ జెందు రావణా!. 155
వ. ఇట్లు. 156
క. ఫణికుండలుఁ డబ్జభవో, మణిపాలితపహనయనుఁ డాహిమాలయకన్యా
మణి కెలఁకఁ బల్కె శుకరా, వణసంభాషణము మదియుఁ బల్కఁ దొడంగెన్.
చ. అని యిటు లాశుకుండు వివిధాజ్ఞత లెల్లను బాసి ప్రాజ్ఞతన్
గనెడు హితోక్తులం బలుకఁ గాలభుజంగముభంగి రోష మిం
పెనయఁగ వానిఁ జూచి కులహీన జగత్త్రయశాసనున్ రిపు
ఘ్నుని నను శిక్ష సేయుమనె కోవిదుభంగి రిపుల్ నుతింపఁగన్. 158
క. నను నిప్పుడ గ్రుంచెద నై, నను నుపకారంబు మున్నొనర్చితి పటు గా
వున బ్రతుకు మంతె యింకిటఁ, జన దుండఁగఁ జనుము విసఁగఁజాల దురుక్తుల్.
క. అని పల్కిన భీతిల్లుచుఁ, జనియె శుకుం డపుడు తనదుసదనంబున కో

వనితా! యని పల్కఁగ విభుఁ, గనుఁగొని గిరికన్య యనియెఁ గాంచనవసనా!.

వ. దేవా! నిశాచరుం డయ్యును శుకుండు విజ్ఞానవంతుం డగుట కేమి హేతువు నాయందుం గృప గలదేని వీని పూర్వవృత్తాంతం బెఱింగింపు మనిన సంతసంబు నొంది నిజవల్లభకు బ్రమథవల్లభుం డిట్లనియె. 161

ఆ. వినుము శుకునిదైన వృత్తాంత మంతయుఁ, వీఁడు ద్విజుఁడు తత్త్వవిదుఁడు ఘనుఁడు
వనమునందు నిలిచి దనర వానప్రస్థ, నియతితో స్వకర్మనిరతుఁ డగుచు. 162

వ. ఇట్లు పూర్వంబున బ్రహ్మనిష్ఠుండు బ్రహ్మవిత్తముండై వనంబున నియోగింపుచు దేవహితార్థంబును దనుజవినాశార్థంబును నవిచ్ఛిన్నంబుగాఁగ నొక్కసవనంబు సలుపం దొడంగి నంత నవ్విధం బంతయు నెఱింగి వజ్రదంష్ట్రుండను నొక్క నిశాచరుండు నిజనాశకరంబు గావున దానికి విఘ్నంబు సేయం దలంచి యవహితుం డయ్యె నొక్కనాఁడు. 163

చ. వినుతతపోధనుండు జనవిశ్రుతమూర్తి యగస్త్యమౌని య
వ్వనమున కేఁగుదెంచి యభివందితుఁడై శుకుచేత భోజనం
బునకు నిమంత్రితుం డగుచుఁ బోయి జలంబులఁ గ్రుంకుచుండ న
ద్దనుజుఁడు నా కుపాయమిది దాకొనె నంచు నగస్త్యవేషియై. 164

వ. చనుదెంచి శుకుం గనుంగొని. 165

ఆ. అశన మెసఁగదేని యామిషంబును నాకుఁ, దెచ్చిపెట్టి తడవు దినము లయ్యె
రసయుక్తమైన ఛాగాంగసంభవం, బనుభవించి యనుచు నరిగె మఱియు. 166

వ. శుకుండును నవ్విధంబ యొనరించె నంతఁ గుంభసంభవుండు కృతస్నానుండై జలంబులు వెడలి చనుదెంచి భోజనంబునకుఁ గూర్చున్న సమయంబున. 167

ఆ. శుకునిభార్యభంగి సుందరీరూపుఁడై, దానవుండు మేనుఁ బూని మాని
మానమాయఁ బన్ని మానుషామిష మప్పు, డొసఁగి చనియె వనరుహోజ్జ్వలాక్షి!.

వ. ఇట్లు సుపక్వంబును బహువిస్తరంబును నగు నరామిషంబు గనుంగొని నిఖిలజాగరూకశ్రేష్ఠుండగు నగస్త్యమునీంద్రుండు కోపసంభరితమానసుండై యరుణంబులగు నేత్రంబులఁ గనుంగొనుచు నోరి! విప్రాధమా! యిట్లు సేయుపాపాత్ములు గలరే యది గావున నిబ్భంగిఁ గుటిలవర్తనుండవై నరామిషం బొసంగితివి గావున నీవును నరామిషాహారుండవై రాక్షసరూపంబునఁ జరియింపు మనుచు నతిఘోరం బగు శాపం బొసంగె నంత శుకుండును భీతచిత్తుండై కరంబులు మొగిడ్చి. 169

తే. దేవ! మీ రానతిచ్చిన తెఱఁగు నే నొ, సంగితినిగాని యితరంబు సల్ప నాకు
శాప మేటికి ననఁ గొంతసేపు ధ్యాన, మాశ్రయించి తదాసురం బంతఁ దెలిసి. 170

వ. శుకుం గనుంగొని యిట్లనియె 171

క. నీ వొనరింప నకృత్యము, భావించితి నైన నాదుపలుకు లమోఘం
బీవును నెవ్వేళ జగ, ద్రావణు రావణువధింప రఘునాయకుఁడై. 172

వ. భక్తపరాయణుం డగు నారాయణుండు భానువంశంబున. 173

క. జనియించి దనుజసైన్యము, లను ద్రుంప మహోగ్రభంగి లంకాపురిపైఁ
జనుదెంచు నంతవట్టును, దనుజాకృతి నిలువు మంత దైవముకృపచేన్. 174

వ దశాననప్రేరితుండవై రఘునందనుం గనుంగొని యమ్మహాత్ముదర్శనంబున ముక్తశాపుండవై పక్షికంధరునకుఁ దత్త్వజ్ఞానంబు నుపదేశించి పరమయోగిగమ్యంబగు నారాయణస్థానంబు నొందెద వనుచుఁ గరుణార్ద్రహృదయుండగు కుంభసంభవుం డానతిచ్చి తిరోహితుం డయ్యె. శుకుండును రాక్షసరూపధరుండై దశానను ననుసరించియుండె నేఁడును నిర్మలవచనుండగు నగస్త్యవాక్యంబులభంగి సలక్షణుండగు లక్ష్మణాగ్రజుం గనుంగొని రావణాసురునకుఁ దత్త్వజ్ఞానంబు నెఱింగించి భూసురుండై వైఖానసవర్గంబులం గూడి నారాయణభక్తిపరాయణుండై చరియింపుచుండె. శైలనందనా! విజ్ఞానసంపన్నుండగు శుకుని వృత్తాంతం బిది యింక నావలికథాక్రమం బెఱింగించెద. 175

## మాల్యవంతుండు రావణునికి నీతి సెప్పుట

మ. శుకుఁ డిట్లేఁగిన మాల్యవంతుఁ డతిసంశుద్ధుండు మాతామహుం
డకలంకస్థితిఁ జెంది రావణ! భవద్వ్యాపారముల్ క్రూరముల్
స్వకులం బెల్ల నశింపఁ గాలమిపు డాసన్నించె నింకైన మ
ల్లికఁ గావింపవు మానసం బొరులయాలిన్ దేఱ సత్క్రియే. 176

వ. ఏను నీకు మేలు దలంచెదఁ గావున నొక్కవాక్యంబుఁ బల్కెద నెట్లనిన. 177

సీ. ధరణిజ యిచట పాదము పెట్టినది మొదల్ దుర్నిమిత్తము లెల్లఁ దోఁచుచుండు
నన్నంబు మొలచు నిత్యంబు మేఘావళుల్ రుధిరంబుఁ గురియు దుర్వ్యథలు ఘనము
పురమెల్ల నుడుకు నెప్పుడు దేవలింగము ల్బొరియించుఁ గన్నుల జలము నిండఁ
బచ్చనిపండ్లతోఁ బకపక యని నవ్వు కాళికాదేవి చుక్కలును డుల్లు

తే గార్దభంబుల గోవులఁ గాంచు మఱియు, ముంగులును గాచు నెల్లెడ మూషికముల
గుడ్లగూబలు నక్కలుఁ గూయుఁ బగలు, మనపురంబునఁ జెలరేఁగి దనుజవర్య!.

వ. ఇదియుఁ గాక కరాళవదనుండును ముండితుండును కృష్ణపీతాంబరుండును నై యంతకుండు దైత్యాలయంబుల నర్ధరాత్రంబున సంచరించు నివ్విధంబున భవన్నాశనకరంబులైన దుర్నిమిత్తంబు లనేకంబులు దోఁచుచున్నయవి గావున జనకరాజనం

దనను సధనంబుగాఁగ జగదీశ్వరుండగు రాఘవేశ్వరునకు సమర్పించి కులంబును
ప్రాణంబును రక్షించుకొనుము. రామచంద్రుండు నారాయణుం డని యెఱుంగుము
విద్వేషబుద్ధిఁ దలంపకు మెట్లంటేని. 179

చ. అనుదిన మిమ్మహాత్ము సుగుణాఢ్యు విదేహసుతామనోహరున్
వినుతచరిత్రు సజ్జనులు వేడుకతోడఁ దదంఘ్రియుగ్మముల్
ఘనమగు నిబ్భవాబ్ధితుదిఁ గాంచఁగఁ గాంతురొ తద్విధంబునన్
దనుజవరేణ్య! రాఘవుఁడు తామరసాక్షుఁడు మానవుం డిలన్. 180

ఆ. అట్టిరామచంద్రుఁ డఖిలప్రాణులకు, భక్తిభావనమున భజనసేయ
నీ వొనర్చినట్టి నిఖిలదుష్కార్యముల్, తొలఁగు భక్తివలనఁ గలుగు శుభము 181

వ. అని యివ్విధంబున నీతిమంతుండగు మాల్యవంతుండు. 182

క. కులకాలహేతువులుగఁ, బలుకఁగ దనరైన కాలపక్వముఁ దెలియన్
బలికెడుక్రియ సాగ్రహుఁడై, పలికె దశాననుఁడు వికచపద్మదళాక్షీ!. 183

వ. అది యెట్టు లనిన. 184

చ. కృపణు మునిప్రియున్ మనుజుఁ గీశకులాశ్రయు రామచంద్రు ని
క్కపుదొరగాఁగఁ బల్కెదవు కన్గొన సంతసమర్థుఁడేని తం
డ్రిపనుప నేల వచ్చు బెదరించెద వాతనిబంటుభంగి దు
ర్నిపుణత యింక మాను నిను వృద్ధని సైచితిఁ జంపఁ జాలకన్. 185

తే. నీదువాక్యంబులెల్లను నే సహింపఁ, జాలఁ జను మింక నిలువంగఁ బోల దనినఁ
జనియె దశకంధరుం డంత సకలయాతు, ధానవర్గంబులును గొల్వఁ దనరుచుండె.

వ. ఇట్లు సౌధాగ్రంబున నిలిచి వనచరసైన్యంబు లెల్లం గనుంగొనుచు నాహవంబునకు
నిజసైన్యంబుల నాయితంబు గండని నియోగింపుచుండె నంత నవ్విధం బంతయుఁ
గనుంగొని. 187

## శ్రీరాముఁడు రావణునికిరీటంబుల శరంబుచే బడవైచుట

మ. వరకోదండము కేలఁ బూని యనుమత్ప్రాంతంబు భీతిల్ల భా
స్కరవంశాగ్రణి యర్ధచంద్రశర ముగ్రం బొప్పఁగా నేసెఁ ద
ద్వరగాంగేయమహేంద్రనీలముఖభాస్వద్భూరికోటీరమం
డలశైలాభకిరీటపంక్తి దుమురై ధాత్రిస్థలిన్ గూలఁగన్. 188

వ. ఇవ్విధంబున దశానను దశకిరీటంబులు నొక్కసాయకంబున నేలంబడనేసిన నతిభ
యప్రదంబగు తత్కార్యంబునకు సురానీకంబు లెల్ల విస్మయంబు నొందిరి యఖిల
వానరులునుసతిసంభ్రమంబున వాలంబు లెత్తుకొని గంతులు వైచుచు గర్జనంబులు

సేయుచు రామలక్ష్మణులును దత్పాలితబలుం డగు మార్తాండనందనుండును జయంబు నొందెదరు గావుత మనుచుఁ బలుకం దొడంగి రంత రఘునాథుశాసనంబున నాంజనేయాంగదకుముదనలజాంబవంతదధివక్త్రతారకేసరిప్రముఖయూథాధిపతులును దక్కిన సైన్యంబులును బ్రహ్మాండకటాహంబు చిటిలిపడం బలుసింహనాదంబులు సేయుచు దండధరకింకరప్రతిమానదోహాచరభటసేవ్యంబగు లంకానగరంబు చతుర్ద్వారంబులు నిరోధించి శైలపాదపంబులను వజ్రాయుధతుల్యంబులగు నఖదంష్ట్రాయుధంబులను నడ్డంబైన నిశాచరవ్యూహంబుల నొండొరు దలఁపక యంతకప్రతిమానులై గీటడంగింపం దొడంగి రాసమయంబున నచ్చటి యాతుధానులును బ్రళయకాలవలాహకవర్గంబుభంగి భైరవారావంబులు చెలఁగఁ గుఠారశూలభిండివాలఖడ్గప్రముఖాయుధంబులు కరంబులం బట్టి తత్పురద్వారంబు వెలువడి ప్లవంగసైన్యంబులం దలపడి.

మ. గదలన్ వైచుచు భిండివాలముల దోర్గర్వంబుఁ దూలించుచున్
బ్రదరౌఘంబుల మేను దూరి చన నుద్యత్సింహనాదంబులన్
జెదరై పాఱఁగ నేసి యార్చుచు నవిచ్ఛిన్నంబు గాఁ బోరి ర
న్నదదోహాటభటాలివానరచమూమధ్యంబునం బార్వతీ!। 190

వ. ఇట్లు నిశాటులు విజృంభించిన. 191

తే. వారు లేసిన క్రూరాస్త్రవర్గమెల్ల, ఘోరశైలంబులను నొడ్డుకొనుచు వృక్ష
ముష్టిఘాతంబులను దైత్యమూక లెల్ల, బెంచుపడఁజేసి రక్కసు లీభమగరిమ. 192

చ. మఱియును ఘోటకంబులను మానక ఘోటకపంక్తిచేతఁ దు
త్తుఱుముగఁ జేసి కాల్బలముతోఁ డుతిఁ గాల్బలపంక్తి బిట్టుగాఁ
జఱచి జరైషణంబులఁ బ్రచండపరాక్రమ మొప్పఁ బోరి ర
త్తరుచరవీరు లాసురులఁ దాఁకి తుషారమహీధరాత్మజా!। 193

వ. ఇట్లు నిశాచరవనచరవ్యూహంబు లన్యోన్యజయాభిలాషులై యాయుద్ధంబు లెల్ల భగ్నంబు లయినను పిరుతివియక మల్లయుద్ధంబునకుం దలపడి పోరం దొడంగి రయ్యాహవంబు వైమానికసిద్ధనిచయంబులకు విస్మయావహంబై మాంసశోణితపంకసంకులధరాతలంబై యొప్పె నాసమయంబున నారాయణస్వరూపుండగు రఘునాయకు విమలవీక్షణంబున దివిజాంశసంభవులు గావున వానరసైన్యంబు లెల్ల నమృతంబుఁ ద్రావెడుభంగి మహాసత్త్వసంపన్నులై విక్రమించిరి. యాతుధానులును జనకజాహరణపాశబద్ధుండగు రావణుచేతఁ బరిపాలితులు గావున దైన్యంబు నొంది విగతసత్త్వులై మ్రగ్గం దొడంగి రిట్లు నిముసమాత్రంబున జతుర్థాంశంబగు రాక్షససైన్యం బెల్ల నశియించె నాసమయంబున. 194

చ. తనబల ముక్కడంగుటయుఁ దద్దయు వానరసేన లుబ్బుట
ల్గనుఁగొని మేఘనాదుఁ డురుకార్ముక మెక్కిడి యాకసంబునన్
తన కజుఁ డిచ్చినట్టి వరదత్తపుచేత నదృశ్యదేహుఁడై
తునుమఁగఁజొచ్చె వానరులఁ దోయజపత్త్రవిశాలలోచనా! 195

వ. ఇట్లు ధారాధరమండలమధ్యవర్తియై బ్రహ్మాస్త్రప్రముఖదివ్యాస్త్రంబులు నిగుడించుచు నప్రతిహతప్రతాపంబునఁ జరియించు మేఘనాదుం గనుంగొని కొంతసైఁచి యంతయుం బోక సైన్యంబుల దైన్యంబు నొందింపం దొడంగె నాసమయంబున.

చ. వినుతమహాస్త్రకోవిదుఁడు వీరశిఖామణి రాఘవుం డత
ద్వనచరసైన్యము ల్వగుట వానిఁ దలంగుటఁ జూచి తమ్మునిన్
గనుఁగొని లక్ష్మణా! యదిరొ కార్ముక మిప్పుడు తెమ్ము దానవుం
దునిమి మదీయసైన్యములు దోఁగినభీతి నడంచి ప్రోచెదన్. 197

క. అని యివ్విధమునఁ బలికెడు, మనుజోత్తము వాక్య మపుడు మదిఁ దెలిసి భయం
బునఁ బాటి లంకఁ జొచ్చెను, దనుజాధముఁ డదియుఁ గాక తరమే నిలువన్. 198

తే. అంతఁ దనసైన్య మంతయు నడఁగుటకును, జింత నొందుచు నారాజశేఖరుండు
పవననందనుఁ గాంచి రౌద్రమూర్తి, నీక తగు నాదుకార్యంబు నిర్వహింప.

ఉ. కావున దుగ్ధసాగరముఖంబున ద్రోణగిరీంద్రమందు సం
జీవి వెలుంగుఁ గానఁ గపిశేఖర తద్గిరిఁ దెచ్చి వేగ సం
జీవితులన్ బొనర్చు మనసేనల నీదగుకీర్తి శాశ్వతం
బై వెలయుం దివాకరసుధాకరు లుండెడునంతకాలమున్. 200

క. అని యిటుపలికిన వాయుజుఁ, డనఘ! భవత్కార్యమునకు నాదట గలదే
యని పాదములకు వందన, మొనరించి ఖగేంద్రుభంగి నురుతరజవుఁడై. 201

వ. విహాయసమార్గంబునఁ గెగసి రెండవపవమానుచందంబున మహావేగిరై యపారంబగు పారావారంబు దాఁటి నిఖిలమహీధరవనంబులం గనుంగొనుచు మహోత్తుంగంబగు ద్రోణాచలంబుఁ గనుంగొని యౌషధం బొసంగకున్న మహాహితుల్యంబగు తనదువాలంబునం జుట్టి శిరంబున నిడుకొని. 202

తే. మరల యతివేగమున వచ్చి గిరిచరాళి, నెల్ల బ్రతికించి తద్భూధరేంద్ర మపుడు
తొంటిచందంబునను వైచి తోన వచ్చె, వాయునందనునటువంటివారు గలరె.

ఆ. అంతఁ దొంటిభంగి నగచరానీకము, ల్బొలఁగి గర్జనములు సేయ నవియు
విని దశాననుండు విస్మయస్వాంతుఁ డై, యిట్టు లనుచుఁ బలికె బిట్టుదూలి. 204

సీ. బలశాత్రవుఁడు నాకుఁ బ్రాప్తమయ్యెను రాముఁ దద్దేవనిర్మితుం డగుచు నేఁడు
వరనిఁ ద్రుంపఁగ నేఁగుఁడఖిలబాంధవులును బ్రియకాంతులగు వారునయముతోడ

నిటుగాక నిలుచు నేఁ డెవఁడు మచ్ఛాసనంబును దాఁటి ప్రాణభీతిని దలంగి
వానికండలు గోసి వైతుఁ బక్షుల కంచుఁ బలుక దానవు లెల్ల భయము నొంది
తే. యితనిచేతను మృతిఁబొంద నేమిఫలము, గల దటంచును సంగరకౌతుకమున
ధరణి వడఁకంగ దుర్నిమిత్తములు గాంచి, సరకుగొనకయ వెడలిరి చంద్రవదన.

## అతికాయప్రముఖుల యుద్ధము

వ. ఇవ్విధంబున నికుంభ దేవాంతక నరాంతక ప్రహస్త సుహోదర మహాపార్శ్వాతి
కాయ ప్రముఖదోషాచరవీరులు శతసహస్రసంఖ్యలు గలసైన్యంబులు తమ్ము బలసి
కొలువ ధరాధరసన్నిభంబులగు రథంబుల నెక్కి వివిధాయుధంబులను గరంబులం
బట్టి భూనభోంతరాళంబు లదర సింహనాదంబులు సేయుచుఁ బ్లవంగసైన్యం
బులం దలపడి ముసలండి భిండివాల పరశు పట్టిస ఖడ్గ ప్రాసాదిముఖ్యసాధనంబులు
పయిం బఱపి కంతి వారును బిఱుతివియక విశాలంబులగు సాలంబులను బొడిచియు
నడచియు నిముసమాత్రంబున నిశాచరమండలం బంతయు బెండువడం జేసి రందు.
క. కొందఱు రాఘవుచేతను, గొందఱు లక్ష్మణునిచేత గొందఱు నలుచేఁ
గొందఱు భానుజుచేతను, జెందిరి దానవులు జమునిసేవకు సఖియా!. 207
వ. ఆసమయంబున. 208
తే. తనదు బాంధవు లని బుద్ధిఁ దలఁపఁబోక, దునుమఁ దొడఁగె విభీషణుండునుమహోగ్ర
తరగదాహస్తుఁ డగుచు సద్దనుజభటుల, నహహ సద్భక్తి యన నిట్టు లమరవలదె.
వ. ఇవ్విధంబునఁ దక్కిన నిశాటసైన్యంబుల నెల్లను నాంజనేయాంగద ప్రముఖవలీ
ముఖసత్తములు మక్కడంచి రిట్లు. 210
క. వనచరు లెల్లను రాఘవు, ఘనబలమున వెలసి రెలమిఁ గావున లేకు
న్నను దేవతాళికైనను, వనితా! యిటువంటిబలము వలసినఁ గలదే. 211
ఆ. సర్వమయుఁడు నయ్యు సర్వేశ్వరుఁడు నయ్యు, ధాత యయ్యు జనవిడంబనార్థ
మమర నిట్లు సచ్చిదానంద డయ్యును, గదనమనుచు మాయ నొదవె తరుణి!.
వ. అనుచు నవ్వాలివృత్తాంతంబు భవానీసతిం గనుగొని యభవుం డిట్లనియె నంత
లంకానగరంబున రావణుండు. 213
చ. కదనతలంబునందు నతికాయముఖాత్మజమూసమూహము
ల్పదుగురు నీల్గుట దెలిసి బల్వగురోషము శోకముఁ మదిఁ
గదులుకొనంగ సేన చని హాల్చెద నంచట మేఘనాదుతోఁ
బదిలము పట్టణం బనుచుఁ బల్కి మహోజ్జ్వలభూషణాంగుఁ డై. 214
తే. సకలశస్త్రాస్త్రకలితమా స్యందనంబుఁ, బటుజవంబున నెక్కి విస్ఫుటము లగుచు

వరకిరీటంబులు వెలుంగ దాశరథుల, నదెతు నని తత్పురీద్వార మపుడు వెడలి.

వ. ఇవ్విధంబున రథారూఢుం డయి యిరుదెఱంగుల నిశాటభటులు జయజయధ్వానంబులు సేయ నిరువది కరంబులను శరాసనంబులు ధరియించి విహాయసమార్గం బంతయు శరలాఘవంబున గాఢాంధకారంబు గావించుచుఁ జనిచని శాఖామృగసైన్యంబునం జొచ్చి విజృంభించి యెదురులేని పరాక్రమంబున. 216

సీ. ఆశీవిషోగ్రతుల్యంబులౌ శరము లత్తగుచరావళిమీఁదఁ బఱపి పఱపి
తన తేరి కడ్డమై చనుదెంచు సుగ్రీవపవనజాదుల నెల్లఁ బాఱఁ దఱిమి
పటురయంబున రాఁగఁ బ్లవగసేనామధ్యమునసుండి యవ్విభీషణుఁడు క్రోధ
రక్తాంతనేత్రుఁడై రాక్షసాధమ! వచ్చితే యటంచును బండ్లుదీటుకొనుచు
తే. బలుగదాదండ మెత్తుక ప్రళయకాల, శూలిపోలికఁ జనుదేరఁ జూచి యద్ద
శాస్యుఁడిప్పాపకర్ముఁ జక్కాడఁతు ననుచు. మయుఁడొసంగిన శక్తి సమంత్రకముగ.

ఆ. తిగిచి యేసె నదియు దీప్తానలాభమై, భీకరముగుచు నవ్విభీషణుని
జంప నేఁగుదేర శరణాగతత్రాణ, పరుఁడు లక్ష్మణుండు పరఁగ నదియు. 218

వ. కనుంగొని యీతని కభయం బొసంగితి మింకఁ బరసాధనంబు వధియింపం జూచు చునికి సద్ధర్ములకుఁ గర్జంబు గాదు గావున దీనిం దప్పించెద ననుచు శరాసనంబు కేల నందికొని రయంబున. 219

తే. చని విభీషణుముందఱ శైలమువోలెఁ, జనఁగ నిలిచెను లక్ష్మణుం డంత నదియు
శక్తి యడఁగక పటుతరశక్తితోడఁ, దాఁక నాలక్ష్మణునియురస్స్థలము చెలియ!

వ. తాఁకియు. 221

తే. మాయచేత భూమిమండలంబునఁ బుట్టు, శక్తులకును మూలశక్తి యతఁడు
శ్రీనివాసు మొదటిశేషాంశ మటువంటి, మహితు నేమిసేయు మయునిశక్తి 222

వ. అయినను జగద్విడంబనంబుగఁ జరియించుమహానుభావుండు గావున మనుష్యభావంబు నంగీకరించి నిశ్చేష్టితుండై ధరాతలంబునం బడియె నంత దశాననుండును నరదంబు డిగ్గనుఱికి యతిరయంబునం బఱతెంచి కైలాసకుధరోత్తారణంబులగు తన వింశతిబాహువుల నమ్మహామహుదేహంబు నొక్కింతయైనను గదల్పనోపక వెల్లనయినమొగంబున దిక్కులు నిరీక్షించుచు నుండె నిట్లు గాదేని. 223

క. పరమేశ్వరు లోకాశ్రయు, పరము జగత్స్వరు విష్ణు పరమేశు విరా
ట్పురుషు సుమిత్రాసుతు భా,సురదేహం బెత్తి రక్కసునకుఁ దరంబే. 224

వ. అంతఁ దద్విధం బంతయు నెఱింగి దూరంబుననుండి పవమాననందనుండు రోషదందహ్యమానమానసుండై యతిరయంబునం బఱతెంచి వజ్రాయుధోపమానంబగు

తనదు బలుపిడికిటం బొడిచె నాప్రేటునకు రావణుండు రుధిరంబుఁ గ్రక్కుచు గిర గిరం దిరిగి చేష్టలు దక్కి చదికిలంబడి మెల్లన నరదంబుఁ జేరె నంత. 225

క. మనుజాని క్రియ దనుజాని, శక్తిని ధరఁ బడియున్న మహితు ధీరు సుమిత్రా
తనయుని మారుతతనయుఁడు, గొనిచనియెను కరయుగములఁ గొనిచనుసరిద్యు. 226

వ. ఆసమయంబున. 227

తే. తనకు నతనికిఁ గలుగు మిత్రత్వమునను, నతనిభక్తికి గురుతరుం డయ్యు నట్టి
యొడ లఘుత్వము నొందె రామానుజుండు, తరుణి! పుణ్యులు భక్తవత్సలులు గారె.

తే. అంత నాశక్తి నారాయణాంశజుండు, పుణ్యతముఁ డీతఁ డనిశంబు పొగడఁ దగిన
వాఁ డటంచును సౌమిత్రి వదలిచనియెఁ, బఙ్క్తికంధరు రథముపైఁ జటులరయమున.

వ అంత రావణాసురుం డురవడించిన కోపంబున. 230

## రావణాసురుఁడు శ్రీరాము నెదుర్చుట.

క. కాండాసనధరుఁ డై బ్రహ్మాండంబులు తల్లడిల్ల నార్చుచు నమ్మా
ర్తాండకులాగ్రణిపయి పర, పాంశు రహాయకలితరథముఁ బఱపె మృగాక్షీ! 231

వ. ఇట్లు తనపైకిఁ బఱతెంచు దశాననుఁ గనుంగొని రాఘవుండును మహాబలసంపన్నుం డగు వాయునందను స్కంధారోహణంబు చేసి బలువింట నారి యెక్కించి గుణంబు మెరయించుచు నన్నిశాచరుం డగ్గఱి మేఘగంభీరభాషణంబుల నిట్లనియె 232

చ. దనుజ! సమస్తభూతసమదర్పను నాయెడఁ దప్పొనర్చి తీ
వనిశము పోవనేర్తువె ఖరాదులపాలికిఁ బుత్తుఁగాక స
య్యన నిలుమంచుఁ బల్కుఁ ద్రిదశారియుఁ గోపసమగ్రుఁ డై విహిం
చినపవమాననందనుని శీర్షము ఘోరశిలీముఖాహతిన్. 233

తే బెగడుపడ రక్తధారలు బిట్టుగురియ, నేయఁ దోఁచఁగను నయ్యాంజనేయుఁ డపుడు
తనశరీరంబు మార్తాండు నమకరింపఁ, గడఁగి యూర్ధ్వంగఁ దోఁచఁగ రాక్షసులు గలఁగ.

వ. ఇట్లు రుధిరధారాసంసిక్తశరీరుం డయ్యును జలియింపక నిలుచు పవమాననందను శౌర్యసౌశీల్యంబులకు విస్మయంబు నొంది రావణుం డింత యొనరించెదువాఁడే యనుచుఁ దద్రథాభిముఖుం డై. 235

సీ. కోపంబునను భుజాటోపంబు దిలకింప జయశీలమగు వింటి శరముఁ దిగిచి
యొకబాణమున సూతు నొకటఁ దచ్ఛత్త్రంబు నొకటఁ గోదండంబు నొకట రథము
నొకటఁ గేతువు మఱియొక్కట శస్త్రాస్త్రసమితి యొక్కట రథాశ్వముల నిట్లు
భంగంబులై భూమిభాగమందునఁ గూలఁ జేసి యారాజలోకేశ్వరుండు

తే. మఱియుఁ దదంతక మతిఘోరశరపరంపరములు నొవ్వంగ నేయ బెగ్గిలుచుఁ గ్రిందఁ

కేతులెల్లను మాఁతగాఁ జేసి వింధ్యు, విడిచి మూర్ఛిల్లె దోషాటవిభుఁడు చెలియ!.

వ. అసమయంబున. 237

ఆ. ధర్మమార్గమునను దనరుపుణ్యుఁడు గాన, జంపుకరము తదీయశాతకుంభ
పద్మరాగరత్నభాస్వత్కిరీటాళి, దుమురు లగుచు ధరణిఁ దొరల నడఁచె. 238

వ. ఇట్లు వికటవిక్రమం జేసి యంతఁ గపులెంచి మారుతిం గనుంగొని. 239

ఆ. పవనతనయ! వీఁడు బవరంబునను ఏచ్చి, సొరిగెఁ గాన లంకఁ జొరఁగ నిమ్ము
నేఁడు దీని నింక నాదుకార్యశక్తిఁ, గాంచు మిల్లి కల్గుకలహమునను. 240

వ. అని పలికి నంత దశాననుండును మగుడ వచ్చి తనదైన యువమానంబునకుం గుందుచు విగతదర్పుం డై బ్రతుకుగంటి నింక నితనిముందట నిలువంబోల దనుచు ససారథ్యంబగుసనిదంబుఁ దోలుకొనుచు లంకాభిముఖుండై చనియెనంత రాఘవుండును.

క. ఘనతరమూర్ఛాగతుఁ డై, తనరెడు తనదైన ముద్దుతమ్మునిఁ గని హా
యనుజా! నను విడనాడుదుమఁ, జయుదవే తుచ్ఛుఁడగు నిశాచరశక్తిన్. 242

వ. అని మఱియుఁ జింతాభరంబున. 243

ఉ. తమ్ముఁడ! యివ్విదేశమున దానవుచేతను బట్టి దుర్దశల్
గ్రమ్మెడు నంచు ప్రాసనాళా కట్టిడియైన విధాత యింక మీ
యమ్మ మదీయనూనుఁడు గుణాఢ్యుఁడు లక్ష్మణుఁ డేఁ డటన్న నే
నెమ్మెయి బొంకుదున్ జయ మదృష్టవిహీనుల కేల గల్గెడిన్. 244

ఉ. అలిని గోలుపోయి సుగుణాకరుఁ దమ్ముని బాసి యింక నా
కేల యొకండనై బ్రతుకు టీశ్వర! హా యని ధారుణీస్థలిన్
వ్రాలె సుషేణుఁ డంత రఘువల్లభ! ధాతువు మేయిఁ బ్రాణముల్
తాలిమితోడఁ జేపురు ముదం బగు మీ కిల చింత యేటికిన్. 245

ఆ. అనుచు నేదదేర్చి యమరఁ ద్రోల్లిటి యూపా, యంబు పల్కె నమ్మహామహుండు
పవనతనయుఁ గాంచి భవ్య! నీవయ చెల్లఁ, గాక యొరులు దలఁపఁగలరె మదిని.

క. కావున నను రక్షింపుము, పావని! మును మనబలంబు బ్రతికింపవె నీ
వావిధమున నని పలుకఁగ, దేవర! సత్కృప యటంచు దృఢతరమతి యై. 247

తే. తత్పదాంభోజములకు వందన మొనర్చి, గగనపథవర్తి యగుచు వేగమున జలధి
దాఁటి చనుమండె నంత నేతద్విధంబు, విని దశాస్యుండు చింతించె విఘ్నమతుఁడు.

వ. అన్నిశాసమయంబున సత్పథగామియగు కాలనేమిగృహంబునకుం జని పాదార్ఘ్య పాద్యాదివిధులం బూజించి ముకుళితకరకమలుండై దేవా! యే నొనరింపవలయు కార్యం బెయ్యది యానతిం డనిన సతిగుఃఖపీడితుం డై రావణుం డిట్లనియె. 249

ఆ. కాలవశముచేతఁ గష్ట మొకటి నాకుఁ బ్రాప్తమయ్యె నేఁటిబవరమునను
మయునిశక్తిచేత మహి లక్ష్మణుఁడు గూల, నతని బ్రతుకఁజేయ ననిలసుతుఁడు.

వ. దివ్యౌషధంబులు దేర ద్రోణాచలాభిముఖుం డై. 251

క. చనుచున్నవాఁడు గావున, ననుఁ బ్రోచెదవేని వాని నడుమనఁ దడవై
చనకుండఁ జేయు మాయల, మునిరూపముఁ బన్నియైన ముదమున నీవుఁ. 252

## కాలనేమి రావణునకు హితోక్తులు చెప్పుట.

వ. అని యిట్లు పలుకు దశాననువాక్యంబులకుఁ గాలనేమి యిట్లనియె. 253

సీ. విను నిశాచరనాథ! ఘనతత్త్వకలితంబు సద్వాక్య మొకటి నెమ్మది నాలింపు
ప్రాణభీతిని నీకుఁ బలుక నే క్రియ నన్ను మృగరూపమునను మారీచుఁ డెట్టు
లాయెనో మును నాకు నవ్విధంబె నేఁడు కలిగె నిశ్చయ మింకఁ గడఁగి పుత్త్ర
మిత్త్రాదులను జంపి శాత్త్రవ ల్వెలరేఁగ బ్రతికియుండిన నేమి ఫలము నీకుఁ

తే. దనరుభోగంబులను జడాత్మకము లైన, దేహమును గావ రఘునాథుదేవి నొసఁగి
సకలరాజ్యంబు మనవిభీషణున కిచ్చి, బుద్ధితోనుత నడవికిఁ బొమ్ము యిపుడు. 254

వ. ఇవ్విధంబునఁ గలితవిజ్ఞానుండవై యతిరమ్యంబును మునిగణాశ్రయంబు నగు వనంబున కరిగి యరుణోదయావసరంబున విమలసలిలంబులఁ గృతస్నానుండవై సంధ్యాదిక్రియలు నిర్వర్తించి యొక్కయేకాంతప్రదేశమునందు సుఖాసనపరిగ్రహుండవై బహిర్విషయంబులవలన సాంగత్యంబు దిగనాడి తత్ప్రవృత్తులగు నతఁ గణంబులనెల్ల మెల్ల మెల్లన ప్రత్యక్ప్రవాహంబు గావించి ప్రకృతివలన భిన్నుం డగు నాత్మను విచారింపనుయు మఱియుఁ దేహబుద్ధీంద్రియాదులవలన నాబ్రహ్మస్తంబపర్యంతంబును జరాచరాత్మకంబై కనిపించుజగం బంతయుఁ బ్రకృతి యనియుఁ మాయ యనియుఁ గీర్తితం బగు నదియు జగద్వృత్తంబువలన నగు సర్గస్థితివినాశంబులకు లోహితశ్వేతకృష్ణాదిరూపంబులఁ బ్రజల సృజించుచుండు నదియు కామక్రోధాదిపుత్త్రాఢ్యయు నింక దనదగు గుణంబులవలన నీశ్వరుండగు నాత్మను భ్రమనొందించుచుండు నదియు గాదు కర్తృత్వ భోక్తృత్వాదిస్వగుణంబులెల్లను నీశ్వరుండగు నాత్మయందు నారోపించి వివశత్వంబు నొందించి యద్దేవుం గలసి క్రీడించుచుండు నాత్మయు సతిశుద్ధుం డయ్యు సద్గుణసాంగత్యంబువలన మోహితుండై తనయాత్మను మఱచి బహిఃపదార్థంబు లెల్లను గనుంగొనుచుండు మఱియు నేసమయంబుననైనను విజ్ఞానవంతుండగు సద్గురువువలన సలక్షణంబు గాఁగ నుపదేశంబు నొంది నివృత్తబహిర్దృష్టియై స్వకీయంబగు నాత్మను స్ఫుటం [illegible] గనుంగొను నాసమయంబుననే దేహప్రాకృతగుణంబులవలన విడువంబడి

జీవన్ముక్తుం డగు సంశయంబు లేదు గావున నిశాచరవల్లభా! నీవును నియతేంద్రియుండవై ప్రకృతివికారంబులవలన భిన్నుండగు నాత్మ నెఱింగి యీశ్వరు నారాధింపు మెట్లనిన. 255

సీ. శ్రీమించు నాత్మీయహృత్పద్మకర్ణికాగ్రమునందుఁ గనకపీఠమున వివిధ
రత్నప్రభాభాసురంబైన మృదుతలంబున జానకీయుక్తు వనజనేత్రు
మాణిక్యకుండలు మార్తాండకులవర్యు నజు మహాబాహు వీరాసనాఢ్యు
విద్యున్నిభాంబరు విజ్ఞానముద్రాభిశోభితు నతిశాంతు సుందరాంగు

తే. నమరవినుతాంఘ్రియుగళుఁ గళ్యాణచరితుఁ, గలితకోదండు నమితభాస్కరనిభాభు
సకలవ్యాప్తస్థితు శ్రీరామచంద్రు విష్ణు, భజనయొనరింపఁ గలుగుఁ దత్పదవి నీకు.

వ. ఇవ్విధంబునఁ బరమభక్తియుక్తుండవై యితరచింతలు మాని యమ్మహానుభావు విమలచారిత్రంబుల ననుదినంబును వినుచు దత్సేవాపరతంత్రుండవై యుంటివేని తూలానలన్యాయంబున ననేక జన్మార్జితంబులగు మహాపాతకంబులైనను దగ్ధంబ నశియించు నిది నిజంబు మఱియును. 257

ఉ. భజన యొనర్పు భక్తజనభావితుఁ బద్మపలాశనేత్రు భూ
భుజకులరత్నమున్ గనకభూషణభూషితు సేవ్యమానసూ
ర్యజహనుమద్విభీషణనిజానుజు భూరిశరాసు రాఘవున్
సుజనులభంగిఁ బొమ్ము మదిఁ జూడకు మింకొక టింక రావణా!. 258

వ. ఇది కాలనేమివచనం బని తదనంతరకథనంబు తుహినాచలనందనతోడ మహాదేవుం డిట్లనియె నిట్లనామయుండును బురాణపురుషుండును బరిపూర్ణుండును శాశ్వతుండును నగు రఘునాయకుచరణకమలంబు లాశ్రయింపు మనుచు నమృతతుల్యంబులుగాఁగఁ గాలనేమి పలుకువాక్యంబులకు నాజ్యసంయుక్తంబగు హుతాశను చందంబున సాగ్రహుండై కరవాలంబుచేత నంకించి యోరి దుష్టా! మచ్ఛాసన పరాఙ్ముఖుండవగు నిన్ను నిప్పుడ పరిమార్చెద ననుచుఁ బీఠంబు డిగ్గనుఱికినఁ గాలనేమియు భయసంత్రస్తుండై దేవా! భవచ్ఛాసనంబుకొలందియ యొనరించెద ననుచు నిజాలయంబు వెలువడి. 259

సీ. చని హిమాచలముపొంతను బుష్పఫలలతాద్యనుపమంబగు తపోవన మొనర్చి
శిష్యవర్గముతోడఁ జెలఁగి తన్మార్గావరోధియై యుండె మారుతియు నంతఁ
జనుదెంచి విస్మయంబున నేను మును గనుంగొన నిట్టివనము సన్మునియుతంబు
మార్గంబు దప్పెనో మతి భ్రమించెనో యైన నిమ్మునీంద్రునిచేత నెఱిఁగి జలము

తే. గ్రోలి చనువాఁడ నాద్రోణశైలమునకు, ననుచు ఖర్జూర కదళికా పనస సాల

ముఖ్యధరణీరుహోపేతముగ వెలుంగు, నవ్వనం బటు సొచ్చి వాతాత్మజుండు. 260

వ. ఇవ్విధంబున సకలమృగపక్షిగణశబ్దానువిసర్జితంబై యోజనవిస్తీర్ణంబుగ నొప్పు నవ్వనంబుఁ జొచ్చి యచ్చట నింద్రయోగంబు నాశ్రయించి శివపూజాతత్పరుం డగు కాలనేమి యను మహాసురుం గనుంగొని మునీశ్వరుం డను తలంపున. 261

## మునిరూపముఁ దాల్చిన కాలనేమిని హనుమంతుఁడు చూచుట.

తే. వందన మొనర్చి యోభగవత్స్వరూప!, యేను హనుమంతుఁడను రాఘవేంద్రుదూత
నమ్మహామహుఁ డనుప దుగ్ధాంబురాశి, కరిగి ద్రోణాద్రిఁ దోఁతెంచు నాసతోడ.

వ. చనుదెంచితి నిప్పుడు. 263

ఉ. ఆఁకలి బాధ నేపడి గుణాకర! యొక్క జలప్రదేశముఁ
నా కెఱిఁగింపు తృప్తిగ వనంబును గ్రోలి యథేచ్ఛఁ బోగునం
చాకపివర్యుఁ డిట్లన వనాటు! మదీయకమండలూదకం
బీకదళీఫలాదులును నింపుగఁ గ్రోలి వసింపు మిచ్చటన్. 264

వ. ఏనును. 265

క. ఎఱుఁగుదు జరిగినయవి మఱి, జరిగెడునవి నాదుతపముసామర్థ్యమునన్
దరుచరలక్ష్మణు లటులే, చిరి రాఘవు విమలదృష్టిచేతను సుఖులై. 266

క. అని పలికిన మారుతి యప్పలికెను మునినాథ! తృష్ణ యతిశయ మటు గా
వున నొక్కకొలను జూపుము, చనవలయు నటన్న వాఁడు సమ్మతితోడన్. 267

వ. మాయావికల్పితుండగు తనశిష్యుం గనుంగొని బాలకా! యివ్వనాటునకు నగాధసలిలంబగు నొక్క కాసారంబు గనిపింపు మనుచుఁ బావనిం గనుంగొని. 268

ఆ. కనులు మూసి జలము కడుపు నిండఁగఁ గ్రోలి, రమ్ము యఖిలయాపథమ్ము లెల్లఁ
గానిపించునట్లు కడువేడ్క నొకమంత్ర, మిత్తు ననినఁ గపికులేశ్వరుండు. 269

వ. వెడలి తన్మాయాశిష్యుండు కనఁబఱచిన కాసారప్రాంతంబునకు. 270

క. చని ముని మని పలికినతెఱఁగునఁ గనుఁగవ మూసి జలము గ్రోలఁగ నతనిన్
గనుఁగొని పటురోషంబున, ఘనదుర్భరమకర మొకటి గ్రసియించె సఖీ! 271

వ. ఇట్లు గ్రసియించిన. 272

ఉ. మారుతపుత్రుఁ డమ్మకరిమన్నము లెల్లను జించి మేను వి
స్తార మొనర్చి కంత మొగఁదన్నఁగ నూపిరియాడకన్ దదా
కారముఁ బాసి యొక్కసురకన్యయ యై పవమానపుత్ర! వి
స్ఫారచరిత్ర! నీదగు ప్రసాదమునన్ ముని శాపమున్. 273

ఆ. పాసి తొంటిరూపుఁ బడయంగఁ గంటి నా, పేరు ధాన్యమాలి ధీరవర్య!

నీదుస్పర్శనమున నిర్ధూతపాపుఁడై, చనెద నిపుడు బ్రహ్మసదనమునకు. 274

వ. దేవా! యియ్యాశ్రమంబున నున్నవాఁడు రావణప్రేరితుండగు కాలనేమి యను నిశాచరుండు నీకు విఘ్నంబు సేయం జనుదెంచి మునిరూపధరుండై యుండెఁ గావున శీఘ్రంబ వానిం జక్కాడి క్షీరసాగరంబునకుం జను మనుచుఁ దిరోహిత యయ్యె నంతఁ బవమాననందనుండును. 275

ఆ. మరలి తొంటియాశ్రమమున కేతెంచినఁ, గాలనేమి యతనిఁ గాంచి పలికెఁ
గొనుము మంత్ర మిపుడు గురుదక్షిణ యొసంగు, మనిలతనయ! యేటి కాలసంబు.

వ. అని పలికిన మారుతాత్మజుండును బలువిడిం బఱతెంచి మహాహితుల్యంబగు భుజా దండంబు సాఁచి. 277

క. కొను మిదె గురుదక్షిణ యో, దనుజాధమ! యనుచు నెగసి తద్వక్షము ము
ష్టిని బొడువ వాఁడు బెగ్గిలి, మునిరూపము విదలి ఘోరముగ రక్కసుఁడై. 278

ఉ. మాయలు పన్ని పైఁబడువ మారుతియుక్ బల మెక్కు నమ్మహా
మాయకు దూతగాన క్షణమాత్రముచేత నె వాని మాయలన్
మాయఁగఁ జేసి చంపి గరిమంబుగ ద్రోణమహాద్రి కేఁగె నా
గాయతిసత్త్వుఁడై వడి విహాయసవీథి హిమాద్రినందనా!. 279

వ. ఇవ్విధంబునఁ బవమాననందనుం డు నిఖిలౌసధరాధరంబులు గనుంగొనుచుఁ జని చని ద్రోణాచలంబు గాంచి యందుఁ జెలువొందు దివ్యౌషధంబు లెల్లను నదృశ్యంబులైన నతికోపంబున నమ్మహాచలంబు వాలంబునం జుట్టి శిరంబునం దిడుకొని మహావేగియై రఘునాయకు సమీపంబునకుం జనుదెంచి నమస్కరించి యిట్లనియె.

ఉ. ద్రోణధరాధరం బిదియు తోడుకవచ్చితి రాఘవేంద్ర! క
ల్యాణము గల్గుఁ గార్యము విలంబము సేయకుఁ డింక నన్న వ
క్షీణపరాక్రముండు రఘుశేఖరుఁ డవ్విధిఁ జేయఁ బంప స
ప్రాణుఁడు నిద్ర మేల్కొనినభంగిని లక్ష్మణుఁ డాక్షణంబునన్. 281

తే. లేచి ధనువంది యోరజనీచరాధ, మా! దశానన! నిలు పోకు మద మడంతు
నిదియ యనిపల్కు లక్ష్మణు ముదముతోడఁ, గాంచిరఘునాయకుఁడు కౌఁగిలించి యపుడు.

వ. శిరంబు మూర్కొని వాయునందనున కిట్లనియె 283

చ. అనిలజ! నీదు దార్ఢ్యమున నామయవర్జితుఁ బ్రాణయుక్తు ల
క్ష్మణుఁ బొడఁగాంచఁ గంటి మదిఁ గన్గొన మారఘునంశ మెల్ల నీ
ఘనభుజశక్తిపై బ్రతికెఁ గావున నీ ఋణ మింకఁ దీర్ప నే
ర్తునె వహియించి తీవు మముఁ బ్రోచితి వంచు యశంబు భూస్థలిన్. 284

ఆ. అనుచుఁ బలికె నంత నఖిలశైలచరాళి, గండుమీఱి తొంటికంటె మిగుల
బలముతోడ వృక్షపర్వతపాషాణ, హస్తు లగుచు నిలిచి రనికి మరల. 285

వ. ఇట్లు విభీషణాలోచనంబున నఖిలవానరసైన్యంబును సమరోన్ముఖంబై యుండె నంత నక్కడ రావణాసురుండును. 286

### రావణాసురుఁడు కుంభకర్ణుని నిద్ర లేప నాలోచించుట.

క. హరిచే మదగజమును ఖగ, వరుచే భుజగంబుమాడ్కి వడి రాఘవదు
ర్ధరసాయకాళిచే జ, ర్జరితాంగుం డగుచుఁ జని నిశాచరపతులన్. 287

వ. తగువారల రావించి సభాభవనంబునం గూర్చుండి చింతాక్రాంతుం డై యిట్లనియె.

సీ. వినుఁడి దానవులార! మనుజుచే మృతి గల్గు నని పల్కె మును నీరజాసనుండు
నాదువంశమున సనాతనుండును బరమాత్ముఁ డగు విష్ణుఁ డవతరించి
తునుము నిన్నని నట్లు యనరణ్యుఁ డనువాఁడు చనియె నంతట దివంబునకు వారి
వాక్యంబు కతనఁ దద్వాసుదేవుఁ డమేయుఁ డాదినారాయణుం డర్కవంశ

తే. మునను శ్రీరాఘవాఖ్యచే జనన మంది, వచ్చె నను ద్రుంపఁ గష్టంబు వచ్చె నాకుఁ
గుంభకర్ణుండు నిద్ర మేల్కాంచఁడు దీని, కేమి సేయుదు నింక మీఁదేది తెరువు.

వ. అయినను ముందరికార్యంబు విచారింపవలయుఁ గావున. 290

ఆ. మీర లతని వేగ మేలుకొల్పుఁ డటన్నఁ, జని యనేకదనుజసముదయములు
బొబ్బ లిడఁగఁ గొంత ప్రొద్దు లేవక లేచి, నీల్గి మాంసములను నెత్రి భుజించి. 291

వ. తన్ను మేల్కొల్పినకార్యంబు దెలిసి దశాననుం డింత వేల యగునే యనుచుఁ దలంచుచు సభాభవనంబునకుం జనుదెంచి యచట సింహాసనస్థుండగు తనయన్నం గనుంగొని నమస్కరించి తగినపీఠంబునం గూర్చుండె నాసమయంబునఁ బంక్తికంధరుం డిట్లనియె. 292

చ. కనుఁగొను కుంభకర్ణ! మృతికాలము నాకుఁ దటస్థమయ్యె నె
ట్లనినఁ బ్లవంగసైన్యములు నల్లన వార్నిధి దాఁటి నేఁడు పై
కొనియె రఘూత్తముం డతిసఘోరశరాళి ననేకరక్కసుల్
మనిఁగిరి వాని మార్కొను సమర్థులు లేరు జగత్త్రయంబునన్. 293

వ. ఇదియు కాదు విచారించిన. 294

ఆ. మేటిదనుజవరులు గీటడంగిరి మన, సైన్యమునను వారిసైన్యమునను
వెదక నొక్కప్లవగవీరుఁ డైనను జావఁ, డహహ! దైవబలము నగునె దలఁప. 295

వ. ఇట్లు కావున మదర్థంబై దాశరథులసైన్యంబులం దలపడి భుజపాండిత్యము నెఱపుము కీర్తి వహింపు మనినఁ గుంభకర్ణుం డందులకుఁ దెలియునట్లు గంభీరంబుగ నిట్లనియె. 296

క. నారాయణుఁ డారఘుకుల, వీరాగ్రణి యోగమాయ పృథ్వీసుత య
వ్వీరుఁడు ధరణీభారముఁ, దీరుప జనియించె ననె దెలియఁగ నీతోన్. 297

వ. మఱియును. 298

క. దనుజేంద్ర! తొల్లి యాలో, చనచేసెడు సమయమునను సైఁపదు రఘురా
మునితోడ వైర మని చె, ప్పనె నీ విటు వినక చేటుపాటు దెలియుకన్. 299

తే. తెమ్ముకొంటివి వైరంబు దీర్పఁ దగదు, ఇది యుకా దొకవృత్తాంత మేను వింటి
మును విశాలాపురంబునందునను నేను, సలుప సదిరేయియందు మానికులవరుఁడు.

వ. నారదుం డరుగుదెంచిన నేనును నమస్కరించి మహాత్మా! యెటవోయెద రనిన నమ్ము
నీంద్రుం డిట్లనియె. 301

క. విను దేవతలరహస్యం, బునఁ బుట్టినమాట మీయుభుజబలమునఁ బీ
డనఁ జెంది వారికి మొఱయిడ, వనజాక్షుఁడు మిమ్ముఁ దునుమ వసుధాస్థలిపై. 302

క. జనియించెద నని యభయం, బనిమిషుల కొసంగె సత్య మాతనిపలు కిం
దును గాన నేఁడు దశరథ, తనయుండై రాముఁ డనఁగ ధరణి జనించెన్. 303

క. అని పలికి తిరోహితుఁ డ, య్యెను నారదమౌని యేను నదిమొదలు మనం
బున రాముఁడు నారాయణుఁ, డని తలఁచెద దనుజనాథ! యనుపమభక్తిన్. 304

ఉ. కావున నీ వెఱుంగు మవికారు సనాతను రాఘవేంద్రు స
ద్భావము నొందు వైర మిఁకఁ బాయుము ప్రోవఁగలండు భక్తిచే
సేవ యొనర్ప భక్తియు ప్రసిద్ధిగఁ దల్లినిబోలు జ్ఞానస
ద్భావునిఁ జేయు భక్తియు ముదంబుగ ముక్తియొసంగు నిచ్చటన్. 305

వ. ఇవ్విధంబున మాయామనుష్యరూపుండును బరబ్రహ్మయు నగు రఘునాయకువలన
భక్తిగరిష్ఠుండవు కమ్మెట్లనిన భక్తివిహీనుం డెద్ది సేయు నది యెల్లను నిరర్థకం
బిదియునుంగాక యమ్మహానుభావు లీలానుసారంబులగు నవతారంబు లనేకంబులు
గలవందు సహస్రాంశలఁ గనుఁగొన శ్రీరామచంద్రుండు జ్ఞానమయుండును శివుం
డును నగుం గావున నిపుణులగువారలు వాక్కాయమనంబులను నమ్మహాత్ముని
దలంచుచు ననాయాసంబున సంసారసాగరంబు దాఁటి శాశ్వతంబును సనకాది
పరమమునీంద్రవంద్యమానంబును వైష్ణవంబును నగు తత్పదంబు నొందెద రిది
నిజంబు మఱియును 306

ఉ. ఏనరులైన సత్త్వమతి నెప్పుడుఁ దద్రఘునాథు నీశ్వరున్
ధ్యాన మొనర్చి తత్కథ లహర్నిశముం బఠియింతురొక్కొ వా
రీనిరయప్రదం బనఁగ నింపగు సంసృతిఁ బాసి జానకీ
మానసచోరు రాఘవుని మక్కువ నొంది వసింతు రింపుగన్. 307

వ. అని శైలనందనతోడఁ దదనంతరవృత్తాంతంబు చంద్రమౌళి యిట్లని చెప్పం
దొడంగె నివ్విధంబునఁ గుంభకర్ణుండు. 308

క. తన కతిహితకరములుగా, నెనయగు వాక్యములు పలుక భ్రుకుటీవికటా
ననుఁడై వను బోధింపఁగఁ, జనుదెంచితె నిద్ర లేచి సద్గురునిగతిన్. 309

చ. వినుము మదీయకృత్యములు వీనుల సోఁకనివేని నిద్రకై
చను మిటు దూలువాఁడ వెటు సైతువు పోరొనరింప నం చనన్
విని యతిక్రూరుఁ డీతనికి వేఱొకమాటలు సైఁప వంచు గ
ర్జన మొనరించుచున్ వెడలె సర్వవనాటులు భీతి నొందఁగన్. 310

## కుంభకర్ణుఁడు వానరసైన్యంబులం దలపడి యుద్ధము సేయుట

వ. ఇవ్విధంబునఁ గుంభకర్ణుండును గాలవశత్వంబునఁ దొల్లి పల్కిన నీతివాక్యంబుల
నెల్ల నడగుపఱచి కరాళవదనుండై మహోత్తుంగంబగు లంకాప్రాకారంబు విలం
ఘనంబు సేసి యొక్క నాదంబుఁ గావించె నమ్మహానాదంబునకు మకరాలయం
బెల్లఁ బ్రతిధ్వని వీతెంచె నిట్లు సాగ్రహుండై పఱతెంచి ప్లవంగసైన్యంబులం
దాఁకిన. 311

చ. కరములఁ బట్టి కొండలను గ్రక్కున మ్రింగుచుఁ గొండలం ధరా
ధర మిటు పత్త్రయుక్తముగఁ దాఁకొనె నంచు భయంబుతోడుతం
బలువక పోకుపోకు మని పట్టి వధింపుము వీని వారటం
చెలుఁగక కొంతసేపు చరియించె నిశాచరుఁ డబ్జలోచనా!. 312

వ. ఇవ్విధంబున. 313

క. శిరములు కరములు నురములు, పరిమెఱఁగను వికలములుగఁ బగులఁగ బలుము
ద్గర మెత్తి యుద్ధులేకరి, తరుచరసైన్యమును ద్రుంచుతఱి నాదైత్యున్. 314

వ. కనుంగొని భ్రాతృస్నేహంబున విభీషణుండును గదాకలితహస్తుండై సమీపంబు
నకుం జనుదెంచి నమస్కరించి యిట్లనియె. 315

ఉ. ఏను విభీషణుండ దయ సెంచుక చూడుము పఙ్క్తికంఠుతో
జానకి నిమ్ము రామునకు సైఁపకు వైరము శ్రీజనార్దనుం
డానరనాయకుం డనఁ బదాహతి నిన్నిటు ద్రొబ్బ నేను ని
బ్భానుకులాన్వితంబు రఘుపాలు పదాబ్జము లాశ్రయించితిన్. 316

ఆ. అనుచుఁ బలుకఁ దమ్ముఁ డనిరోఁజెంగి కరాంబుజములఁ గౌఁగిలించి ప్రమద మొప్ప
బ్రతుకు వత్స! రామభద్రు పాదాంబుజా, శ్రయుఁడ వగుచు సితరభయము వెడలి.

క. ఏనును మును నారదమునిచే, నెఱిఁగితి దనుజహితము సేయక శ్రీమ

ద్భానుకులాధిపచరణ, ధ్యానపరాయణుఁడ వగుచుఁ దనరెద ననుచున్. 318

వ. వినుము. 319

క. నావారు నొకరివా రని, భావింపఁగఁ జాల నిపుడు బలుమత్తతచేఁ
గావునఁ జను మనఁ జింతా, వ్యాప్తుఁడై పదయుగముల కానతుఁ డగుచున్.

వ. కన్నుల నీరు నించుచుం జని రామచంద్రుపార్శ్వంబున నిలిచె నంతఁ గుంభకర్ణుండును గదాదండంబుఁ ద్రిప్పుచు శాఖామృగసైన్యంబులం దలపడి యోలమాస గొనక కరంబులను బాదంబులను నెగఁజిమ్ముచు సైన్యం బంతయుఁ జీకాకుపఱుప రాఘవుండును 321

సీ. కనుఁగొని యాగ్రహంబున భూరికోదండధారియై జ్యానినాదం బొనర్చి
వాయవ్యశర మప్పు డేయుఁ దద్గదతోడ వానిహస్తము భూమి వ్రాలె నపుడు
దాని క్రిందఁ దనేకవానరు ల్మడిసి రంతఁ దా నాఁడు నొకమహాధ్వని యొనర్ప
నమ్మహాధ్వనికిఁ గీశాధిపు లెల్ల డొంది రాకసంబున వాసవాదిసురలు

తే. రామరాక్షసులకుఁ గల్గు భీకరణముఁ, గాంచఁగ విమానముల నెక్కి కడఁగి నిలిచి
రంత దనుజాధముఁడు సవ్యహస్త మిట్లుఁ, బోవఁగ ఱకెక్కి రోషవిస్ఫూర్తితోడ.

ఉ. సాలము వామహస్తమునఁ జయ్యనఁ గైకొని రామ! రామ! నిన్
గూలుతు నంచుఁ బై నడువఁ గొంకక యైంద్రమహాస్త్ర మేసి త
త్సాలసమేత మాసటు భుజం బిలఁ గూలిచె రామచంద్రభూ
పాలుఁడు సద్భక్తజనపాలుఁడు శీతనగాధిపాత్మజా!. 323

వ. ఇట్లు భుజాదండంబులు రెండునుం దునిమి బెండుచెడక రుధిరధారాసంసిక్తశరీరుండై కేవలుఁ గొండచందంబున నాహవంబునకు గమకింప రామచంద్రు నారాచంబులు వచ్చి వానిచరణంబులు ధరణీతలంబునం బడ నడిచె నంత వాఁడును మహానాగంబుభంగి బడబాముఖతుల్యంబగు వదనంబుఁ దెఱచుకొని యేచి రాఘవా! పెద్దకాలంబునకు నా కాహారంబు గలిగితి విప్పుడు నిన్నుం దినియెద దశాననుమనస్సంతాపంబు వాపెద ననుచు నంత నురస్సారంబున సుధాకరమండలంబుపైఁ గవయు రాహుగ్రహంబుగతి మ్రింగం బఱతెంచె నాసమయంబున రాఘవుండును.

తే. మొనసి నిశితాస్త్రములు వానిముఖమ్ము నిండ, దీటుకొలిపిన వాఁడోటు పాటులేక
తోఁ గదిసిన మార్తాండతుల్యమైన, యైంద్రబాణంబుఁ దనదుకర్ణాంతముగను.

ఆ. తిగిచి యేసె నదియు దివ్యకుండలవత్న్న, ఖచితవరకిరీటకలిత మగుచు
భయదదంష్ట్రి మగుచు బలుగుతుల్యంభిక, గోత్రశిరముఁ ద్రుంచి యుర్విఁ గూల్చె.

వ. ఇవ్విధంబున దేవనాథుఁ బ్రయోగంబునం దైత్రు వృత్రాసురు శిరంబుపగిది జగ

త్కంటకుండగు కుంభకర్ణశిరంబునం దొగి మహాఘోషంబు వీతెంచుచు లంకాద్వా
రంబునం బడియెఁ దత్కాయంబును మహోదధిమధ్యంబునం గూలె నంత సకల
దేవతావర్గంబులును మహర్షిసముదాయంబులును నతిసంభ్రమంబున 'రామచంద్ర!
దయానిధీ!' యనుచు జయజయధ్వానంబులతోడఁ బుష్పవర్షంబులు గురిపించి
రాసమయంబున 327

## నారదుఁడు శ్రీరాముని స్తుతించుట

తే. గగనమున నుండి రఘునాథుఁ గనుఁగొనంగ, నిచ్చఁ జనుదెంచె దేవమునీశ్వరుండు
నారదుఁడు బ్రహ్మవిజ్ఞానపారగుండు, దేహకాంతుల దిశ లెల్లఁ దేజరిల్ల. 328

వ. ఇట్లు చనుదెంచి. 329

మానిని. (ఈషదుదంచితతామ్రవిలోచను నిందిరహృజ్జలజార్కు జగ
త్పోషణు నైంద్రసమాహ్వయశస్త్రుని భూరిశరాసనబాహు ద్విష)
ద్భీషణశస్త్రనిపీడితసర్వకపిప్రబలోజ్జ్వలసత్కరుణా
భాషణు శ్రీరఘునందను దానవభంజనభీముఁ గనుంగొనియెన్. 330

వ. ఇట్లు కాంచి హర్షగద్గదభాషణంబుల నిట్లని వినుతింపందొడంగె. 331

సీ. దేవ! జగన్నాథ! దివ్యప్రభావ! సర్వాధార! నారాయణాభిధాన!
శరణు సనాతన! పరమాత్మ! విశ్వసాక్షి! పరాత్పర! సర్వపాపహరణ!
ఘనవిశుద్ధజ్ఞానస్వరూపి వయ్యు నిజ్జగముల నెల్ల వంచన యొనర్ప
సుఖదుఃఖవంతుని సొబగున మాయచే మనుజాకృతిని నిట్లు తనరె దీవు

ఆ. నీవు మాయచేత నెట్టఁ గప్పఁబడిన్వ, జంతుహృదయముల వసింతు వార
యఁగ స్వభావమున స్వయంజ్యోతి వమలాత్మ, చేత వ్యక్తుఁడవు మహితశేంద్ర!.

క. కనుదెఱచిన భువనంబులు, జనియించుట కన్నుమూయ సమయుట లేదే
మునివలన నట్టి రఘుకుల, వనధిహిమకిరణ! నీకు వందన మిపుడున్. 333

తే. ఎవని యందున జనియించు నీచరాచ, రాత్మకం బగు జగము లే రరయ నెవని
గనఁగలే రట్టి జగదీశ! ఘననిభాంగ!, రామ! మ్రొక్కెద నోపరబ్రహ్మ! నీకు. 334

తే. కాల మవ్యక్త మవ్యక్తముల్ కడఁగి ప్రకృతి, పురుషులును నీవయని బుద్ధిఁ బరమమునులు
దలఁచుచుండెద రట్టి సీతాసమేత!, జనకభూవరజామాత! శరణు నీకు. 335

సీ. కమలాక్ష! నిన్ను విజ్ఞానమయుండను నిర్వికారుండును సర్వభూత
లాధారుఁడును శుద్ధుఁ డని శ్రుతుల్ గానంబు సేయు నీకరుణావిశేషహీను
లగు వేదవాదకు లగు వైదికులకు విరోధబుద్ధియు కాని రూఢిలేను
మాయచేఁ గ్రీడించు నీయందు నవిరోధత్వంబు దోఁపదు తలఁచి చూడఁ

తే. జవిటిభూమిని రవిరశ్మిజాల మెల్ల, జలము భంగిని దోఁచెడుపగిది జగము
లెల్ల నీయందె భ్రాంతిచే నెఱుఁగఁబడును, గాని నిర్గుణుఁడవు బుద్ధిఁ గనుఁగొనంగ.

వ. మఱియు దేవా! యిప్పాటంబున ద్వైతాద్వైతభావంబుఁ బాగు నిన్ను నెవ్వ రెఱుంగంజాల రైనను నిపుణులగువారలు భవద్దివ్యలీలావతారంబులు దలంచెదరేని ముక్తు లగుదు రింక యూపకంబునకు మార్జాలంబు పోని యుండె నని గింగి నాత్మను గామక్రోధా దులు పరిపంథులై సమయంబు నిరీక్షింపుచుండు నట్లుగావున సమస్తజగత్పావనం బగు భవన్నామంబు జపియించుచు హారకిరీటకుండలశ్రీవత్సకౌస్తుభాలంకృతం బును సర్వప్రమాణాయుతంబు నగు భవద్విగ్రహంబు హృత్కమలమధ్యంబునం దలంచుచు భవత్పూజాపరినిష్ఠితులై భవచ్చారిత్రంబులవలన నాసక్తులై వినుచు నీకు భక్తు లగువారలతోడ సాంగత్యంబు నెఱపుచుఁ గాలంబు జరుపు పుణ్యాత్ములు సంసారమహార్ణవంబు గోష్పదంబులీలం దాఁటి భవత్సాన్నిధ్యంబు నొందెద రిది నిజంబు రఘునందనా! యేనును నిరంతరంబు నీగు సగుణస్వరూపంబు నారాధించి భవపాశంబులవలన విముక్తుండనై సకలదేవతాపూజ్యంబుగ భువనత్రయంబుల సంచరించెద నిప్పుడు. 337

క. నీ వొనరించిన కార్యము, దేవహితము కుంభకర్ణుఁ దెగటార్చుటచే
నీవసుధాభారము సగ, మావలయై చనియె జనకజాధిప! రామా!. 338

తే. ఇంక సౌమిత్రి రేపు దైత్యేంద్రపుత్త్రు, నింద్రజిత్తుని బరిమార్చు నెల్లిగాక
యావలను మీరు దశకంఠు నడఁచఁగలరు, సురలు నేనును దివినుండి చూడఁగలము.

తే. జానకీనాథ! కరుణింపు చనెద నిప్పు, డనుచు నారాముచంద్రుచే నధికములగు
మన్ననలు గాంచి సురసేవ్యమానుఁ డగుచు, నరిగె నారదముని బ్రహ్మపురమునకును.

వ. అంత రావణుండును. 341

చ. తనయనుజుండు బాహుబలదర్పసమగ్రుఁడు కుంభకర్ణుఁ డి
ట్లని రఘునాథుచేఁ దెగుట లంతయుఁ జారులచే నెఱింగి హా
యనుజ! మనుష్యమాత్రుని శరావళి నిన్నిటు చేసెనే యటం
చును ధరణీస్థలిం బడఁగఁ జూచి తదాత్మజుఁ డింద్రజి త్తనెన్. 342

ఉ. నీ వదిఁ జింత యేల రజనీచరవల్లభ! యేను గల్గ నా
రాముఁ డనంగ నెంత మఱి రండిఁక నిల్వు మిటన్ నికుంభిలా
హోమ మొనర్చి కార్ముకము నుగ్రశరంబులఁ దేరుఁ గొంచు సం
గ్రామ మొనర్చి వానరుల రాఘవులన్ బరిమార్చి వచ్చెదన్. 343

వ. ఈసమయంబునం దాహుతాశను మెప్పించి రథాదికంబులు గొనియెద. 344

ఆ. అనుచుఁ బలికి తాను వానరాళియును చేరి, రక్తగంధమాల్యరాజి మెఱయ
ఘోరమైన యగ్నికుంభిలాహోమంబు సేయఁ బోదఁగెఁ దుహినశిఖరిసయ! 345

వ. అంత నిర్విఘ్నంబంతయు నెఱింగి విభీషణుండు రఘునాయకున కెఱింగించువాఁడై
సమీపంబునకుం జని యిట్లనియె. 346

సీ. మనల జయింప హోమము సేయుచున్నవాఁ డింద్రజిత్తుఁడు రాఘవేంద్ర! చూడు
విఘ్నంబు గాకుండ వెస వేల్పునే సురాసురాదులకైన నాఁగఁబోఁడు
కాన నాతోడ లక్ష్మణు నాయితముచేసి పంపు మీతఁడు వానిఁ ద్రుంచుటకును
బలవంతుఁ డన రామభద్రుఁ డెంతయు సంతసము నొంది యోవిభీషణ! మదీయ

తే. జయము గోరెద వతియు శ్రద్ధాళి నీవు, పిన్నవాఁ డగు లక్ష్మణుఁ డెన్న నిప్పు
డేను జనుదెంతు వాని మాయింప మీఁద, గెలుకొల్పెద నస్త్ర మాగ్నేయ మనుచు.

తే. కాలరుద్రోపమానుఁడై కార్ముకంబుఁ, గొనిన రఘునాథుతోడ నిట్లనె విభీష
ణుండు జగదీశ! వీఁడు చావండు నితర, జనులచేతను నెటు లన్న వినుము తెలియ.

క. పదునాల్గు వత్సరంబులు, నిదురయు నాహార మెఱుఁగనట్టి జనులచేఁ
దుది గాంచు ననియెః గమలజుఁ, డది గావున వాని నడఁప నగు లక్ష్మణుఁడున్.

వ. ఎట్లనిన మీ రయోధ్యాపట్టణంబు వెడలిన యది మొదలు భవత్సేవాపారతంత్ర్యం
బున నాహారనిద్రలు మఱచియున్నవాఁ డిదియుఁ గాదు సమస్తధరాధరుం డగు
భుజంగవల్లభుం డేనును నెఱుంగుదుఁ గాన ననుజ్ఞ యిమ్ము వాని వధించి సంప్రాప్త
విజయుండై చనుదెంచు నిదియునుం గాక. 350

ఉ. సాయక సర్వభూతములపాలన లీలయుఁ బోలెఁ జేయు నా
రాయణమూర్తి నీవు భుజగాధ్యుఁడు లక్ష్మణుఁ డిట్లు మాయచే
నీయవనీభరం బడఁప నిచ్చ జనించితి రయ్య రామభూ
నాయక! సర్వభూతలయనాటకసూత్రధరా! మహాప్రభూ!. 351

వ. అని యివ్విధంబున విభీషణుం డనియె ననుచు శివాశివసంవాద ప్రకారంబు. 352

ఉ. నీలఘునాధి దేవా! రజనీచరవంశపయోధిమందరా!
పాలితభక్తలోక! నిజపాదపయోరుహజాతదేవగం
గాలహరీవిలాస! వరకాంచనచేల! రథాంగహస్త! తాం
బూలమిళన్ముఖాంబురుహ! భూరిపరాక్రమ! రంగనాయకా!. 353

మాలి. వనరుహదళనేత్రా! వార్ధికన్యాకళత్రా, మననిజహరతోషా! మంజుభాషావిశేషా!
ఘనకనకశరాసా! కాలమేఘావభాసా!, దినకరనిభతేజా! ధీర! శ్రీరంగరాజా!.

గద్య. ఇది శ్రీమారుతోటముక్కీశ్వర ప్రసాదలబ్ధకవితాపవిత్ర కోటమరాజుభాస్కర
మంత్రిపుత్ర నాగయామాత్య ప్రణీతంబైన శ్రీమదధ్యాత్మరామాయణంబను
మహాకావ్యంబునందు యుద్ధకాండము ప్రథమాశ్వాసము

శ్రీరస్తు.

# అధ్యాత్మరామాయణము

## యుద్ధకాండము-ద్వితీయాశ్వాసము.



లక్ష్మీవర! బలభి
న్నీలవినీలస్వరూప! నీరాధాత్రీ
లోల! మహామునిసముదయ
పాలా! రంగాభిధాన! భక్తాధీనా!.

క. శ్రీనారాయణ! కమలా, మానసపరనీజమిహిర! మందరధర! దా
త్రీనాథ! పక్షిముఖముఖ, దానవకులభిదు! రంగధామ! మురారీ!.

వ. దేవా! యవధరింపుము పై మాచరిత్ర కవ్యకావత్సలంబునుం గనుంగొని గంగాధరుం డిట్ల
నియె నట్లు రఘువల్లభుండు స్వకార్యానుగతంబులు గాఁగ విభీషణుండు పలుక
మృదుభాషణంబులకు సంతసించి యేనును మేఘనాదుమాయావిత్వంబును బ్రహ్మ
స్త్రనైపుణ్యంబును మనలక్ష్మణు శరాసనకౌశలంబును నాయంగుల భక్తియుం
దత్స్వరూపంబును నెఱుంగుదు నైనను భావికార్యగౌరవంబున నూరకయుంటి
ననుచు సుమిత్రానందనుం గనుంగొని విజ్ఞానగరిష్ఠుండగు రాఘవేశ్వరుం డిట్లనియె

ఉ. తమ్ముఁడ! మేఘనాదు బలదర్పము దూలఁగఁజేసి కీర్తికై
కొమ్ము భవత్సహాయముగఁ గ్రోల్పులిమూకలఁ గొంగి గీశసై
న్యమ్ముల జాంబవంతుఁడును నట్లు విభీషణుఁ డాత్మమంత్రివ
ర్గములతోడ రాఁగలఁడు గవ్వడిచుణ్ సురవైరిమర్త్యముల్.

వ. అని పల్కిన

తే. అవ్విధంబున నాత్మబాణాసనములు, లక్ష్మణుండు విభీషణుం డాత్మగంబ
కొనిరి సౌమిత్రి యంత గానని దాబ్జ, ములకు వందన మొనరించి పలికె నిట్లు.

ఉ. ఓవరనాథ! మచ్ఛరము లుగ్రశరాసము వీడి యాంత్యకా
లానల్పాత్తిఁ బాతి దనుజాంగముఁ జొచ్చి పగిల్చి దుస్సరా
పానవిస్పృద్ధరక్తరుధిరపంకము భోగవతీజలంబులన్
స్నాన మొనర్చి పాయుఁ దివిజప్రకరంబు నుతింప నిప్పుడున్.

ఆ. అనుచుఁ బలికి రాఘవానుజ్ఞ వడసి పెం, పమర నింద్రజిద్వధార్థ మపుడు
వెడలె లక్ష్మణుండు వివిధసైన్యములచేఁ, బవనజుండు వెంటఁ దవిలి నడువ. 8

వ. ఆసమయంబున నిజమంత్రిసమేతుండై కరాగ్రంబున గదాదండంబు వెలుంగ విభీ
షణుండును భల్లూకవర్గంబుతోడ జాంబవంతుండును గూడ నడచి రిట్లు గగన
పథంబు విహంగరాజసమాన వేగులై చనిచని భుగభుగాయమానంబులుగఁ బొగలు
వెడలు నికుంభిలాదేశంబు గాంచి యాహవంబునకు సన్నద్ధులై రంత విభీషణుండు
సుమిత్రానందనున కిట్లనియె. 9

సీ. చూడుమల్లదె మహాసురయోధనికరంబు దృఢయత్నమున నొందు ధీరవర్య!
వీరిఁ ద్రుంపక కాని వెస నింద్రజిత్తుండు గనుపింపఁ డదిగానఁ దసకకుండు
మన విభీషణుమతి కనుమతించి మహోగ్రకోదండ మటు కేలఁ గొని తదీయ
సైన్యవర్గముమీఁద శరవృష్టి ముసరింపఁ దొడఁగె వానరులును గడఁగి శైల
తే. పాదపంబులు గొని వారి బడలువఱుపఁ, గడఁగి రంతట వారు ముద్గరశరాసి
సాధనంబుల మరలి యాశైలచరుల, సంధులగలంగ మొత్తను సాఁగి రపుడు. 10

వ. ఇవ్విధంబున సుభీమసైనికులం దలపడి పిఱుతివియక సంప్రహారశబ్దం బుడిగిపోరం
దొడంగి రందు శాఖామృగసైన్యంబుల బలం బగ్గలం బయిన 11

చ. బలురజనీచరుల్ ధరణిపైఁ బడ మేఘనినాదుఁడున్ నికుం
భిల యటు మాన్పి కార్ముకము భీకరసాధనపఙ్క్తిఁ గొంచు ను
జ్జ్వలమగు తేరిపై నసితశైల మొకో యన నెక్కి వచ్చి తా
నిలిచె స్వకీయసైన్యరజనీచరవర్యులు సేద దేఱఁగన్. 12

వ. ఇట్లు నిలిచి సుమిత్రానందనున కిట్లనియె. 13

తే. ఓయి! లక్ష్మణ నీ వెంతఁ బోయె దింక, మేఘనాదుఁడు వీఁడు నీమెదడు వ్రేల్చి
నగ్నియందున నని గదాహస్తుఁడైన, తనపినతండ్రిఁ గాంచి యిట్లనియెఁ గనలి.

మ. తగురా నీకు విభీషణా! యిచట జాతంబై మముష్మబోంట్ల మొ
త్తిఁగ నేతెంచితి వేల మాట లికఁ బుత్రద్రోహి! నీకంఠమున్
దగ వ్రేయం బగదీర్తునే యనుచు నాదిత్యోపమాన ప్రభున్
జగతీనాయకుఁ గాంచె వాయుజఘనస్కంధస్థితున్ లక్ష్మణున్. 15

## ఇంద్రజిల్లక్ష్మణుల యుద్ధము.

ఆ. ఇట్లు గాంచి కన్ను లెఱ్ఱసేసి మహాప్ర, మాణధనువుఁ గొంచు మహితనాదముఁ
జేసి లక్ష్మణా! మహాశనితుల్యంబు, లివియ కపిబలములఁ దవిలి చంపు. 16

చ. అనుచు మహోగ్రసాయకము లాత్మ వలీముఖసైన్యపఙ్క్తిపైఁ
బనుపఁగఁ గ్రూరపన్నగముభంగిని లక్ష్మణుఁ డూర్పు లుచ్చుచున్

గనలి శరాస మెత్తి ఘననాదుని మేనను లంపవాన ముం
చిన రథమధ్యమందున విచేష్టితుఁడై పడె నాఁడు శైలజా!. 17

వ. ఇవ్విధంబున. 18

క. ఆరామానుజశరములఁ, జేరహిఁ దూలుచును గొంతసేపటికిని వి
స్ఫారవిలోచనుఁడై సజ, ఘోరశరాసనము గొంచుఁ గ్రూరత్వమునన్. 19

ఆ. ఓరి! లక్ష్మణా! మదుజ్జ్వలకార్ముక, శక్తి నీవు మొదటిసమరమునను
దెలియ విపుడు నీకుఁ దెల్లంబు సేసెద, నమదసాయకంబు లందమర్చి 20

సీ. శతసహస్రంబుగ నాటు నొక్కొక్కటి శరము లుగ్రత లక్ష్మణుని మేను గాఁడ నేసి
తీక్ష్ణధారలు గల్గు దృఢతరాంబకములు పది నారదాని మేనఁ గుదులు కొల్పి
యశనితుల్యములైన యమితసాయకములు చొనిపి విభీషణు తనువు నొంచి
యడ్డులేక చరింప నవ్విధం బంతయు లక్ష్మణవంతుఁడౌ లక్ష్మణుండు

తే. గాంచి నాటుంతవాఁడను గల్గి వీని, ప్రాణము నెల్ల నిత్తు నే బహుళపఱతుఁ
గాక యని ఘోరమగు సాయకములు నాని, బాణవర్షంబు నడుమన భంగపఱచి. 21

క. గురుతరసాయకములఁ బైఁ, బఱపి తనుత్రాణ మెల్ల భిన్నము సేయన్
దఱచగు రోషమునను రఘు, వరుదర్పము చించె నట్టి వాఁడిశరములన్. 22

వ. ఇవ్విధంబున నుభయుల తనుత్రాణంబులును భిన్నంబులైన నోటుపాటులేక పరస్పర
జయైషణంబుల శరసంధానమోక్షణంబు లెఱుంగరాకుండ వలయాకారంబులై
కోదండంబులు మెఱయ రుధిరధారలు గ్రమ్మ దేహకాంతులు నిదాఘసమయ
మధ్యందినమార్తాండమండలంబు ననుకరింపఁ గాలభుజంగంబుల భంగి నిట్టూర్పులు
నిగుడించుచుఁ గృతప్రతికృతులు నై జయాపజయవివర్జితులు నై యుభయుల మర్మ
చ్ఛేదకరంబులగు నారాచంబుల నిశాచరనాథనందనుండును సుమిత్రానందనుం
డును బెద్దతడవు సమరంబు సలిపి రాసమయంబున 23

చ. దశరథరాజనందనుఁడు తా నొక్కని యైదుశరంబు లేసి యా
దశముఖపుత్త్రుని గార్ముకపతాకతురంగము లెల్ల ధాత్రిపై
యసము దొలంగఁ గూల్పఁగ సురారితనూభవుఁ డొండుచాపమున్
గుశలతఁ దాల్చి పైనఁబడఁ గొంకక లక్ష్మణుఁ డాశరాసనమున్. 24

ఆ. తొంటిభంగి మూఁడుతూఁపుల ఖండింపఁ, బరిఘభిండివాలపట్టసాది
సాధనంబు లన్ని రాచరుఁ డెసరింపఁ, దునిమె లక్ష్మణుండు తోన నవియు. 25

వ. ఇట్లెన్ని సాధనంబులు పట్టిన నన్నియు సుమిత్రానందనుం డడుమన ఖండింప
సంక్రందనజిత్తుండును గ్రోధతామ్రాక్షుండయి యొండుశరాసనం బందుకొని.

క. వాలుకలు దెఱచు క్రూర, వ్యాళము లన ఘోరశరము లాలక్ష్మణుపైఁ
గీలుకొలిపి వానరులను, దూలఁగ నిశితాంబకములఁ దొడరించెఁ జెలీ. 27

వ. ఇవ్విధంబునఁ దనదుచేతుఃతీఁట వోవఁ బ్లవంగయూథపులం బరిమార్చుచు విజృంభించిన 28

ఆ. ఇట్లు తనదు సైన్య మెల్ల నొంప్రుచు నమో, ఘప్రతాపుఁ డగుచు గండుమీఱు
మేఘనాదుఁ గాంచి మించుకోపంబున, లక్ష్మణుండు శత్రుశిక్షణుండు. 29

వ. విజయశీలంబగు కార్ముకంబు కేల నంది యైంద్రాస్త్రంబు సంధించి లక్ష్యంబు దనుజరాజనందను కంధరప్రదేశంబున దృఢతరంబుఁ జేసి రాఘవేంద్రుచరణకమలంబులు స్మరియింపుచు సజ్జనహితంబుగాఁగ నిట్లనియె. 30

ఆ. దశరథాత్మజుండు ధర్మాత్ముఁ డు సత్య, సంధుఁడును సమస్తజగములందుఁ
దెలియ జనుల కప్రతిద్వంద్వుఁడైన నో, సాయకంబ! వీనిఁ జక్కడంపు. 31

క. అని యాకర్ణాంతంబుగ, ధనువుఁ దిగిచి యేసె రాముతమ్ముఁడు లోకం
బునఁ గ్రూరుఁడైన ఘనునా, దనిఁ దుంపఁగ నంత నదియు దుర్భరజవియై. 32

క. చని రత్నకుండలోజ్జ్వల, మును మణిమయఘనకిరీటమును నై చెలువొం
దిన మేఘనాదు శిరమును, దునిమి ధరాస్థలిపై గూలెఁ దోయజనయనా!. 33

వ. తత్సమయంబున. 34

తే. సంతసంబున దేవతాసముదయములు
పొగడఁ దొడఁగిరి సౌమిత్రి భుజబలంబు
హర్షమును నొందె భగవంతుఁడగు మహేంద్రుఁ
డమరబుషిసంఘముఁ దగును శీతాంశువదన!. 35

వ. మఱియు నమరాలయంబున దుందుభిధ్వనులు చెలంగె గగనతలం బెల్ల నైర్మల్యత వహించె విశ్వంభరయు పార్థివస్థిరాభిధాన యయ్యె నంత గతప్రాణుండై పడియున్న దాశకంఠిం గనుంగొని లక్ష్మణుండును జయలక్ష్మీసమేతుండై తనదుశంఖంబు పూరించుచు నమ్మహారావంబునకు విగతశ్రములగు జాంబవదాంజనేయవిభీషణ ప్రభృతి మిత్రవర్గంబులను దక్కిన సైన్యంబులనుం దోడ్కొనుచు మాయావిలక్షణుండును నారాయణుండును నగు శ్రీరాఘవేశ్వరా! భవత్కటాక్షంబున మేఘనాదుం బరిమార్చి సుఖంబునం జయందెంచితి ననుచు ననేకవిధంబుల వినుతిగావింప నమ్మహానుభావుండును. 36

సీ. అతికృపాదృష్టిచే నాలింగన మొనర్చి శిరము మూర్కొని నీవు చేసినట్టి
కార్యంబునను జెడ్కఁ గంటి లక్ష్మణ! దాశకంఠి కూలఁగఁ గూలెఁ గడమబలము

యీవిధంబునఁ గ్రుంగుచు విలపించుచును మూఁడహోరాత్రములనుండి యుంటి నిట్టు లింకఁ బుత్త్రుఁడు పోవు టెఱిఁగి దుఃఖంబున రాఁగలం దనికి నారాయణుండు

తే. నేను మ్రింపంగఁగలనంచు నిట్లుపలుకఁ, బంక్తిముఖుఁడంతఁ దనపుత్త్రుపాటెఱింగి
హా సుతా! యంచు మూర్ఛిల్లి యవని వ్రాలి, కొంతసేపటి కమ్మూర్ఛ కొంత దెలిసి.

వ. పుత్త్రమోహంబునఁ దత్పరిభావంబు లుగ్గడించుచు. 38

ఉ. మేఘనినాద! నీ విటు లమిత్త్రులచే సమరంబునందు గు
ర్వైరిఁ జెంద నన్వగవ ల్దనువా రెవరయ్య యింకఁ దం
డ్రీ! ఖచరాళి స్వర్గమునఁ బ్రీతిఁ జరింపఁగఁ గల్గె నీభుజా
శాఖలు శత్రుశస్త్రహతులు చెందకు తారదము గ్రుంప నక్కటా!. 39

వ. అనుచు నిర్వేదంబున సహింపరాని పుత్త్రశోకంబున. 40

ఆ. దీనివలన నిట్టి తెఱఁగు నాకుఁ దటస్థ, మయ్యెఁ గాన దీని నణఁతు ననుచు
సీతపైకిఁ దామసించి ఖడ్గముఁ బూని, చనఁగ వానిఁ గాంచి జనకజయును. 41

వ. శోకభయంబులు నివ్వటిల్ల నచ్చటి దనుజకాంతామధ్యంబున నొదిగియుండె నంత దశాననునకుఁ బరమసచివుండును బుద్ధిమంతుండును శుచియు మేధావియు నగు సుపార్శ్వం డను నిశాచరసత్తముండు చనుదెంచి వారించి యిట్లనియె. 42

తే. వేదవిద్యావ్రతస్నాత వాదజపిత, యధికగుణుఁడవు వైశ్రవణానుజుఁడవు
సర్వలోకమ్ము వెన్నఁగ స్వకర్మనిష్ఠితుఁడవు, తగునె స్త్రీవధ నీకు దైత్యప్రధాన! 43

క. ఏము సహాయము గానా, రాముబలం బెల్ల గెలువు రాముని బల మిం
కామీఁద నీదె కాదే, యామానవతీలలామ నేటికిఁ గనుమా. 44

తే. అనుచుఁ బలుకంగ రావణుం డాసుపార్శ్వ, వాక్యములచేత మరలి సౌవర్ణమణిమ
యాంచితంబగు తనగృహంబపుడు చేరి, మరలి గుర్బుద్ధితో సభ కరుగుదెంచి 45

## రావణాసురుఁడు రెండవసారి యుద్ధమునకు వెడలుట

వ. నిఖిలమంత్రివర్గంబుం గూడుకొని యాలోచనంబుచేసి శలభంబులు శలభంబులం గూర్చుకొని దవానలంబుపైఁ గవియుచందంబున హతశేషులగు నిశాచరవల్లభుల సందోహ నాయితంబుగం జేసి నియోగించి తానును దీప్తిమంతంబగు నొక్కరథం బెక్కి సకలశస్త్రాస్త్రంబులును గరంబులం బట్టి యామినీచరవరులు మాతంగతురంగాదివాహనంబు లెక్కి తోడ నడువఁ బ్రళయకాలబలాహకవర్గంబుభంగి గర్జనంబు సేయుచు లంకానగరంబు వెడలి దాశరథుల సైన్యంబుల దాఁకి మాఱులేని పరాక్రమంబున విజృంభింప రఘునాయకుండును. 46

సీ. అశనితుల్యములైన యంబకంబుల వాని సైన్యంబులను నెల్ల దైన్యపఱచి
దశకంఠుచేతి కోదండంబు లెల్లను ఖండించి పత్త్రంబు గాఁడఁ బెక్కు
బాణంబు లడరింపఁ బసచెడి వాఁడు విగ్రతదార్ఢ్యుఁ డగుచు లంకాపురంబుఁ
జొచ్చి హోదైవమా! సోఁకుమూకల కెంతపాటు వచ్చెను రామభద్రుచేతఁ
తే. గీశమాత్రుండు నన్నింత చేసె వాయు, నందనుఁడు వీరి నందఱ డింపుపఱుతుఁ
గాక యనిశుక్రమందిరాంగణము కరిగి, యెలమి నప్పుణ్యుఁ గని మ్రొక్కి యిట్టులనియె.

ఉ. దేవ! సమస్తబాంధవులఁ దీఱిరి శ్రీరఘునాథకార్ముకా
శీవిషతుల్యబాణముల నిగ్గు నిల్వఁగ నేమిసేతు నా
కీవిధి మారు గల్గ జనియించుట లొప్పునె యన్న సత్కృపా
వ్యాప్తచిత్తుఁడై పలికె నాకవి పద్మపలాశలోచనా!. 48

క. విను పఙ్క్తివదన! హోమం, బొనరింపు మవిఘ్నమైన నుద్భవమగుఁ గాం
చనరథము శరశరాసన, ఘనశక్తియు వానిఁ గూడి గడఁగుము రిపులన్. 49

వ. ఇంతలోన విఘ్నంబయ్యెడేని సబాంధవంబుగ నీవ నశియింపుదు వనుచుఁ దద్విధానం బంతయు నుపదేశమిచ్చి దివ్యంబులగు మంత్రంబు లొసంగిన దశాననుండును నతిత్వరితంబునఁ జని పాతాళసదృశం బగు నొక్కగృహంబు నిర్మించి యయ్యాభిచారంబునకు వలయు నుపకరణంబు లెల్ల సమర్థంబులు గావించి పురద్వారంబులు మూయం బనిచి యొక్కపాషాణంబు తద్గృహద్వారంబున నిడి తానును మౌనియై నిశ్చలచిత్తుండై యనలంబున భార్గవోక్తప్రకారంబుగ హోమంబు వేల్వం దొడంగె నాసమయంబున. 50

క. భుగభుగ మని పొగ లెగయఁగ, నాగిఁ గన్గొని యవ్విభీషణుఁడు రాముఁ డెఱుం
గఁగ నిట్లనెఁ గనుఁగొనుమో, జగదీశ్వర! రావణుండు సలిపెడువిధమున్. 51

సీ. మనుజేంద్ర! హోమధూమసమాజ మదె యది సాంగమైనను వీఁ డసాధ్యుఁ డగును
గానఁ దద్విఘ్నంబు గావింప హరివీరులను వేగఁ బంపు మీ యనిన నర్క-
పుత్త్రసమ్మతి వాయుపుత్త్రాంగదాదులఁ బహుపరాక్రములను బనుప వారు
ప్రబలి లంకాపురప్రాకారములు దాఁటి పదికోటులు ప్లవంగపతులు రాన
తే. ఖాలయముఁ జొచ్చి తద్రక్షకాళిఁ దఱిమి, హయములను జంపి గజముల నడుగుపఱచి
యెగుర వచ్చినవారల నేఁచి రావ, ణుండు వేగమె మాకుఁ జూపుం డటంచు. 52

వ. తలప్రహారంబులం బాధింపం దొడంగినఁ బ్రభాతం బగు వేళ సరమ యను నొక్క పుణ్యవతి హస్తసంజ్ఞచేత గుహాపిధానపాషాణం బంగదునకెఱింగింప మహాసత్త్వశాలి యగు నక్కుమారుండును బదఘట్టనంబున నప్పాషాణంబుఁ జూర్ణంబుఁ గావించి

నిజయూథపసహితుం డై లోనికిం జొచ్చియచ్చట నిమీలితాక్షుండును దృఢాస
నుండు నగు దశాననుం గాంచి యతనిపైఁ గపులం బురికొల్పిన 53

సీ. కొందఱు గపానింప గోలాహలధ్వని సేయుచు దనుజుఁ జెండఁ దొడఁగి
రంగుఁ గొందఱు వడి నఖిలసంభారముల్ దీసి కుండములోన వేసి రపుడు
వాయుజుం డాపత్ని పదనుఁ డేస్రువ మెత్తె వడి దీసి దానిచే వాని వైచె
నఖదంతపదతాడనములఁ బైఁబడి యొంపఁదొడఁగిరి కొందఱు తోన గదిసి

తే. రిట్లు చేసిన మౌన మొకింత చెడక, యుండు దశకంఠుఁ గని యంగదుండు కోప
మెసఁగఁ దలవెండ్రుకలుపట్టియీడ్చికొనుచు, వచ్చెమందోదరినిబంక్తివదనుకడకు

## అంగదుండు మందోదరిని రావణు నెదుటి కీడ్చి తెచ్చుట

వ. ఇవ్విధంబున నంతఃపురంబువలననుండి పరమపతివ్రతారత్నంబగు మందోదరిం దోడి
తెచ్చి యనాథవోలె విలపించుచుండ దశాననుకట్టెదుర నీడ్చుచుఁ గరతలంబున
వ్రేయుచు బాధింపుచుండ. 55

మ. నవరత్నోజ్జ్వలమైన కంచుకము భిన్నంబయ్యె హారావళుల్
భువి దూలెన్ ముఖవారిజంబును నిజస్వేదప్లుతం గాంచెఁ గ
న్గవలం దశ్రులు తీవ్రమయ్యెఁ విలసద్గ్రైవేయము న్వీడె స
య్యవనీపుత్రిసమాన దేవతాసతులుఁ గీశాళుల్ మోదం బందఁగన్ 56

వ. అంత నామందోదరియు నతిదుఃఖంబున నిజవల్లభుం గనుంగొని. 57

చ. పరువడి నీవు చూడఁ దలపట్టి ధరాస్థలి కీడ్వ నాగసుం
దరి యని లజ్జ లేక ప్రమదంబున వేల్పుదవేల నుండితే
ధర బ్రతుకంగ నా తనయ! దైత్యవిభూషణ! మేఘనాద! న
న్నోఁరు లిటు సేయనోపుదురె యుండిన నీవు సజీవివై భువిన్. 58

ఆ. నిన్నుఁ గన్నతల్లి నేఁ డిట్టు కోఁతుల,చేత నీడ్వఁ బొందఁ జేసె బ్రహ్మ
పూని నాదుభర్త మౌనంబు విడువఁడు, వాని దూలి బ్రతుకు నాసతోడ. 59

వ. అని యివ్విధంబున విలపించు నిజవల్లభం గనుంగొని దశాననుండు మౌనంబు విడిచి
ఖడ్గహస్తుం డై యంగదుపయిం గవిసి. 60

క. విడువిడు మని ఖడ్గముచే, నడఁగటికేశంబు లైవ వదలి దశాస్యుం
బడఁ దన్ని యెగసి చనె న,య్యెడ నంగదుఁ డానభఃపథమున సగచరయుతుఁ డై

వ. ఇవ్విధంబునం జని శ్రీరామచంద్రుపార్శ్వంబున నిలిచె నంతఁ బంక్తికంధరుండును
నతిశోకసంతప్తయగు మందోదరిం గనుంగొని యిట్లనియె. 62

సీ. సఖిరో! దైవాధీన మఖిలంబు బ్రతికియుండిన నేమి తనుఁ గనుంగొనక యుండుఁ

గానఁ బోవిడువు దుఃఖము నిశ్చయంబైన జ్ఞానంబు పూను మజ్ఞానమునను
శోకంబు పుట్టు నాశోకంబుచేఁ జెడు జ్ఞానంబు దానని గల్గు నేను
నాది యం చనుట యనాత్మయౌ దేహంబునందుఁ దానని కళత్రాదిబంధ
తే. వితతి చెలువొందు దాన సంసృతి జనించు, హర్షభయలోభమోహశోకాదు లింక
జన్మమృత్యుజరాదులు జనుల కెల్లఁ, దనరుచుండును స్వాజ్ఞానమునను నిజము. 63
వ. మఱియును. 64
సీ. ఆత్మ ముక్తుండు భావాభావవర్జితుం డానందరూపుఁ డనంతుఁ డమలుఁ
డొకట సంయోగ వియోగంబులును లేవు జ్ఞానాత్మశుద్ధుండు గాన నిట్టు
లే నెఱింగియుఁ గ్రోధ యూని వానిపదంబు గాంతు నీ వట నేయుక్రమము వినుము
సీతను ఖడ్గంబుచేతఁ ద్రుంచి మదీయతనువుతోడను గూలు మనలమందు
తే. ననుచుఁ బలుకంగ విని శోకమునను దైత్య, లోకనాయక! నాబుద్ధి నీకుఁ బొందు
ఏటిమాటలు నీవు జయింపఁగలవె, రాఘవేశ్వర దివిజశరణ్య విష్ణు. 65
తే. ఆమహాదేవుఁ డఖిలలోకాధినాథుఁ, డతఁడు పురుషప్రధానుల కాద్యుఁ డింక
గల యనేకంబు లతనిలీలలు వచింప, జలరుహాభవాదులకు నైన నలవి గావు. 66
వ. అయినను నాయెఱుంగుకొలంది వివరించెద నెట్లంటేని. 67
మ. మును వైవస్వతధారుణీరమణు నంభోరాశిమధ్యంబునం
దున భీతిం గనకుండ భక్తుఁడని విద్యుత్పుంజముంబోలు మే
నును బల్ గ్రుడ్డు వెదంద వాలమును జెన్నొందఁ న్మహామత్స్యమై
కని రక్షించెను రాఘవేశ్వరుఁడు సోత్కంఠతన్ సురారీశ్వరా. 68
వ. మఱియును. 69
మ. వనధిన్ మందరధారుణీధరము గవ్వం బొప్ప దేవాసురుల్
మును దోశ్శక్తి సుధార్థులై తరువఁ దద్భూభృద్వత్తంసంబు ని
ల్వను సామర్థ్యములేక వార్ధిఁ బడ భాస్వత్కచ్ఛపాకారమై
కనకక్ష్మాధర మెత్తె రాముఁ డరయంగా భూమిభృన్మాత్రుఁడే. 70
వ. వెండియు. 71
మ. అవనీమండలమెల్లఁ జైకొని హిరణ్యాక్షుండు పాథోధియం
దవలీలం జొర నమ్మహామహుఁడు శౌర్యస్ఫూర్తి నవ్వేళ నిం
దువరాహాకృతిఁ బూని ఖడ్గమున రక్షోవల్లభుం ద్రుంచి బం
తివలెం గొమ్మున నెత్తె ధారుణి ధరిత్రీనాథు లీపాటియే. 72
వ. ఇదియకాదు. 73

తే. దనుజరాజసభాస్తంభమునఁ బెకిల్లు, మనుచు ధ్వని పీవ నారసింహాఖ్య వెడలి
రాక్షసాధముఁ గ్రూరు హిరణ్యకశిపుఁ, ద్రుంచి ప్రహ్లాదు బాలు రక్షించెఁ గరుణ.
వ. మఱియును. 75
క. అదితికి సుతుఁడై మూఁడడుగు, పదములు బలి నడిగి యతని బంధించి సుఖా
స్పదు నింద్రునిఁ జేసెను వి, వ్విదితుఁడు రాఘవుఁడు మును త్రివిక్రముకరణిన్.
వ. తదనంతరంబ. 77
క. దనుజాలు క్షత్త్రియు లయి భువి, జనియించిన నిర్వదొక్కసారి కుఠారం
బునఁ ద్రుంచి ధరణి కశ్యప, మునికొసఁగెను బరశురామమూర్తి యనంగన్. 78
తే. తద్విధంబున సకలభూతములఁ బ్రోచు, మేటిదొర కాన లేఁడు నిక్కాగిటసంప
జనవ మొందెను సూర్యవంశమున మాన, వాకృతిని రాముఁడనఁగ నారాయణుండు.
తే. అమ్మహాత్ముని సతి వరణ్యమున నొంటిఁ, దెచ్చి తెందుకు నీవును జచ్చి నాదు
నందనునిఁ జంపుటకుఁ గాదె నాథ! మన్నుఁ, బ్రోవనే యింతచేసె నీబుద్ధి లేఁడు.
వ. ఇంకనయిన నమ్మహాత్ము నారాయణుఁ గా నెఱింగి బుద్ధిమంతుండ వై. 81
చ. శరణని తత్సతీమణిని సమ్ముఖమందున నుంచి రాఘవే
శ్వర! కరుణింపు మంచు జనసమ్ముఖుఁడైన విభీషణున్ నిశా
చరవిభుఁ జేసి తమ్ము నాశ్రితశీలంబులఁ గన్న నాత్మ నుం
దరినటు గాంచి పల్కుఁ బ్రముదంబున రావణుఁ డద్రినందనా! 82
మ. విను మందోదరి! సర్వబాంధవుల బాధింపంగ శ్రీరాఘవేం
ద్రుని బారిం బడఁ ద్రోచి యేక్రియను నిల్తుం గాన దోశ్శక్తిమై
జని తత్సాయకసంతతిచే నఖముఁ జక్కాడి యేఁ గాంతు రా
ముని నైర్మల్యపదంబు వైష్ణవము నిర్ముక్తాఘసంసేవ్యమున్. 83
చ. ఎఱుఁగుము రాఘవుండు జగదీశ్వరుఁ డాద్యుఁడు విష్ణుఁ డౌట నిం
దిర జగదేకమాత సుదతీమణి జానకి యౌట లిట్టు లే
నెఱిగియుఁ బాపసంచయము లెల్లను బాసి నితాంత మద్విరా
ట్పురుషపదంబు నొందుటకు భూసుతఁ దెచ్చితి మానికై వడిన్. 84
వ. మఱియు నిన్నును సంసారంబు విషనాడి యాతిశీఘ్రగంబులును నమోఘంబులును
నగు రఘునాయకు సాయకంబులవలన విదళితదేహుండ నై సదాప్రియంబును
బరానందమయంబును శుద్ధంబును నగుచు నెద్ది ముముక్షు లగువారలచేత సేవింపఁ
బడు నట్టినారాయణస్థానంబు నొందెద నదియునుంగాక. 85
శా. పంచక్లేశతరంగఘూర్ణితము కుంభద్విభ్రమాఢ్యంబు సో
దంచత్పుత్త్రకళత్రమిత్త్రఝష ముద్యద్దుష్కృతౌర్వానలం

దెంచఁగ సంసరణాబ్ధి గాన విడిచేఁ డేఁ గాంతు సద్భక్తి నే
వించం బుణ్యమొసంగు శ్రీహరిని హృద్వీథిన్ సరోజాననా! 86

### రావణుఁడు మూఁడవసారి యుద్ధమునకు వెడలుట.

వ. ఇట్లు దశాననువాక్యం బుమాసతి కాలింగించి యవ్వలివృత్తాంతంబు మహాదేవుం
డిట్లనియె నట్లు దశాననుండు మందోదరి కయ్యంగం బలికి నివారించి తానును వివి
ధాభరణభూషితుం డై సకూబరంబును షోడశచక్రసమాకులంబును ఘంటాశతశో
భితంబును నై పిశాచవదనంబులగు వేసడంబులం బూన్చినయరదం బెక్కి ఖడ్గరో
మప్రముఖదోషాచరయూథపు లుభయపార్శ్వంబుల బలసి నడువ సకలసైన్యంబు
లును సింహనాదంబులు సేయ భీషణుండును రణకర్కశుండును నగుచుఁ బుర
ద్వారంబు వెడలి సైన్యంబున కభిముఖుం డై నడచె నాసమయంబున. 87

క. చనుదెంచెడు రావణుఁ గనుఁగొని వనచరసైన్య మెల్లఁ గొందలపడుచున్
జనియెను రామునివెనుకకు, హనుమంతుం డదియుఁ గాంచి యాగ్రహ మొప్పన్.

సీ. పలికెంచి చనుదెంచు పంక్తికంధరునట్టు మడరుదోఁచెడుముష్టిఁ బొడువ వాఁడు
పసచెడి పతికిలఁబడి యంతఁ దడవున కమ్మూర్ఛ దెలిసి యోయాంజనేయ
మేటిబంటవు నాకు మెచ్చువచ్చె నటన్నఁ బంక్తికంధర నిన్ను బ్రతుకనిచ్చెఁ
గాల్ప నే నాగ్రుద్ధు కడగి నివును నన్నుఁ బొడువు మంతట నీదుపొంకమడఁగు
తే. ననిన సాగ్రహుఁడై వాయుతనయుఁడట్టు, మన్నకాటుం బొడువ వాతాత్మజుండు
ఘూర్ణలోచనుఁడై ధాత్రిఁ గూలి మరలి, దెలిసి యొకకొంతఁ గొనిపండ్లు దీఁటుకొనుచు.

వ. దశాననుపయిం గవిసె వాఁడును భీతచిత్తుం డై యొండుదెసకుఁ దేరు వఱపించె నంత.

తే. తత్సమీపంబునం గల్గు దైత్యవరుల, మేటిమగలను నలుఁగురఁ గీటడంచి
పవనసీలాంగదాంజనీతనయు లపుడు. చని శ్రీరామచంద్రుని సముఖమునకు 91

వ. ఇట్లగ్నివర్ణ సర్పరోమ వృశ్చికరోములను గ్రహస్త్రమంబున గీటడంచి విహరించు
ప్లవంగులం గనుంగొని రావణుండు తత్సంరంభంబు సహింపంజాలక రథంబు
ద్రిప్పించి పెదవులు గొఱుకుచు నతికోపంబున. 92

చ. వనచరసైన్య మెల్ల శరవర్షముచేతను ముంచుచున్ గృతాం
తునిగతి రాముపై నడువఁ దోయజమిత్రకులీనుఁ డున్ మహా
శనిసమసాయకంబులను జాపమునం దొనగూర్చి యేసె న
ద్దనుజరథంబుపై సమరదర్ప మెలర్ప హిమాద్రినందనా! 93

వ. అంత దశాననుండును నిశితకాండంబు లారాజరత్నంబు పయిం బఱపిన వాని నెల్ల
నడుమన చక్కాడి రఘునాయకుండును దెబ్బదిసాయకంబుల నయ్యామినీచరు

పక్షంబు గాఁ జేసె నిట్లుభయులును దంతావళద్వయంబుభంగిఁ బోరునవసరంబున.

ఆ. రథముపైఁ జెలంగు రావణు ధరణిపై, నిలిచి పోరొనర్చు నృపవరేణ్యుఁ
గాంచి జంభవైరి గ్రక్కున మాతలిఁ, బిలిచి యిట్టులనియె జలజనయన! 95

ఉ. రాజకులైకభూషణుఁడు రామవిభుండు రథంబు లేక యి
ట్లాజితలంబున న్నిలుచినాఁడె గుణాకర! నీవు మద్రథం
బా జననాథునొద్దకు రయంబునఁ దోడుకపొమ్ము కార్యముల్
దేజము గల్గు రావణుఁడు దీరు సుఖింపఁగవచ్చు నందఱుల్. 96

వ. అని యివ్విధంబున దివిజవల్లభుం డానతిచ్చిన మాతలియుఁ దత్పదంబుల కెఱఁగి హరి
తవర్ణంబులగు తురంగంబులం బూన్చి యాయితంబు చేసి దీప్తిమంతంబగు నరదంబు
గొనుచు రఘునాయకు సమీపంబునకుం జనుదెంచి ముకుళితకరకమలుండై యి
ట్లనియె. 97

ఉ. దేవ! శచీవిభుండు భవదీయజయార్థము పంచె నీరథం
బీవరఖడ్గతూణయుగ మింపగు నైంద్రశరాసనంబునున్
గావున నీవుఁ గొంచు దశకంఠునడంపుము వృత్రుఁ బట్టి యా
దేవవిభుండు తొల్లి కడతేర్చినపోలిక మత్సహాయతన్. 98

తే. అనుచుఁ బలుకంగ రాఘవుం డారథోత్త
మమున కతిభక్తి మ్రొక్కి సేమము దలిర్పఁ
బూర్వధరణీధరంబుపైఁ బొల్చు మిహిరుఁ
డనఁగఁ దత్స్యందనారూఢుఁ డయ్యె నపుడు. 99

## శ్రీరాముఁ డింద్రరథంబుపై నెక్కి రావణునితో యుద్ధము చేయుట.

వ. ఇట్లు జగంబులకు దృష్టి నొనగూర్చుచు నైంద్రరథారూఢుం డై యశనిసంకాశం
బులగు నిశితకాండంబుల న్నిశాచరవల్లభు నయిం గురియింప నొండొరులకును రోమ
హర్షణంబగు తుములసమరం బయ్యె నయ్యవసరంబున. 100

మ. అనలాస్త్రంబు దశాననుం డనుప నయ్యస్త్రంబుచేఁ ద్రుంచె మ
ధ్యను శ్రీరాఘవుఁ డంత రావణుఁడు దేవాస్త్రంబు సంధింప దా
నిని దైవాస్త్రముచే నడంచె నిటు లెన్నే నస్త్రము లెవ్వి య
న్నిని మధ్యం దనముడి పెంపెసఁగ నన్నీచుండు క్రోధాంధుఁడై. 101

మ. పదివిండ్లం బలుసాయకంబు లిడి భూపాలాధమా! నిన్ను నీ
ప్రదరంబు ల్పరిమార్పఁ జాలు మని తద్బాణావళుల్ రాముపై
వదలెన్ మంటలు గ్రక్కుచున్న వియదాభాస్వత్స్వరూపంబులై
పొడ లెందెక్కలు రఘువంశేంద్రరథ మంతో జాతపత్రీతతుల్. 102

తే. అమరరఘునాథుఁ డబ్భుజంగాస్త్రములను, గాంచి కడురోషమునఁ గమించి గారుడాస్త్ర
మప్పు డడరించె నదియుఁ దత్సర్పములను, జించి చెండాడి శకలముల్చేసెఁ జెలియ!.

వ. ఇట్లు దివ్యాస్త్రంబు లెల్లను గ్రూరుని మనోరథంబులభంగి విఫలంబులైనఁ బౌల
స్త్యుండును సాగ్రహుండై యుచ్చిపోవు బలుకాండంబుల శతాయుతంబులు గాఁగ
నక్కౌసల్యానందను శరీరం బెల్ల నొప్పించుచు 104

సీ. కనకపుంఖములైన ఘనశరంబులు చొచ్చి ధరణిపై మాతలిఁ దొలఁగ నడచి
నవరత్నఖచిత కేతువు తుండెములు చేసి నాసవాశ్వముల గర్వము నడంచి
పదితలలును నిరువదికరంబులు నొప్ప నధిపుఁడై పైనాకధనువు పట్టి
లాహవంబున నమోఘాస్త్రుఁడై విహరింపఁ జింతనొందిరి దేవసిద్ధగణము

తే. లార్తుఁ డగు వారి నీక్షించి యఖిలమునులు, కలఁక నొందిరి వానరబలము లెల్లఁ
గాలుసేయాడకయుండె నేల వ్రేలఁబడియెఁ, దత్సమయమున నంతట దాశరథియు.

వ. క్రోధసంరక్తలోచనుండై బొమలు ముడివడ రాక్షసౌఘము దహింతునో యను
కోపం బొనర్చి యద్భుతంబును దేవేంద్రధనుస్సమానంబును నగు కార్ముకంబు
కేలం బూని కాలరూపి యగు భగవంతుండు గావున వెలుంగు ఱేని తేజంబునఁ బరా
క్రమంబు గనిపింపుచు నఖిలవానరసైన్యంబులకు హర్షం బొసంగుచు దశాననున
కభిముఖుండై పెలుచఁ గ్రుద్ధుండగు నవ్వీరాగ్రేసరువదనంబు సకలభూతంబుల
కును త్రాసంబు బుట్టించె మేదినియుం దరరె నుత్పాతంబులు బహుళంబులయ్యెఁ
దినకరకిరణంబు గనిపించెం గావునఁ బంక్తికంఠునకును మనంబునం దలంకు
దోఁచె నాసమయంబున నధిపులును గోదండపాండిత్యంబు నెఱపుచుం దనుత్రాణ
చ్ఛేదకంబులగు శరంబు లురంబులం దిరంబు సేయుచు దివ్యాస్త్రంబుల వేటులాడు
చుఁ బరస్పరప్రేరితసాయకంబులు నడుమన ఖండించుచుఁ గదనతలం బెల్ల మాంసశో
ణితపంకసంకులంబును నిఖిలభూతభీతావహమహాదాకరంబును గాఁగ నొనరించుచు
మందోదరీవల్లభుండును రాఘవేశ్వరుండునుం బెద్దతడవు సమరంబు సలిపి రయ్యా
హవంబును జగత్ప్రళయతుల్యం బగుటం జేసి విహాయసంబున సవిమానులై వీక్షించు
కిన్నరసిద్ధగంధర్వామరగణదయంబులకు విస్మయావహంబై కనుపించె నాసమయం
బున. 106

క. పిడుగులఁ దెగడెడి శరములు, దొడిగి రఘూద్వహుఁడు వైవ దుస్సహగతి బెగడై
దడదడ రావణుశిరములు, కడఁ ద్రెడఁగను బుడమిఁ దాటిపడుఁ గడిమిన్. 107

క. దినమును రేయును సంధ్యయు, గణియింపక శిరము లెన్ని ఖండించిన నం
టనె మొలచు రామచంద్రుఁడు, తనమనమున విస్మయంబు దనరఁగ నపుడున్.

వ. ఇట్లని వితర్కించె. 109

ఆ. మాటయొక్క మాఱు గీటడంచితి వీని, శిరము లింతయైన( జేటు గవ(డు
తొల్లి మేటిరిపుల( దునిమియైచిన నాదు, శస్త్రసమితి వ్యర్థపార మయ్యె 110

వ. అనుచు సకలశస్త్రాస్త్రవేత్తయు శూరుండును నయ్యు( గౌసల్యానందనుం డివ్విధంబున( జింతింప( దత్సమీపంబుననుండి ముకుళితకరకమలుండై విభీషణుం డిట్లనియె. 111

సీ. వినవయ్య! రఘునాథ! మును వీనితపమున కాత్మ మెచ్చి పయోరుహాసనుండు
వర మొసంగెను బోల శిరము లెవ్వరు త్రుంప జనియించు( దోడనె యనుచు మఱియు
నమర నాభిస్థానమందు( బీయూషంబు కుండలాకారమై యుండు( గాన
నింకింపు మనలాస్త్ర మేసి యంతట వీ(డు సమయు సిక్కమటన్న సకలభూత
తే. ములకు( ద్రిగుణంబులకు( జూడ ముఖ్యు( డయ్యు(
దలిసియుండియు నెఱు(గనితెఱ(గొనర్చి
పావకాస్త్రంబు సంధించి భస్మముగను
జేసె దశకంఠు నాభిప్రదేశ మపుడు. 112

వ. ఇట్లొనరించి వెండియు ననేకసాయకపరంపరల నయ్యామినీచరవల్లభుశిరంబు లెల్లను మహాధ్వని వీవ ధరాతలంబునం బడ(బడుచు వా(డును లెక్కసేయక యాత్మ నుత్పచ్ఛేదనకరంబులగు విభీషణభాషణంబులకుం గినలియొక్క శక్తి వైచిన నదియు విభీషణుపయిం గవయ శరణాగతవత్సలుండు గావున రఘునాయకుండు సమమున నింతింతలుగావించె నిట్లతిభయంకరంబుగ నొక్కశిరంబును రెం(డు) కరంబులును నవశేషంబు గా(గ( గదనరంగంబున నిలిచి వా(డి చెడక సంసారసాగరంబువలన విముక్తుండనై పరమయోగీంద్రసేవ్యంబగు నారాయణస్థానంబు నొందెద నను దృఢనిశ్చయంబున నాగ్నేయప్రముఖదివ్యాస్త్రంబు లెల్లను నవరించుచు మహాచలతుల్యుండై నిలిచె రఘువీశ్వరుండును భవత్పాపసంఘంబు లెల్లం జక్కాడి ముక్తి యొసంగెద ననుచందంబున నైంద్రశరాసనతుల్యంబగు తనదుకార్ముకంబు కేల నందుకొని గుణంబు సారించి కాంచనపుంఖంబులును వజ్రసంకాశంబులును నగు ప్రచండసాయకంబుల( దన్మాంసశోణితంబులు విహాయసమండలంబెల్ల( గప్ప(జేంచి చెండాడుచుండె నిట్లుభయులకును క్రోధసంవర్ధనంబై పరాక్రమవిజృంభణంబై పెక్కుకాలంబు భయానకంబగు తుములసమరంబు చెల్లె నాసమయంబున మాతలి రఘునాయకుం గనుంగొని యిట్లనియె. 113

క. భానుకులప్రదీప! భవబంధవిమోచన! రాఘవేంద్ర! సం
ధాన మొనర్చి వ్రేయు మరిదర్పహరాస్త్రము బ్రాహ్మ మందు నీ

దానవుకంఠదేశ మది దప్పక మర్మముఁ జించు నన్న న
న్నాన మొనర్చి నేఁడు నటు మాతలి! యంచు మహాగ్రహంబునన్. 114

క. తనపార్శ్వంబునఁ బవనుం, డనలార్కులు ఫాలమునను నాకృతి నభమున్
గనకాచలనిభగౌరవ, మును సూర్యసహస్రతేజమును సన్నుతమున్ 115

వ. మఱియు సకలజగద్భయనివారకంబునను వందితంబును జాజ్వల్యమానంబును వినాశకాలంబు సమీపించు దనుజాలపై నేయునదియును మహోగ్రంబును నగు బ్రహ్మాస్త్రంబుఁ గేల నందుకొని వేదోక్తప్రకారంబున బాణాసనసంధానంబు గావింప సకలభూతంబులును సంత్రస్తంబు లయ్యె. సర్వంసహాచక్రంబును జలియించె నిట్లు గుశలి మర్మఘాతకంబగు నయ్యస్త్రం బతిప్రయత్నంబున రామచంద్రుండు విముక్తంబు సేయు నదియును మహాజ్వాలాకలితంబై వెడలి పఱతేర రావణుండును నయ్యస్త్రంబున కెదురనడచి శరాసనంబు గొని బలుసాయకంబులు నిగుడింప నదియును మహేంద్రప్రేరితంబగు వజ్రంబుభంగి దుర్ధర్షవేగంబునఁ దచ్ఛిలీముఖంబుల లెక్కగొనక. 116

## శ్రీరాముని చేత రావణుఁడు చచ్చుట.

మ. భయదంబై దశకంఠుఁ దాఁకి యురముం భంజించి గర్భంబు సా
చ్చి యటం ద్రెవ్వులు చించి చంపి పడఁ దచ్ఛైపాహి సీక్షించి మ
ల్లి యథాప్రక్రియ రామచంద్రు వెనుకన్ లీలాగతి న్నిల్చె నం
త ఘుమర్త్యారి గుభిల్లునం బడియెఁ దద్గాత్రం గతప్రాణుఁడై. 117

వ. ఇట్లు శరాసనంబులు విడిచి ధరాతలంబునం బడిన నిశాచరవల్లభుం గనుంగొని తక్కిన సైన్యంబులు నలుదిక్కులకుం బఱచి రంతఁ గాత్రవనిధనంబును రఘునాయకుని విజయంబును గనుంగొని జితకాశంబులగు వనచరసైన్యంబు లెల్ల సంభ్రమంబునఁ గీర్తింపం దొడంగె నఖిలభువనంబులు నిండ దేవదుందుభులు మొరసె సురలు పుష్పవర్షంబులు గురిసి రప్సరోగణంబులు నృత్యంబు సలిపిరి. మహర్షివర్గంబు లెల్ల వేదవాక్యంబుల వినుతి యొనరించి రంత. 118

తే. రావణునిమేను వెడలి సూర్యప్రకాశ, మగుచు నొక తేజ మపు డయోధ్యాధినాథు
తనువునను జొచ్చె నది కనుంగొని మహాత్ము, లమరు లెల్లను గడువిస్మయంబుతోడ.

ఉ. ఎంతటిభాగ్యవంతుఁ డఖిలేశ్వరుఁ డెంద దశాననుండు దు
ష్టాత్ముఁడు విష్ణుదూషకుఁడు సజ్జనహింసకుఁ డయ్యు నేఁడు సే
వింతుము సాత్వికాంతులయు విష్ణుని సత్కృపఁ గాంచినాఁడ మి
ట్లింతయుఁ గల్గు నదేమొకొయుం సంస్మృతిఁ బాయఁ గంటిమే. 120

ఆ. అనుచుఁ బలుకు సురల నలుగొంది నారద, మునివరేంద్రుఁ డిట్టు లనియె మఱి
వినుఁడి ధర్మతత్త్వవేత్త లిట్లయినను, దనుజకులజుఁ డయ్యె దీనుఁడు. 121

సీ. నిరతంబు రఘునాథుచరణాంబుజంబులు ద్వేషియై తలఁచి సేవించుచుండఁ
దత్కథాశ్రవణాయుక్తస్వాంతుఁడై యుండు నిలలోన నెవ్వఁడు రాఘవుఁ దలంచుఁ
దనుఁ జంపు నని రఘూత్తముని సేవించి యుండు బోధకుం డయ్యె సత్పురుషపంక్తి
నేఁటికి రామునిచే నిఖిలబంధము లెల్లఁ బాసి నిర్భీతిఁ దత్పదవిఁ గాంచెఁ

తే. బరధనాపేక్షుఁ డైనను బాతకుఁ డైన, స్నేహంబునను భీతినైనఁ దలఁప
నిర్మలస్వాంతుఁ డగుచు ననేకజన్మ, పాపములఁ బాసి హరిఁ జెంద నోపు నతఁడు.

చ. దనుజదశాననుం గనిమి తద్దను వద్దగ నిల్చి నిల్చి లో
చనముల కింపుసొం పొదవ సాయక మొక్కటి కేలఁ ద్రిప్పుచుం
దనువు శరాళిచే రుధిరధారలఁ గ్రమ్మ శతార్కతేజుఁడై
యొనరుగు వీరరాఘవునుపేంద్రుఁడు మమ్ముల బ్రోచుఁ గావుతన్. 123

వ. అనుచు నవ్వాలివృత్తాంతంబు హైమవతితోడ శంకరుం డిట్లనియె నంతఁ బరితుష్టమానసుం డయి రఘునాయకుండు పవనతనయవిభీషణాంగదలక్ష్మణసుగ్రీవజాంబవదాదినిజవిజయావహవర్గంబులం గనుంగొని పుణ్యాత్ములారా! భవదీయభుజాసారంబున దశాననుం బరిమార్పఁ గంటి మత్కార్యసంయుతంబయి సకలకల్మషనాశనం బయి యాచంద్రభాస్కరంబుగ మీదుకీర్తి ధరాతలంబునం జెలువొందెడు నని బహువిధంబులఁ గారవించె. నాసమయంబున మందోదరీప్రముఖరావణపాలితకాంతాజనంబు లివ్విధం బంతయు నెఱింగి హాహారవంబులు, నురంబులు మోఁదుకొనుచు నతిశయంబునం బఱతెంచి దశాననుపయిం బడి విలపింపం దొడంగిరి. విభీషణుండును ప్రబలదుఃఖాక్రాంతుం డై యన్నపాటునకు వగచుచుండె నంతఁ గౌసల్యానందనుండు సౌమిత్రిం గనుంగొని. 124

ఉ. శూరవరేణ్య! నీవు చని శోకము వల్దని వేగ భ్రాతృసం
స్కారము సేయ నెమ్మది నిశాచరకాంతల నూఱడింపుమన్
బీరము దక్కి నిప్పుడు విభీషణుతోడుత నన్న లక్ష్మణుం
డారఘునాథువాక్యముల కానతుఁడై చని తద్రణస్థలిన్. 125

## రావణునికై చింతించుచున్న విభీషణుని లక్ష్మణుఁ డూఱడించుట.

ఉ. వచ్చినవాని కెట్టెగుటఁ జచ్చినపోలిక వ్రాలియున్న యా
సచ్చరితున్ విభీషణుని సమ్మతిఁ గన్గొని యేల వెఱ్ఱి మా
కచ్చెరువయ్యెడుం దలఁప నావల నీవల నేఁడు సృష్టికిం
జచ్చినవాఁడు నీకు మఱి చచ్చినవానికి నెవ్వ రేవురున్. 126

వ. మఱియు విభీషణా! సలిలప్రవాహంబునం బడిన సైకతంబులమాడ్కి దేహంబులు గాలప్రవాహంబునం గలియుచు వీడుచుం దత్తద్వేగవశంబులై తిరుగుచుండును. ధరణీపతితంబులగు ధాన్యంబులపోలిక జగదీశప్రేరితంబులై యమ్మహామహిమా యాగుణంబున భూతంబులవలన భూతంబులు సద్భవించుచు లేకయుండుచు నుండు. నీవును మృతుండగు దశాననుండును నేనునుం దక్కిన జనంబులును గాలవశంబున జనియించితి మింగుకు సమానుల మింక నెక్కాలంబున నెవ్విధంబున నెవ్వనికి జన్మమృత్యువులు లిఖితంబు లక్కాలంబున నవ్విధంబున నాతనికి నలభ్యంబులై గలుగుచుండు. నీశ్వరుండును నజుండయ్యును సకలభూతంబులవలనను భూతంబులం బుట్టించుచు సంహరించుచు ననపేక్షకుండై బాలునిచందంబునం గ్రీడించుచుండు. బీజంబువలన బీజంబులుపుట్టినచందంబున దేహియగు జీవుని వలనను దేహంబుచేత నితరదేహసాంగత్యమువలన శాశ్వతుండును నద్వయుండును నయ్యు జనియించినచందంబున నుండు. దేహి యుద్భవించు మఱియు హుతాశనునందు దారుక్రియానుగతధర్మంబులు గలవను భ్రాంతిభంగి మిథ్యాతాదాత్మ్యధ్యాసవలన నాత్మయందునను నానాత్వంబులు నుజన్మనాశనంబులును వృద్ధిక్షయంబులును గ్రియాఫలంబులును దోచుచుండు. గాఢసుషుప్తివేళ నహమ్మానంబులు లేమివలన వానికి సంసారంబులేదు కావునం దద్విధంబున జీవితుండై యుండినను విముక్తుండగువానికి నహంకృతి లేదు కావున సంసారంబునుం గలుగనేరదిది యంతయు మాయామయంబగు మనోమాత్రంబు గావున నహమ్మమతలు రెండును విడిచి విగతబాహ్యేంద్రియార్థసంబంధుండవై తద్దోషంబుల నెల్ల మనంబునకుం గనంబఱచి భగవంతుండును నాత్మయు నీశ్వరుండును సర్వభూతాత్మయుం బరుండును మాయామానుషవిగ్రహుండును నానందసాంద్రుండును నగు శ్రీరామచంద్రపరబ్రహ్మంబువలన మనంబు గీలుకొల్పి యింక క్షణసంగప్రభంగురంబులగు దారాగారాదులును శబ్దాదివిషయంబులును దేహబుద్ధివలనం గాని యాత్మచేతం గాదు. దేహంబువలన విలక్షణుండుగాంగ నాత్మ నెఱింగనేని యవియెల్లను దోచనేర వట్లుగావున నీ వింక రాజ్యంబున నుండియు భూతభవిష్యద్వర్తమానంబుల నూహింపుచుం బ్రారబ్ధంబు లనుభవించుచు భక్తిభావితుండవగు రఘునాయకుం దలంచుచు యథాన్యాయంబుగ విహరించెదవేని యీకానొకసమయంబున నైనను సంసారదుఃఖంబులు నిన్ను సంస్పృశింపనేర విప్పుడు దశాననునకు సాంపరాయికంబు లొనరింప రఘువల్లభుండు నిన్నుం బనిపనిచెం గావున నమ్మహాత్మునాజ్ఞ యొనరింపుము మూఢచిత్తులై విలపించుచుండు మందోదరీప్రముఖకాంతాజనంబుల నూఱడింపుము. బుద్ధిమంతుండ

పై లంకానగరంబునకుం జనుమం యాశోకవిధంబులఁ దత్త్వోపదేశంబులు గాఁగ
రామానుజుండు పలికి విభీషణుండును. 126

ఆ. వీతశోకమోహుఁ డగుచు శ్రీరఘునాథుఁ, గానవచ్చి ధర్మశీలమునఁగ
నమర రామమానసానుకూలముగాఁగ, ప్రగతుఁ డగుచు నిట్లు పలుకఁ దొడఁగె.

క. క్రూరుండు నృశంసుఁడు పర, దారాసక్తుండు త్యక్తధర్మవ్రతుఁడౌ
నీరావణుఁ డో రాఘవ, యేరీతిని దగును క్రియల నే నొనరింపన్. 128

వ. అనిన సంతసించి రామచంద్రుం డిట్లనియె. 129

మ. మరణం బొందిన వైర మేల మనకున్ మన్నింపఁ గాఁబోలు నీ
సరి నా కితఁడుఁ గానఁ జేయు మిఁక సంస్కారంబు లన్నం ధరా
ధరధీరా! భవదాజ్ఞ యంచుఁ బితృమేధప్రక్రియ న్నాహితా
గ్నిరుచిన్ వేగమె యవ్విభీషణుఁ డొసంగెన్ వహ్ని శైలాత్మజా!. 130

వ. ఇట్లు సబాంధవుండై దశాననున కనలం బొసంగి స్నానంబు లొనరించి యావస్త్రం
బులతోడఁ దిలదర్భలు నుదకసమ్మిశ్రితంబులు చేసి విధిపూర్వకంబుగ విడిచి
శిరోఘటితకరపుటుం డై యన్నకు నమస్కరించి గద్యాభర్యల బహుభంగుల నూఱ
డించి లంకాపురంబునకుం బనిచి తానును రఘునాయకు సమీపంబునకుం జనుదెం
చి యతివినయుండై నిలిచె నంత. 131

ఆ సైన్యయుక్తుఁ డగుచు సానుజుం డగుచు న, కీశవర్యుఁ డగుచు వానిమీఱ
రామచంద్రవిభుఁడు రాక్షసాధము వృత్రుఁ, జంపి చెన్నుమీఱు శక్రుకరణి.

సీ. అంత మాతలి రాఘవాంఘ్రియుగ్మములకు నొసలంటు మ్రొక్కి యనుజ్ఞ వడసి
గగనమార్గమున స్వర్గముఁ జేరె రాఘవుండును నిజానుజుఁ గాంచి యనియె నిట్లు
లక్ష్మణా! మున్నె యీలంక నే నొసఁగితి నైన నీవిపుడు తదాఢ్యుఁ గాఁగ
విధ్యుక్తమా మంత్రవేత్తలౌ విప్రులచేతఁ జేయింపు విఖ్యాతచరిత
తే. నవ్విభీషణా నన లంక కేఁగి వార్ధి, జలముఁ దెప్పించి సద్విప్రజనులచేతఁ
బ్రీతి రామానుజుండు విభీషణునకుఁ, జెలఁగి సేయించె రాజ్యాభిషేక మపుడు.

వ. ఇట్లొనరించి పౌరజనంబు లెల్ల నానావిధోపాయనపాణులై తోడ నడువ లక్ష్మ
ణుండును విభీషణుం దోడుకొని రామచంద్రుసమీపంబునకుం జనుదెంచి యుభ
యులును దండప్రణామంబులను గావించి రంత రాఘవుండును బ్రాప్తరాజ్యుం
డగు విభీషణుం గనుంగొని భానువందమున కిట్లనియె 134

ఉ. మీపృథుదోస్సహాయమున మేటిదశాననుఁ డీల్గె రాజ్యముం
జేపడి యివ్విభీషణుఁడు సేమము నొందెను మత్ప్రతిజ్ఞ స

ద్వ్యాపకమయ్యె నంచు బవసాత్మజుఁ గాంచి ప్రతాపవంత! నీ
వీపగిదింతయుం జని మహీసుతతోడ నెఱుంగఁ బల్కుమా. 135

వ. విభీషణానుమతంబున. 136

తే. పలికి యద్దేవివాక్యంబు దెలియ నాకు, వేగఁ జనుదెమ్ము యన నతివేడ్కతోడఁ
జని నిశాచరసేవ్యుఁడై దనుజరాజ, భవన మటుసొచ్చి వాయుజుం డవిరళముగ.

హనుమంతుండు సీతకడనుం జని శ్రీరాముని విజయంబు చెప్పుట.

వ. చొచ్చి తదంతఃపురశింశుపాతరుసమీపంబున నానందితయుఁ గృశీభూతయు దను
జరాంతాపరివృతయు నగుచు రామ! రామా! యని దీనవదనయై ధ్యానించు విదే
హరాజకన్యకారత్నంబునుం గనుంగొని నమస్కరించి కరంబులు మొగిడ్చి యద్దేవి
మహాప్రసాదం బీక్షించుచు నిలిచె నంత. 138

క. పూర్వస్మృతితోడుత నా, పర్వేందునిభాస్య రామభక్తుం డని యా
శీర్వచనం బొనరింపఁగ, నుర్వీసుతయానసనాజ్ఞ యొప్పుట నపుడున్. 139

క. కనుఁగొని వాయుజుఁ డనియెను, జననీ! కుశలంబు రామచంద్రుఁడు దశకం
ఠునిఁ ద్రుంచె సపరివారము, గను లంక విభీషణునకుఁ గరుణ నొసంగెన్. 140

వ. సుగ్రీవలక్ష్మణవిభీషణసహాయుండై యింతయు నొనరించి యుపశమితక్రోధుండై
సుఖంబున నున్నవాఁడు విజయవార్త మీకెఱింగింపు మనుచు నను బనిచె నని స
వతిముదంబున. 141

క. తనవిభుని విజయవార్తయు, విని పవనజ! త్రిభువనములవెదకఁగ నీ కీ
యను వస్తుసమితి గనఁబడ, దనఘ! భవత్సదృశు లెవ్వ రరయఁగ నాకున్. 142

వ. అనుచు బహువిధంబులం గారవించినఁ దల్లీ! విగతశత్రుండును సుస్థితుండును
నగు రఘుపుంగవుం గాన నేఁగెద ననిన జనకనందన యిట్లనియె 143

చ. అనిలతనూజ! సద్గుణము లన్నియు నీదగు రూప మయ్యె నా
జనవిభుఁ గాంచ వేడ్క యగు సమ్మతితోడఁ దిదాక్షఁ దెమ్ము పొ
మ్మనిన నమస్కరించి కమలాప్తకులీనునిఁ జేరి వాయుజుం
డనుపమభక్తితోడుత ధరాత్మజ పల్కులు తత్స్వరూపమున్. 144

వ. ఎఱిఁగించుచు మఱియు నిట్లనియె రఘునాయకా! యీయుద్యోగారంభంబును నీశ
లోదయంబును నెవ్వరికొఱ కట్టి జనకనందనను రావించుకునికి కర్జంబు గా దనిన
విజ్ఞాపనగరిష్ఠుండగు రఘుశ్రేష్ఠుండును. 145

సీ. మాయామహీజను మఱచి పావకునందుఁ దనరు వసుంధరాతనయ నాత్మఁ
గాంచి విభీషణుఁ గనుఁగొని గుణసాంద్ర నీవు మత్సతిని వినిర్మలాంబ

రాభరణాంచిత యగునటు సేయించి తెప్పింపు మన మారుతియును దాను
జని వృద్ధులైన రాక్షసభామినులచేత మజ్జనం బొనరించి మహితగంధ

తే. మాల్యకౌశేయములను నమూల్యరత్న, సంకలితభూషణముల నలంకరించి
మించు శిబికోత్తమంబున నుంచి వెడలె, రామసామీప్యమున కద్రిరాజతనయ.

వ. ఇట్లు కంచుకోష్ణీషంబులం బూని వేత్రహస్తులగు పౌలస్త్యులుచుట్టును నిల్చి కాపు సేయ నియోగించి తోడితెచ్చు నవసరంబున. 147

క. వనచరు లతికౌతుకమున, జనకతనయఁ జూడ రాఁగ నార్భటు లెగయన్
దనుజాలు వారింపుచు నిటు, చనుదెంచిన నదియు రామచంద్రుం డపుడున్. 148

వ. దూరంబున నుండి కనుంగొని శిబికారూఢ యగుటకుఁ గారణం బేమి యనుచు ముందు చనుదెంచిన విభీషణుతో నిట్లనియె 149

చ. దనుజాలు వానరేంద్రుల నదల్పఁగ నేటికిఁ దల్లి యంచుఁ గ
న్గొనెదరు గాన డిగ్గి యిటకుం జనుదేరఁగఁ బల్కు మన్న న
మ్మనుజవరేణ్యుమాట విని మైథిలి చయ్యనఁ బాదచారియై
జనవిభుఁ గానవచ్చెఁ గపిసత్తము లుబ్బునఁ దన్నుఁ గన్గొనన్. 150

తే. అమరకార్యార్థనిర్మిత యైన యట్టి, సీత నటు గాంచి దుర్భాష లాఁతఁ జేసి
పలుకఁ దొడఁగిన వినలేక పలికె లక్ష్మ, ణా! త్వదగ్రజాజ్ఞను సురల్ నమ్మునట్లు.

సీ. అనలం బొనర్పు మే సందుఁ జొచ్చెద నన్న సౌమిత్రి యారామచంద్రుచిత్త
మెఱిఁగి వహ్ని నొనర్చి మఱలి రామునిపొంత నిలచె సీతయు నంత నిష్ఠ యమున
మూఁడు ప్రదక్షిణంబులు రామచంద్రున కొనరించి రాక్షసాంగనలు నఖిల
లోకంబులును జూడ లోహితాశ్వునిముంగు నిలచి చేతులు మోడ్చి నిఖిలదేవ

తే. తలకు భూసురులకును వందన మొనర్చి, యనుదినంబును రామార్పితాంతరంగ
నైతినేని జగత్సాక్షియైన యనలుఁ, డంచితంబుగ నన్ను రక్షించుఁ గాత 152

వ. అనుచు ధగద్ధగాయమానంబులగు నెఱిమంటలతోడం దేజరిల్లిన యమ్మహానలంబు నకుం బ్రదక్షిణంబు గావించి నిర్భీతస్వాంతయై తన్మధ్యంబున నిలచె నైనను. 153

క. ఏయమ్మబంటు నిజవా, లాయితఘోరాగ్నిశిఖల కతిశైత్యకరో
పాయ మొనర్చెనో తలఁపఁగ, నాయమ్మకు వహ్ని చల్ల నగుటకు నరుదే. 154

వ. తత్సమయంబున నఖిలభూతసిద్ధగణంబులును హాహాస్వనంబుల. 155

ఉ. ఏమి రఘూత్తముండు జగదీశ్వరుఁ డయ్యును లోకమాత నీ
రాముఁ బవిత్రతాత్మ నిజరాజ్యసుఖావహ నిట్లెఱుంగకన్
బామరవృత్తిఁ దాల్చె నని పల్కఁ దొడంగి రటంచుఁ బల్కి యా
క్కామరుదాశపాలుండు గిరికన్యకతోడుతఁ దోవ నిట్లనున్. 156

## బ్రహ్మాదిదేవతలు సీతఁ గైకొను మని శ్రీరాముని స్తుతియించుట.

వ. అనుచుఁ బలుకునవసరంబున నైరావణగజారూఢుం డయి సహస్రాక్షుండగు శక్రుం
డును బరేతరాజ వరుణ వైశ్రవణ గిరీశులును మఱియు బ్రహ్మవిదులగు మునిసత్తము
లతో భగవంతుండగు చతురాననుండును మహర్షివర్గంబులును విశ్వసిద్ధసాధ్య
చారణగంధర్వాప్సరోగణంబులును దక్కిన నిలింపసముదయంబులును విమానా
రూఢులై గగనపదంబున వెలసినుండి జానకీవల్లభుసమీపంబునకుం జనుదెంచి ముకు
ళితకరకమలులై పరమాత్ముఁ డగు నమ్మహాత్ము నిట్లని వినుతింపం దొడంగిరి. 157

సీ. కర్త వీ వఖిలలోకములకు సాక్షివి విజ్ఞానమయుఁడవు వేదవిదుఁడ
వష్టమవసువు నీ వవ్వసువులయందు శంకరుఁడవు రుద్రసముదయముల
నాదికర్తలఁ జతురాననుండవు నీదుకర్ణంబు లశ్వినులు కనులు సూర్య
చంద్రు లాద్యంతము ల్సకలంబునకు నీవ నిర్ముక్తగుణుఁడవు నీవ నిత్య
తే. బుద్ధశుద్ధాద్వయుఁడ వీవ భువిని నీదు, మాయలోఁ బడువారికి మనుజభంగిఁ
దోఁచుచును లేనివారి హృత్తోయజముల నెల్లకాలంబులును విలసిల్లు దీవ 158

వ. రఘునందనా! నీదునామస్మరణసేయు మహాత్ములకు సమీపవర్తి వగు కరుణా
మయుండవు నీవ మఱియును. 159

క. మును వీఁడు మానువైభవ, మును నిలయంబులును గొనియె ముక్తిప్రద! నేఁ
డనయంబు మీపరాక్రమ, మున సంతసముగ సమస్తమును జేకూరెన్. 160

వ. తదవసరంబున సత్పథవర్తియగు కౌసలేయుం గనుంగొని ప్రణతుండై పితామహుం
డిట్లనియె దేవా! మీ రిమ్మాయాసీత నొనరించుట లెవ్వ రెఱుంగ రిప్పుడు హుతా
శనునందుఁ బరిత్యజించి తదంతరస్థాపితయగు జనకకన్యకామణిం గైకొనినం దగు
నంచు మఱియు నిట్లనియె. 161

సీ. ఓంకారవాచ్య! సద్యోగివంద్య! పరేశ! రంజితలోక! సూర్యప్రకాశ!
యాద్యంతరహిత! హేయాహేయవర్జిత! సర్వహృత్సంస్థిత! సత్స్వరూప!
మరకతవర్ణసుందర! శుద్ధ! మధురేశ! నిర్విషయజ్ఞాన! నిత్యబుద్ధ!
మానవరూప! నిత్యానంద! భావితరూప! లోకాధార! పాపహరణ!
తే. శంకరాదులు నీపదాబ్జాతయుగము, సంపదాసక్తు లగుచు సచ్చవ లానర్త
రట్టి యధ్యాత్మవిజ్ఞాను లైనవారి, హృదయభావ్యుండ వగుదు నీ వెపుడు రామ!.

క. బృందారకబృందంబులు, బృందావనమందుఁ బొగడఁ బృథునీలలస
త్కుందోపమసుందరుఁడవ, నం దగు గుణధామ! వందనం బిదె రామా!. 163

వ. మఱియు విగతమోహులగు సురలు దృఢవ్రతంబున. 164

తే. హృదయమందునఁ బవనసమన్వయములను, గుదియఁగను బట్టి నిలుఁగట్టి కూర్మిఁబట్టి
పట్టి వీఁడని భవము పోఁగొట్టియట్టి, దిట్ట దవరాని గతి గాంతు రినకులీన!. 165

సీ. పరిపూర్ణనుతనామ! భక్తిగమ్య! సమస్తవేదశాస్త్రప్రతిపాదకాఢ్య!
దృగ్రూపరత్నకిరీట! మాయాతీత! యీశ! మాయాసక్తుఁ డెఱుఁగఁ గలఁడె
మానీంద్రయోగవిధానయోగాభ్యాసభావితు లగునారి భావమునకు
సహచారివగు నిన్ను సకలలోకముల కాద్యంతుఁడవును బ్రోవ నధిపతివియు

తే. నీవె భువనాఢ్య! నాచేత సేవ లొంద, నింద్రనీలాభదేహ మింపొందఁ దాల్చి
దశరథాధీశ్వరునకు నందనువిధంగిఁ, గూర్మి చెలువొందఁ బుట్టిన ధార్మికుఁడవు 166

క. ఏకాకేసుసుఖావహ!, లౌకికమన నాతిగమ్య! లక్ష్మీవ! స
త్కాకుత్స్థకులాధీశ్వర!, శోకాప్తసమానరత్నకోటీర! హరీ! 167

వ. దేవా! విష్ణుండ వనాదిపురుషుండవు రమణీయుండవు భావాభావప్రత్యయవర్జితుండవు జగత్పావనుండవును ననుచు వేదంబులు పలుకు నట్టి జగన్నాథా! నీవ మన్నాథుండ వింక శ్రద్ధాభక్తిగరిష్ఠులై యెవ్వరైనను నిన్నుం గొనియాడినయట్టి సత్పురుషకామితకామప్రదుండవు శ్యామలతనుండవు నగు నిన్నుం దలంచుచు బ్రహ్మజ్ఞాననిధానంబును నాద్యంబును నగు నీ స్వరూపంబుఁ బరియించిరేని విగతపాతకజాలులై భవత్సాన్నిధ్యంబు నొందెదరు గావున ననుచు బహువిధంబుల వినుతి యొనరించె నిట్లు పలుకు లోకగురుని వాక్యంబులు విని ప్రపంచసాక్షి యగు వైశ్వానరుండు విమలారుణద్యుతికలితయు రక్తాంబరయు దివ్యభూషణాంచితయు నగుచు. జెలువొందు విదేహరాజకన్యకామణిం గైకొని ప్రపన్నార్తినివారణుండగు రఘునాయకు సమీపంబునకుం జనుదెంచి యిట్లనియె. 168

సీ. దేవ! గైకొనుము విదేహావనీశ్వరనందన మును దశానను వధింప
నటవియందునను మాయామహీజ నొనర్చి నాయందు నిలిపితి వీయిలాత్మ
జను నేఁడు బాంధవసహితుండై దశకంధరుఁడు తావకాస్త్రాలి నడఁగ మిందు
ధారుణీభర మెల్లఁ దఱిఁగెఁ దత్ప్రతిబింబితయు తిరోహితయయ్యె నయముతోడఁ

తే. బరమపావనిఁ దావకపాదపంక, జార్పితస్వాంత నిర్దోష సవనినుతను
గైకొనుము దీన నఖిలలోకములఁ గప్పు, భీతిఁ బాపుము నీచెవిఁ బెట్టు మనవి.

చ. అని శిఖి విన్నవింప ముదమందుచుఁ దత్ప్రతిబింబరూప నీ
తను విడి పూజచేసనలుఁ దన్వి ముదం బొదవన్ సదానపా
యిని యగు లోకమాత మిథిలేంద్రతనూభవ సీత నంకమం
దున ధరియించె రాముఁడు మనోభవసుందరుఁ డాత్మఁగాంబునన్. 170

వ. ఇట్లు జనకకన్యకాకలితస్వాంకప్రదేశుం డై వెలయు కౌసల్యానందనుం గనుంగొని ముకుళితకరకమలుం డై దేవనాయకుం డిట్లని వినుతింపం దొడంగె. 171

సీ. సన్మానిజనచిత్తసౌగసాదూరుఁ డై భూరినీలాభ్రశరీరుఁ డగుచు
జనకజాతానందసందోహగేహుఁ డై సంభృతభిన్నిజోత్సాహుఁ డగుచు
నఖిలప్రపన్నార్తిహరణాభిధానుఁ డై ప్రబలరాక్షసతమోభానుఁ డగుచు
నగజామనోభావితానందరూపుఁ డై పాపవనాగ్నిప్రతాపుఁ డగుచు
తే. యోగమాయను గూడి తా నుర్వి నుండు, ననుజాకరణిని దోఁచుచుఁ దనదుచరిత
ములు వినినవారు సంతసమున మునుంగఁ, దనరు నెవ్వఁడు గొల్తు నద్దాశరథిని.

చ. సితకరకోటితుల్యముగఁ జెన్నువహించిన కీర్తిమంచు భూ
సుతఁ గనకాంబరావృత విశుద్ధతటిత్ప్రతిభ నంకమందు సం
తతము వహించి భూభరవిదారణుఁ డై యమరాళి కెల్ల స
ద్భృతము జనింపఁజేయు రఘుపుంగవుఁ గొల్తు నిజాశ్రితావనున్. 173

క. అమరుల దుఃఖము లెల్లను, సమయఁగఁ జేయుటకె మొదటిసాధనుఁ డై రు
ద్రముఖాదుల కగపడు పం, క్తిముఖాంతకు జానకీపతిని భజియింతున్. 174

క. సొగసుదగి హరివరేణ్యం, డగచరహితుఁ డీశుఁడును నిరాకారుఁడు ప
న్నగవలయసఖుఁడు నై మి, న్నగు నెవ్వఁడు గొల్తు నాపరానందమయున్. 175

క. యోగులు నిజభూరితపో, యోగంబునఁ దలఁపఁ దనువు నొగిఁ దాల్చి తను
ద్యోగానుసారి యగుచును, బాగగు చిన్ముద్ర గామభద్రుఁ దలంతున్. 176

తే. గర్వమున నుంటి మున్నును సర్వలోక, నాథుఁడ నటంచు నోజగన్నాథ! నీదు
పాదదర్శనమున నది వాసె నింక, మీఁద నీదాసులను గూడి మెలఁగువాఁడ 177

## దశరథుఁడు శ్రీరాముని యాశీర్వదించుట

సీ. అఖండలుం డిట్లు వినువేళ దివమున భగవంతుఁడగు పురభంజనుండు
వ్యోమయానంబునం గుండి పల్కె రామ! రామ! రాజకులాబ్ధిసోమ! చూడు
మిద భవద్వైభవం బెలమిఁ గన్గొన వచ్చె దశరథేశ్వరుఁ డొంటి తనువుఁ దాల్చి
మత్ప్రార్థ్యమునకు సమ్మతి దినంబుననుండి యనిన రాముఁడు సుమిత్రాత్మజుఁడును
తే. భక్తితో నంత నవ్విభుపదములకును, వందన మొనర్పఁ గౌఁగిటియందుఁ జేర్చి
శిరము మూర్కొని మిగుల నాశీర్వదించి, పలికె నప్పుడు దశరథుఁ డబ్జపత్రనయన!

తే. భూరిదుఃఖాలయంబు సంసారజలధి, వత్స! నీచేత దీని కావలను నయితిఁ
గాని నిను వీడి యుంట నాకమున నయిన, సంతసము లేదు సుతుఁడ నఁ జను నెనిన్ను

వ. అనుచు మరలి యాలింగనం బొనర్చి రామచంద్రుచేతఁ బూజితుం డయి దివంబు.

నకుం జనియె నప్పుడు ముందు ముకుళితకరకమలుం డయి వినుతియొనరించు పాక
శాసనుం గనుంగొని రఘువల్లభుం డిట్లనియె. 180

ఉ. సురవర! వానరోత్తములఁ జూడు మదీయజయంబుఁ గోరి కూ
లిరి రణమందుఁ దొంటిక్రియ లేచెదుర ట్లమృతంబు చల్లు స
త్వరమున నన్న న ట్లమృతవర్ష మొనర్పఁ బ్లవంగసైన్యము
ల్చిరదిన మేలుకొన్న క్రియ లేచిరి దొల్లిటికన్న దార్ఢ్యులై. 181

వ. ఇట్లు లేచి సింహనాదంబులు సేయుచు రామచంద్రు సమీపంబునకుం జనుదెం
చిరి శైలనందనా! తత్సమయంబున విభీషణుండు రఘువల్లభు సమీపంబునకుం
జనుదెంచి కరయుగంబులు మోడ్చి యిట్లనియె దేవా! నాయందుఁ గృప గలదేని
సీతాసమేతుండవై మంగళస్నానం బొనరింపుము లక్ష్మణుండునుం గూడి వివి
ధాలంకారశోభితుండవై మమ్ములఁ దోడుకొని వెల్లి చనందగు ననిన రాఘవేశ్వరుం
డిట్లనియె. 182

మ. సుకుమారుండు మదీయభక్తుఁ డతిసంశుద్ధుం డటన్ నాదుపో
లికఁ జీరాజినధారియై భరతుఁ డక్లేశంబున న్నిల్వ న
య్యకలంకు న్విడి స్నానమే క్రియను జేయ న్నేర్తు సుగ్రీవము
ఖ్యకపిశ్రేష్ఠులఁ బూజసేయు మిటు సేయం బ్రీతి నా కయ్యెడున్. 183

క. అని పల్క విభీషణుఁ డ, వ్వనచరసైన్యముల వలయువస్తువులను గాం
చనవస్త్రభూషణాదులఁ, దనిపె ముదం బొదవ నపుడు తనిసిరి వారల్. 184

వ. రాఘవుండును వారి నందఱ వీడ్కొలిపి విభీషణుండు తోడితెచ్చిన భాస్కర
సదృశంబును నుత్తమంబును నగు పుష్పకాఖ్యవిమానంబున యశస్వియు లజ్జమా
నయు విద్యున్నిభాంగియు వివిధాభరణభూషితయు స్మేరాననయు నగు విదేహ
కన్యకారత్నంబును స్వాంకస్థలంబునం దిడుకొని విశ్రాంతధనుర్హస్తుండగు లక్ష్మ
ణుండు తోడునిలువ నారూఢుండై సమస్తవానరులను సుగ్రీవాంగదవిభీషణులం
గనుంగొని యిట్లనియె. 185

ఆ. మిత్రకార్య మెల్ల మీచేతఁ జేయంగ, నొప్పె నింకఁ గష్ట మొందనేల
సైన్యయుక్తు లగుచుఁ జనుఁడు నిజాలయం, బులకు మీకు సమము గలరె భువిని.

వ. విభీషణా! నీవు మద్భక్తుండవై సకలసుఖంబు లనుభవింపుచు లంకారాజ్యంబున
నిలువు మాఖండలసహాయులగు దివౌకసు లయినను నిన్ను ధర్షింప సమర్థులు గా
రేను పితృరాజధానియగు సాకేతపట్టణంబుఁ గనుంగొన నిచ్ఛయించెద ననిన
విభీషణుండును సుగ్రీవప్రముఖవనచరోత్తములును బాష్పాకులలోచను లై యి
ట్లనిరి. 187

ఉ. పరమాహ్లాదముతో నయోధ్య నగు మీపట్టాభిషేకంబు నీ
శ్వరునిం బుత్త్రునిగాఁగఁ దాఁ గనిన కౌసల్యాసతిం గాంచ నం
దఱముం గోరెద మాజ్ఞ యిం డనిన సీతావల్లభుం డయ్యెడం
బరమోత్సాహము నొంది నంత రఘుభూపాలాజ్ఞచే వారలున్. 188

## శ్రీరాముఁడు సీతాసమేతుఁడయి పుష్పకము నెక్కుట

వ. కౌబేరంబగు పరమాసనంబున వాయునందననలనీలాంగదజాంబవంతప్రముఖు లతి
ముదంబున. 189

క. ఆరోహణం బొనర్చిరి, యారఘువరునాజ్ఞచేత నదియు రయమునన్
ధారాధరమండల మటు, మీఱి దివంబునకు నెగసె మీనవిభాతీ!. 190

వ. తత్సమయంబున. 191

క. ఆకౌబేరంబందునఁ, గాకుత్స్థకులేశుఁ డొప్పె గగనమున సురా
నీకము పొగడ మరాళము, పై కాంతాసహితుఁ డైన పద్మజుకరణిన్. 192

తే. అదియు మార్తాండబింబతుల్యాభ మగుచు, రామలక్ష్మణసీతలచే మెఱుంగు
వెట్టునటు లవ్విహాయసవీథియందుఁ, జనఁగఁ దొడఁగెను బవనుచందమున వడిని.

వ. అనుచు. 194

క. శైలజ కిటు శ్రీరాముని, లీలలు పల్కుచును గుండలి(కదంబకవ)
ర్యాలంకారుఁడు రఘుభూ, పాలుని యవ్వాలితెఱంగు పలుకఁ దొడంగెన్. 195

వ. అట్లంబరంబున నరుగు నవసరంబున నఖిలదిగ్భాగంబులం జూడ్కులు ప్రసరిం
పంజేయుచుఁ దత్కాలంబునకుం దగినట్టి వాక్యంబుల నమ్మిథిలేశ్వరకన్యకామణి
యగు సీతతోడుత రఘునందనుం డిట్లనియె 196

సీ. అదియ త్రికూటశైలాగ్రంబునను లంక రణభూమి యదె మాంసరక్తపంక
సంకులం బదియ రాక్షసకీశవైశసస్థలం బిచట వానరులు వొగడఁ
దునిమివైచితి రావణునికంధరము లింద్రజిత్కుంభకర్ణులు చేటుగనిన
చోటు లల్లవియ యచ్చోట సేతువు సముద్రమునఁ గట్టించితిఁ దవరు నిదియు

తే. సేతుబంధం బటంచు విఖ్యాతితోడఁ, జూడఁ గ్రుంకిన మ్రొక్కిన వీడి చనును
గల్మషంబులు సౌఖ్యముల్ గల్గు నిదియు, వార్ధితీర్థం బపారంబు వనజనయన!. 197

క. ఇచట జగత్పతి శంభుం, డచలుఁడు రామేశ్వరాఖ్య నలరెను నాచే
నిచట విభీషణుఁ డురుస, ద్వచనుఁడు నను శరణుఁ గాంచెఁ దనమంత్రులతోన్.

వ. ఇదియు సుగ్రీవునిరాజధాని యగు కిష్కింధానగరంబు చిత్రకాననశోభితం
బనియు నచ్చట సుగ్రీవుండు సీతాప్రియార్థంబు తారాప్రముఖవానరకాంతాస

ముదయంబుల రావించె నంత మరలి పుష్పకం బంబరంబునం జనుసమయంబున
రాఘవేశ్వరుండు నిజజీవితేశ్వరిం గనుంగొని. 199

సీ. కమలాక్షి! ఋశ్యమూకధరాధరేంద్ర మల్లదియ వాలిని ద్రుంచి తీస్థలమునఁ
పంచవటీ యను భవ్యాశ్రమం బిదె ఖరదూషణాదుల నఱికివైచి
తిచట నగస్త్యమునీంద్రు నాశ్రమ మిదె యిదె సుతీక్ష్ణుఁడు తపం బొనరుచోటు
తాపసోత్తము లెల్లఁ దపము లొనర్చెడుచోటు లల్లవె చిత్రకూటభూరి
తే. భూధరేంద్రంబు కైకయీపుత్రుఁ డిచట, మత్ప్రసాదంబు గాంచె సన్మాన్యచరితుఁ
డగు భరద్వాజమౌనిపుణ్యాశ్రమంబుఁ, జూడు యమునాతటంబున సొంపుమీఱ.

వ. మఱియును. 201

సీ. కాంచు భాగీరథి గంగాభవానిఁ ద్రిలోకపావనిఁ బుణ్యలోకదాయి
నిది యూపశాలిని యగు సరయూనది యదియు సుందరి! యయోధ్యాపురంబు
సీయు ప్రణామంబు చేయు మెత్తి యటంచుఁ బలుకుచుఁ గని భరద్వాజునాశ్ర
మంబున డిగి వత్సరంబులు పదునాల్గు చనినఁ బంచమియను దినమునందు
తే. నమ్మహాత్ముని గని భూసుతానుజాభి, యుక్తముగ మ్రొక్కి మునివర్య! యిప్పుమీఱ
భరతశత్రుఘ్ను లుందురే పట్టణమున, భిక్షమె బ్రదికి తల్లులొ ప్పెదరె యచట.

తే. అనిన మునివర్యుఁ డనియెఁ గల్యాణచరిత!, కుశలు లందఱు మీరాకఁ గోరి జడలు
దాల్చి కృతకార్యములు నివేదన యొనర్చి,పాదుకలఁగొల్చితమ్ముఁ డౌభరతుఁడొప్పు.

క. వనమున మీ రొనరించిన, ఘనకార్యము లెల్లఁ దపముకలిమి నెఱుఁగుదుఁ గా
జనవర! నారాయణుఁడవు, మనుజాలవ్యాదయముల నిలుచు మహితుఁడ వీవే. 204

తే. ఆదిమధ్యాంతరహితుఁడవైన బ్రహ్మ, వనఘ! పరుఁడవు సర్వవిశ్వాత్మకుఁడవు
బ్రహ్మ పుట్టెఁడె నీనాభిపంకజమున, లోకగురు వని ప్రఖ్యాతి వీఁకఁ గనఁడె. 205

వ. అట్లు గావున. 206

ఆ. నీవు లోకములకు దేవుఁడ విట్లన, మస్కృతుండ వీవు మాధవుఁడవు
సీత లోకమాత శేషుండు లక్ష్మణుం, డగయుజనుల కిట్టు లౌదు వీవు. 207

వ. మఱియు మొదట సలిలంబుఁ బుట్టించి భూతకృతుండవై యందు శయనించినవాఁ
డగుటను విశ్వాత్ముండవై నరులవ్యాదయంబుల వెలింగెదవు గావునను నారాయ
ణుండ వను నభిధానంబుఁ గంటివి సకలభూతంబులకును బహిరంతరంబులు నీవ
యొక్కండవయ్యు నాకాశంబుభంగి నలేపకుండ వయ్యు మాధవ్యష్టులకుఁ బెక్కు
భంగులఁ గనిపించుదు రఘునందనా! నీలీల లెన్నియని వర్ణింప నేర్తుము కల్పితంబగు
విశ్వంబును దద్విశ్వాధారుండవును బరిపాలకుండవును భోజ్యంబు లగు వస్తుచ

యంబులును భోక్తవును భూతభవిష్యద్వర్తమానత్రికాలంబులను గలుగు సకలం
బును నీవ యగుదును భవదన్యపదార్థంబు లే దనుచును జగద్విదితంబుగ
శ్రుతులు చాటుఁగదా మఱియు నచలంబులగు వృక్షాదులు చలనక్రియఁ గలుగు
మారుతసంబంధంబువలనఁ జలియించుపోలిక మీచేతఁ బ్రేరితం బగుచు జడభూ
తంబగు మాయ నిజావయవంబులగు మహదాదులచేత నొనరించిన జగం బంతయు
మూఢులు మీయందు నారోపింతురు గదా జగదీశ్వరా! యిది యెంతవిచిత్రం
బగు నింక దేహశూన్యుండవు జగద్రక్షకుండవు నగు నీకు విరాట్సంజ్ఞ యగు
స్థూలంబును సూత్రసంజ్ఞయగు సూక్ష్మంబును నగు రెండుదేహంబులు గల వవ్విరా
ట్సంజ్ఞయగు స్థూలదేహంబువలన ననేకలీలావతారంబుల నుద్భవింపఁజేయుచుఁ
గార్యాంతరంబు లద్దేహంబునందే మరలఁ బ్రవేశింపఁజేయుదు వయ్యవతారకృత
లీలాశ్రవణమనననిదిధ్యాసలవలన జనులు విముక్తు లగుదు రట్టి యాదినారాయణుం
డవు మద్దృష్టిగోచరుండవైతి వేమని నాదుభాగ్యంబు గొలందిసేయనగు మఱియును.

మ. ధరణీభారము మాన్పఁ బద్మజునిచేతం బ్రార్థితుం డౌచు నీ
కరణిం బుట్టితి వార్యసమ్మతములౌ కార్యంబులు న్నీదుచే
సరణిం జేయఁగ నొప్పె వత్సరసహస్రంబుల్ ధరాపాలన
స్ఫురణం జెన్నువహింపఁగాఁ గలవు మత్పుణ్యాతిరేకంబునన్. 209

ఆ. రామచంద్ర! భువిఁ దురంగమేధంబులు, చేసి తత్కథలను వాసి మీఱ
నిఖిలజగములందు నిండింపఁగల రవి, చదువ వినిన ముక్తి జనులఁ జెందు. 210

క. మాయాశ్రమంబునకు నా, రాయణ! సమ్మతిపవిత్రమా నాగృహముల్
నీయంఘ్రిరేణువున నీ, వే యిచ్చట నిలిచి తగను రేపటఁ జనఁగన్. 211

## శ్రీరాముఁడు హనుమంతుని భరతునొద్దికిఁ బంపుట

వ. అని మహర్షివర్యుండగు భరద్వాజుండు విన్నవించిన సమ్మతించి సీతాలక్ష్మణస
మేతుం డై ససైన్యంబుగ నిలిచి యించుకంతతడవు విచారించి పవమాననందనుం
గనుంగొని యిట్లనియె. 212

ఉ. మారుతపుత్ర! నీ విపుడు మత్సఖుఁడౌ గుహుతోడఁ దమ్ముఁడుం
దూరితశత్రుఁడౌ భరతుతోడుత మత్కుశలంబు పల్కి దో
స్సారుల రావణాదులను జక్కడఁగించుటఁ దెల్పి తల్లులే
తీరున నుండిరో తెలిసి తీవ్రమె రమ్ము సుబుద్ధిశాలివై. 213

తే. అనుచుఁ బలికిన మనుజాఁడై యహికులేంద్రుఁ, గదియు వినతాతనూభవుకరణి నేఁగి
ప్రీతితోడుత గుహు శృంగిబేరపురము, నందుఁ గని రాఘవుల క్షేమ మంత నపుడు.

వ. తెలుపువాఁడై ప్రహృష్టచిత్తంబున నిట్లనియె నిషాదవల్లభా! శ్రీమంతుండును భవత్సఖుండును నగు దాశరథి సీతాలక్ష్మణసమేతుండై నీతోడఁ గుశలంబు పలుకు మనియె నమ్మహాత్ముండును భరద్వాజమునీంద్రుచేత ననుజ్ఞాతుండై యిచ్చటకుం జనుదెంచు నీవునుం జూడఁగల వనుచుఁ బులకాంకితతనూరుహుండగు నప్పుణ్యు వీడ్కొని వాయుపథంబున వెడలి రామతీర్థంబగు సరయూప్రవాహంబు దాఁటి నందిగ్రామంబు గాంచి క్రోశమాత్రదూరంబున నుండి యచ్చట. 215

క. మలపంకవిదిగ్ధాంగుఁ, ఫలమూలాహారు రామభద్రపదాబ్జో
జ్జ్వలదర్శనచింతాపరు, బలభిద్విమతోరుచరితు భరతుం గనియెన్. 216

వ. మఱియును. 217

సీ. సకలవసుంధరాచక్రభారం బంతయును పాదుకలయందు నునిచి వల్క
లంబులు గట్టి దేహంబు కృశింపఁగ నాశ్రమంబున నుండి యఖిలపౌర
జనులు మంత్రులు వీడఁజాలక కాషాయవస్త్రులై తనుఁ గొల్వ వసుధయందుఁ
దనువుతో ధర్మ మంతయు వచ్చి నిల్చెనో యన నట్టు లున్న ధర్మాభిరతు
తే. భరతుఁ గని పుణ్య మేదేవు పాదదర్శ, నంబు వీక్షించె దీ వట్టి యంబుజాక్షుఁ
డాహవంబున దశకంధరాదివీర, దానవులఁ జంపి కుశలియై తనరు నిపుడు. 218

ఉ. ఏటికిఁ జింత లక్ష్మణమహీజలతోడుత రామచంద్రుఁ డి
ప్పాటికి వేగ రాఁగలఁడు చూచెద వీ వన సంతసించి య
మ్మాటకు మూర్ఛనొంది కులమండనుఁ డాభరతుండు లేచి శై
లాటకులాగ్రగణ్యుఁ బవనాత్మజుఁ గౌఁగిటఁ జేర్చి వేడుకన్. 219

సీ. పుణ్యచరిత్ర నీపుణ్యంబునను రాఘవేంద్రు సద్వార్తల నెఱుఁగఁ గంటి
మనుజుండవో కాక మమ్ము రక్షింపఁగఁ గరుణ నేతెంచిన సురవరుఁడవొ
యివ్వాక్యమునకు నీ కిచ్చెదఁ గైకొను గోసహస్రములను భాసమాన
భూషణాంచిత లగు పొలఁతుల బదియార్గురను గ్రామశతముల ననుచు ననియె
తే. నిట్టు లని భవ్య! బ్రతికినయేని సౌఖ్య, మొందు నెప్పుడైన ననుగాథ యొప్పె నిప్పు
డాత్మనమ్మంగ మనుజుల కగచరులకుఁ, బలుకుసాంగత్య మెబ్భంగిఁ గలిగె మఱియు.

వ. ప్రీతికరంబగు రఘునాథుకీర్తనంబు విని బహుదినంబు లయ్యెఁ గావున సత్యం బుగఁ బల్కిన నమ్మెద. 221

మ. అనిన న్మారుతనందనుం డపుడు కల్యాణంబునౌ రాఘవేం
ద్రుని వృత్తాంతము నంతఁ బల్కినను జేతోమోదముం జెంది చ
య్యన శత్రుఘ్నునిఁ జేరి నీ విపు డయోధ్యాపట్టణం బెల్లఁ గాం
చనతోరణోజ్జ్వలమౌక్తికాంబురుహభాస్వద్వస్త్రమాల్యాదులన్. 222

వ. అలంకరించునట్టులును నెల్లెడలఁ గల్గు దేవతాయతనంబులకు నానోపహారబలివిధానంబు లాచరించునట్టులును జేయింపుము వెండియు. 223

క. దూతలు స్తుతిపాఠకులును, వైతాళికజనులు వారవనితలు గుములై
సీతాచేతోవల్లభు, భాతిం గనుఁగొనఁగ వెడలుపగిది రయమునన్. 224

తే. బ్రాహ్మణోత్తములును సర్వపౌరజనులు, రాజకాంతలు మంత్రులు రాఘవేంద్ర
పూర్ణచంద్రుని బోలు నెమ్మోముఁ గాంచు, వేడుకలు పల్లవింపంగ వెడలిరపుడు.

క. చనుదెంచున ట్లొనర్పుము, యనవంశధ్వజచయంబు లెత్తఁగ ద్వారా
ళిని దోరణములు గట్టఁగ, ఘనతరసౌధములు మేలుగా నొనరింపన్. 226

భరతశత్రుఘ్నులు శ్రీరాము నెదుర్కొనుట

వ. చేయింపు మనిన నట్లె యని యట్ల నియోగించి శిబికారూఢు లగుచు రాజకాంతలు వెడల శతసహస్రతురంగంబులను నయుతగంధసింధురంబులను స్వర్ణరత్నభూషితంబు లగు దశసహస్రరథంబులను నానోపాయనపాణులగు భూసురకోటులం దోడుకొని శత్రుఘ్నుండు గూడి రాఁగ భరతుండును దనయన్న యగు రామచంద్రు పాదుకలు శిరంబునం దిడుకొని ముకుళితకరకమలుండై పాదచారి యగుచుఁ దద్దర్శనాభిలాషి యై వెడలె నాసమయంబున ముందర. 227

సీ. కనుపించె నీరజాసనమనోసృష్టతం బంబరంబునఁ బుష్పకంబు చంద్ర
కాంతితోఁ జూత నంతఁ గనుఁగొనం దదె జానకియు రామలక్ష్మణుల్ కీశవిభుఁడు
సుగ్రీవుఁ డదె బలోదగ్రుఁ డైన విభీషణుండు మంత్రులతోడ నంగదుఁ డాడుఁ
డని హనుమంతుఁ డిట్లనిన నబ్బరతుండు స్త్రీబాలవృద్ధులు చెల్వమీఱ

తే. నదిరె రాముఁడు రాముఁ డంచనఁగఁ దొడఁగి, రందఱును వాహనంబుల నపుడు డిగ్గి
కలితముకుళితపాణులై నిలిచి రంత, భావనంబున జంద్రరథంబు గతిఁ 228

వ. సమీపించె నాసమయంబున హృష్టమానసుం డై కరయుగంబులు మొగిడ్చి మేరుధరాధరస్థుండగు భాస్కరునకు నమస్కరించుచందంబున. 229

క. రామునకు సన్నమస్సు, త్రామునకు సముత్థదైత్యదానవభటహృ
ద్భీమునకు దయితసీతా, భామునకు నమస్కరించె భరతుం డపుడున్. 230

క. రామాజ్ఞ నవ్విమానము, భూమిస్థం బయ్యె నంతఁ బొలుపుగఁ దమ్మున్
శ్రీమంతు భరతుఁ గౌఁగిట, నేమంబునఁ దిగిచి కరముచేఁ జుబుకంబున్. 231

వ. పుణుకుచు రఘువల్లభుండు. 232

క. కనుఁగొంటిని బహుదినముల, కని యంకమునందుఁ దిగుచు చాతనిదేహం
బునఁ గల్గు భూపరాగము, తనకరయుగములను నిమిరెఁ దామరసాక్షీ!. 233

వ. ఇట్లు భరతుం గౌరవించె నాసమయంబున లక్ష్మణుండు జనకనందనసుగ్రీవాదు
లుపన్యసింప భరతుండును సంతసంబునొంది వినుతించుచు జాంబవంతాదివనచరులం
గౌఁగిలించుకొని వారలం బలికె వారును మానుషాకారంబుల నబ్భరతునకు మైత్రిఁ
జూపి రంత భానునందనుం గనుంగొని 234

తే. నీసహాయంబునను భానుతనయ! మేము, పగతుఁ జంపితిమని రాఘవుఁ డనుచు దనుజవరుల
గెలిచి యిటు గాన నన్నదమ్ములము మేము, నలువురము నీవ యైదవ దలఁపుమా రవి.

వ. అంత శత్రుఘ్నుండును. 236

తే. రామలక్ష్మణులకును శ్రీరామకాంత, యైన భూపుత్త్రికిని వినయమున మ్రొక్కి
వినుతియొనరించె రాఘవుండును స్వమాత, యైన కౌసల్యసన్నిధి కరిగి యపుడు.

వ. శోకకర్శిత యగు నప్పుణ్యవ్రతకు నమస్కరించి కైకేయీసుమిత్త్రల చరణంబుల
కెఱఁగి వినయంబు సలిపె నాసమయంబున. 238

క. భరతుఁడు స్వాభావికసచ్చరితుఁడు పాదుకలు రామచంద్రుని పదపం
కరుహములయందు నిలిపెను, గురుతరపూజలఁ దనర్చుకొని ఘనభక్తిన్. 239

వ. ఇట్లు రఘునాయకు పాదారవిందంబులయందుఁ బూజితంబులగు పాదుకలు నియో
జించి ప్రాంజలిఘటితకరయుగళుం డై యిట్లనియె. 240

సీ. జానకీనాథ! రాజ్యం బింతపర్యంతమును బాదుకలయందు నునిచి యిప్పు
డతిభక్తి మీకు సమర్పణ గావింప సఫలమయ్యెను నా జన్మ మెల్ల
రంజిల్లె మన్మనోరథము లయోధ్యాపురమ్మున కరుదెంచు మిమ్ముఁ గాంచ
బాగుమీఱంగఁ గోష్ఠాగారబలకోశములు దశాంశల మించెఁ దెలియు మీదు

తే. తేజమున నింతపూసితి రాజవర్య!, యనుచుఁ బలికిన భరతుని గని సమస్త
వనచరేంద్రులు కన్నుల వారి నించు, చును ప్రశంసించి రంతట సుందరాంగి! 241

వ. రాఘవుండును. 242

క. తనయనుజుని సద్గుణముల, కనుమతుఁ డై వెడలి యతని యాశ్రమమునకుం
జన డిగ్గి పుష్పకంబును, గనుఁగొని రాఘవుఁడు పలికెఁ గరుణ దలిర్పన్. 243

వ. చనుము కుబేరు వహింపు మేము దలఁచుసమయంబున రమ్మనుచుఁ బుష్పకంబును
వీడ్కొలిపె. 244

క. దేవేంద్రుండు బృహస్పతి, సేవించినభంగి వసిష్ఠుని భక్తిన్
సేవించె రామచంద్రుం, డావసమున వికచపంకజాయతనయనా. 245

వ. అనుచుఁ దద్వృత్తాంతం బంతయు మహాదేవుండు భవానికిం జెప్పి మఱియు నిట్లని
యె నిట్లు మహాత్మునకుం దనకు రెండు సింహాసనంబులు దెప్పించి యుభయులునుం
గూర్చుండి సంభాషించు నవసరంబున. 246

వినయంబున భరతుం డో, వనజాక్ష! మదీయజననివలనను గృపచే
తను రాజ్యము పొసఁగితిరి యది, మును పొసఁగినభంగిఁ గొనుఁడు ముదమున మరలన్.

సీ. అనుచు భరతుండు ప్రాంజలియగుచు వేఁడఁ, గైకయీదేవి వినుతింపఁ గాత్య మనుచు
నవ్వసిష్ఠుండు పలుక రాజ్యాధిపత్య, గౌరవము నూనె రామభూకాంతుఁ డపుడు.

వ. అమ్మహాత్ముండు మాయాగుణంబు ననుసరించి యార్యచేష్టలు చేయుచుండు నిదియుకా దఖిలదేవతారాజ్యవైభవధారేయుండును సుఖజ్ఞానైకరూపుండును నిరస్తాతిశయుండును నానందరూపుండును నగు జగదీశ్వరుని కిమ్మనుష్యరాజ్యం బెంత మఱియును,

ఏదేవు కరుణారసేక్షణం బాఖండలాధిపత్యము మానవాళి కొసఁగు
నేపుణ్యు భ్రూభంగ మీరేడుజగముల నిర్ఘాతముగఁ జేసి నీటఁ గలుపు
నేభవ్యులీలచే నీసృష్టి జనియించు నెవఁడు విరక్తుఁడై యొనరుచుండు
నేమాన్యుఁ డిటు మానవేంద్రుఁడై జనియించి సకలలోకముల కోరికల నొసఁగు

తే. నట్టిధీరున కీరాజ్య మనఁగ నెంత, మనుజుఁ డయ్యును గానఁ దదనుసరణము
గాఁగ దొరయుంచుఁ జెలువొందె గానిలేక, యున్న నేతద్వికారంబు లున్నె యచట

అంత శత్రుఘ్నువచనంబున రామాభిషేకార్థంబు నిపుణులగు శ్మశ్రుకృంతకు లఖిలసంభారంబులు నాయితంబులు చేసి రాసనుయుంబున. 251

జడలు విచ్చి చిక్కు చక్కఁగాఁ గావించి, భరతలక్ష్మణులును బక్కికంటు
సోదరుఁడును మఱియు సుగ్రీవుఁడును మజ్జనంబు లొనరఁజేసి రంబుజాక్షి!.

వ. ఇట్లు స్నానంబు లొనరించి మహార్ఘంబులగు వసనంబులు గట్టి చిత్రమాల్యానులేపనులై యొప్పి రంత భరతుండును సేవకవర్గంబులచేత రామచంద్రునకు రాజకాంతలవలన భూతనయకును మజ్జనంబులు సేయించి రాజార్హంబులగు వస్త్రమాల్యచందనాభరణాదులనలంకృతులం గావించె నయ్యవసరంబునఁ బుత్రవాత్సల్యయగుటం జేసి. 253

కౌసల్యయు వానరకాం, తాసముదయముల నలంకృతలఁ జేయించెన్
భాసురమణిమయభూషణ, వాసస్స్రక్చందనాదివస్తువులఁ జెలీ!. 254

వ. అంత సుమంత్రుండు శత్రుఘ్నశాసనంబున సూర్యసంకాశంబగు రథంబుఁ దోడి తెచ్చి ముందఱ నిలిపిన 255

తే. సత్యధర్మప్రవర్తనశాలి రాఘ, వేంద్రుఁ డాస్యందనంబుపై నెక్కి ముందు
పవనజవిభీషణార్కజప్రముఖు లశ్వ, వారణాదుల నెక్కి జోహారు సేయ. 256

తే. దేవి జనకాత్మజయును సుగ్రీవసతులు, యానముల నెక్కి రక్తి దేవాళి గొలువ
ననువుమీఱ పాకశాసననిభంగి, దశరథాత్మజుఁ డొప్పెఁ దత్సమయమునను.

వ. ఇట్లు రథారోహణంబు సేసి. 258

—శ్రీరాముఁడు సపరివారముగా నయోధ్యఁ జొచ్చుట.—

సీ. శ్వేతాతపత్రంబు చెలఁగి శత్రుఘ్నుండు పట్ట సారథి యాయె భరతుఁ డొప్ప
సౌమిత్రి వ్యజనంబు సద్భక్తి ధరియింప రాక్షసేంద్రుఁడు చామరములు వీవ
సురసిద్ధసాధ్యు లంబరమున వినుతింప మనుజాలై వనచరుల్ దన్నుఁ గూడ
భేరీమృదంగశంఖారావపణవానకాదు లజాండంబు భేదిలంగ
తే. మ్రోయఁ జెలువొందివెడలె నారాయణుండు, రాఘవేంద్రుండు లోకసంరక్షకుండు
దివ్యకోదండధారి యాదిత్యవంశ, వార్ధిచంద్రుండు సద్యశోవర్ధనుండు. 259

వ. ఇట్లు హరితవర్ణంబులగు తురంగంబులఁ బూనిన యరదం బెక్కి వివిధాలంకార శోభితంబగు నయోధ్యానగరంబు దరియం జొచ్చి రాజమార్గంబునం జనుదెంచు నవసరంబునఁ బౌరకామిను లెల్ల రామాగమనంబు విని సత్వరంబునఁ జేయుపనులు మాని కాంచనసౌధంబు లెక్కె. 260

సీ. పీతాంబరావృతుఁ బీనభుజాంతరు రవితుల్యతేజు నారక్తపంక
జాయతనేత్రు ననర్ఘ్యముక్తాఫలహారకిరీటకేయూరకటక
కుండలకటిసూత్రమండితు మృగమదగంధలిప్తవినీలగాత్రుఁ గల్ప
భూరుహసుమదాము సూనుతనూజాదికాంతవానరసేవ్యు జనమనోభి
తే. రాము దూర్వాదళశ్యాము రాముఁ గాంచి, యతిముదంబునఁ దన్మూర్తి నఘనివర్తి
వార్త్తకును దృక్కులను బధ్యమైనదాని, నిలిపి రాత్రీయమానసనీరజముల. 261

వ. మఱియు దృక్చకోరంబుల రామముఖచంద్రచంద్రికాస్వాదనంబు సేయుచు లాజలును వివిధంబులగు పుష్పంబులును స్వానందమూర్తి యగు నారాజరత్నంబు పయిం జల్లం దొడంగి రాసమయంబున. 262

ఆ. మందహాసమానసేందుబింబమునకుఁ, దోడు సలుపఁ దనయు లాడుచుండ
వారితంద్రు లరయు వైఖరి చూచుచు, నుండె రాఘవేశ్వరుండు ప్రజల. 263

వ. ఇట్లు కరుణారసావలోకనంబుల సకలజనంబులకు సౌఖ్యం బాచరించుచుఁ దూర్య ఘోషంబులతోడ భరతుండు రథంబు నడుప సర్వాలంకారశోభితంబగు పితృగృహంబుఁ జొచ్చి తదంతఃపురసౌధాంతరంబునఁ దనతల్లి యగు కౌసల్యాదేవిం గనుంగొని నమస్కరించి తక్కిన దశరథకాంతాజనంబులకుం బ్రణమిల్లి యుచితాసనంబులం గూర్చుండి వసిష్ఠాదిమహర్షివర్గంబులు వేఱువేఱఁ బీరంబులం జెలువొంద దివిజవల్లభుండునుంబోలె సత్యపరాక్రమశాలి యగు రామచంద్రుండు భరతుం గనుంగొని యిట్లనియె. 264

తే. అఖిలసంపత్సమాయుక్తమైన నాకు, మందిరము వేగ మత్కుమారునకును
దానవేంద్రునకును జూపి తగినయెడల, నఖిలసైన్యంబులను నిల్పునట్లొనర్పు.

వ. అని నియోగించిన భరతుండును దద్వచనానుకూలంబుగ విడిదలలు గనఁబఱచి సుగ్రీవుం గనుంగొని భానునందనా! రాఘవాభిషేకార్థం బతిత్వరితవేగులగు ప్లవంగపుంగవులం బనిచి చతుస్సముద్రసలిలంబులు దెప్పింపు మిల్లి యొనరించుట నిశ్చయం బనిన సుగ్రీవుండును. 266

ఆ. సమ్ముఖమునకు వాయుజసుషేణజాంబవ, దంగదాదులను బ్రియమ్ముతోడఁ
బిలిచి వారినిధుల జలము దెండు మదాజ్ఞ, చేత రాఘవాభిషేకమునకు. 267

క. అని పలికిన వారు చతు, ర్వననిధులకు నేఁగి వివిధరత్నఖచితకాం
చనకలశముల జలంబులు, దినకరనందనునికడకు దెచ్చిరి ప్రీతిన్. 268

వ. అవ్విధంబు శత్రుఘ్నున కెఱింగింప నతండును నిఖిలమంత్రిగణపరివృతుండై గంగాదిపుణ్యతీర్థసలిలంబులును నవియు వసిష్ఠుండు నునిచిన నమ్మహాత్ముండును వృద్ధులగు బ్రాహ్మణవర్గంబులం గూర్చుకొని సంభ్రమంబున. 269

ఆ. కనకరత్నఖచితఘనపీఠమున రాఘ, వేంద్రు నఖిలభూతలేంద్రవైభ
వప్రకాశుఁ జేయ వసుధాతనూజాభి, యుక్తముగను గూర్చుండఁ బెట్టె 270

## శ్రీరామచంద్రుని పట్టాభిషేకము

వ. ఇట్లు వివిధాభరణభూషితులగు నాదంపతులఁ దత్సింహాసనాసీనులం గావించి భేరీమృదంగాదిమంగళవాద్యంబులు చెలంగ సభాసభ్యగణంబులు జయజయశబ్దంబులు పలుక సుగ్రీవపవననందనాదిప్లవంగచమూవల్లభు లుభయపార్శ్వంబుల వివిధాలంకారశోభితులును వృత్తపాషాణహస్తులునై బలిసికొలువ మహేంద్రాలయసన్నిభంబగు తత్సభామంటపంబున. 271

సీ. గౌతమ వాల్మీకి గాధేయ పైంగళ వామదేవ వసిష్ఠ వాలఖిల్య
జాబాలి కుంభసంజనిత భరద్వాజ ముఖ్యమహర్షులు ముదముతోడ
లలి మించు తులసీదళంబులఁ గుశలచేఁ బుణ్యతీర్థోదకంబుల సుగంధ
సంయుతంబు లొనర్చి శక్రున కైంద్రాభిషేకంబు వసువులు సేయుభంగి

ఆ. రాఘవునకు జనకరాజకన్యాశోభి, తాంకదేశునకు దశాననాబ్జ
గంధసింధురునకుఁ గడఁగి రాజ్యాభిషే, కం బొనర్చి రప్పు డంబుజాక్ష!. 272

వ. తదవసరంబున. 273

చ. విమలములై పయోనిధులు విష్ణుపదీజల మంటె మేఘసం
ఘముల మహాధ్వను ల్సెలఁగె గంధవహుం డనుకూలి యయ్యె సం

ఛత్రము నొకసత్త్ర మర్యు రవిరాజముఖగ్రహసేవ్యమానమై
యమరె నభంబు నచ్చరలు నాడిరి పాడిరి కిన్నరోత్తముల్. 274

వ. ఋత్విక్కులును బ్రాహ్మణశ్రేష్ఠులును దత్కాంతానివహంబులను మంత్రులను సర్వౌషధీరసంబుల నభిషేకంబులు గావించిరి. గగనతలంబున నింద్రాదిదిక్పాలకులు స్వవిమానరూఢులై వినుతింపం దొడంగి రయ్యవసరంబున సింహాసనారూఢుండును రాజ్యాభిషిక్తుండును నగు రాఘవేంద్రునకును. 275

సీ. పాండురచ్ఛత్రంబు పట్టె శత్రుఘ్నుండు చామరంబులు విభీషణసనాట
వల్లభుల్ వైచిరి వాసవచోదితుం డగుచు సమీరుండు హార మొకటి
మణిమయాంచితము రామక్షితీశునకు సమర్పణ గావించె సమ్మహోత్తుం
డంతకన్నను మేటి యగు హార మొక్కటి యిప్పించె శక్రుండుచే మించి యప్పుడు
తే. జంఝణాంఝణజంఝణాంఝణా యటంచు, మొఱసె దుందుభులాకసంబున సురలు
వినుతి గావింపుచును ముంచి విరులవాన, జల్లొనర్చిరి యారామచంద్రుపైని 276

వ. అప్పుడు. 277

సీ. హారకిరీటకేయూరాంగదోజ్జ్వలకటిసూత్రనూపురకలితుఁ బద్మ
పత్త్రాయతేక్షణు భావజకోటిలావణ్యు సుమధ్యు దూర్వాదళాభ
దేహుఁ బీతాంబరు దివ్యచందనలిప్తగాత్రు మహోరస్కుఁ గంబుకంఠు
నఖిలలక్షణు వసంతాదిత్యసంకాశు ద్విభుజు మందస్మితు దీర్ఘబాహు
తే భూసుతాధిష్ఠితస్వాంకుఁ బుణ్యచరితు, భూరిసింహాసనస్థితుఁ బురుషవర్యు
వీరవానరసేవ్యు దోర్వీర్యధుర్యు, రాఘవేశ్వరు దివిజశరణ్యు విష్ణు 278

వ మఱియుఁ దదంకప్రదేశంబున. 279

సీ. కనకసన్నిభదేహ కమనీయరత్నసంఘటితభూషణ గంధకలితనిటల
విద్యున్నిభాంబర వికజాంబుజహస్త శ్రీకోత్పలకరాబ్జ రాజవదన
సద్వాతిశయయుక్త చారుచందనలిప్తవక్షోజయుగళ హారవ్యక్షమధ్య
నూపురాంచితపాద నూత్నయౌవన పుట్టుబాలిక హారహారాభిరామ
తే. పావనచరిత్ర రామపార్శ్వస్థితాంబి, తోరముగ నుత్కయై యొప్పు ధారణీత
నూభవను నిట్లు గాంచి తద్వైభవమున, కతిముదము నొంది గిరికన్యకావిభుండు.

వ. వివాహసంబున సఖిలదేవతాగణయుక్తుం డయి యిట్లని వినుతించె. 281

సీ. చారునీలోత్పలశ్యామలవిగ్రహ! హారకిరీటకేయూరమహిత
భూప! సుమిత్రాసుతోపేత! శ్రీరామ! నీకు వందన మగుఁగాక వాఙ్మ

నో దేహముల నీవు నూఁడి యొక్కలంబు నాద్యంతరహితుండ వగుచు నాత్మ
మాయచే లీలలు సేయుచు నొకఁడవై యొప్పెద వీవ నిజోరుసౌఖ్య

తే. మననిత్యాంతంబుకతుఁడవై మూఁడు గుణము,లను జగంబులఁ బుట్టించి పెనిచి త్రుంచి
లేశమైన సవజ్ఞత లేక తనరు, పూజితుఁడ వీవ దశరథరాజతనయ!. 282

క. కరుణను భక్తులఁ బ్రోచెదు, కోఱను ఋషిపాద్యాకృతులను గుణయుక్తుఁడవై
ధర నుద్భవించి జ్ఞానుల, కిరువుగఁ గనుపించు ప్రభుఁడ వీవ మహాత్మా! 283

చ. ఘనమగు స్వాంశతోడుత జగంబు లొనర్చి మహాఫణీంద్రవృ
త్తిని దదధఃప్రదేశమున దీకొని యయ్యుపరిస్థలంబునం
దనలునిభంగి మేఘముల నన్నిట నిల్పి ప్రవర్షరూపి వై
తనరు మహౌషధుల్ గురియు దాతవు నీవె సరోజలోచనా!. 284

వ. మఱియును. 285

చ. అనలునిమాడ్కి దేహభృతులందున నిల్చి సుస్తభుక్తివ
స్తునిచయముల్ చతుర్గతుల సొంపొదవన్ బచనంబు సేయుచుం
బనివడి నిత్యముం బవనపంచసహాయుఁడవై జగంబులె
ల్లను భరియింపుచుం దనరు లక్షణవంతుఁడ వీవ రాఘవా!. 286

తే. చంద్రసూర్యాగ్నులందును సకలభూత, ములను జెలువొందు కాంతియు మెఱసినారి
ప్రాభవాయుర్యశోధైర్యవైభవములు, నీదు సత్యంబ కాదె నిష్ఖేదరూప! 287

క శివ నారాయణ కమలో, ద్భవ శవి శశి కాల కర్మపరిభేదములన్
ధ్రువముగఁ దోఁతువు వానుల, కవనీతలవిభుఁడ వొకఁడ వయ్యును రామా!. 288

తే. మత్స్య కచ్ఛప వారాహ మనుజ సింహ, వామనాద్యాకృతుల ధరావలయుపోష
ణములఁ జెలువొంది శ్రుతిపురాణములనొప్పు, పుణ్యుఁడవునీవ రామ! సంపూర్ణకామ!.

వ. దేవా! యాది కారణంబున సదసద్విభాగం బగు ప్రపంచంబంతయు నీవ మఱియు
ననంతంబగు సృష్టియందు భూతభవిష్యద్వర్తమానంబులగు స్థావరజంగమంబు
లెల్లను నీవె కాక భవద్వ్యతిరిక్తపదార్థం బెందునుం గనుపింపదు పరాత్మ వగు నీదు
యాథార్థ్యంబు కమలసంభవాదులు నెఱుంగం జాలక భవన్మాయావృతత్వంబు
వలన బహిరంగుండ వనుచుఁ దలంతు రింక నిరుపభక్తి సేవామునుమానసులగు పుణ్యు
లకు నిశ్చయంబుగా నెఱుంగంబడుదు మఱియును. 290

క. ఏమను నీనామము మది, నూని కృతార్థుండ నగుదు నొగి మృతులకు న
మ్మానవులకుఁ దెలుపుచుఁ గా, శీనిలయంబున వసింతు శివతోడ నృపా!. 291

క. ఎవరైన నిత్య మీ స్తవ, మువిదశమతిఁ జదువ వ్రాయ నాకర్ణింపన్

ప్రవిమలసౌఖ్యవహులై, శివముగ నీకృపను నిన్నుఁ జెందుదు రనఘా!. 292

వ. అని యిట్లు పార్వతీవల్లభుండు వినుతించుసమయంబున నింద్రుం డి ట్లనియె 293

ఆ. భానువంశతిలక! దానవాధముఁ జెట్టి, జానివరంబుచేతఁ గొనియె మాదు
సుఖము లవియు నీదు సుప్రసాదంబున, మరలఁ గలిగె నిపుడు మడిసె రిపుఁడు.

వ. దేవత లి ట్లనిరి. 295

తే. యజ్ఞభాగంబు లెల్లఁ దా నపహరించు, నివ్వఁ డొకరైన నన్నీచు నిపుడు మీరు
కూల్చుటను మాకు నవి సమకూడె మరల, మానిహృదయాంబుజదినేశ! జానకీశ!.

వ. పితృదేవత లిట్లనిరి 297

ఆ. ఓమహాత్మ! రఘుకులోదధిసంపూర్ణ, చంద్ర! వీఁడు మిగుల సాహసమున
నపహరించి తిలగయాదత్తపిండాదు, లమరె మాకుఁ దొంటియట్ల యిపుడు. 298

వ. యక్షు లిట్లనిరి 299

ఉ. వెట్టికిఁ గొట్టి మమ్ము రఘువీర! నితాంతము బాధపెట్టి యి
ట్టట్టును బోవనీఁ డిదియ యానము మ్రోయుఁగ మాభుజాగ్రముల్
గొట్టుకపోయెఁ జూడుఁ డిలఁ గూలెను వాఁ డికఁ గానఁ జింత పోఁ
దట్టి ద్వదంఘ్రిసేవల ముదంబున నుండెద మింక మీకృపన్. 300

వ. గంధర్వు లిట్లనిరి. 301

తే. ఏము సంగీతనిపుణుల మెప్పుడు శక
ధాళిఁ జదువుచు నిత్యసౌఖ్యమున నుందు
మటులు గాదయ్యె నైన దైత్యాధముండు
ద్రుంగుటను దొంటిభంగి నుత్సాహంగఁ గలిగె. 302

వ. అనుచు నివ్విధంబున మహోరగ సిద్ధకిన్నరపతత్త్రిగణ ప్రజాపతి ప్రముఖులు వేఱువేఱఁ బట్టాభిషిక్తులగు నారాజదంపతుల వినుతింపుచు నయనోత్సవంబుగఁ గనుంగొనుచు నభినందితులై నిజస్థానంబులకుం జనిరి. బ్రహ్మరుద్రాదులు నమ్మహామహాకల్యాణగుణంబులు గానంబు సేయుచు సింహాసనస్థితంబును సీతాలక్ష్మణసమేతంబును నగు నారాజవల్లభురూపంబు మానసింపుచు నిజనివాసంబులకుం జనిరి తదనంతరంబున. 303

మ. చెలఁగెం దుందుభు లాకసంబున నుదల్ సేమంబునం బూలవా
నలు గావించిరి సంతసించిరి మునుల్ నారాయణుం డారమా
లలనాధీశుఁడు రాఘవుం డమరె సాలంకారుఁడై భూమిజా
నిలపుత్త్రార్కజలక్ష్మణాద్రిచరమానివ్యూహముల్ గొల్వఁగన్. 304

వ. అనుచు మరలి సదాశివుం డంబికతోడ నిట్లనియె నివ్విధంబున సకలలోకసుఖావహుండగు రాఘవేశ్వరుండు ధరణీపాలనధురీణుం డై యునయు నవసరంబున వసుంధర సస్యసంపన్నయు మహీరుహంబులు ఫలవంతంబులు సుగంధహీనంబులగు సుమంబులు సుగంధసహితంబులును నగుచుఁ జెలువొందె నమ్మహామహుండును శతసహస్రసంఖ్యలగు గజ తురంగ ధేను సముదయంబుల నెల్లవారికి నొసంగెఁ బూర్వంబ నూఱు వృషభంబులును ముప్పదికోటులు సువర్ణంబులును వస్త్రాభరణరత్నాగులును బ్రాహ్మణోత్తములకు సమర్పించె వెండియు. 305

క. భాస్కరతనయున కొసఁగెను, భాస్కరసదృశంబు కనకబహుమణిగణశో
భాస్కరము హార మొప్పుగ, భాస్కరకులతిలకుఁ డతికృపన్ వనజాక్షీ!. 306

వ. అవ్విధంబున. 307

క. తారేయున కొసఁగెను గే, యూరంబులు తోన నొసఁగె నుర్వీసుతకున్
దారాధిపకోటిసమము, హారము మణిరత్నఖచిత మంబుజనయనా!. 308

వ. అదియును నవ్వైదేహి స్వకంఠంబు కరంబునం దిగిచి నిఖిలవానరవ్యూహంబులను రామచంద్రునిం గనుంగొను నవసరంబున నింగితజ్ఞుండగు రఘువల్లభుం డిట్లనియె.

ఆ. ఎవరివలన నీవు టెంపు గంటివి వారి, కిమ్ము హార మనిన సమ్మదమున
ననిలజాని కొసంగె నమ్మారుతియు మించె, హారమునను మించు గౌరవమున. 310

వ. ఇట్లు సీతాదత్తంబగు హారంబువలన విరాజమానుం డయి కరకమలంబులు మోడ్చి యున్న పవమాననందనుం గనుంగొని తద్భక్తితాత్పర్యంబునకుఁ దుష్టచేతస్కుం డై రఘువల్లభుండు 311

ఆ. అనిలపుత్త్ర! నీహృదంతరేప్సిత మెద్ది?, వేఁడు మనిన వంగి వేల్పులకును
నమరనట్టిదైన సమకూర్తు ననిన సం, తసము నొంది పవనతనయుఁ డపుడు. 312

ఉ. నామది నీదునామభజనంబునఁ దృప్తి వహింప దింక నే
నీమహిలోన దాని భజియింపుచు సౌఖ్యముతోడ నుందు శ్రీ
రామ! వరం బొసంగిన ధరాస్థలి నిల్పుము మత్కళేబరం
బామహనీయనామము గలంతటి కాలము దీని వేఁడెదన్. 313

వ. అనిన రామచంద్రుండును నవ్విధంబున నగుంగాక ముఖుండ వై యుండుము కల్పాంతంబున నాదుసాయుజ్యంబు నొందెద వనుచుఁ గటాక్షించె సంతత జనకనందన కృపాహృదయుంబున. 314

సీ. వినవయ్య! హనుమంత! వేల్పుమూఁకలు వత్తు రేచట నీ వుండిన నచటి కెల్ల
మాయాక్ష ననిన నమ్మారుతి యతిభక్తితో ధూరి నాదంపతులకు మ్రొక్కి

చనలేక చనలేక కనుల నానందాశ్రు లొలుక మహాబుద్ధియుతుఁడు గానఁ
దపము సేయఁగ శితధరణీధరంబున కరిగె రాఘవుఁ డంతఁ గరుణతోడ

తే. గుహునిఁ గన్గొని మత్సఖ! కొమరుమిగుల, శృంగిబేరంబునకు నేఁగు మంగళములు
స్వార్జితంబులు భుజియింపు మనుదినంబు, ననుభవింపుము సామ్రాజ్య మొనరఁ దుదిని.

వ. ఇది యసంశయం బనుచు దివ్యాభరణంబులును విపులంబగు రాజ్యంబును విజ్ఞానంబును నొసంగిన గుహుండును బ్రముదితమానసుం డై స్వభవనంబునకుం జనియె. భానునందన విభీషణులును దక్షిణ వనచర వ్యూహంబులును సమూల్యాభరణవస్త్రాదుల యథార్హంబుగఁ బూజితు లై నిజనివాసంబులకుం జనిరి. రామచంద్రుండును.

శా. పాలించెన్ ధరఁ దండ్రిభంగిని గృపాపారీణుఁడై లక్ష్మణుం
డాలక్ష్మీవిభుచేతఁ గోరిక యొకింతైనన్ మదిన్ లేక యుం
బాలుం డయ్యును యౌవరాజ్యమునకున్ భవ్యాత్ము లిట్లయ్యుఁ ద
ల్లోలస్వాంతుఁడు గాక యన్న కనుకూలుం డై జయించె న్మదిన్. 317

వ. ఇవ్విధంబునఁ దమ్ముండు సేవలు సలుపఁ బరమాత్మయు ధర్మాధ్యక్షుండును నిత్యుండును గర్తృత్వాదివిహీనుండును నిర్వికారుండును నయ్యు రఘునాయకుండు నిజానందంబున సంతుష్టుం డగుచు లోకంబున కుపదేశంబు సేయు చందంబున మానుషదేహానుసారుం డై విపులదక్షిణల నశ్వమేధాదియజ్ఞంబు లనేకంబులు గావించుచు సకలజనవత్సలుం డై ధరాతలంబు శాసింపుచుండె నక్కాలంబున. 318

సీ. కలుగుట ల్లే వాపదలు సర్పభయములు విధవలు వ్యాధులు బధిరు లంధు
లరిభయంబులు వృద్ధు లమృతులై యుండంగ బాలురు గ్రుంగుట ల్లావె సరయు
జనులెల్ల రామపూజాపరుల్ రాఘవచింతకు ల్సర్వకులోక్తిశీలపరులు
కాలాంబుదములు మేఘములు పౌరాంగనల్ పతిభక్తియుతులు నిష్పాపు లిట్లు

తే. వెలయ నందతికిని దండ్రి విగ్రముదోఁప. సర్వలక్షణసహితుండు సత్యధర్మ
యుతుఁడు నై రాఘవేశ్వరుం డుర్వి యేలె, సోత్సవంబున పదివేలవత్సరములు 319

చ. అనుచు శశాంకమౌళి తుహినాచలనందనతోడఁ బల్కెఁ బా
వనము శుభప్రదంబు ధనవైభవదం (బభిషేక) మెవ్వరై
నను వినినం బఠించిన మనంబునఁ గల్గెడి కోర్కె లెల్లఁ బం
దును గృతపాపసంఘములు దుల్లు ననేకము లైన నిమ్మహిన్. 320

తే. ఇందుఁ బ్రత్యహ మీరాఘవేంద్రుభూత, లాభిషేకంబు వినిన ధనార్థుఁ డైన
నమరుధన మింకఁ బుత్రార్థి యైననార్య, సమ్మతసుతుఁడు గల్గు నిస్సంశయంబు.

తే. మొదలనుండియు సద్భక్తి జదువు సతిఁడు, దీనుఁడును బూజ్యుఁ డౌఁ జేరి వినిన
వంధ్య యైనను సౌభాగ్యవతియుఁ బుత్రి, ణియు నగుఁ బత్ని కంధుత్రైరిణాఁ.

సీ. శ్రద్ధ నీయధ్యాత్మరామాయణము వినుసభ్యుండు త్రైలోక్యసమ్మతుండు
సురలెల్ల సంతసింతురు దుర్గమము లగుకార్యముల్ గడచు సౌఖ్యములు గల్గు
రఘునాథునందు భక్తి ప్రబలయౌ సతి రజస్వల యైన శ్రీరామచంద్రవిగ్ర
హార్పితస్వాంతయై యాకర్ణన మొనర్ప నాయురారోగ్యసౌఖ్యాభియుతుండు
తే. సుతుఁడు జనియించు గరఁబతివ్రత యనంగఁ, బరఁగు నెవరైన నిత్యంబు భక్తితోడ
వందన మొనర్చి పూజింపఁ జెందు రామ, చంద్రునిలయంబు పాపసంచయము లెడలు.
తే. మనుజుఁ డధ్యాత్మ మఖిలంబు వినినఁ జదువ, వానివలనను జానకీవల్లభుండు
సంతసిలు నమ్మహామహుసంతసమున, ధర్మమోక్షార్థకామముల్ దనకుఁ గలుగు. 324
తే. భాస్కరాదిగ్రహంబులు పరమమునులు, నసురులును బిశాచులుఁ దృప్తు లగుదు రభయ
మనుగు నధ్యాత్మరామాయణము పఠింప, నొరులవలనను వినిన సత్పురుషులకును.

మ. వినుఁ డధ్యాత్మము చిత్రమై యలరు సద్విజ్ఞానవైరాగ్యశో
భనయుక్తంబు సవిస్తరంబు చదువన్ భక్తిన్ వినన్ వ్రాయుఁ దా
రనుమోదించిన మానవోత్తములు దుర్దాంతోగ్రసంసారవా
ర్ధి నిమగ్నత్వవిముక్తులై సహజయాతీతోరంగులం గల్గునే. 326

వ. అనుచు ద్వివిధంబున. 327

తే. వేదరాశిసమస్తంబు వెదకి రాఘ, వేశ్వరుఁడు తారకబ్రహ్మ మీశ్వరుండు
విష్ణుఁడను సద్రహస్యంబు వెలయఁబలికె, నంబతోడుతఁ ద్రిపురారియతిముదమున.
ఆ. అఖిలసారసంగ్రహ మెఱింగి సంక్షేప, మునను బ్రస్ఫుటముగ మనుజుఁ డైన
దాశరథిని గూడఁ దత్త్వంబు వివరించి, శైలతనయతోడ శంకరుండు. 329
క. అని శివుఁ డంబికకెఱిఁగిం, చినగతి విధి నారదునకుఁ జెప్పిన వ్యాసుం
డను నాకుఁ బల్కె వినుఁ డం, చనియెను సూతుండు శౌనకాదిమునులకున్. 330
క. ఫణిభోగిశయన! యగణిత, గుణమణిగణభరణ! భువనభరణ! భవతా
రణ! దుఃఖహరణచరణా!, రణరంగప్రవణ! రంగరామ! ధురీణా. 331

మాలిని. హరిహయమణితుల్యా! శ్యామలాంభోజనేత్రా!
సురరిపుహర! శ్రీసీతాద్రికన్యాకళత్రా!
మురమథుబలకాలాంభోధరోద్యత్ప్రహారా!
సురనుతపదకీర్త్యస్తోమ! శ్రీరంగధామా!. 332

గద్య. ఇది శ్రీమారుతోటమకీశ్వరప్రసాదలబ్ధకవితాపవిత్ర కోటసురాజుభాస్కర మంత్రిపుత్త్ర నాగయామాత్యప్రణీతం బైన శ్రీమదధ్యాత్మరామాయణం బను మహాకావ్యంబునందు యుద్ధకాండము సర్వంబును ద్వితీయాశ్వాసము.

యుద్ధకాండము - సంపూర్ణము.

న్నవారని వేగంబ తోడితెం డని నియోగించె వార లట్ల యొనరించి రంత రాఘవుండును. 8

క. చనుదెంచెడ మునివరులను, గనుఁగొని ప్రణతులు నొనర్చి కడువేడ్క సుఖా
సనములును నర్ఘ్యపాద్యము, లును గోగణములు నొసంగి లోకులకరణిన్. 9

తే. కుశల మరసిన వారలు కుశల మనుచుఁ, బలికి రోరాఘవేంద్ర! మద్భాగధేయ
మున ననుజుఁ గూడఁ గంటిమి దనుజవరుల, నడఁచి రాజ్యాభిషిక్తుఁడవై యలరు నిన్ను.

చ. మును దశకంధరాదులను మొత్తి మమున్ గృపఁ జూడు మంచుఁ బ
ల్కినతెఱఁ గయ్యె నెమ్మదిని గెల్చిన లోకములన్ సృజింపఁ బెం
పను భరియింపఁ గర్తలగు భవ్యులు సహ్యము మీకు నింకఁ గ
ల్గొనఁగను మేఘనాదు ననిఁ గూల్చుట సహ్యమె రాఘవేశ్వరా!. 11

వ. అని పల్కిన భావితాత్ము లగు నమ్మహాత్ముల వాక్యంబులకు విస్మయంబు నొంది హస్తంబులు మొగిడ్చి కౌసల్యానందనుం డి ట్లనియె. 12

తే. క్రూరులును బాపు లగునట్టి కుంభకర్ణ, దశముఖాదుల విడనాడి దాశరథి
నింత బలుమానిసిని జేయ నేల యనిన, నం దగస్త్యుం డు పలికె నిట్లనుచు నప్పుడు.

వ. రాఘవా! రావణమేఘనాదుల జన్మకర్మవరదానప్రకారంబు సంక్షేపంబుగ నెఱింగించెదఁ బూర్వంబు కృతయుగంబునఁ బులస్త్యుం డను చతురాననవందనుఁడు గలం డమ్మహాత్ముండు మేరుధరాధరపార్శ్వంబునఁ దృణబిందునాశ్రమంబున స్వాధ్యాయనిరతుం డై తపంబు సేయుచుండ నిట్లుండ దేవగంధర్వకన్నియలు నృత్యవాద్యవీణాస్వనంబులఁ దత్తపోవిఘ్నంబు గావింపం బూనిన నమ్మహాత్ముం డలిగి మద్దృష్టిగోచరు లగువారలు గర్భంబులు దాల్తు రనుచు శాపం బొసంగె. వారలును దద్భయంబున నొండుదెసకుం జని రవ్వాక్యప్రకారం బెఱుంగకునికిఁ దృణబిందునందనయు నిర్భయంబునఁ జరియింపుచు నిజశరీరంబున గర్భచిహ్నంబు లేర్పడ నతిభయంబునం జనుదెంచి జనకున కెఱింగించిన రాజర్షివర్యుం డగు నాతృణబిందుండును 14

ఆ. జ్ఞానదృష్టివలన సంయమికృత మంచు, నెఱిఁగి భార్యఁ గాఁగ నిచ్చెఁ దనదు
తనయ నమ్మహాత్ముఁ దగిలి యక్కన్యయుఁ, జేయుచుండె నతని సేవ చెలియ!. 15

వ. ఇట్లక్కన్యకారత్నంబు సేయు శుశ్రూషలవలనఁ బ్రీతుం డై పులస్త్యుం డుభయవంశవర్ధనుండగు నందను నొక్కని సృజియించి విశ్రవ స్సని యభిధానం బొసంగె నక్కుమారునకు భరద్వాజకన్యవలనఁ బితృముఖ్యుండగు వైశ్రవణుండు జననం బొందె నతండును. 16

ఉ. తపమున నప్పితామహునిఁ దన్పి ధనాధ్యతయుం దివౌకసా
ధిపతులు మెచ్చు పుష్పకము తీవ్రమె కైకొని తండ్రిఁ జేరి స
త్కృప నొకచోటు నిల్వ నెఱిఁగింపు మటన్నను లంక వారిమం
దు పరులు చేరకుండఁ దగుఁ దుల్యము నాకముతోడఁ జూడఁగన్. 17

వ. తొల్లి నిశాచరసమయంబుగా విశ్వకర్మ నిర్మించె నిప్పురమును. 18

తే. అందు రాక్షసు లల్లనారాయణుని కు, దర్శనమునకుఁ జని రసాతలమునందు
జడిసి యుండెద రది నివాసంబు గాఁగ, నిలువు మనినఁ గుబేరుఁ డప్పలుకులకును.

వ. ముదం బంది యాలంకానగరంబున వసియించియుండె నంతఁ గొంతకాలంబునకు
రసాతలంబు వెడలి సుమాలి యను నొక్క పిశితాశనుండు మర్త్యలోకంబునం జరి
యింపుచుఁ బుష్పకారూఢుం డై విహరించు కుబేరుం గనుంగొని రాక్షసాధిష్ఠితం
బగు లంకానగరం బిట్టు లగునే యని చింతింపుచు రాక్షసహితార్థి యై లక్ష్మి యనం
దగు కైకసి యను నిజనందనం గనుంగొని యి ట్లనియె. 20

తే. యౌవనము నీకు సంప్రాప్తమయ్యె నిది వి, వాహకాలంబు గావున వరుఁడు విశ్ర
వస్సు వరియింపు మిప్పుడు వరసుతులను, ధనదతుల్యులఁ గాంతువు దనరు సుఖము.

వ. అనినఁ గైకసియు సుమాలివచనప్రకారంబున. 22

క. చని యమ్మునిఁ గనుఁగొనఁగను, దనపాదాంగుష్ఠమునను ధర వ్రాయుచు ని
ల్చిన నెఱిఁగి దాన వీవన, మునివర! చిత్తమునఁ దెలియ మొనకొను మనియెన్. 23

వ. అనిన నమ్మునీంద్రుండు యోగదృష్టి నెఱింగి పుత్రార్థివై చనుదెంచితి విది దారు
ణంబగు వేళ గావున నతిదారుణులగు రక్కసు లుద్భవించెద రనిన నక్కన్యక యి
ట్లనియె. 24

క. మీయంతవారిఁ జెందిన, నీయాలమట లేల యనిన నింతీ! విను నా
రాయణభక్తిపరాయణుఁ, డై యొకనందనుఁడు గల్గు నాతఁడు నిల్చెన్. 25

సీ. అని పల్కుసమయమునందున జనించెను బంక్తికంఠుండు నీలమేఘంబో యనఁగ
బలు మేను పదియగు తలలును నిరువదిహస్తము లెవ్వలయ నయ్యసురుఁ డవట
పుడమిపైఁ బడినయప్పుడె తల్లడిల్లెను భువనము ల్నాశహేతువులు చాలఁ
గనుపించె నట కుంభకర్ణుండు జనియించెఁ బర్వతం బనఁగ శూర్పణఖపుట్టె
తే. నంతఁ బ్రభవించె రామభక్తాగ్రగణ్యుఁ, డమలకర్మానువర్తి స్వాధ్యాయపరుఁడు
సౌమ్యదర్శనుఁ డుగ్రశాంతిశమదమాఢ్యుఁ, డీపనాత్రయహరుఁడు విభీషణుండు.

వ. ఇట్లు నియతాహారియు నిరంతరధర్మమార్గానువర్తియు నగుచు జనియించి బాల
చంద్రుండునుం బోలె వృద్ధిఁబొందుచు నుండె దశాననకుంభకర్ణులు మూఢాత్ము లై

ఋషిసంఘంబులం దినుచు నతిదారుణులును మహాసత్త్వసంపన్నులును నై ఘోరా
టవుల సంచరింపుచు లోకంబులకు రోగంబులు వృద్ధిఁ బొందుత్రియఁ బెరుఁగు
చుండిరి జానకీవల్లభా! సకలాంతరస్థుండవు విజ్ఞానసదృశుండవు సాక్షివియు నిర్మ
లుండవును నగుచు వెలుఁగు పరమేశ్వరునకు నేను బల్కెడునంతవాఁడనే నైనను
స్వమహిమయగు మాయాగుణంబు ననుసరించి యడిగితివి గావున రక్షోద్భవం
బెఱింగించితి ననుచు నగస్త్యమునీంద్రుండు మఱియు నిట్లనియె. 27

తే. అని యగస్త్యుండు పలుకంగ నాననమున, మందహాసంబు దళుకొత్త మద్గుణాను
కీర్తనం బిర సజ్జనకీర్తితంబు, ఫలద మని పల్కె రామభూపాలుఁ డపుడు. 28

వ. అనుచు శశిశేఖరుం డవ్వలివృత్తాంతంబు పర్వతరాజనందనతోడ నిట్లనియె నట్లు
దశకంధరాదుల ప్రభావంబు మఱియు నెఱింగించువాఁ డై కుంభసంభవుం డిట్లనియె.

సీ. నరనాథ! విను మొకనాఁడు కుబేరుండు పుష్పకారూఢుఁడై పుణ్యుఁడైన
తనతండ్రిఁ గనుఁగొనఁ జనుదేరఁ గైకసి యవ్వైభవముఁ గాంచి యాత్మఁ గుంది
దశకంధరునిఁ జేరి తండ్రి గన్గొను ధనాఢ్యత్వుండు నీ విటులగుట లేను
గనుఁగొను టెన్నఁడో యనిన రావణుఁ డిట్టులనియెఁ జూడుము తల్లి! యతనికన్న

తే. మిన్న యయ్యెద నటుగాక యున్నసముఁడ, నైన నయ్యెదదుఃఖంబు నడపుమనుచుఁ
దల్లినటులూఱడించియాదశముఖుండు, ననుజులనుగొంచుఁదపము సేయంగఁజనియె.

వ. ఇట్లు కార్యసిద్ధికొఱకు గోకర్ణశం బను పుణ్యక్షేత్రంబునకుం జని వేఱువేఱ సుప్ర
దేశంబు లేర్పఱచుకొని తపంబు సేయం దొడంగి రందు రావణుండు. 31

సీ. దేహంబు దశవర్షసాహస్రములు నొక్కపాదంబునను నిల్పి పంచాగ్నులైనఁ
దినక నిరాహారముఁ దివ్యసాహస్రవర్షము ల్నిలిచి మువ్వర్షములు స
హస్రంబులైనను హవ్యవాహనునియం దొకతలవ్రేల్చుచు నొవర నిట్లు
దలలు తొమ్మిది వ్రేల్చియులయుక పదియగు కంధరం బటు ద్రుంచఁ గడఁగునపుడు

తే. వలదు వల దని భారతీవల్లభుండు, వేగఁ జనుదెంచె వత్స! న న్నేఁడు తావ
కేప్సితంబులు కరుణింతు నిప్పు డనినఁ, బలికె దశకంఠుఁ డానందభరితుఁ డగుచు.

వ. దేవా! కరుణించెదవేని సుపర్ణయక్షరాక్షసులవలన నవధ్యత్వంబును నమరత్వంబు
ననుగ్రహింపుము తృణభూతులగు మనుష్యు లెంతవార లనిన వల్లె యని పితా
మహుం డిట్లనియె. 33

క. విను దశకంధర! యనలం, బున వ్రేల్చిననీదుతలలు మునుపటిక్రియఁ గ
ల్గును నక్షయంబు లగుచును, దునిమిన రణరంగమునను దోడనె యనుచున్. 34

వ. సత్యధర్మపరాయణుండును నిర్మలభాషణుండును నగు విభీషణుసమీపంబునకుం జని
యతనిసాత్వికతపంబునకు మెచ్చి యిట్లనియె. 35

ధిటుం డగు నందీశ్వరునిచేత శాపంబు నొంది యనార్యకృత్యంబు గణన సేయక హైహయపట్టణంబునకుం జని యారాజుచేత బద్ధుం డయి తండ్రియగు పౌలస్త్యనివలన విడిపింపంబడి యంతట నుడుగక హరిపుంగవుండగు వాలిని జయింపు తలంపున నేఁగి యమ్మహాసత్త్వుచేతఁ జతుస్సముద్రంబుల ముంపంబడి కరుణించి విడిచిన నతనితోడ మైత్త్రి యాపాదించి యప్రతివీరుం డయి చెలఁగొంచె రఘునందనా! దశాననమేఘనాదుల ప్రభావంబు లిట్టివి జగద్రక్షణపరాయణుండ వగు నీచేత మహాచలతుల్యులగు రావణకుంభకర్ణులు తెగటారి రయ్యింద్రజిత్తుండును పుణ్యకీర్తనుం డగు లక్ష్మణు భుజాసారంబున వినిగ్గతిదార్ఢ్యుం డయ్యె నేమును సకలజనంబులును సుఖంబు గంటిమి మఱియును. 55

సీ. జగముల కెల్ల రక్షకుఁడవౌ నారాయణుండవు నీ వఖిలబ్రహ్మాండములను
గరమొప్పు నిచ్చరాచరజంతుజాలము లీస్వరూపము జగన్నేత్రరైన
బ్రహ్మ నీదగు నాభిపంకజంబున నగ్ని వాక్కుతోఁడుత నీదు వదనమునను
బాహువులను లోకపాలకు ల్చంద్రభాస్కరులు నేత్రములను గర్ణములను
తే. దిగ్విదిశలును బ్రాణము ద్దెలియ నశ్వి, నులును ఘ్రాణంబునను జానువులను జంఘ
లను భువర్లోకమాదిరై తనరులోక, ములను జనియించె నీమహామూర్తి యిట్లు 56

వ. తనరు మఱియుఁ గుక్షిప్రదేశంబువలనఁ జతుస్సముద్రంబులును వక్షోజంబులవలన నింద్రవరుణులును రేతంబువలన వాలఖిల్యాదులును మేఢ్రంబువలన యముండును గుదంబువలన మృత్యువును గోపంబువలనఁ ద్రిలోచనుండగు రుద్రుండును శల్యంబులవలన బర్వతంబులును శిరోజంబులవలన మేఘంబులును రోమంబులవలన నఖిలౌషధులును నఖంబులవలన ఖచరాదులును నుద్భవంబు లయ్యె జానకీవల్లభా! మాయాశక్తిసమన్వితుండవై గుణవ్యతికరంబుల నానారూపంబులఁ గనుపింపు విశ్వరూపపురుషుండవు నీవ మఱియును. 57

సీ. నిన్నాశ్రయించుటనే కదా యమృత మధ్వరమున సురలకుఁ ద్రావఁ గల్గె
నరయ స్థావరజంగమాత్మకం బగుభూమి నీచేతనే కదా నిర్మితంబు
త్వద్భక్తి మగుఁ గదా వస్తుసంచయ మెల్లఁ బాలలోపల నెయ్యి పరఁగునట్లు
నంతట నీవు చెల్వొంది యుందువుగదా పరిధవిల్లెడు చంద్రభాస్కరులును
తే. నీదు తేజంబుననె కదా నీవు వారి, తేజమునఁ గాదు గద యిట్లు తెలియ నెల్ల
జ్ఞానవంతులకే కదా మానవేంద్ర!, యెంత విం తనవచ్చు నీయట్టిమహిమ. 58
తే. నీదుభక్తి వాకింతైన నిల్వనేని, నిత్యుఁ జిన్మాత్రు సర్వజ్ఞు నిర్వికల్పు
విష్ణుఁగనుఁగొనవోపుఁగా కున్న నొండు, కరణిమనుజుండు నినుఁ గాంచఁగలఁడె రాఘ!

వ. దేవా! భవదనుగ్రహభాగ్యంబున నను నాయందుఁ గరుణించి సర్వజ్ఞుండవగు నీముంద టంబల్కిన వాక్యంబులు క్షమియింపవలయు మఱియును. 60

చ. అరసి భజింతు నిత్యుఁ జలనాదివివర్జితు దేశకాలది
గ్వరహితు సర్వగు న్నిగమవేద్యుఁ బరేశు ననన్య ముఖ్య న
శ్వరు నజు భూతమాయు పరశాంతు ననంతు గుణత్రయాత్మకున్
నిరవధికప్రకాశు హరి నీలనిభున్ రఘువల్లభున్ శివున్. 61

క. తా నిటు పల్కి తుషార, ద్యుతినాయకతనయుతోడ మఱియును దెల్పం
బూని సదాశివుఁ డవ్వలి, భానుకులాంభోధిచంద్రు పావనగుణముల్. 62

వ. అనుచు వినుతించు కుంభసంభవుం గనుంగొని రఘుపుంగవుం డిట్లనియె 63

క. తెలియంగ వాలిసుగ్రీ, వులజన్మము వానరత్వ మొప్పుటయును వా
రలు సేయువిక్రమంబులు, పలుకుఁడు కృప ననినఁ గలశభవుఁ డిట్లనియెన్. 64

## వాలిసుగ్రీవుల జననము.

చ. విను రఘువంశభూషణ! సవిస్తర మొప్పఁగ మేరుభూధరం
బున శిఖరంబు సన్మణులఁ బొల్చు నొకండటి యందు నూఱురో
జనములఁ బొల్చు నొక్కసభ సారససంభవుఁ డందు నొక్కనాఁ
డనుపమయోగ మంది కనులందుల బాష్పజలంబు జారఁగన్. 65

వ. కరంబునం దిగిచి యించుకంత ధ్యానించి విడిచిన నయ్యుదకంబు పుడమిపయిం బడునంత. 66

క. జనియించె నొకమహాకపి, వనజజుఁడును వానిఁ గాంచి వత్స! సమీపం
బున నిలువు కొంతకాలముఁ, దనరు శుభం బంత నవినఁ దద్వాక్యమునన్. 67

వ. వాఁడు నిలిచి కొంతకాలంబునకు ఫలమూలార్థియై వనంబున సంచరింపుచుండు నొక్క మణిశిలాంచితం బగు వాపిం గనుంగొని నిక్కిచూచి యందు నిజబింబంబు ప్లవంగమం బని భ్రమంబు నొంది దుమికి యేమియుం గానక వెడలివచ్చి యప్పుడు. 68

సీ. తనదేహ మొకదివ్యవనితోపమంబైన వతిక్షిప్తయిము నొంది యచట నిల్వ
శక్రుండు మధ్యాహ్నసమయంబున సరోరుహాసను బూజించి యరుగుచుండి
కనుఁగొని మోహసంకలితుఁడై వీర్యంబు వదల నవ్వీర్య మవ్వనితవాల
దేశంబునను బడ దేవేంద్రతుల్యపరాక్రమాఢ్యుఁడు వాలి యన జనించె

తే. వాసవుండును వానికి స్వర్ణమాల, యొకటి కరుణించి చనె నంత నుగ్రకిరణుఁ
డట్లు కనుఁగొని మానధ్వజాస్త్రదళిత, చిత్తుఁడై వీర్యమును వీడ శీఘ్ర మదియు.

క. గ్రీవంబునఁ బడుటను సు, గ్రీవుం డన నుద్భవించెఁ బ్రియుఁ డీతనికిన్

గావలయు నని సమీరజు, దీవిలనిటు నొసఁగి రవియు దివమున కరిగెన్. 70

వ. అంత. 71

తే. వనిత యువ్వాలిసుగ్రీవు లను తనూభ, వులను గొని నిద్రనొంది సూర్యోదయమున
లేచి తనమేను తొలిభంగి నాచుఁ దనర, నేమి యనవచ్చుఁ బరమేశ్వరేచ్ఛ యనుచు

క తనయుల నిరువురఁ గైకొని, చని యువ్విధ మెల్ల వనజసంభవునకుఁ బ
ల్కిన నతఁడు చింత వల దని, తనభటు నొకనిఁ గనుఁగొని సుతాత్పర్యమునన్.

వ ఇట్లనియె. 74

క. మానుగ ధరపైఁ గిష్కింధానగరము గలదు దేవతలకైనను గ
మ్యానగఁ బోలదు నీ వి, వ్వానరకులతిలకుఁ జేయు వల్లభు నచటన్. 75

చ అరయఁగ సర్వభూవలయమందును గల్గు నజేయులైన వా
నరులు మదాజ్ఞ నీప్లవగు నర్మిలిఁ గొల్తురు గాక శ్రీరమా
వరుఁడు సనాతనుండు జనవత్సలుఁ డెన్నఁడు గౌసలేయుఁడై
ధర రఘునాథమూర్తి యన దా నుదయించునొ నాఁడు వీరునన్. 76

తే అమ్మహామహునకు సహాయ మ్మొనర్ప, నేఁగెదరు గావుత మటన్న నట్లు బ్రహ్మ
పలికె నట్టుల యొనరించి తెలియఁ జేసె, మరలి యుద్ధూత పంక్తికంధరవిదారి 77

క. అది మొదలు ముఖ్యవానర, సదనము కిష్కింధ యయ్యె సర్వేశ్వర! మీ
రుదయించితిరి జగంబుల, కొదువలు మాన్పంగ వారికోరిక లలరన్. 78

వ. దేవా! కమలసంభవుండు ప్రార్థించుటవలన మీరు కైకొనిన మనుష్యదేహంబుచేత లీలయుపోలె సకలభూభారంబు హననం బయ్యె నింక సర్వభూతాంతస్థుండవు నిత్యముక్తుండవు చిదాత్మకుండవు నఖండానందవిగ్రహుండవు నగు నీ కివ్విగ్రహంబున నెంత యగు నైనను భవద్యశోవైభవంబు సకలలోకకల్మషాపహంబును సుఖప్రదంబును గావున లీలామానుషవిగ్రహుండ వనుచు భవద్విషయైకసగుణారాధనతత్పరులై పుణ్యు లగువారలు ప్రాగ్దుపుత్తురు మఱియును. 79

ఆ. నీకు భక్తులగుచు లోకు లివ్వాలిసు, గ్రీవజన్మకర్మకీర్తనంబు
సేయ వినిన వ్రాయ నాయురారోగ్యంబు, లమరుఁ బాపసంచయములు డుల్లు. 80

### సీతపూర్వవృత్తాంతంబు రామునకగస్త్యుండు చెప్పుట.

వ రఘునందనా! భవదాశ్రయంబగు నింకొకవృత్తాంతం బెఱింగించెద రావణుండు జనకనందనం గొనిపోవుకారణంబు వినుము తొల్లి కృతయుగంబున సనత్కుమార మునీంద్రుం గనుంగొని యతివినయంబున దశాననుం డిట్లనియె 81

సీ. ఏదేవుఁ డలరు దేవేంద్రాదులకు మిన్న బలవంతుఁ డయి ధరాభరణగరిమ
నేపుణ్యుఁ గొలువఁ దా రెదిరించి సంగరంబుల శత్రువుల సుర ల్పొంకుపఱతు

కేభవ్య యోగీంద్రు లేప్రొద్దు ధ్యానింతు రెవని భూసురు లెల్లఁ దవిలిఁ గొలుతు
రేమహామహు గుణస్తోమంబు లుగ్రసంసారాంధకారభాస్కరకరంబు

తే. లట్టిజగదీశు నారాయణాభిధానుఁ, దెలియఁ బలుకుఁడు ప్రేమ నావలన నిలిపి
యనిన దశకంఠుహృత్సంశయంబు దెలిసి, పలుకఁదొడఁగెను సన్మౌనితిలకుఁ డపుడు.

సీ. పరఁగ జన్మాదిషడ్భావవర్జితుఁ డౌచు నెవ్వఁ డొప్పు నాఁడు ధాత్రీశ్వరుండు
అతఁడె నారాయణుం డని సురాసురు లెల్ల నుతిసేయుదురు ప్రజాపతుల కెల్ల
విభుఁడైన బ్రహ్మ యవ్వేదవేద్యుని నాభికమలంబునను బుట్టెఁ గాంచ నిచ్చ
రాచరాత్మకమగు భూచక్ర మతనిచే నిర్మింపఁబడె దేవనిచయ మెల్ల

తే. నమ్మహామహుఁ గొల్చి తా రాహవమున, రిపులనిర్జించు సౌఖ్యంబు లపరిమితము
లొందుదురు యోగులును ధ్యానయోగములను, భజనయొనరింతు రద్దేవుపాదయుగము.

వ. అనిన దశాననుం డిట్లనియె. 84

తే. దేవతలచేత నడఁగి యేతెరవు గాంతు, రతఁడు నారాయణుని భీకరాహవమున
మడఁగి పరమంగు నెట్టిసన్మార్గగాము, లగుదు రధములు తెలియంగ నగు మునీంద్ర.

వ. అనిన సనత్కుమారమునీంద్రుం డిట్లను నాఖండలాది దేవతాబృందంబులచేత
శమయువారలు నాకంబు నొంది భోగానుభవంబై నపిదప భ్రష్టు లగుచు భూతలం
బునం బడి పూర్వార్జితంబులగు పాపపుణ్యంబులవలనం బుట్టుచు జచ్చుచు నుండు
దురు మఱియును. 86

క. నారాయణుని సుదర్శన, ధారఁ గీటడఁగువారు దఱుగని సౌఖ్యాం
భోరాశిఁ దేలి యాతఘు, వీరాగ్రణిమూలకెంకి వెలయుదురు సుతా! 87

వ. అనిన నద్దేవుతోడం దలపడి సంగరం బొనర్చి నిహతుండనై తత్పదప్రాప్తుండ నగు
దుం గాక యనుచుఁ దలంప నమ్మునివల్లభుం డిట్లింగి దశకంధరా! కొంతకాలంబు
సైఁపుము నీదుమనోరథంబు సఫలం బగు నను పకుండును మహాయాయిఘంటును
నగు నద్దేవునిముఖ్యనిలయంబు లెఱింగించెద నెట్లంటేని. 88

సీ. ఓంకారమునను సర్వోర్వీతలంబున సావిత్రివలనను సత్యమునను
స్థావరాదులయందు సకలపట్టణముల నగులయందును జగన్నాయకుండు
చెలువొందు సకలభూవలయంబు ధరియించు శేషాహి యాగాజశేఖరుండు
పగలును రాత్రియుఁ బర్జన్యుఁడును బ్రహ్మరుద్రాదులును నీసముద్రములును

తే. శమనవాతాగ్నిమృత్యువుల్ చంద్రసూర్య, కాలవరుణేంద్రులును నింకఁ గలుగునట్టి
దేవదానవముఖరులు దేవదేవుఁ, డయిన నారాయణునితావు లని తలంపు 89

వ. మఱియు విశ్వంబు సృజియింపుచుఁ బెంచుచుఁ గాలపరిపక్వం బైనం ద్రుం

చుచు లీలాభివర్తనుం డై యుండు సనాతనుం డమ్మహామండనుఁ డాత్మాదియంతయు
నతనిచేత వ్యాప్తం బని మూఢచిత్తుండవు గమ్ము. మఱియును. 90

సీ. కమనీయజలధరాకార మింపగుమేను నీలోత్పలంబులఁ బోలుకనులు
తొలకరిమెఱుపుతోఁ దులదూఁగువస్త్రంబు చిఱునవ్వు తఱుకొత్తు చిన్నిమొగము
హారకుండలకౌస్తుభాంగదాదివిభూషణాంచితంబగు విగ్రహంబు తీరు
పొలుపొందు బంగరుబొమ్మయో యన లక్ష్మి నొగిఁ గౌఁగిటను జేర్చి యొనరుచూపు
తే. లిట్టి జగదీశురూపమ్ము నెలమిఁ గాంచఁ, గలుగుదురె దేవభుజగాసురులనైన
నమ్మహాత్ముని సత్కటాక్షమ్ముఁ గాంచు, సజ్జనుఁడె యింత ఘనయోగశాలి గాక.
తే కలుగ దయ్యజ్ఞదానాదికర్మములను, ఘోరతపముల నైన నవ్వారిజాక్షు
పాదదర్శన మిఁక నొకపగిదిఁ గల్గుఁ, గాంచఁగలవేని విను పంక్తికంఠ! యిపుడు.
క. వేదాంతామలదృష్టిని, శ్రీదయితు ముకుందు విష్ణుఁ జిద్ఘను సుజనా
మోదుఁ బరాత్పరుఁ గనుఁగొనఁ, గాదగు మునులాశ్రయించుగతి యిదె పత్నా!
వ. మఱియుఁ దద్భక్తుండును దద్గతప్రాణుండును చింతాధూతకల్మషుండును నగు
పుణ్యుండు గాంచ నోపు నింక నొక్కసులభమార్గం బెఱింగించెద. 94
సీ. ఆతీర్థపాదుండు త్రేతాయుగమునందు దశరథనృపతికిఁ దనయుఁ డగుచు
నృపవిగ్రహంబున నిటలాంబకప్రతాపాఢ్యుఁడై జనియించి యఖిలలోక
మాతయౌ నిజమాయతోఁ దండ్రిపనుపునఁ జనుదెంచు దండకంబునకుఁ గాన
సేవింపు మపుడు లక్ష్మీనాథు సనివ నారావణుం డది మొద లీవిరోధ
తే. మునకు నారంభమొనరించి తనదు దేహ, మానవమున కిట్లు యుద్ధార్థి యగుచు లోక
ములఁ జరించును వటుగానఁ దెలియుమతఁడు, బంక్తికంఠుండు నీపాదభక్తు డనఘ!.
క మనుజాలు నీకథ వినినను, వినిపించినఁ దాను జదువ వేడ్కన్ వ్రాయన్
ధనధాన్యపుత్త్రసుఖవ, ర్ధను లయి నీపాదభక్తిఁ దనరుదురు భువిన్. 96
వ. అనుచు. 97
ఆ. కలశజుండు మార్త్యకులపవిత్రునితోడఁ, బలికె వనుచుఁ దెలియఁ బలికె శైల
తనయతోడ శివుఁడు తదనంతరకథాక్ర, మం బుపక్రమించె మఱియుఁ దెలుప.
వ. అప్పుడు కుంభసంభవుండు మరల జానకీపతిం గనుంగొని రఘునందనా! యిం కొక
వృత్తాంతంబు గలదు తొల్లి బ్రహ్మలోకంబుననుండి చనుదెంచు నారదమునీంద్రుం
గనుంగొని నమస్కరించి దశాననుండు నాకుం బ్రతివీరు నెఱింగింపు మనిన నమ్మౌ
నివర్యుం డించుకంత విచారించి. 99
శా. శ్వేతద్వీపమునందు ముక్ హరికరాసిం గూలువారల్ జగ
ఖ్యాతుండైన సరోరుహాక్షు చరణధ్యానార్చనప్రక్రియా

చేతు ల్వచ్చి జనింతు ర ట్లగుట త్వద్భీమాహవక్షోణియం
దూఁత మ్మై నిలువంగ నేర్తు రనఁ దా నుప్పొంగి యుద్ధార్థి యై. 100

### రావణుఁడు శ్వేతద్వీపమునకుఁ బోయి భంగపడుట.

క. తో బలములు రహిఁ దెలఁగఁగఁ, గౌబేరం బెక్కి బాహుగర్వసమగ్రుం
డై బిట్టరుగఁగఁ బుష్పక, మాబెడిదపుఁగాంతి కోడి యురుగక నిలిచెన్. 101

తే. దానవం బట్లు నిర్గతదార్ఢ్యమైన, విడిచి చనిచని యాసితద్వీపమునను
బాలికలహస్తములఁ జిక్కి నల్కఁబడియె, నెవఁడు నిన్నిచ్చటికిఁ బంపె నెవ్వఁడనుచు.

వ. ఇట్లు హాస్యంబునం బల్కంబడి యొట్టకేలకుఁ దత్కరవిముక్తుం డై భయాశ్చర్యం
బులు నివ్వటిల నారాయణుం డింతయొప్పునే యనుచు నెమ్మనంబున. 103

మ. హరిచేతన్ మృతి నొంది పొందెదను బుణ్యంబైన వైకుంఠ మం
దిర మింకేగతి నాయెడం గనలు నద్దేవుండు నే నవ్విధం
బు రయం బొప్పఁగఁ జేతు నంచు ధరణీపుత్రిన్ వడిం గొంచు నేఁ
గి రమా మానిని లోకమాత యని భక్తిం బెంచె లంకాపురిన్. 104

క. ఇది నిక్కము రఘునందన, మదిఁ బరమాత్ముఁడవు భువనమండనుఁడ వటం
చుఁ జిరంబుగ నెఱుఁగును దశ, వదనుం డిటు లయ్యె నాత్మవధకై చేసెన్. 105

చ. ఇనకులవార్ధిచంద్ర పరమేశుఁడ వాశ్రితబృంద మెల్ల గో
రినగతి జేయుచుందువు ధరిత్రిని గల్గినఁ గల్గుచున్నఁ గ
ల్గను గలయట్టి జీవులకుఁ గారణమూర్తివి సాక్షి వందఱున్
మనుజుఁడ వీ వసంగ నిజమాయ వెలింగెద విట్లు రాఘవా!. 106

ఆ. అనుచు వినుతిఁ జేసి యారాఘవేంద్రుని, చేతఁ బూజ లంది శిష్యజనులు
నఖిలమానివరులు నరుదేర స్వాశ్రమం, బునకుఁ జనె నగస్త్యమునివరుండు. 107

వ. అంత రాఘవేంద్రుండు సీతాసమేతుం డయి మంత్రిజనమ్ములును తమ్ములును హనుమ
త్ప్రముఖవానరానీకంబులునుం బలసి కొలువ నాసక్తిలేనివాఁ డయ్యును సక్తుండ
పోలె నిఖిలభోగంబు లనుభవింపుచుఁ బరమానందుండు సంసారియు నై చెలువొం
దె. నొక్కనాఁడు పుష్పకంబు చనుదెంచి కుబేరుం డనిన తెఱంగున రఘువల్లభు
తో ని ట్లనియె. 108

చ. నను దశకంధరుండు ప్రధనంబున నోటొరించి నిన్నుఁ గై
కొనె రఘునాథుఁ డద్దశముఖుం దరఁ గూల్చెను గానఁ దాల్పు ము
య్యనఘుని దివ్యకుంఠనిలయమ్మున కేఁగిన రమ్ము పొమ్మనన్
మనుజవరేణ్య వచ్చితి సుమంగళవిగ్రహ నిన్ వహింపఁగన్. 109

వ. అనినం గారవించియేము తలంచు నవసరంబునం జనుదె మ్మనిన నదియు నంతర్ధానం
బు నొందె రఘుపుంగవుండును. 110

ఆ. పౌరకార్యములు కృపాచిత్తుఁడై యథా, న్యాయ మొప్పఁ జలిపె ననుజమంత్రి
వరులు గొలువఁ బుత్త్రమరణాదులును లేక, కలితసౌఖ్య మయ్యెఁ గాల మపుడు.

సీ. శ్రీరమావల్లభుం డారామవిభుఁడు రాజ్యం బెల్ల శాసించు సమయమునను
ధర యెల్ల సస్యసంభరితంబు ఫలవంతములు భూరుహంబులు కలితధర్మ
వర్తనుల్ జనులు స్వధర్మానుకూలులు వనితలు జానకీవల్లభుండు
దినదినంబు విమానమును నెక్కి జనకనందన యంకమున నొప్పఁ దనదు తమ్ము
తే. లును గవిశ్రేష్ఠులును మంత్రులును జెలంగ, ధరణి నెల్లను విహరించుఁ దండ్రియాతఁ
డనఁగఁ బ్రజలను బోషించు నమరు లెల్ల, మెచ్చు కార్యంబు లొనరించు మించుకరుణ.

వ. ఇట్లు విహరించుచు నొక్కనాఁ డకాలమృత్యువశుండగు నందనుం దోడితెచ్చి విలపించు
బ్రాహ్మణుం గనుంగొని మహాబలుండు గావున నెఱింగి వనంబున నిష్ఠ సలుపు శూ
ద్రుం బరిమార్చి విప్రనందనుం బ్రతికించి యాశూద్రునకు స్వర్గం బొసంగె
నిట్లొసంగి. 113

తే. ఎల్లజనులకు నుపదేశ మిచ్చుభంగి, నిలను గోటులు శివలింగముల నొనర్చి
సకలభోగంబులను భూమిజాసమేతుఁ, డగుచు నొందుచు రాఘవుం డలరె నిట్లు.

వ. అమానుషంబులగు భోగంబు లనుభవించుచు సకలలోకకల్మషాపహంబుగ నిజగుణ
కథనంబు విస్తరించుచు మాయామానుషవిగ్రహుండును లోకవంద్యపదాంబుజుం
డును నేకపత్నీవ్రతుండును రాజర్షియు నగుచు నగ్నిహోత్రాదులు యథావిధ్యు
క్తంబుగా నడుపుచు జనుల రక్షింపుచు విధిక్రమంబున రఘునాయకుండు పదివేలవ
త్సరంబులు ధరాతలంబు పాలించె నాసమయంబున. 115

తే. శమదమంబుల నొప్పుచు సాధ్వి యనఁగఁ, బరఁగి రఘునాథుచిత్తంబు పగిదినడుచు
కొనుచు జగదేకమాత యజ్జనకతనయ, సురలు వినుతింపఁ గాలంబు జరుపుచుండె.

వ. అంత నొక్కనాఁడు సర్వభోగసమన్వితంబగు క్రీడావిపినంబున. 117

## శ్రీరాముఁడు సీతాసమేతుండై క్రీడావనంబున విహరించుట.

సీ. నీలమాణిక్యసన్నిభదేహు దివ్యాభరణభూషితు సుకాంతుఁ బ్రథనభీము
విద్యున్నిభాంబరు వేద్య శ్రీరఘునాథుఁ గని సర్వభూషణకలిత యగుచుఁ
గమలాక్షి మిథిలేంద్రకన్య చయ్యనఁ జేరి కరములఁ దత్పాదసరసిజములు
లాలింపుచు స్వభక్తపాలన! యాదిమధ్యాంతవర్జిత! జగదాధ్య! దేవ
తే. దేవ! పరమాత్మ! సకలవ్యాప్తస్థిర! యశేష, కారణ! సనాతన! భవాంధకారహరణ!

ఘనచిదానందమయ! సుమంగళ! పరేశ!, యామినీచరసంవర్తకాభిధపవన!. 118

వ. మహాత్మా! నిలింపసముదయంబులు నన్నుం జేరి వైకుంఠాగమనం బపేక్షింపుచుఁ బల్కినతెఱంగు వినుండు. 119

ఉ. కూరిమిమందిరం బగు వికుంఠము వీడి స్వేశ క్షితిపైన నీ
తో రఘువల్లభుండు గుణతోయధి భూస్థలి నిల్చెఁ గాన నేఁ
డారయ నీవు ముందుగఁ బ్రయాణ మొనర్చినఁ దోన వచ్చు నా
భూరమణుండు నిట్లయినఁ బొల్పగు సాధిపమై వికుంఠముల్. 120

వ. అని విన్నవించిరి గావున. 121

తే. తెలియఁ బలికితిఁ జిత్తంబుకొలఁది సవధ, రింపుఁ డిటు గా దటంచు శాసింపఁగలనె
యనిన నించుక ధ్యానించి యనియె నిట్లు, జనకనందనతో రామచంద్రవిభుడు.

వ. దేవీ! యింతియు నెఱుంగుదు నిందులకు నొక్క యుపాయంబు పల్కెద నీవలన నొక్క యపవాద గలిగిన నమ్మిషవలన భీతుండపోలె వనంబున నిన్ను విడిపింతు నీకును. 123

క. జనియింపఁగలరు వాల్మీ, కుని యాశ్రమమునను గవలు కొమరులు నీనుం
గనుఁగొనఁగ గర్భచిహ్నము, లొనరెడు నీమేన నిప్డు దుర్వ్రతసయా!. 124

ఆ. అంత నన్నుఁ గాంచ నరుదెంచి జను లెల్ల, నమ్మ బాసఁ జేసి నెమ్మిఁ జనుము
కుతలవివరమున వికుంఠధామంబున, కిదియు నిజము మనల కిద్దఱకును. 125

వ. ఏను దోడనె చనుదెంచెద ననుచు నమ్మహాదేవిని విడిచి ముఖ్యజ్ఞానేక్షణుం డగు జానకీవల్లభుండు నిజపరివారంబులు గొలువఁ గొలువునం గూర్చుండి హాస్యప్రౌఢ కథావిశేషంబులం బ్రొద్దుపుచ్చుచుఁ బ్రసంగవశంబున విజయుం డను నొక్క భటుం గనుంగొని యిట్లనియె. 126

చ. నగరమునందుఁ బల్లెల జనంబులు నేమని పల్కుచుందు రిం
పుగ నను మత్సహోదరుల భూతనయన్ దెలియంగఁ బల్కు భీ
తిగ నిఁకఁ బల్కకున్న ననుఁ ద్రుంచినయట్లు లటన్నఁ బల్కె వాఁ (?)
డు గడు భయంబు నొంది తెగడు న్నను లోకము లంచుఁ బార్వతీ!. 127

వ. మఱియు నిట్లనియె నెల్లవారును రామచంద్రుండు దుష్కరంబగు కార్యం బొనరించియు రావణుండు గొనిపోవుట లడుగుపఱచి తోంటిభంగి దనభార్యం గైకొనియె మనవు జనంబునకుం దలంప దుష్కర్మంబగు బలియులగువారల నేమి యనం బోలు నిదియ కాదు. 128

ఆ. ప్రభువు లెట్టివారొ ప్రజ లట్టివా రౌదు, రిది నిజంబు రాఘవేశ్వరునకు

నేమి సుఖము వాదు నింత తానాడిగట్టి, తగుదు ననుచు సీతఁ దగిలి యుంట. 129
అనుచు నిశ్చయంబుగఁ బల్కుచు దనివ సుహృజ్జనంబుల నడుగ వారును నట్ల
పలుక నందఱఁ గొలువు వీడి చన నియోగించి లక్ష్మణుం బిలిపించి. 130

అవనిజవలన లోకాపవాద జనించె భరియింపఁ జాల రేపటిదినంబు
నీవు మీవదినెను నిజముగ వాల్మీకియాశ్రమంబున డించి యతిరయమునఁ
జనుదెమ్ము యొండు పల్కిన నన్నుఁ ద్రుంచినయట్లు లన్నను భీతి నంది లక్ష్మ
ణుండు ప్రొద్దున లేచి మెండైనరథముపై నెక్కించి మంత్రితో నేఁగి యచట
డించి మాతల్లి! లోకంబు లెంచుమాట, కోడి రఘువల్లభుఁడు నిన్ను వీడఁబనిచె
జనుము వాల్మీకియాశ్రమంబునకు దోస, మెఱుఁగఁజేసితి రామాజ్ఞ నింతవట్టు. 131
అనుచు రాముఁ జేర నరుదెంచి లక్ష్మణుఁ, డంత జనకజయును హారఘుకీర్తి
మా! యటంచు ముగ్ధ యోయని విలపింపఁ, దెలిసి రామచంద్రు లలన యనుచు
యోగదృష్టివలన రాఁగలకార్యంబులఁ దెలిసి వాల్మీకిమునీంద్రుం డతిరయంబునం
జనుదెంచి తల్లీ! దైవఘటనకుఁ జింతింప వలవదు జగన్మాతవగు నీకుఁ గొఱంత
యేమి? యనుచు నర్ఘ్యపాద్యాదులవలనఁ బూజించి మునికన్యకల నోసంగ
వారలు వాల్మీకివాక్యంబువలనఁ బరమాత్మయగు నారాయణునిలక్ష్మి యని తలంచి
యనుదినంబును రాజోపచారంబులవలనఁ బూజింపుచుండి రంత. 133

జనకజ లేకయుండుటనె సర్వజగద్వలయేశుఁ డయ్యెఁ దా
ననుపమభోగసంగముల నన్నిటి వీడి విరక్తుఁడై మునీం
ద్రునిగతి మానిసేవితపదుండు పరాత్పరుఁ డాదిదేవుఁ డ
య్యనఘుఁడు రాఘవుం డగృహమందుల నిల్చె హిమాద్రినందనా!. 134
అనుచుఁ దుషారాచలనం, దనతోడ విదేహరాజతనయాధిపు పా
వనకీర్తి నాడి శివుఁ డో, య్యన నవ్వలితెఱఁగుఁ దెలుప నారంభించెన్. 135
ఇట్లు జగన్మంగళం బగు నాత్మశక్తివలన రఘుపుంగవుండు మంగళాత్మకంబును
నుత్తమంబును నగు రామాయణం బను నిజకీర్తిసుధాకరకిరణసముదయంబు జగం
బులం జల్లి పూర్వకాలంబున రాజర్షివర్యులచేత నభిసేవితంబులగు ధర్మమార్గంబు
లఁ దాను సంచరింపుచు. 136

తగు నుదారబుద్ధి యగు లక్ష్మణునిచేత, నడుగఁబడి మహీసుతాగ్రహమున
నృగమహీంద్రునకును జగతిపైఁ దిర్యక్త్వ, మనుభవింపఁ గలిగె ననుచుఁ బలికి.
పావనంబగు నొక్కకథ నుపన్యసించెద ననిన నంత నొక్కనాఁ డేకాంతంబునం
గూర్చున్న రమాలాలితపాదపంకజుండగు తనయున్నం గనుంగొని సంపాదితశుద్ధ

భావనుం డయి కరయుగంబులు మొగిడ్చి వినయంబున మరల సుమిత్రానందనుం డి
ట్లనియె. 138

ఉ. అరయ సర్వదేహులకు నాత్మ వధీశుఁడ వవ్యయుండవు౯
దూరితవిగ్రహుండవు నిగుండవు శుద్ధవిబోధకుండ వీ
తీరగునట్టులైన భవదీయపదాంబుజభక్త్యంగనిర్మితో
దారనిజాంతరంగులకు దివ్యులకుం గనుపింతు వీశ్వరా!. 139

ఆ. ఏ నమస్కరింతు మానిరాజ్ఞిచయస, ద్వంద్వములు భవాపవర్గకరము
లైన నీపదముల కజ్ఞానవార్ధి వే, గమున దాఁటుసరణిఁ గఱపఁగదవె 140

వ. అనుచు విన్నవించు ముగ్ధలక్ష్మునిం గనుంగొని నిఖిలాంతరస్థుండును ప్రసన్నార్తి
హరుండును ప్రసన్నబుద్ధియు నగు జానకీవల్లభుండు సంతసించి శ్రుతిప్రసన్నుం
డును వేదశిరోభూషణంబును నగు విజ్ఞానంబు నజ్ఞానతమోపశాంతి యగుభంగిఁ
బల్కందొడంగె నెట్లనిన. 141

## శ్రీరాముఁడు లక్ష్మణునికిఁ దత్త్వోపదేశము చేయుట

సీ. మనుజుండు ప్రథమంబు తనయాశ్రమమున వర్ణితములౌ క్రియల సమ్మతి నొనర్చి
పరవిసాధనచతుష్టయనుసంపత్తిభావుకసమాసాదితశుద్ధమాన
సత్వంబుగలిగి స్వేచ్ఛను దత్క్రియల నెల్ల నొకయెడ నిలిపి తా నొక్కగురువు
నాత్మసంప్రాప్తికై యనుసరింపఁగఁ బోలు నపుఁడ కతఁ డిట్టు లంటివేని
తే. యాక్రియలఁ గోరి యొనరించునట్టివారి, కగును హేతువుపొందు దేహమునకవియ
యగుఁ బ్రియాప్రియములకు ధరాధారములనుఁ, గారణంబులు వార్ధిగంభీరనిజము.

క. వే టోకతను వొందుచుఁ దొలి, తీరునే క్రియ లొనర్చి దేహి యగును నీ
తీరున నరయఁగ నీసం, సారము చక్రంబుభాతి సత్యము వత్సా!. 143

ఉ. దీనికి మూలకారణముఁ దెల్పెద జ్ఞానము లేకయునిక్క యి
ద్దానినె నిశ్చయింపఁ బడెఁ దద్ఘనక్రియ యందు విద్య బ
ల్మానిసి తద్భవంబులు తలంపఁగఁ గర్మము లొప్ప వెట్లన౯
భానుకులేశ! శాస్త్రములు పల్కెడు పెద్దలచేతఁ దద్దయు౯. 144

తే. ఒనర నజ్ఞాన మడఁగక యుండెనేని, ద్వేషరాగాదులను గల్గు దోషములను
గర్మపుట్టించు సంసృతిఁ గుముఁ దగదు, గాన విజ్ఞానసువిచారి గాఁగ వలయు.

వ. వేదచోదితంబును విద్యభంగిఁ బురుషార్థసాధనంబు గావునఁ బ్రాణభృతుం డగు
వాఁడు సేయవలయు ననుటను నిత్యావపాయిత్వంబునఁ జేయకున్న దోషంబు
గలుగు నని విశ్రుతులు పలుకుటవలన ముముక్షులగువారల కెల్లకాలంబును గ్రియల

నొనరించుటయు కార్యం బంటివేని స్వతంత్రయు నద్భుతకార్యకారిణియు నితరాన
పేక్షయుఁ గావున విద్యయు యవలంబనార్హం బదియునుం గాక. 146

సీ. సవనంబు దలఁపంగ సత్యస్వరూపి యయ్యును గారకంబులఁ దనకు వేఱు
లగువానిఁ గాంక్షించు యాజకునకు ఫలం బొసఁగుమాడ్కి-ని విద్య యొసఁగు మోక్ష
మమరు వేదోక్తకర్మములఁ గాంక్షించియు యంటివేని కుమార! యట్లు గాదు
మహి నొప్పు దేహాభిమానంబునఁ గ్రియ లహంకృతి పోవ విద్యలు చెలంగు
తే. విమలవిజ్ఞానభూషిత విద్య యది య, పార మంతఃకరణవృత్తికారకములఁ
గర్మఁ గాంక్షించు విద్యనిక్కంబ బటంచుఁ, గాన భరణార్హ నిర్ణయగ్రాహి వగుము.

వ. ఇట్లు విద్యాకర్మ లధికంబగు దృష్టవిరోధంబు గలుగుటం జేసి నీవు వల్కి-న తెఱం
గుఁ గంటివేని. 148

ఆ. ఎంతవట్టు పాయ కిద్దేహములయందు, నాత్మబుద్ధి గలుగు నంతవట్టు
వేదసముదయప్రచోదితార్థములఁ దా, ననుసరించి మనుజుఁ డరుగవలయు. 149

వ. అయినను 150

సీ. జగమునఁ దగుపనిషద్వాక్యముల నిషిద్ధంబయ్యెఁ గాన నిక్కంబు గాఁగఁ
బరమాత్మ నెఱిఁగి యేఁ బలికినగతిఁ గ్రియ ల్వదలింపవలయు నేసమయమందు
నూఁదుఁ బరాత్మాత్మభేదబాధకమగు విజ్ఞాన మవ్వేళ వెలయుచుండు
నాత్మసంసృతిహేతు వగు మాయ నిజకార్యకర్మల నిఁక వేఱుకరణి గాదు
తే. మతలి తొలిపోలిక శ్రుతిప్రమాణములవుఁ, గాక యది కార్యకారియై గాని యట్ల
తనరు విజ్ఞానమాత్రంబునను విశుద్ధ, యద్వితీయ యునంగఁ గల్యాణచరిత. 151

ఆ. విను మవిద్య యిట్లు జనియింపకున్న స, హంకృతియును బుట్ట దట్లు గాన
ప్రీతితోఁ బ్రసిద్ధహేతువ యైన వి, ద్యయ ధరింపఁ బోలు నయవిదుండ. 152

వ. ఇవ్విధంబున సమస్తకర్మంబులను న్యాసంబు ప్రసిద్ధం బనుచుఁ దైత్తిరీయ
శ్రుతివలన మోక్షంబునకొఱకు జ్ఞానంబకాని కర్మంబు సాధనంబు కాదని వాజ
సనేయశ్రుతివలనను సాదరంబుగఁ జల్కంబడియె నిదియు కాదు. 153

క. కారకములఁ గ్రతు వగు నా, తీరున నజ్ఞాన మిట్లు దెలియు ఫలంబు
ల్వేఱగుట విద్యతోడుత, నారయు దృష్టాంత మగునె యధ్వరము మహిజ్ఞా. 154

వ. అనఘ! యనాత్మయైన తనువందుల యేనను నాత్మబుద్ధి గ
ల్గు నదియు ప్రత్యగాత్మ మగుఁ గోరినఁ గల్గ దొకింత తత్త్వద
ర్శనులకుఁ గాన ద్వైత మని చేసెడుభంగి విధానమంచుఁ జెం
దినను నవిక్రియాత్మఁ డగు ధీయుఁడు కర్మను వీడఁగాఁ దగుఁజా. 155

మ. ఇట్లొనరించి యంత శ్రద్ధాన్వితుండై గురుప్రసాదంబున విశుద్ధమానసుం డగుచుం దత్త్వమసీతివాక్యంబుల జీవపరమాత్మలకు నేకత్వం బెఱింగనేని మేరుధరాధరంబునుంబోలె నకంపనుం డై సుఖంబు నొందు నిబ్భంగి యెట్లగు నంటేని యమ్మహావాక్యంబు సామవేదస్థంబు గావున సమానాధికరణవాక్యం బని చెప్పవలయుం గాదేని యదియును మధ్యపురుష కనుపపత్తి గల్గు "సంసర్గో వా విశిష్టో వా వాక్యార్థో నాత్ర సమ్మతః" ఇతివ్యాయంబున నభిహితాన్వయవాదంబు నన్వితాభిధానవాదం బను నివి రెండును నివ్వాక్యార్థనిర్ణయంబున సంభవింప నేరవిం కెట్లనిన "సోయం దేవదత్త!" యను వాక్యంబుభంగి నభేదాన్వయవాదంబు సేయవలయు నత్తెఱం గెఱింగించెద. 156

సీ. అమ్మహావాక్యార్థ మబ్బుఁగ వాక్యసంఘటితపదంబులు గాంచఁ దత్వ
దార్థంబు నెఱుఁగఁగ నగు మూడుపదములు తత్పదంబును ద్వంపదంబు నని య
నెడు క్రియాపదము నా నెఱఁ బరమాత్మ యమ్మొదల నౌఁ దత్పదంబునకు రెండ
వది యనఁ దగిన యాత్వంపదంబునకు జీవుఁడు లక్షణావృత్తి నొక్కటిగను

తే. నసి యను క్రియాపదం బైక్య మెసఁగఁబలికె జీవపరమాత్మలకు నిట్టి త్రోవవెలయు
వారు వాక్యార్థవిజ్ఞానపారగు లనఁ, దగుదు రే మెచ్చెదను సుమిత్రాతనూజ!. 157

వ. అందగపడని హేతువువలనఁ బరమాత్మయందుఁ బరోక్షత్వంబును బ్రత్యక్త్వంబును నసఁ బ్రతిలోమప్రకాశమానత్వంబు గావునఁ దత్తజ్జీవుని యందునను గల్గుటం జేసి యేతాదృశవిరుద్ధధర్మములగు జీవపరమాత్మల కవిర్వోధంబునఁ "దత్త్వమసి" యను మహావాక్యం బైక్యంబు బోధించె నంటేని 'గంగాయాం ఘోషః' యనువాక్యంబు జహల్లక్షణంబును 'శోణో ధావతి' యనువాక్యం బజహల్లక్షణంబును ననుసర్థంబులు బోధించెం గాని యివ్వాక్యార్థంబున నాలక్షణంబులు గూడ విం కెట్లనిన "సోయం దేవదత్తః" యను వాక్యంబు తద్దేశ తత్కాల ఏతద్దేశ ఏతత్కాలంబులగు విరుద్ధధర్మంబులు విడిచి భాగత్యాగలక్షణంబున దేవదత్తస్వరూపంబును లక్షించి తదైక్యంబును బోధించినభంగిఁ 'దత్త్వమసి' తివాక్యంబున విరుద్ధధర్మంబులగు పరోక్షత్వప్రత్యక్త్వంబును విడచి తత్త్వంపదంబువలన జహల్లక్షణాపాలంపరభాగత్యాగలక్షణంబునఁ జైతన్యస్వరూపంబును సంగ్రహించి తచ్చైతన్యస్వరూపాభేదంబును బోధించె నిది యసంశయంబు మఱియును. 158

కళికవృత్తము. కనఁగొన శబ్దస్పర్శరూపరసగంధములు సూక్ష్మభూతము లై
దును బంచీకృతము లగుచు నయ్యెను స్థూలశరీరజనకములు గా
వునఁ బంచీకృతభూతసంభవం బుడుగుట గలుగుట గలదియుఁ జెం
దిన సుఖదుఃఖము లొంద నదన మీతీరున సూక్ష్మశరీర మగుచ. 159

వ. ఇదియ యనాదికర్మజంబును మాయామయంబును నాత్మకు స్థూలోపాధియు నవం
బరఁగునపంచీకృతసూక్ష్మతన్మాత్రపారంపర్యముచే సూక్ష్మభూతసంభవంబును మనో
బుద్ధ్యహంకారదశేంద్రియప్రాణపంచకసంయుతంబును భోక్తకు సుఖదుఃఖాద్యను
సాధనంబును నాత్మకు రెండవదియును నన సూక్ష్మదేహం బొప్పు ననాదియు నని
ర్వాచ్యంబును మాయాప్రధానంబును గావున నాత్మకుఁ బ్రథమశరీరం బనఁ గార
ణదేహం బొప్పు మఱియును. 160

క. ఈదేహత్రితయంబునఁ, దాఁ దగులం డనుచుఁ దనకు దనువునఁ దెలియం
గాఁదగు నాత్మను నీక్రియఁ, దాఁ దెలిసిన సౌఖ్యసంభృతస్వాంతుఁ డగున్. 161

వ. మఱియును. 162

చ. ఎఱుపగు పువ్వువందుఁ గదియించిన సుస్ఫటికంబుభాతి నా
త్మరహితసంగుఁ డద్వయుఁడుఁ దా నజుఁ డయ్యును గోశయుక్తుఁడై
యొరులకుఁ దత్స్వరూపుఁడుగ నుండును గారణకార్యసంగమం
బరయఁగ లక్ష్మణుండ! నిజ మభ్రనినాదము (వేదవిద్వరా!). 163

వ. మఱియును. 164

*పంచచామరము. కనుంగొనన్ గుణత్రయాత్మకంబు లైనబుద్ధికిన్
అనంగ నొప్పు జాగ్రదాగు లట్టిమూఁడు వృత్తులం
దు నిజ్జగంబు వెల్గుఁ గానఁ దోఁచ దొక్క టున్నవే
ళ నిట్టు లౌట మిథ్యగాఁ దలంప నౌను లక్ష్మణా! 165

వ. ఇవ్విధం బంతయుఁ దద్వృత్తిత్రితయాత్మకంబగు జగంబు. 166

†మాలిని. ఆర్యాధారుఁడు నిత్యుఁడు బ్రహ్మయు నచ్యుతుఁడున్ శివుఁ డౌచును దా
నివ్విధి నొప్పు పరేశునియందున నెన్నఁగఁ గల్పిత మౌను జగం
బెవ్విధి నన్నను రజ్జువునందు నహిం గ్రము భ్రాంతి జనించినటుల్
దవ్వుల నుండినవాఁడు జగంబును దల్చును నీశునియం దనుజా!. 167

వ. మఱియు దేహేంద్రియప్రాణమనశ్చిదాత్మలను సదసత్పదార్థంబుల కజస్రంబును
సంగంబును బరస్పరమిథ్యాతాదాత్మ్యంబునఁ దమోమూలంబున నజ్ఞానమునం బుట్టు
క్రియావృద్ధి యొంటిపర్యంతంబు గల్గు నంతవట్టు విద్వాంసులకయినను సంసారం
బపరిహార్యం బగు నిదియునుం గాక. 168

క. అరయంగ "నేహ నా నాస్తి కించన" యన "నాత్ర కాచనభిదాస్తీతి" యనఁగఁ
దెలియు "సధాత ఆదేశోన". యనఁగను జెలువొందు శ్రుతివాక్యములను నిఖిల

---

* ఈవృత్తము మూలగ్రంథాధారమున సరిచేయఁబడినది.

† ఈపద్యము మూలాభిప్రాయమున ఛందోనిబంధితమైనది.

మును నిరాకృత మర్యా మనుజుఁడి ట్లగుటచే మామిడిపండున మధురరసము
గొని టెంకయును జర్మమును పాఱవైచిన గతిని వ్యాత్మ_మలమం దతిగుణాఢ్యుఁ
తే. డన సదాస్వాదితసుచిద్ఘనామృతుఁ డగు,నరయ నఖిలంబు విడుచు సత్యంబు నింత
పలుకఁ బనిలేదు తా నిట్లు తెలిసి మనను, నిలుపఁజాలిన రఘుంకతిలక! నిజము.
వ. మఱియు 'సజాయతే న మ్రియతే' యను వాక్యంబుగ. 170
కలికవృత్తము. విరహితషడ్భావుఁడు ప్రాజ్ఞుండును విరతసమస్తావయవుఁడు భా
సురుఁ డద్వయుఁడు స్వయంప్రభుఁ డమలుఁడు సుఖరూపుఁడు సర్వగతుఁడు ని
ట్లరసిన నొప్పు పరబ్రహ్మావలన నతిసుఖగుణఖాత్మక మగు ను
స్మరణము గల్గునె యజ్ఞానాధ్యాసవలన సౌమిత్రీ! యదియుక. 171
క. జ్ఞానంబు గలిగినేనియు, జ్ఞానాజ్ఞానముల కింపు గలుగగు గానం
దోడనె నశియించును న, జ్ఞానంబునఁ బుట్టినట్టి కార్యము వత్సా!. 172
వ. అన్యోన్యాధ్యాసంబు లెవ్వి యనిన. 173
సీ. ఒకవస్తువును వేఱె యొకవస్తువుగను దా నొకవస్తుధర్మంబు నొండువస్తు
ధర్మంబుగను బుద్ధిఁ దలఁచుట లననివి తను "నహంకర్త్రమో దహతి" యనెడు
వాక్యంబులట్ల నీ వసుధను ధర్మిధర్మాధ్యాస లన సుమిత్రాతనూజ!
మఱియుఁ బల్కెదఁ బ్రథమంబ వికల్పితప్రపంచసాక్షునఁబడు చిదాత్మ
తే. యం దహంకారమునను రాగాదిధర్మ. కంబులగు దానివృత్తులు గల్గె మాయ
నెనయఁగావునసంసారహేతువులని, రామయుఁడుపరుఁడునగు బ్రహ్మమయ్యె నిజము
వ. కాని యయ్యహంకారంబును దద్వృత్తులను లేని సుషుప్తిసమయంబున "తమోభి
భూత స్సుఖరూపమే" తీతి "సుఖ మహమస్వాప్స" మితి శ్రుతివాక్యంబులచేత
సుఖస్వరూపుం డగుచు విభావితుం డగుఁ గావున నహంకారతద్వృత్తిసామాపణం
బునఁనె కాని విచారింప సంసారం బాత్మయందుఁ గనఁబడదు మఱియును 175
సీ. ఒనర ననాద్యవిద్యోద్భవబుద్ధిబింబితుఁ డగు జీవుసిపేర నను చి
దాభానుఁ డన నాత్మ యచ్చిదాభాసబుద్ధులకును సాక్షియై వెలయు వేఱ
బుద్ధ్యుపాధికుఁడౌచుఁ బొలుపొందు విజ్ఞానమయుఁడని యజుఁడని మఱియుఁ దలఁచి
బుద్ధిచిద్బింబంబుఁ బోల్పఁ దత్సాక్ష్యాత్మ యును మూఁడు నిలుచుట నొకటికొకటి
తే. కైవతాదాత్మ్యమనెడు నధ్యాసమిథ్య, వలన "లోహోదహతి" యనువాక్యమట్టు
లగును నేఁజేతువనుట యు నాత్మయందుఁ, గాని నిక్క ంబుఁదెలియంగఁ గాదువత్స!.
వ. అవ్విధంబుననెయన్యోన్యాధ్యాసవలనఁ జిదాత్మచేతస్సులకును జడాజడత్వంబులు
గనఁబడును గావున విద్వాంసుం డగువాఁడు గురుముఖంబునను వేదవాక్యంబులవల

తను సంజాతవిద్యావిభవధురీణుండై యాత్మగోచరంబగు జడకార్యం బశేషంబు
నిరసించి యాత్మస్థుండును నుపాధివర్జితుండును నగు స్వాత్మను నెఱింగి యానస
యుంబున. 177

విరహితుఁడఁగా వినిశ్రుతుఁడ విగ్రహుఁడఁగా విగతామయుండ భా
సురుఁడ సదావిముక్తుఁడ విశుద్ధుఁడ వక్రియుఁడఁగా యజాండ సం
భరితయచింత్యశక్తుఁడను భవ్యయశుండ సకృద్విభాతుఁడఁగా
విరహితపాపుఁడఁగా సుఖుఁడ వేద్యుఁడ నంచుఁ దలంపఁగాఁ దగున్. 178

మఱియు నతీంద్రియజ్ఞానుండును సంపూర్ణుండును విశుద్ధవిజ్ఞానఘనుండును వేద
వాదులగు బుధులచేత వ్యాఖ్యానితుండును ననుచు నెల్లయెడల భావన యొనరిం
చునేని యట్టి యఖండితాత్ముం డగువాని విశుద్ధభావన సదాసేవితం బగు నౌషధంబు
రోగంబుల హరించుపోలిక సకారకంబులతోడ నవిద్యను వశియింపం జేయుఁ గావున.

మనుజాలు దిరుగనిచోటునఁ, జని విమలాత్ముఁడు ననవ్యసాధనుఁడు సుఖా
సనుఁడును విజితదశేంద్రియుఁ,డును మౌనియు నగుచు మనుజుఁడు నిలువవలయున్.
ఇట్లు నిలిచి. 181

అరయఁ డొకటి యగు పదార్థంబు భావించి, మిగుల జ్ఞానసదృశుఁ డగుచుఁ బండి
తుండు నాత్మసంస్థితుండు కావలయుఁ గే, వలము భానువంశతిలక! యిటులు. 182
అంత. 183

తాను జరాచరాత్మకమగు విశ్వ మంతయు మించుపరమాత్మదర్శనంబు
కరణిఁ గాంచుచు సర్వకారణుండగు పరమాత్మయందులను లయం బొనర్చి
యానందమయుఁడు నత్యంతసంపూర్ణుఁ డై యుండఁగాఁ దగు నిట్టు లుండెనేని
యతఁ డట్టివేళ బాహ్యాంతరవస్తునిర్ణయ మెఱుంగఁడు సంశయమ్ము నిదియుఁ
గాక విజ్ఞానమాత్రంబు గాక జగము, తత్సమాధికిఁ బూర్వంబ తలఁపవలయు
వాచ్య మిదియగుఁ బ్రణవం బవాచకంబు, గాదు వేఱొండుగతిని నిక్కంబువత్స!
కావున. 185

ఈనిఖిలజగంబున న, జ్ఞానంబున దలఁపఁబడియె సౌమిత్రీ! వి
జ్ఞానంబు గల్గెనేనియుఁ, దోఁచదు దృశ్యాన్య మగుచుఁ దోఁచును నిజమున్. 186
ఇంక నయ్యోంకారం బెట్టి దంటేని. 187

కలుగు నకార ఉకార మకారంబు లన మూఁడు వర్ణంబు లయ్యె వాని
యం దవస్థలు జాగ్రదాదులు మూఁడు వర్ణను వానికిని నవస్థలకు విశ్వ
తైజసప్రాజ్ఞులు దగుధన్యులని సమాధికిఁ బూర్వమే భువిఁ దెలియఁబడును
గానఁ బూర్వోక్తప్రకారంబునను విశ్వుఁ డాఢ్యుఁ డైన యకార మయ్యకార

తే. మునను తైజసుఁ డాధ్యక్షుఁ డనఁగఁదగిన, యయ్యుకారంబు నమ్మకారాంతరమునఁ
ప్రాజ్ఞుఁడాధ్యక్షుఁడగు మకారంబులయము, మించుపరమాత్మయందుఁ గావించవలయు.

వ. ఇట్లు చిద్ఘనుండును గారణుండును నగు పరమాత్మయందు లయం బొనరించి యంత.

ఆ. ఎవనియందు లయము నే నొనర్చితి నతఁ, డేను నిర్మలుఁడను జ్ఞానదృశుఁడ
నైనయ నిత్యముక్తుఁడను గతోపాధికుం, డను నటంచుఁ దలఁపఁజను బుధుండు.

వ. ఇట్లు దలంచుచు. 191

క. చలియింపని జలములు గల, జలనిధితెఱఁగున నరుండు స్వానందమునన్
మెలఁగుచును బరిస్రుతభూ,తలుఁడును ముక్తుండు నగుచుఁ దనరఁగవలయున్. 192

వ. ఇట్లు పరిజ్ఞాతపరాత్మభావుండును నిత్యాత్మసుఖప్రకాశకుండును సదాభ్యస్త సమాధియోగుండును నివృత్తసర్వేంద్రియవృత్తిగోచరుండును వినిర్జితాశేషశత్రుండును జితషడ్గుణాత్మకుండును నయి యోగుండు మునివల్లభునకు దినంబును నేను గానం బడుదుఁ గావున నిట్టియాత్మ నహర్నిశంబును ధ్యానింపుచు ముక్తసమస్తబంధనుండయి ప్రారబ్ధంబున సుఖదుఃఖంబులు గలిగినను నభిమానంబులేక యోగియగువాఁడు నిలువవలయు నిదియునుం గాక. 193

తే. ఆదిమధ్యాంతములను నభేద మెఱిఁగి, భేదభయదంబులగు విధివాదవోది
తముల విడనాడి యాత్మయై తనరి సకల, జీవుల వెలుఁగుస్వాత్మను జేరవలయు. 194

వ. ఇదియు గా దాత్మయందు నిర్విశేషం బంతయు నభేదంబున క్షీరంబులయందు క్షీరంబులు గలుపుకరణిని భావింపం బోలు నిట్లయిన నాతోడుత నభేదుం డగు మఱియును. 195

చ. శ్రుతులను సత్ప్రమాణములఁ జొప్పడుయుక్తుల నిజ్జగంబు చం
ద్రతరణు లంబుపాత్రిలను ద్విగుణులై కనిపించుమాడ్కి మా
రిత మగుఁ గాన మానవుఁ డరిందమ! మిథ్య యటంచుఁ దల్పఁ బో
లు తను భవంబున న్నిలిచి లోకులభంగిని నిల్చియుండినన్. 196

క. నరుఁడు మదాత్మ యటంచును, బరువడి జగమెల్లఁ గాంచుపర్యంతంబుం
బరమద్విగ్రహసేవా, పరుఁ డయి జరుపంగవలయుఁ బదపడి దివముల్. 197

వ ఇట్లయిన నహర్నిశంబులయందు "తస్యైవ ఆత్మా వివృణుతే తనుస్వాం" అను శ్రుత్యుక్తప్రకారంబున హృదయగోచరుండు నగుదు నిప్పుడు నీయందుఁ బ్రియంబున నేను బల్కిన రహస్యంబును శ్రుతిసారసంగ్రహంబునునగు నీయర్థంబు నెవ్వరైనను నాలోచనంబు సేయుదు రట్టివార లనేకపాతకజాలంబుల నైనను నిమిషమాత్రంబున విముక్తు లగుదురు మఱియును. 198

చ. కనుఁగొన నైంద్రజాలికజగం బపుడా వని చూచి విస్మితం
బనుపడ నిట్లు మాయ యనుభంగిని నీసదసద్విలక్షణం
బున ధర మాయచేతఁ బొలుపొందు జగంబును మిథ్య యంచు భా
వనను మదీయతత్త్వము ధ్రువంబుగ నిల్పఁ దగుం సుపుణ్యుఁడై. 199

వ. ఇట్లు మద్భావనాభావితశుద్ధమానసుం డై యానందమయుండును సుఖంబును నిరామయుండును నగుచు నుండవలయు. 200

క. అగుణుండ ననుచు నైనను, సగుణుండ నటంచు నైన సమ్మతిఁ దలఁపం
దగు నిటు దలఁచిన పుణ్యుఁడు, జగముఁ బవిత్రంబు సేయుఁ జలజహితుక్రియన్.

వ. ఇవ్విధంబున 202

చ. గురుచరణారవిందములకుం బ్రణమిల్లి మనంబునం దనుఁ బె
ద్దఱికము మాని వాక్యములఁ దద్దయుఁ జేరిచి వేదపారవి
ద్వరుఁ డన నొప్పు నే నెఱుఁగఁ బల్కిన యీతగు వేదసారముం
గురుతరమైన జ్ఞానమును గోరి భజించినవారు నా సముల్. 203

## ఋషిసమూహము లవణాసురవృత్తాంతము రామునికిఁ దెలుపుట

వ. అని యివ్విధంబున సుమిత్రానందనున కుపదేశం బొసంగు నవసరంబున యమునాతీరవాసులగు పెక్కండ్రు ఋషులు చ్యవనభార్గవుల మున్నిడుకొని లవణాసురుని భయంబున బఱతెంచి రఘుపుంగవుం గాంచి యభయకాంక్షితు లై నిలువ నారాజరత్నంబు వారల మన్నించి పూజనంబులం బ్రీతులం గావించి యిట్లనియె.

క. ననుఁ గనుఁగొనఁ జనుదెంచుట, ఘన మయ్యెను మీదుకోర్కి కడు దుష్కర మై
నను జేతు దనుజు లయినను, మునులు బ్రాహ్మణులు దేవతుల్యులు నాకున్. 205

వ. అనిన హర్షంబు నొంది రంతఁ జ్యవనుం డిట్లనియె. 206

సీ. విను రఘువల్లభ! మును కృతయుగమున ధర్మాత్ముఁడును సురధారుణీసు
రాభిపూజితుఁడు మధ్వాసురుం డలరు వాలాంబకుం డాతనియందు సుప్ర
సన్నుఁ డై శూలం బొసంగి దీనను వ్రేయ నెవఁడైన భస్మమౌఁ గల నటంచుఁ
బలికె నాతనికి రావణు చెల్లెలగు కుంభినసికిని లవణుఁ డనంగ నొకఁడు

తే. పాపకర్ముండు జనియించె భవ్యచరిత!, వానిచేఁ బీడితుల మౌచు వచ్చినార
మఖిలలోకేశ్వరుఁడవు నారాయణుఁడవు, నీవు గల వని యొక దృఢనిశ్చయమున.

వ. అనిన వెఱవకుం డిది యెంత కార్యంబు లవణు నడంగం జేసెద విగతజ్వరు లయి
చనఁబోలు ననుచుఁ దమ్ముం గనుంగొని. 208

క. ఎవరు లవణుఁ ద్రుంచి యయ్యవనీసుర, బృందములకు భీతి దీర్పఁ దుఱుతు

రనిన భరతుఁ డెంతో వినయంబుతోడుత, నిట్లు పలికె రఘుకులేశుతోడ. 209
వ. దేవా! యాజ్ఞ యొసంగదవేనిఁ బరిమార్చెద ననిన శత్రుఘ్నుండు లేచి నమస్క-
రించి యి ట్లనియె. 210
చ సితసరసీరుహాక్ష! రఘుశేఖర! లక్ష్మణుచేతఁ జేయఁగా
జతపడె భూరికార్యములు సన్మతియౌ భరతుండు మిమ్ముఁ బా
సి తలఁపరానిదుఃఖములఁ జెందెను గావున నేను ధర్మదూ
షితుఁ డగునట్టి యాలవణుఁ జేరి వధించెద నాజ్ఞ యిచ్చినన్. 211
ఆ. అనిన సంతసించి యాసుమిత్రాపుత్త్రు, నంకమునను జేర్చి యయ్య! యిపుడె
యధిపుఁ జేసు మధుర కసు లక్ష్మణునిచేతఁ, దదుపకరణచయము ముదముతోడ. 212
వ. తెప్పించి తదుపకరణయుక్తుని నతిస్నేహంబున మధురానగరంబున కభిషిక్తుం జేసి
యొక్క దివ్యసాయకం బొసంగి శత్రుసూదనా! యిబ్బాణంబున లోకకంటకుండగు
లవణుం బరిమార్పుము వాఁడు సదాశివప్రసాదలబ్ధంబగు శూలంబుఁ బూజింపుచు
గృహంబునం బెట్టి నిఖిలజంతుహననోద్యుక్తుండగు వలయకాలుపోలిక భక్షణా
ర్థంబు ఘోరాటవుల సంచరించుం గావున వాఁడు మరలి రాకుండునంతఁ బురద్వా
రంబున ధృతకార్ముకుండవై నిలువు మిట్లయిన వధియింపం బోలు నీకు సహాయం
బుగఁ బదివేలు తురంగంబులును దదర్ధసంజ్ఞికంబులగు శతాంగంబులును నాలు
వేల గజంబులును లక్ష పదాతివర్గంబును జనుదెంచు వేగంబ చని వానిం జక్కాడి
మధుసంజ్ఞికంబగు తద్వనంబు పట్టణం బొనర్చి సుఖాసనంబున రాజధానిగాఁ
గైకొను మనుచు మూర్ధాఘ్రాణంబుచేసి వీడ్కొలిపిన శత్రుఘ్నుండు. 213
మ మునివర్య "విజయోస్తు తే" యనఁగ సమ్మోదంబుతో నేఁగి య
న్న నియోగించినభంగి నాలవణునిం జక్కాడి సర్భితిమై
జను లెల్లన్ వసియించుపట్టణము లిచ్చన్ జేసి తద్రాజ్యపా
లనుడై పుణ్యముతోడ సొంపెసఁగెఁ గల్యాణీ! భవానీసతీ!. 214
వ. అనినఁ బార్వతి యిట్లనియె. 215
తే దేవ! కైలాసవల్లభ! ధృతశశాంక!, లోకపావన! సీత వాల్మీకియాశ్ర
మంబునను నుండి యెటు లేఁగె మఱియుఁ బల్కు, విస్తరంబుగ నద్దేవివాస్తవముగ.

## వాల్మీకియాశ్రమంబునఁ గుశలవులు జనించుట.

వ. అనిన సుకుమారమణీమణిం గనుంగొని త్ర్యంబకదేవుం డిట్లనియె. 217
చ వినుము హిమాద్రిశైలజా! జనకవీరనృపాగ్రణిపుత్త్రి సీత నం
దనులను గాంచె నిద్దఱ నొనర్చెఁ గుశుండు లవుం డనంగ న

మ్మునివరుఁ డంత వారికి సముజ్జ్వలనామము లక్కుమారకు
ల్దనరిరి బాలసూర్యులవిధంబున మించుచు నంత కంతకున్. 218

వ. ఇట్లు వృద్ధిఁ బొందుచు 219

తే. లీల విద్యలు నేర్చి వాల్మీకి యుపన, యన మొనర్పంగ వేదాధ్యయన మొనర్చి
దర్పణప్రతిఫలితులో దాశరథులో, యనఁగ గుణములఁ దనువుల నలరి రచట. 220

వ. అంత వాల్మీకిమునీంద్రుండు వారలకుఁ బూర్వంబునఁ ద్రిపురమర్దనుండు భవాని
కెఱింగించిన నిఖిలవేదార్థకలితంబగు రామాయణంబు కావ్యరూపంబునఁ బఠనంబు
గావించె నశ్వినులభంగి నతిసుందరులగు నక్కుమారులు స్వరసంపన్నంబుగఁదంత్రీల
యసమాయుక్తంబుగ గానంబు సేయుచు మునిబృందంబుల సంచరింప వారు విస్మ
యంబున 221

తే. కాల మధికంబు మనమైతె గడపినార, మిట్టి సుస్వరగీతంబు లెలమిఁ జదువ
వింటిమే తొల్లి గంధర్వవిబుధమనుజ, లోకములనైనఁ గర్ణామృతాకరములు. 222

వ. అని యిట్లు. 223

క. మును లనుతింపఁగ నిలిచిరి, ఘనుఁడగు వాల్మీకి మౌనికడ రాఘవుఁ డం
తను గవక జనకనందన, నొనరించి తురంగమేధ మొనరించుటకై. 224

వ. ఉపక్రమింపఁ దద్దర్శనాభిలాషు లయి బ్రహ్మక్షత్త్రియవైశ్యజనంబులును రాజర్షి
వర్యులును జనుదెంచుచుండ నమ్మునివరుండు. 225

మ. కర మింపొంద నిజోదితంబు నగు సత్కావ్యంబు గానంబు సే
య రఘుశ్రేష్ఠులఁ గొంచు నొక్కఋషివాటోపాంతమం దేగ న
చ్చరమాద్రి న్మిహిరుండు గ్రుంక నచటన్ సంధ్యావిధు ల్దీర్చి భా
స్వరయోగంబున నిల్చె నక్కుశుఁడు నవ్వాల్మీకి యిట్లుండుటల్. 226

వ. కనుంగొని తత్సమాధివిరమంబుఁ గాచియుండి జ్ఞానశాస్త్రకథనాంతరంబున నిట్లనియె

క. మునివర వినవేఁడెద నె, ట్లనయము సంసారబంధ మగు దేహికి వీ
డును మరల నెట్లు శిష్యుఁడ, నని ననుఁ గరుణించి పలుకుఁ డన ముని యపుడున్.

వ. సంతసించి సీతాకుమారా! వినుము బంధమోక్షణస్వరూపంబును దత్సాధనంబులును
ముక్తియు సంక్షేపంబున నెఱింగించెద నేను బల్కుసభంగి నెఱింగి తత్ప్రకారంబున
నాచరించితివేని జీవన్ముక్తుండ వగుదు వెట్లనిన విదేహుండగు చిదాత్మకు లింగదేహం
బనఁ గల్పితం బయ్యె నాదేహంబు తచ్ఛాయాగ్రాహి యయ్యెఁ దచ్ఛాయ యుండు
వను దనయుందునను దదభిమానపారంపర్యంబగు నహంకారంబు జనియించె నయ్య
హంకారంబున బింబస్థానీయంబగు సాక్షితోడఁ బరస్పరమిథ్యాతాదాత్మ్యంబువలన
స్వచేష్టితంబులగు జడత్వకర్తృత్వాదు లన్నియుఁ దత్సాక్షియందు నారోపించి

తత్సాక్షిచేష్టితంబులగు చేతనత్వ ప్రకాశత్వంబులను దనయందు నారోపించుకొని "జ్ఞాతా ద్రష్టా కర్తే"తి వ్యవహారపరివర్తితుం డగునట్టి చిదాభాసవిశిష్టదేహోపాధికుం డగుచు సంకల్పంబు లనుశృంఖలంబులచేత సాక్షి యావృతుం డగు నిట్లగుచుఁ బుత్త్రదారగృహాదులయందు భోగాపేక్షుం డయి సంకల్పంబు లొనరించుచుఁ దల్లభ్యాలభ్యంబులయందు సుఖదుఃఖంబుల నొందుచుండు నట్టి సాక్షికి రజస్సత్త్వతమస్సంజ్ఞలయి యధమోత్తమమధ్యమంబులగు మూఁడు దేహంబులు జగత్స్థితికారణంబు లయి చెలువొందు నందు. 229

క. ఎనయు తమోదేహంబునఁ, దనుకక నిరతంబు నరుఁడు తామసకృత్యం
బొనరించుం దామసుఁడై, జనియించును గీటకాదిజన్మముల మహిన్. 230

వ. మఱియును. 231

క. విను సాత్త్వికదేహంబున, జననాయక! నరుఁడు సత్త్వసంకల్పుండై
తనరును దేవాద్యాకృతు, లను భాస్వదదూరమోక్షలక్ష్మీయుతుఁడై. 232

వ. మఱియు ధర్మజ్ఞానపరాయణుండును సుఖుండును నగుచు నుండుఁ గడమరజోదేహంబున రజస్సంకల్పుండును బుత్త్రదారానురంజనుండును లోభసంభరితుండును నగుచు మనుష్యాదిభావంబుల నొందుచు నుండుఁ గావున నమ్మూఁడు రూపంబులును బరిత్యజించి యాత్మపరిక్షయం బగుచుండ నఖిలదృష్టులఁ మఱలించు మనంబుచేత మనంబును నియమించి బాహ్యాభ్యంతరంబుల సంకల్పసంక్షయం బొనరించి తత్పరంబగు పదంబు నొందు మిట్లు గాదేని. 233

క. శతసాహస్రాబ్దంబుల, నతిఘోరతపం బొనర్తు వైనను నీ వీ
కృతసంకల్పుఁడ వైనను, జతపడ నేరవు విమోక్షసామ్రాజ్యంబుల్. 234

వ. ఇదియ కాదు పాతాళభూస్వర్గంబుల నుండినను సంకల్పోపశమంబునం గాని యొండుసాధనంబున విముక్తుండ వగుట దుర్లభంబు గావునఁ జేత నయినంతపట్టుఁ బురుషప్రయత్నంబున నవికారంబును బరమపావనంబునగు స్వసుఖంబున సంకల్పోపశమనయత్నంబు సేయుము మఱియును. 235

తే. కలుగుభావము లెల్ల సంకల్పమనెడు, తంతువునఁ గాన సంకల్పతతి నడంచి
తేని బూసలు త్రాఁడు రెండైన వీడి, చనెడుపోలిక భావముల్ చనును వదలి. 236

వ. ఇబ్భంగి. 237

తే. క్షీణసంకల్పజాలుఁడౌ జీవుఁ డొందు, నిజము బ్రహ్మత్వమును గాన నీవు దెలిసి
చనుమ యొక్కాలమున కద్ది సంభవించు, నట్టి వ్యవహారమున భూసుతాగ్రతనయ.

చ. విను మినవంశభూషణ! ప్రవీణుఁడ వై సువికల్పజాల మి
ల్లను విడనాడి యాత్మసుఖలభ్యముకై యవిచిత్తవృత్తిచే

ఘనపరమార్థ మద్వయ మఖండము నై తగు తత్త్వదంబు చ
య్యనఁ గను నిన్నుఁ బోలెను గృతార్థులు గల్గరు భూతలంబునన్. 239

ఆ. నాకజుండు రామనందనునకుఁ దత్త్వ, మిట్లు పల్కి చనుచు నింగుమాలి
శైలతనయతోడఁ జాల ప్రసంగించి. యింపు మీఱ మఱియు నిట్టు లనియె. 240

చ. అని యిటు మౌనిపల్కిన హృదంతరవిభ్రమ వీడి యుత్సుకుం
డనుపమముక్తుఁడై బయల నందఱి పోలికనుండె మారి తాన్
జని కనకేంద్రశైలమణిసంయుతసౌధ వరోర్వి గాంచి తో
డను జనుదెంచు రాఘవుల డగ్గఱి యిట్లనిరొక్క ముదంబునన్. 241

ఆ. తనయులార! మీరు దశరథాత్మజసభా, స్థానమునను నిల్చి పాడఁ డంత
వసువు మీకు నిచ్చునని గొనవలె, దనినఁ గుశలవులును విని ముదమున. 242

సీ. చని తత్పురద్వారమున రామచంద్రుండు వినునట్లు సంగీతవిధము మెఱసి
సుస్వరంబుగఁ బాడఁ జొచ్చినఁ దనపూర్వచర్య లెల్లను విని సంతసమున
సభ కేఁగుదెంచి దర్శనకాంక్షులకు సుప్రసన్నత గనుపింప శబ్దవిదులు
వసుధేశులును జటావల్లభుల్ పౌరాణికులును బందితులును గూడిరాఁగ

తే. నంతఁ గుశలవులును సభ కరుగుదేర, జనులు గనుఁగొని విస్మయసహితు లగుచు
నహహ! వీరలు రాముని యట్ల యున్న, వారు సౌందర్యమునఁ గాంతి వైభవమున.

క. ఈకరణి జనులు వాగులు, లేమన్న విశేషముగ వెలిఁగెద రనుచున్
లోకులు పలుకఁగ వల్లకి, నాకౌమరులు మీటుచుం బ్రియస్వరములుగన్. 244

వ. షడ్జమధ్యమాదిభేదంబుల సమానంబును మధురంబును నగు గాంధర్వంబు ప్రవృ
త్తిం బొరలింప రామచంద్రుండు విస్మయంబు నొంది యపరాహ్ణం బైనఁ
గొలువు వీడి చనుచు ఘటకుం గనుంగొని వీరల కయుతధనం బిప్పింపు మనిన నట్ల యొన
రించినఁ బరిగ్రహింపక కుశలవు లిట్లనిరి. 245

చ. వనమున సంచరించుచును వన్యఫలంబులు గ్రోలు మాకుఁ గాం
చనము దలంప నేల యని సన్న్యాస నేఁగిన రాముఁ డంతయున్
విని జనకాత్మజాత్మజులు వీ రని విస్మయ మంది లక్ష్మణుం
గనుఁగొని వారిఁ గన్గొనెడు కౌతుక మొప్పఁగఁ బల్కె నిట్లుగన్. 246

క. వినుము విభీషణ మారుతి, తన యనుషేణాంగదులును ధరణీజను దో
డ్కొని వాల్మీకియు నిచటికిఁ, జనుదేరఁగఁ జేయు మంత జనకజయు సభన్ 247

క. జను లెల్లను నిష్కల్మష, యని సమ్మఁ బ్రతిజ్ఞ సేయు నగు నన రఘువ
ర్యుని వాక్యములకు విస్మయ, మును భయమును బొంది రచటి మునులును జనులున్.

వ. అంత రఘువల్లభుహృద్గతం బెఱింగి వాల్మీకిమునీంద్రుం డిట్లనియె. 249

తే. పతియె దైవంబు గురువును భామినులకు, గాన రఘునాథ! మీమదిఁ గల తెఱంగు
నెల్లఁ జేయును జనకజ యిది యసంశ, యం బనినఁ బల్కి రందఱు నట్ల యనుచు.

వ. సీత యొనరించు శపథంబు శుభాశుభంబు లెల్లవారు నెఱుంగవలయు నని యాజ్ఞ యొసంగి రాఘవుం డంతఃపురంబునకుం జనియె నంత మఱునాఁడు కొలువు దీర్చియున్న యవసరంబున బ్రహ్మక్షత్త్రవైశ్యశూద్రులును మహర్షులును వానరపుంగవులును గౌతుకంబునఁ జనుదెంచిరి. వాల్మీకిమునీంద్రుండు జనకపుత్త్రిం దోడ్కొని సభామధ్యంబునకుం జనుదెంచి రామచంద్రున కిట్లనియె 251

## సీతాదేవి భూవివరంబునం ద్రుంగుట

సీ. ఇదియె భూనుత రాఘవేశ్వర! కనుఁగొను ధర్మచారిణి సువ్రత సుచరిత్ర
విడిపించితివి ఘోరవిపినమధ్యమున లోకాపవాదకు నోడి యైన నేమి
యాజ్ఞ యిమ్ము ప్రతిజ్ఞ యాచరించెడు వీర సీతాకుమారులు చిన్నికవలు
యేను జేయఁగఁ బంప నీకుకుమారులు నను గూడి తపము లొనర్చినారు

తే. దశరథాధిపపుత్త్ర! సీతాకళత్ర!, నీ వెఱుంగ నేమి యీనిఖిలమానవు
గాన సుచరిత్ర యని బుద్ధి నూనెదేని, గొనుము యిప్పాన్య నిబ్భంగిఁ గుందనీక.

వ. అనిన రఘువల్లభుం డిట్లనియె. 253

క. మునివర! మీవచనములనె, జనియించె నిజంబు మున్న జనకజయును జే
సెను శపథ మఖిలజనములు, గనుఁగొన వనలంబు సాక్షి గాఁగను లంకన్. 254

వ. అయినను లోకాపవాదకు నోడి నిర్దయుండనై విపినంబున విడువం బనిచితి నది క్షమియింపవలయు నిక్కవలవారలు నావలననే జనియించిరి యెఱుంగుము జనకనందన పరిశుద్ధ గావున నాకుఁ బ్రీతి యయ్యె ననిన దాశరథిభావంబు గ్రహించి కమలగర్భ మున్నిడుకొని పురందరాదిబృందారకులు చనుదెంచిరి భూపుత్త్రియు సంతసించి తజ్జనౌఘమధ్యంబునఁ గట్టినకౌశేయంబు శిరంబున ముసుంగిడి క్రిందు చూచుచు కరంబులు మొగిడ్చి యిట్లనియె. 255

క. శ్రీరఘువర్యునికన్నను, వేఱొకరిఁ దలంప నేని వివర మొసఁగు మో
ధారుణి! యనఁ దోడుతనె మ, హారవము దలిర్ప వివర మయ్యె ధరణియున్. 256

వ. నాగకన్నియలు వింజామరమ్ములు వీవ సింహాసనంబు గైకొని భూదేవియుఁ జనుదెంచి. 257

చ. కరములు సాఁచి జానకిని గౌఁగిటఁ జేర్చి ముదంబు పల్కి తా
నరిగె రసాతలంబునకు నాగతి సేఁగ సుర ల్విరు ల్వడిన్

గురిసిరి దుందుభు ల్మ్రోసెఁ గొందఱు విస్మయ మంది చూచుచుం
డిరి మదిఁ దోఁచినట్టులు పడి న్నుతిఁ గొందఱు పల్కి రయ్యెడన్. 258

క. కొందఱు చింతిల్లిరి మఱి, కొందఱు భూతలమునందుఁ గ్రుంకెడు ధరణీ
నందనను బొగడుచుండిరి, కొంద ఱచేతనులభంగిఁ గూలిరి ధాత్రిన్. 259

వ. కొందఱు మహాకాయులగు వానరులు సీతాశపథకారణంబున రఘువల్లభు నీక్షించు
చుండిరి ట్లొక్క మహాశ్చర్యంబు జగం బంతయు సమ్మోహితం బయ్యె రామచం
ద్రుండు సకలంబు నెఱింగియు నెఱుంగనివాఁడపోలె భవిష్యత్కార్యగౌరవం
బున దుఃఖించి బ్రహ్మచేత బోధితుండై సీతాస్నేహసుఖంబు లన్నియు స్వప్నంబు
భంగిఁ దలంచుచు ననంతరక్రియలొనరించి ధనరత్నాదుల ఋత్విక్కులను దక్షి
ణవారలను సంతుష్టులం జేసి వీడ్కొలిపి కుశలవులం దోడుకొనుచు సాకేతపురంబు
ప్రవేశించె నంత. 260

సీ. ఆదిమధ లక్ష్మిహితకులాధీశ్వరుఁడు రాముఁ డిహభోగములను నిస్పృహ వహించి
యాత్మచింతాపరుం డగుచు నొంటిగ నుండె నిటు లుండఁ గౌసల్య హృదయమందు
నితఁడు నారాయణుం డిందిరావల్లభుం డని యెఱింగి ప్రియోక్తు లాడుకొనుచు
నతిభక్తితోడ ధ్యానాలయమునకును జనుదెంచి తనహస్తవనరుహములు
తే. మొగిచి రఘునాథ! జగముల మోహపఱుపు, నీదుమాయావృతాత్మనై నీవు సుతుఁడ
వనుచు ననుబోంటి సనకాదిమునుల కైన, నెఱుఁగఁజాలని పదవి నే నెఱుఁగ నైతి.

వ. దేవా! దుగ్ధపారావారోత్తుంగతరంగమధ్యవిలసితభుజంగరాజతల్పంబున యోగని
ద్రారతుండవై పవ్వళించు పురాణపురుషుండవు సచ్చిదానందవిగ్రహుండవు జగం
బులకు మొదటివాఁడవు ఆదిమధ్యాంతవర్జితుండవు పరమాత్మవు పరమానందమయుం
డవు పూర్ణపురుషుండవు ఈశ్వరుండవు నగు పుండరీకాక్షుండ విట్టి నీవు నాయం
దుం గరుణించి మత్పుణ్యాతిరేకంబున నందనుండవై యుదయించితి విప్పుడు నాకు
నవసానకాలంబు సమీపించెఁ గావున దయాళుండవై మాయాజ్ఞాననివర్తకంబగు
జ్ఞానంబు పల్కవే యనిన సంతసిల్లి మంగళవతియు జర్జరితాంగియు నగు కౌసల్యం
గనుంగొని ధర్మాత్ముండును మాతృవత్సలుండును బరమదయాసముద్రుండును నగు
రామచంద్రుం డిట్లనియె. 262

## శ్రీరాముఁడు కౌసల్యకు మోక్షమార్గ ముపదేశించుట.

ఆ. జననీ! వినుము మోక్షసౌధాగ్రమునఁ జేరఁ, బరఁగు జ్ఞానకర్మభక్తియోగ
ము లన మూఁడు మార్గములు మున్నె చెప్పి, తందు సులభమార్గ మరయ వినుము.

సీ. భక్తియోగంబు తద్భక్తిఁ బల్కుఁగ నొప్పు గుణభేదములను నిక్కువలయుమన
సెవని కట్టి స్వభావ మెసఁగు నాతని కట్టి భక్తియు లభియించు బయలు గనుచు
దంభమాత్సర్యభేదప్రసరంభియౌ నతఁడు తామసభక్తుఁ డర్థభోగ
కామయశఃఫలాకాంక్షులై యర్చాదులను భేదమునఁ బూజ లొనరఁ జేయు
తే. నతఁడు రాజసభక్తుండు పతియు గతియు, నైన నాయందుఁ గర్మంబు లర్పణములు
చేసి కర్తవ్య మని పూజ సేయువాఁడు, భవము నొందఁడు సాత్త్వికభక్తుఁ డతఁడు.
క. జనని! యనంతగుణాలయుఁ, డనఁ దగు నాకథలు వినినయంతనె నాయం
దనయము నవిచ్ఛిన్నం బై, జనుల మనోవృత్తి గంగజలధిఁ జనుగతిన్. 265
ఆ. అదియు నిర్గుణుండ నైన నాయందుల, నురుతరంబు భక్తియోగమునకు
నవ్యవహిత మగుచు నన్య హేతువు లేక, నొక్కనికిఁ బుట్టు నుర్వియందు 266
వ. అట్లు జనియించిన పుణ్యులకు సాలోక్యాదిచతుర్విధముక్తు లొసంగెద నన్నను మత్సేవనంబకాని తక్కనయవి యొల్ల రదియ భక్తిమార్గంబున నాత్యంతికయోగం బయ్యోగంబునను గుణత్రయంబుల నతిక్రమించి జనుండు మద్భావంబు నొందు మఱియును. 267

సీ. అరసి స్వధర్మంబు లాచరింపుచు మించుఁ గామంబు లెల్లను గదిమి మిగుల
దర్శన వందన స్తవ పూజనములచే నను సంతసిలఁజేయుచును స్వతుల్యు
లగువారితో మైత్రి యాచరించుచు భూరివేదాంతవాక్యముల్ వినుచు భూత
ములను నే నను భావము వహించుచును దుఃఖపడువారిఁ జూచి చెప్పకయ తనకుఁ
తే. గలుగుకొలఁదిని వారిదుఃఖములు వాసి, చనఁగ నుపకార మొనరించుచును మహాత్ము
లైనవారలయెడ వినయంబు సేయు, మను జనుండును బుణ్యుఁ డై తనరవలయు
వ. మఱియును. 269

చ. ఒరులకుఁ గన్నరోగమున నొప్పగు శక్తిని హింససేయకన్
నిరతము నాదుధర్మముల నిశ్చయకాంక్షఁ దలిర్చుచున్ మహా
పురుషులఁ జేరి వారొసఁగు బుద్ధిని నే నిధి నాది యంచుఁ బ
ల్మరుఁ దలపోయుట ల్విడచి భాగవతుండు వసింపఁగాఁ దగున్. 270
ఆ. సంగములను వీడి సత్యంబు వహియించి, రహితకల్మషాంతరంగుఁ డగుచు
దిక్కు నీవె యనుచు దినమును మదనంత, నామములు స్మరించు మనుజవరుఁడు.
వ. ఇవ్విధంబున ధ్యానమననాదులచేత నరుండు మత్పారవశ్యం బై యుండెనేని వాయువశంబున గంధంబు స్వాశ్రయంబగు ఘ్రాణంబు నొందుభంగి వానిచిత్తంబు పరమాత్మయందు లీనంబగు. 272

సీ. సకలభూతముల హృత్సరసీరుహములందు వెలుఁగొందు నను జనుల్ వెళ్లులగుచు
బయల నొనర్తురు భక్తిఁ బూజింపుదు రది నాకు సవినతం బనఁగరాదు
తృప్తి యనఁగరాదు తెలియ నందఱికిని సమమాన మొనరించి యాత్మ గుందఁ
జేసి చేసినక్రియల్ సేయు నన్ను సతృప్తుఁ గాఫైన జనుఁడు నిక్కంబు గాఁగ
తే. నఖిలభూతాంతరస్థుండ ననుచు నెంతి, తపవు దెలియుఁడో తానంతరాత్ము ప్రతిమ
లందు స్వకులోచితాచార మనుసరించి, పూజ యొనరింపఁ దగు జగత్పూజ్యు నన్ను
వ. భూతావమానంబు సేయువానిచేత నర్చితుండఁ గాను వినుము. 274

క. ఎవ్వఁడు పరాత్మస్వాత్మల, కవ్వని భేదంబుఁ గాంచు నాతఁడు భయమృ
త్యువులకు లోఁబడుఁ గావునఁ, గని తెలుపఁగఁ బోల దిటులు కలలో నైనన్.

వ. మఱియు నిఖిలభూతంబుల నపరిచ్ఛిన్నుండనై యుండు నన్ను తెంగిజ్ఞానమానంబులను
మైత్రిని నభిన్నబుద్ధినై యర్చింపుచు దినంబును మనంబునఁ గరంబులు మొగిడ్చి
సకలభూతంబులకు నమస్కరింపుచుఁ జేతనుండును ద్ధ్రుంపను నగు నేను జీవరూ
పంబున నున్నవాఁడ నని యెఱుంగుచు లోకానాకసముదయంబులనైనను జీవేశ్వరు
లకు భేదం బొనర్పక విద్వాంసుం డగువాఁడు నిలిచెనేని కృతార్థుం డగు నీ నెఱిం
గించిన జ్ఞానకర్మభక్తియోగంబుల నరుండు శాంతి వహింప నొక్కటియ చాలు
నది గావునఁ దల్లీ! సర్వవ్యాప్తస్థితుండ నగు నన్ను భక్తియోగంబున నిశ్చయంబుగ
ధ్యానింపుచు శాంతి నొందు మనినఁ గౌసల్యయు. 276

క. రాముని వచనములకు మదిఁ, బ్రేమ స్నిగ్ధహృదయమున పరించి నుతిగుణ
స్తోమున్ బ్రాప్యశ్రేష్ఠు, శ్యామున్ లోకాభిరాము నభినుతిఁ జేసెన్. 278
తే. హేమవర్ణాంబరావృతు సోమసూర్య, నయను సంపూర్ణకాము సనాతనుఁ బర
భావన మొనర్చి సంతోషభరిత యగుచుఁ, బరమగతి నొందె దశరథభార్య గిరిజ!.
వ. ఇవ్విధంబున నెల్లెడల నిజభావన యొనరింపుచు సంసారబంధంబు భేదించి పరమగతి
నొందెఁ బూర్వంబ రఘుపుంగవుచేత భక్తియోగం బెఱింగినయది గావునఁ బరమ
శాంతయు శ్రద్ధాభక్తిసమన్వితయు నై కేకయరాజనందనయును. 279

మ. సజలాంభోధరదేహుఁ బద్మహితవంశశ్రేష్ఠు సీతాప్రియుం
ద్రిజగద్వంద్యుఁ దలంచి మై విడిచి పంక్తిస్యందనుం గాంచె న
ట్లజగన్నాస్య సుమిత్రయుం దనువు నిర్లక్ష్యంబునం బాచి జే
రఁ జనెన్ స్వప్రియు సంతిమింత గలదే ప్రాలేయశైలాత్మజా!. 280

క. అని దశరథభూవిభునకుఁ, దనయుండగు రాము కథలు తేఁ బలికె సుమా
వనితకు నిటలాంబకుఁ డి, ట్లని యెం దదనంతరమున నగు తెఱఁగెల్లన్. 281

సీ. అంత యుధాజిత్తుం దన మాతులుని తోడ భరతుండు రఘువర్యపంపు వడసి
సైన్యసమేతుఁడై చని మూఁడు కోట్ల గంధర్వుల ద్రుంచి ఘనుల సుతులఁ
బుష్కరావతి యందుఁ బుష్కరుఁ దక్షశిలాహ్వయంబునఁ దక్షు నధిపుఁ జేసి
మరలి రాఘవుఁ గొల్వ నరుదెంచె రాఘవుఁ డంతట లక్ష్మణు నతి ముదమునఁ

తే. జీరి సౌమిత్రి! నీకుఁ గుమారవరులఁ, గొనుచుఁ బశ్చిమదిగ్భాగమునకు నేఁగి
జనవిరోధుల మల్లులఁ జంపి వారి, దొరలఁ గావించి నను గొల్వ మరలి రమ్ము.

చ. అని తన యన్న పల్కిన నయంబున నచ్చటి కేఁగి మల్లులం
గొనిమి ఘనాఢ్యు లౌ సుతులఁ దనూజు లంగదచిత్రకేతులన్
బనిచి తురంగరత్నబలభర్మచయంబుల వారి కిచ్చి చ
య్యనఁ జనుదెంచె రాఘవుపదాంబుజసేవ యొనర్ప శైలజా!. 283

## శ్రీరామునికడకు యముఁడు మునివేషధారియై వచ్చుట

వ. అంత సుపుణ్యంబగు తత్కాలంబున నెల్లయెడల ధర్మపథవర్తియై చెలువొందు రాఘవేంద్రుం గనుంగొను కౌతుకంబునఁ గాలుండు ఋషివేషధరుండై చనుదెంచి రాజద్వారంబున నిల్చి సుమిత్రానందనుం గనుంగొని 284

క. విను లక్ష్మణ! మీ యన్నన్, గనుఁగొని యొకమనవి సేయఁ గాంక్ష గలదు నా
వు నెఱుక సేయు వేగమె, జనకసుతావల్లభునకుఁ జని యిపు డనినన్. 285

వ. లక్ష్మణుండు రఘుపుంగవు సమీపంబున కరిగి కరయుగంబులు మొగిడ్చి. 286

క. సుందరవదన! సుందరశర, దిందుయశస్సాంద్ర! వనరుహేక్షణ! దశకం
ఠేంధనదావానల! సుత, వందిత! గుణధామ! రామ! వైరివిరామా!. 287

వ. దేవా! భవద్దర్శనాకాంక్షియై యొక్క మునిముఖ్యుండు ద్వారంబున వచ్చియున్నవాఁ డనినఁ దోడితెమ్మని యనిచె నంత దీప్తతేజస్కుం డగు హుతాశనుభంగి వెలుంగు నమ్మునివరుఁ దోడితెచ్చిన నతండును జయజయశబ్దంబులు పలుకుచుఁ జనుదెంచిన రామచంద్రుండు సుఖాసనం బొసంగి పూజించి భవదాగమనకారణం బెఱింగింపుం డనిన ని ట్లనియె. 288

చ. విను రఘునాథ! యిత్తెఱఁగు వేఱొకరెవ్వ రెఱుంగరాదు గా
వున బలవంతు నిప్పుడును గోటవాకిట నున్న నప్డు తా
నను జని గాంచి లక్ష్మణ! మదాజ్ఞ సహింపుము ద్వారమందు రాఁ
జన దను మెవ్వరిన్ నిజము చెచ్చెద నం చని వచ్చిరేని యున్. 289

వ. అని సౌమిత్రిని వీడుకొలిపి రాఘవుండు. 290

ఆ. మునివరేణ్య! లక్ష్మణుని ద్వారమున నిల్పి, చనుట లెందు కభిమతార్థ మెద్ది

పలుకుఁ డనిన మౌని పలికె నిట్లని రాము, చంద్రుతోడఁ దుహినశైలతనయ!. 291

సీ. కమలాసనునిచేతఁ గార్యార్థినై పంపఁబడి వచ్చితిని రామభద్ర! యేను
నీతనూజుఁడ మాయ నీవు పొందుటచేత జనియించితిని సర్వసంహారుఁడను
గాలుండ దేవర్షిగణపూజితుండగు బ్రహ్మ మాతోడను బల్కె మనిరో
స్వర్గంబు రక్షింప సమయ మిప్పుడు చేర నీ వొక్కరుండ వీనిఖిలజగము

తే. నడఁచి మాయామయుండవై యాత్మజునిఁగ, నన్నుఁ గంటివి యట్లన నాగవిభుని
వితతసలిలాశయుని నొనర్చితివి భాను, వంశభూషణ! షడ్గుణైశ్వర్యకలిత!. 292

ఆ. అంత బలపరాక్రమాఢ్యులౌ మధుకైట, భుల వధించి కీర్తి వెలయ వారి
శల్యములను మొదట శైలసంబాధమౌ, ధరను జేసితివి ప్రధానపురుష. 293

వ. వెండియు దివ్యార్కసంకాశంబగు నాభిపద్మంబున నన్నుం బుట్టించి ప్రజాధ్యక్షత
నొసంగిన నేనును భవదీయశాసనంబు దల నిడి సేయుచు మద్వీర్యాపహారులగు
రక్కసుల నుక్కడంపుం డని విన్నవించినఁ గశ్యపవీర్యంబున వామనరూపధరుండ
వైతి విప్పుడు. 294

ఆ. పఙ్క్తికంఠుఁ డనఁగఁ బ్రబలరాక్షసుఁ డొక్కఁ, డవనిఁ బుట్టి సజ్జనాళి కెల్ల
హింస సేయ సురల మెల్ల మిమ్ము భజింపఁ, గరుణతోడ మమ్ము గారవించి. 295

వ. దశకంధరహరణార్థివై పదునొకొండువేల వత్సరంబులు మర్త్యలోకంబున నిలువ
సమయంబొనర్చితివి జనులెల్లఁ బూర్ణాయువులై యుల్లసిల్లెదరు తావకమనోరథంబు
సఫలంబయ్యె నవతరించినకార్యంబు తీరె నిప్పుడు కాలుండు మునిరూపంబునఁ
జనుదెంచుచున్నవాఁడు రాజ్యంబు వదలి చనుదెంచెదరేని శుభంబు మాకునుం
గల్యాణం బగు ననుచు నివ్విధంబునఁ బితామహుం డానతిచ్చె రఘువల్లభా! జితేం
ద్రియా! దేవలోకప్రయాణంబునందుఁ జిత్తంబు గలదేని భవద్భక్తులగు బృందార
కులెల్లను సనాథులును విగతజ్వరులు నయ్యెద రనుచుఁ జతుర్ముఖోదితంబులుగఁ
గాలుండు పల్కిన నవ్వాక్యంబులు విని చిఱునగవు దళుకొత్త జానకీవల్లభుం
డిట్లనియె. 296

చ. సరసిజగర్భవాక్యములు సమ్మతము ల్మది నెంచి నీవు స
త్వరమున వచ్చుటల్ శుభము వాసవముఖ్యులు నాదుభక్తు ల
ప్పరముల నెల్లకాలము కృపామతిఁ బ్రోచెదఁ గాన హృద్గతం
బరయఁగ సంభవించె నిఁక నన్యవిచారము లేదు నిర్యోదల్. 297

## శ్రీరామునియొద్దకు దుర్వాసమహర్షి వచ్చుట.

క. అని జానకీవిభుం డిటు, లనువేళ మహోగ్రమూర్తి యాత్రేయుఁడు వ

చ్చెను దుర్వాసుఁడు భ్రాజిత, ఘనశైలశరాసుఁ డుగ్రకరభాసుఁడొగిన్. 298

క. చనుదెంచి లక్ష్మణునిఁ గనుఁ, గొని సౌమిత్రీ! మనమునను గొంకకు మీయ
న్నను జూపు మీక్షణంబునఁ, బని గల దనినను సుమిత్రపట్టియుఁ బ్రీతిన్. 299

వ. జ్వలనతేజుండగు నమ్మునిపుంగవుం గనుంగొని మహాత్మా! రామచంద్రుచేత నగు కార్యం బెఱింగింపుఁ డేన యొనరించెదఁ గాదేని నిముసంబుఁ సైఁచుఁ డొక్కింతరాజకార్యాంతరంబున సక్తుం డయి యున్నవాఁ డనినఁ గ్రోధసంవ్యాప్తుం డై యయ్యాత్రేయుం డిట్లనియె. 3 0

క. ఏతత్క్షణమున లక్ష్మణ!, సీతావిభుఁ జూపకున్న సిద్ధము భస్మీ
భూతులఁ జేసెద నిన్నును, వాతని రఘువంశజుల మదాగ్రహదృష్టిన్. 301

చ. అని పలుకంగ లక్ష్మణుఁడు నమ్మునిరూపము చూచి యింత నే
యును నిజ మింతకంటె నిపు డొక్కనిచావు శుభంబు గాన రా
ముని కెఱిఁగింతు నెట్లయిన ముఖ్య మటంచును వేఁగి కౌసలే
యుని కెఱుఁగంగఁ బల్కె నపరోగ్రుఁడు నత్రిసుతుండు వచ్చుటల్. 302

వ. రామచంద్రుఁ డవ్వాక్యంబులు విని కాలుని వీడుకొలిపి దుర్వాసుని సమీపంబునకుం జనుదెంచి నమస్కరించి మీరు విచ్చేసిన కార్యంబు పల్కుఁ డనిన నమ్మునీంద్రుం డిట్లనియె. 303

తే. ఓవర సాహస్రవర్షంబు లుగ్రతపము, నిరశనవ్రతయుతుఁడనై జరిపి యిపుడు
వాంఛ గలదు భుజింప భూవర! సుపక్వ, మైన యన్నంబుఁ బెట్టింపు మరసి వేగ.

మ. అనినన్ సంతస మంది వేగమె సుపక్వాన్నంబుఁ బెట్టింప న
మ్మునియుం దృప్తి వహించి యేఁగె రఘురాముం డంత సర్వజ్ఞుఁ డ
య్యును మాయాశ్రయుఁ డౌచు నెమ్మనమునం దూహించె సౌమిత్రికై
తను మున్ పల్కిన పల్కు సత్యపథభీతస్వాంతతం బార్వతీ!. 305

వ. ఇట్లు పరమాత్ముండు నిత్యానందుండును జితంతనుండును నయ్యు వికలాంగుండును దీనవదనుండును సత్యవాక్యపీడితుండును నగుచు మొగంబు వంచి మనంబున హతప్రాయునిఁగ లక్ష్మణునిం దలంచెఁ దత్కాలంబున శుభలక్షణాన్వితుండగు లక్ష్మణుండు పూర్వంబ రఘువల్లభుచేత నజ్ఞాననాశనం బగు విజ్ఞానం బుపదేశింపం బడెఁ గావున ధీరుండును వివేకియు గుణవంతుండును భక్తిమంతుండును నింగితార్థవేదియు నగుచు రాఘవేశ్వరు సమీపంబునకుం జనుదెంచి కరయుగంబులు మొగిడ్చి యిట్లనియె. 306

సీ. భవభయదూర! రాఘవ! మీర లిబ్బంగి నెఱుఁగనట్టుల యుండు టేమి యిపుడు
మత్కృతంబగు స్నేహబంధనం బెల్లను విడనాడి నను ద్రుంచివేయవలయు
నిది కాలగతి మున్నె యెఱుఁగుదు మీరు హీనప్రతిజ్ఞుల రైన నరక మగును
నాకు నామీఁదను మీకు సత్కృప గలదేని యధర్ముఁడ నైన నన్ను

విడిచి జగముల నీకీర్తి విస్తరింపు, మనిన లక్ష్మణుమాటల కవ్విభుండు
చలితమానసుఁ డగుచు మంత్రులవసిష్ఠుఁ, బిలువఁబనిచి సమస్తంబుఁ దెలియనట్లు.

తనదు ప్రతిజ్ఞయుఁ గాలుం, డనినతెఱంగత్రిసుతుని యాగమనముఁ బ
ల్కిన వా రందఱు నిట్లని, యనిరి రఘూద్వహునితోడఁ బ్రాంజలు లగుచున్. 308

రఘునాథ! మీచేతఁ బ్రథమంబ భూభారహరణంబు వర్తిల్ల మయ్యెఁ గాన
జ్ఞానదృష్టి నెఱింగఁ జను లక్ష్మణునిఁ దొఱఁగ ముబ్భంగి లక్ష్మణునందుఁ బ్రేమ
విడువు మింకఁ బ్రతిజ్ఞ విడునను విడిచిన నగు ధర్మమెల్లను వ్యర్థముగను
ధర్మంబు నశియింపఁ ద్రైలోక్యము లడంగు ధరణిఁ బ్రోచెడు ధర్మపరులు మీరు
గాన వేఱొక్కగతి బుద్ధి నూన కిప్డు, డొక్క లక్ష్మణు విడనాడి యఖిలలోక
జనులపాలన మొనరింపఁ జను జగంబు, వినుతి యొనరించు నీకీర్తి విస్తరించు 309

అనుచు ధర్మార్థసత్యసమన్వితంబులుగఁ బలుకు వారల వచనంబు లాకర్ణించి సభా
మధ్యంబున సుమిత్రానందనుం జీరి యిట్లనియె. 310

మనసు వచ్చినట్లు చనుము లక్ష్మణ! ధర్మసంక్షయంబు గాఁగఁ జనదు వెడల
ద్రోబ్బుటయును శిరము దునుముట రెండును, సమము నాత్మఁ దలఁప సజ్జనులకు 311

—లక్ష్మణుఁడు సరయూనదియందుఁ జేరుట.—

అన దుఃఖాక్రాంతుం డై, తనయన్నకు మ్రొక్కి యంతఁ దడయక సదనం
బును వెడలి సరయువకుం, జనియెఁ గరంబులు మొగడ్చి శైలతనూజా!. 312

ఇట్లు పరమధార్మికుండగు సుమిత్రానందనుండు కృతాంజలి యై సరయూతటంబు
నకుం జని సకలప్రాణంబులను నియమించి మూర్ధతలంబునం జేర్చి షడాధార
స్వరూపజ్ఞుండును యోగయోగాంగవిదుండును గావున రాజయోగప్రకారంబున
దృష్టిపూర్వకంబున భూమధ్యంబునం జూచుచుఁ గృతాకృతానుసంధానంబులు
మాని సర్వసంకల్పవర్జితుం డై యద్ది యక్షరంబును బరబ్రహ్మంబును వాసుదేవా
ఖ్యంబును నగు నట్టి పరమస్థానంబు మనంబునం జింతింపుచు మారుతంబుల నిరో
ధించె నాసమయంబున. 313

సకలదేవతలును సర్వర్షులును సంత, సమునఁ బొగడి మించు జల్లు గాఁగఁ
గ్రింగుకొలిపి రమలమందారకుసుమముల్ మేఘనాగువైరిమీఁద నపుడు. 314

మహావసంబగు నమ్మహామహు శరీరంబును బ్రాకృతజనుల కదృశ్యం బయ్యె
నంత. 315

ధీరు సుమిత్రానందను, నైరావణముపయిఁ జేర్చి యాత్మపురికి జం
భారాతి దోడుకొని చని, గారవ మొదవంగఁ బూజఁ గావించె సఖీ!. 316

నారాయణచతుర్థాంశుండగు రామానుజు నచ్చటిదేవత లెల్లను బూజించి రప్పురుష
వర్యుండును స్వీయంబగు భుజంగదేహంబు ధరియించి సత్యంబున కనుగమించె
నప్పుడు. 317

చ. ఘనముగ సత్యలోకమునఁ గల్గు ఋషుల్గములై మరాళవా
హనయుతులై దివంబున మహాహితకీరసమేతుఁ డాజనా
ర్దనచతురాంశ లక్ష్మణుని దర్శన మింపుగఁ జేసి రేమి చె
ప్పను గిరికన్య! కన్నులకుఁ బండువ లయ్యె తగ నట్టివేళయున్. 318

ఆ. అనుచుఁ బర్వతునకు నల్లుఁడౌ కైలాస, మందిరుండు భ్రమరబృందవేణి
రైన శైలకన్య కర్కాకులీనుని, కథలు పలికి పలుకఁ గడఁగె మరల. 319

వ. అంత నచ్చట రఘువల్లభుండు సుమిత్రానందను వీడి నిలువఁదగని దుఃఖంబున
మంత్రులను బంధుజనులను రావించి యందు వసిష్ఠున కిట్లనియె. 320

ఆ భరతు బుద్ధిమంతుఁ బట్టాభిషిక్తుని, జేతు లక్ష్మణుండు చేరినట్టి
మార్గ మేను గాంతు మఱి యొవ్వ రిఁక నాకుఁ, దలఁచి చూడ భ్రాతృధర్మమునను.

ఆ. అనినఁ బౌరజనము లందఱు దుఃఖార్తు, లగుచు మొదలు దెగిన నవని వ్రాలు
నిడుపు మ్రానుకరణిఁ బడిరి కర్ణములను, బడిన మూర్ఛ నొందె భరతుఁ డపుడు 322

వ. ఇట్లు భరతుండు దెప్పిఱి తనను దాన నిందించుకొనుచు రామచంద్రునితో నిట్లనియె.

ఉ భవదీయాంఘ్రియుగంబు లాన రఘుభూప! శ్రేష్ఠ నిన్నీడి యి
ధ్భువి రైనం దివి రైన నొల్ల నిదె నీపుత్త్రుల్ధరాపాలన
ప్రవిశత్వం బొనరింపు తమ్ముఁడును సద్భక్తుండు శత్రుఘ్నుఁ డం
త విసం జేయుము చాటఁ బంపు జగము ల్త్రిత్తిజ్ఞ లౌనట్లుగన్. 324

చ. అని భరతుండు పల్కె జను లందఱు రాముని వీడఁ గల్గునో
యని భయ మంది రంత మహిజాధిపుతోడ వసిష్ఠుఁ డిట్లనున్
జనవర! నిన్నుఁ బాయఁగను జాలక పొక్కెద రింద ఱిట్లు గా
వునఁ గరుణింపు కూడి చన నుండు నె నిన్నెడి యొక్క నిచ్చటన్. 325

తే. అనిన సీతావిభుండు ప్రియంబు నొంది, వారి నందఱఁ బూజించి యడుగవలువ
దేమి కోరిక పల్కుఁడే నిచ్చుడు చేతు, ననిన నిట్లని పల్కిరి యంద అపుడు 326

ఉ. మిమ్ములఁ గూడి వచ్చుటలు మే లగు మాకు ధరిత్రికైన స్వ
ర్గమున కైనఁ బ్రీతి యిది కాంతలతోడను బుత్త్రమిత్రవ
ర్గములతోడఁ గూడ నన గట్టిగ వీరి మనంబు గల్గునం
చమ్మెయి రంతు వల్లె యనె నా రఘుపుంగవుఁ డద్రినందనా!. 327

వ. ఇట్లు రమావల్లభుండగు రాఘవేశ్వరుండు మహాప్రస్థానంబునఁ గృతనిశ్చయుండై
యాదినంబున నిజనందనులగు కుశలవుల రావించి యేసిమిదివేల రథంబులును బది
మూఁడులు గజంబులును నాఱువేల తురంగంబులును ననేకులగు పదాతివర్గంబులును
బహుధనరత్నాదులును వేఱువేఱ నొసంగి వీరికొలిపిన నానీతేయులు జగజ్జనము
డగు నిజజనకునకు నమస్కరించి వీడఁజాలక యతిదుఃఖంబునం జని రంత రాఘ
వుండు శత్రుఘ్నసమీపంబునకు దూతం బనిచిన వాఁడును. 328

క. అని కాలురాక యాత్రే, యనిచేష్టయు లక్ష్మణుంపు నొగి నీల్గుట రా
మునినిశ్చయంబుఁ బల్కిన, విని శత్రుఘ్నుండు శోకవిహ్వలమతి యై. 329

ఆ. ఇంచుకంత చింతఁ గాంచి తోడనె ధైర్య, మూని చంద్రకేతునూను విదిశ
యను పురికిని మధుర కాధ్యు నుబాహునిఁ, జేసి నిజగృహంబుఁ జొని వెడలె.

వ. ఇట్లు మహాబుద్ధియగు లవణాంతకుండు రాఘవదర్శనాపేక్షుం డయి యయోధ్యా
నగరంబునకు వచ్చి యచ్చట. 331

చ. కనియె దుకూలయుగ్మ నిజకాంతిసమావృతదిక్సమాజా స
న్మునిగణసేవితున్ జనమనోహరు భానుకులప్రసూను దు
ర్జనసికరాబ్ధిబాడబు సుశాంతవహోమయుతు నింద్రనీలమే
ఘనిభశుభాంగుఁ బఙ్క్తిముఖగర్వహాలాహలభీము రామునిన్. 332

ఆ. ఇట్లు రామచంద్రు నింద్రనీలనిభాంగు, జనకజాభిరాము సమరభీముఁ
గాంచి వందనములు కర మొప్పఁ గావించి, భక్తితోడ నిట్లు పలికె నపుడు. 333

ఉ. దేవ! మదీయనందనుల ధీరుల రాజ్యమునందు నిల్పి నీ
సేవ యొనర్ప వచ్చితిని జేరిన భక్తుని వీడరా దనన్
భావమునందు నిక్కమగు పల్కని రాముఁ డెఱింగి లెమ్ము ర
మ్మా వెడలంగఁ బోలు దినమధ్యమునన్ రవి నిల్వ నందఱున్. 334

## శ్రీరామునికడకు విభీషణసుగ్రీవాదులు వచ్చుట.

వ. అని ధర్మంబులగు శత్రుఘ్నవాక్యంబులకు మధ్యాహ్నంబునఁ బ్రస్థానం బనుచు
రామచంద్రుం డాన తిచ్చె నాసమయంబున రఘువల్లభు చిక్షితం బెఱింగి దేవాం
శసంభవులును గామరూపులును నగు ప్లవంగపుంగవులును భల్లూకకులాధీశ్వరులును
విభీషణసమేతులగు నిశాచరవర్యులును సహస్రసంఖ్యలగు గోపుచ్ఛులును బుత్ర
దారాసమేతు లగుచుఁ జనుదెంచి ప్రాంజలు లయి దేవా! భవదనుగమనంబున దృఢ
నిశ్చయుల మని రంత సుగ్రీవుండును భక్తివత్సలుండగు నారాజవల్లభున కిట్లనియె.

తే. జానకీనాథ! నీపదాబ్జాతయుగము, వీడఁజాలక కనుఁగొను వేడ్కతోడ
వంగనుని వేగ కిష్కింధ కధిపుఁ జేసి, వచ్చితిని నన్ను విడనాడ వలవ దిపుడు. 336

వ. అనినఁ జిఱునగవు దళుకొత్త నల్లె యని విభీషణుం గనుంగొని. 337

సీ. విను విభీషణ! నీవు ధనధాన్యసంపద లెనయు లంకారాజ్య మేలుచుండు
మద్వాక్యమునను నిమ్మహి ప్రజావళి యెంత కడవు దాల్చునో యంత కడవు కేల్
పలుకకు మిఁక నొం పగిదిని నామీఁదియాన నీవును జగత్పావనతనయ!
యావిఁ జిరంజీవి వగుచు నిల్వుము వ్యర్థ మొనరింపకు మదాజ్ఞ వనచరేంద్రు

తే. లార! మీరును వృత్తికులార! మీరు, రండు నాఁ గూడి కోర్కులు పండు వేగ
నాయతము గం డనుచు నిట్లు లానతిచ్చెఁ, బ్రేమతోడను దశరథరామవిభుఁడు.

వ. అని ప్రభాతసమయంబున. 339

శా. మాయామానుషరూపవంతుఁడును శ్రీమంతుం డనంతుండు సా
మ్నాయాగమ్యుఁడు నైకరూపుఁడు జగన్నాథుండుఁ దత్త్వార్థివ
ర్ధ్యేయుండుం బురుషోత్తముండు హరియున్ ధీరుండు గావ న్నస
త్త్రాయం బీజగ మంచు రాముఁడు మహాప్రస్థాన మూఁదె న్మదిన్. 340

వ. ఇట్లు పరమాత్ముండు షడ్గుణైశ్వర్యకలితుండును నగు రామచంద్రుండు వసిష్ఠమునీం
ద్రుం గనుంగొని ముందర నగ్నిహోత్రంబులు నడపింపుం డనిన నమ్మునియు మహా
విధానంబుగఁ బ్రస్థానకర్మం బొనరించె నంత. 341

## శ్రీరాముఁ డయోధ్యను విడిచి సరయూనదికిఁ జనుట.

సీ. క్షౌమాంబరుండును సకుశపవిత్రపాణియు నిర్మలుఁడు నౌచు నిజపురంబు
వెడలె సితాభ్రంబు వెడలు చంద్రునిభంగిఁ గలశాబ్ధికన్యయుఁ గరమునందు
రక్తోత్పలము మీఱ రఘువాఘు సవ్యభాగమున నిల్చెను శస్త్రకార్ముకాస్త్ర
విసరంబు లెల్లను విగ్రహంబులు దాల్చి వేదంబులును నట్ల వెలసి కూడ
తే. నడచె దివ్యులు మునులును నడచి రట్లు, ప్రణవయుతముగ వ్యాహృతిత్రయసమేత
ముగను మాత్రలుశ్రుతులును ముందు నిలిచె, నమరె రాఘవుప్రస్థానసమయమపుడు

వ. పుత్త్రమిత్త్రకళత్రాదులతోడ జనంబు లెల్ల మహాకాంక్షు లయి ధనంబు గొనువారలు
ద్వారంబు నావరించుభంగి లక్ష్మణాగ్రజు నావరించిరి మఱియును 343

క. అంతఃపురజనములు ద్వా, రాంతికుఁడును భృత్యజనులు నాప్తులుఁ దనదా
క్రాంతయుఁ గూడఁగ సీతా,కాంతునితో నడిచె వేడుకను భరతుండున్. 344

మ. వెలయన్ రాము రమారమేశుఁ గని యుర్విన్ వెలుంగొందు వి
ప్రులు సత్క్షత్త్రియవైశ్యశూద్రులు సతీపుత్త్రప్రియానీకయు
క్తులు సోత్కంఠులు నౌచు వచ్చి రతిభృత్యుల్ భానుజాదిప్లవం
గులు శుభ్రాంబరముల్ ధరించి నిజలాంగూలంబులం ద్రిప్పుచున్ 345

వ. మహాప్రయాణగృహీతబుద్ధు లగు సమ్మార్గాభిషిక్తులతోడ జయ జయ శబ్దంబులు
పలుకుచు వెడలి రక్కాలంబున. 346

తే. దీనులును దుఃఖభయయుక్తమానసులును, బాహ్యసుఖసక్తులును లేరు ప్రజలుసంత
సమునఁ బలుభృత్యవరులై చనుదు రితరు, చింతలను వీడి రఘునాథుఁ జేరఁగోరి.

వ. ఇట్లానందరూపులును విరక్తులు నగుచు రామానుగమనం బొనరించి రట్టివేళ స్థావర
జంగమాత్మకంబు లగు భూతంబుల కెల్లను భయంబు గనుపడ దయ్యె నందఱును
విముక్తు లగుచు సాక్షాత్పరమాత్మయు ననంతశక్తిపంతుండును బరుండును నీశ్వ
రుండును నగు రామచంద్రునకుఁ దోడు నడచి సకలసంపద్భరితం బగు నయోధ్యాన
గరంబున రఘువల్లభానుగమనులు గాని జను లొక్కరైనను లేరైరి రామచంద్రు

మహాప్రయాణానంతరంబునఁ దత్పురంబును జంతువిరహితం బయి శూన్యం బై
యుండె నంత 348

మ. అతిదూరంబు రఘూద్వహుం డపు డయోధ్యావీఁటు డై యేఁగి య
ద్భుతమా శివారిసేత్రజాతను నదిన్ పుణ్యప్రదం గాంచి సం
స్మృతిచేఁ బావనుఁ డౌచు సంతసమునం బృథ్వీతలం బెల్ల బ్యాత్
స్థితి మంచుం దలపోసెఁ బర్వవిలసత్పీతాంశుబింబాననా!. 349

ఉ. ఆసమయంబునన్ ఋషులు నంబుజగర్భసురేంద్రసిద్ధవి
ద్యాస(మిత)న్ విమానముల నంబరవీథిని నిల్చి రట్లు ప
ద్మాసనముఖ్యదేవతలు దాకొమటన్ నభ మెల్ల దివ్యతే
జోసహితంబుగా వెలిఁగెఁ జాల దిగీశునిలోకమా యనన్ 350

వ. స్వయంప్రకాశులును మహాత్ములు నగు వసిష్ఠాదిపుణ్యమునీంద్రులు వచ్చి నిల్చిరి
మఱియును. 351

సీ. దేవమృదంగముల్ ధిమిధిమిద్ధిమియంచు మొరసెఁ బూవులవాన గురిసె భూరి
గానం బొనర్చిరి గంధర్వవరు లెల్ల వేడ్కఁ జల్లని గాలి వీచె దేవ
ములు సుగంధసమేతములుగ నొప్పెను రాఘవేశ్వరుం డంత జలస్పర్శనంబు
సరయూనదిని నిజచరణంబుల నొనర్చి మరలఁ బ్రాకృతశరీరము నొంద

తే. నంత బరమేశ్వరుఁడును బరాపరుండు, నైన రఘువల్లభునకుఁ బద్మాసనుండు
హస్తములు సాఁచి వందనం బాచరించి, భక్తితోడుత నిట్లని పలుకఁ దొడఁగె.

తే. భయరహితుఁడసదానందమయుఁడఁ బూర్ణుఁ, డను బరాత్పరుఁడను విష్ణుడను శివుండ
ననుచు నెఱుఁగుదు వైన భక్తాళిఁ బ్రోచు, బిరుదువహియించిచెలువొందుదొరవుగాన.

వ. మనుజనిభంగి నుంటి వైన నేను. 354

క. తనయుఁడను సంతతము పద, వనరుహముల సేవ పూజ వదలనిభక్తుం
డను బహుపుత్రాదఁ బ్రజలను, జనియింపఁగఁ జేయుబుద్ధిసహితుఁడఁ గావన్. 355

వ. నాయందులఁ గరుణించి యిప్పుడు. 356

క. నీవును దమ్ములు వైష్ణవ, మైనయెలయు శరీర మంది యమరావనమున్
గావింపు మెందు దోఁచిన, నావిధమున నైనఁ బ్రోవు మందఱ మమ్మున్. 357

వ. దేవా! విష్ణుండవు సురాధీశ్వరుండవు నీవ నిన్ను వీడి యన్యపురుషు నెఱుంగము కం
దాముతలఁ గేరు నీదుమృదుపదంబులకుఁ బదివేలు ప్రణామంబు లాచరించెద మఱియు
సాఁగి మ్రొక్కెద నాయందు దయాళుండవు గమ్మనుచుఁ జతురాననుండు విన్న
వింప నాసమయంబున దేవతల వయసంబులకు దురాలోక్యం బై. 358

## శ్రీరామదేవుండు తననిజస్వరూపమున బ్రహ్మాదులకు దర్శనం బిచ్చుట.

సీ. ఘనశంఖచక్రయుక్తంబు లౌ నాలుగు భుజముల నొప్పె నప్పుణ్యతనువు
తనరె నద్భుతభోగధారి యౌ లక్ష్మణుఁ డీశ్వరతల్పం బై యొనరె గరుడు

భరతశత్రుఘ్నులు దశరథాంగంబు లై లక్ష్మి యయ్యెను సీత లక్షణాంగి
నారాయణుఁడు రఘునందనుం డు పురాణపురుషుఁ డయ్యెను శైలపుత్రి! యిట్టు
తే. లైరి వారలు పూర్వదేహములతోడ, దివ్యతేజోయుతాంగు లై భవ్యచరితు
లై విభూషణకలితు లై యమలవస్త్రు, లై స్వభక్తదయాళులై యద్భుతముగ. 359

వ. ఆసమయంబున. 360

చ. వనరుహగర్భమౌనిగణవాసవముఖ్యులు స్తోత్రము ల్సపూ
జనములు చేసి మ్రొక్కిలిడి సంతస మందుచుఁ బ్రాప్తకాము లై
తనరిరి యాశుఁ డవ్యయుఁడు తా నగు విష్ణుఁడు బ్రహ్మతోడ ని
ట్లనియె నిజానుగమ్యు లగునట్టి జనంబులయందు సత్కృపన్. 361

క. కానఁగ తిర్యగ్జంతువు, లయినను నను వీడలేక యరుదెంచెడు మె
చ్చౌ నీవు మద్వికుంఠము,తో వీరికి సామ్యపదము దొరకొల్పు వేగన్. 362

చ. అని హరి పల్కినన్ సరసిజాసనుఁ డిట్లను దేవదేవ! నీ
యనుపమనామకీర్తనము లారయ సాంతనికాఖ్యలోకముల్
వనుపడఁ జేయు నంత్యమునఁ బామరుఁ డైనను సంస్మరింపఁ గా
వున నిను గాంచు వీరి కవి యొప్పుట సందియ మాని చూడఁగన్. 363

వ. అని ద్రుహిణుండు పల్కె నంత 364

చ. పొలుపగు వేడ్కతోడ హరిపుంగవు లెల్లను స్నానము న్నదీ
జలములఁ జేసి దేహముల సంగతి వీడి సమస్తదేవతాం
శల మును పెవ్వ రట్లయిరి చయ్యన వారలు వారియందునం
గలసిరి భూరిసంసరణకల్మషు లై గిరిరాజకన్యకా! 365

వ. సుగ్రీవుండు ప్రభాకరబింబంబు గావున నద్దేవు నొందె నరు లెల్లను సరయూ
జలంబులఁ గృతస్నాను లై మనుష్యదేహంబులు పరిత్యజించి విమానంబుల నెక్కి
సత్యలోకంబునకు మీఁదునై బహుభోగంబులఁ జెన్నొందు సాంతనికాఖ్యలోకం
బుల నొందిరి తిర్యక్సరీసృపసముదయంబులును రామచంద్రు శుభవీక్షణంబున జలం
బుల మునింగి దివంబు నొందిరి తక్కిన పల్లెలజనంబు లెల్లను జనుదెంచి రామచంద్రుం
గనుంగొని ముక్తసంగు లగుచు లోకగురుండును బరేశుండును నగు హరిని స్మరియిం
చుచు జలంబుల నంటి స్వర్గంబు నొందిరట్లు. 366

సీ. పలుకంగఁ బడె నింతపర్యంతమును రామచంద్రు సత్కథ యశేషంబు గాఁగ
శంభునిచే శైలజకుఁ గాన సమ్మహాదేవుఁడు రఘునాథు భావమునను
స్మరియింపుమను భూరిసంతోషభరితయై తనరె నివ్యాఖ్యానమును మహాత్ముఁ
డవు గాధిసుతునిచేత విరచితం బయ్యెఁ గాఁగల కార్యంబు భోగిధరణి
తే. చేతఁ బల్కినయది గాఁగఁ జేరి వినినఁ, గౌసలేయుండు రంజనశీలుండు
దశరథేశ్వరతనయుండు ధార్మికుండు, మించువేడుకతో సంతసించఁ గలఁడు 367

క. రామ[illegible]కావ్యము హేతు, [illegible]గాత్మజకు భోగిభూషణుఁ డెలుఁగం
గా వి[illegible]ఁ బల్కెఁ గావున, [illegible]మంతులు విన్న వారు చేరి దినంబున్. 368

తే. దినము [illegible] నరుండు, దనరుభక్తిని బద్ధ్యమైనను బఠింప
గనుములను [illegible] కందరాని, రామసాలోక్య మందును జేరు నతఁడు.

తే. అమర నధ్యాత్మరామాయణము లిఖింప, విన్న వినిపింప శ్రీరామజననిభుండు
పితతోఁ [illegible] సిగ్గులఁ జేరి భాగ్య, మాయురారోగ్యమోక్షంబు నొందఁ జేయు. 370

తే. ప్రబలవిజ్ఞానమార్గైకభాస్వరంబు, జానకీనాథచరితంబు సమ్మతంబు
ఘోరపాతకసంఘముల్ పాఱఁ దోలు. నశ్వరం బొక్కఁడైన సత్యంబు మహిని. 371

కవికృత్యము:—

జనమనోహర మాదికావ్యము జలజభవముఖ రేతరా
వినుత మధ్యాత్మికముసంజ్ఞము విన్నఁ జదువ నెఱింగినన్
జనులు సంసారాబ్ధి దాఁటి సుసమ్మతంబును దేవతా
వినుత మగు సత్పథము గాంతురు విష్ణుకరుణాదృష్టిచేన్. 372

క. అని శివుఁ డంబిక కెఱిఁగిం, చినగతి విధి నారదునకుఁ జెప్పిన వ్యాసుం
డును బల్కెఁ నాకు వినఁ డం, చనియెను సూతుండు శౌనకాదిమునులకున్. 373

చ. జనపతి! భక్తహృత్సరసిజాతదివాకర! పుండరీకలో
చన! హరి! నీలదేహ! దితిజప్రజమర్దన! దేవ! కాం
చనశుభవస్త్ర! భావభవశాసనమిత్ర! మహాహితల్ప! చం
దనకలితాంగ! భూరిభవతాపనివారక! రంగనాయకా!. 374

మాలిని. జలరుహనిభపాదా! సత్యమార్గానుమోదా!, జలదనిభశరీరా! శక్రవైరిప్రహారా!
సులలితశుభభావా! శర్వవంద్యప్రభావా!, కలితదరరథాంగా! కౌస్తుభోపేతరంగా!

గద్య. ఇది శ్రీమారుగోఁటము క్షేత్రప్రసాదలబ్ధకవితాపవిత్ర కోటమరాజభాస్కర
మంత్రిపుత్త్ర నాగయామాత్యప్రణీతం బైన శ్రీమదధ్యాత్మరామాయణం బను
మహాకావ్యంబునం దుత్తరకాండము సర్వంబును నేకాశ్వాసము.

అధ్యాత్మ రామాయణము - సంపూర్ణము.

శ్రీ

---

* ఈపద్యలక్షణము స్పష్టముగఁ దెలియఁబడలేదు.

---

'హావిళ్ల' ప్రెస్సున ముద్రితము —1925.